# అమ్మ

# అమ్మవాక్యాలు


సంకలనం :

డా॥శ్రీపాద గోపాలకృష్ణమూర్తి



శ్రీ విశ్వజననీ పరిషత్

జిల్లెళ్ళమూడి

గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్.

# అమ్మ - అమ్మ వాక్యాలు

సర్వస్వామ్యములు :
శ్రీ విశ్వజనని పరిషత్
జిల్లెళ్ళమూడి.

మొదటిముద్రణ :
శ్రీ వృషనామ సంవత్సర శ్రావణము

ప్రతులు : 1000

మూల్యం: రూ.100/

ముద్రణ :
శ్రీ శారదా ప్రింటర్సు
సీతంపేట, రాజమండ్రి.
ఫోన్ : 0883 - 473554

ఓం

అంఅ

బొప్పూడి రామబ్రహ్మము
అధ్యక్షులు
శ్రీవిశ్వజననీ పరిషత్
జిల్లెళ్లమూడి.

ప్రపంచంలో ప్రేమ విలువైనది. ప్రేమించటం నేర్పటానికి, మానవుని మాధవుడుగా తీర్చిదిద్దేందుకు కరుణాంతరంగయైన పరమాత్మ స్త్రీ రూప ధారిణియై అనసూయమాతగా జిల్లెళ్ళమూడిలో అవతరించాడు.

సోదరీసోదరులు అనేక సందర్భాలలో అమ్మను సందేశ మివ్వవలసినదిగా అభ్యర్థించారు. "నాన్నా నాకేం తెలుసు? నేనూ మీవంటిదానినే" అని మాయతెరలు కప్పినా, కొన్ని సందర్భాలలో చెప్పిన సందేశములను పరిశీలించితే. అమ్మను గురించి, సాధనను గురించి మనకు కొంత అవగాహన పెరుగుతుంది.

1. "తెలియనిది తెలియజేయటానికే నారాక" అని అమ్మ సుస్పష్టంగా చెప్పారు.

2. "నా జీవితంలో మీకేదయినా మంచిదనీ, నలుగురూ అనుసరించ దగినది ఉన్నదనీ అనిపిస్తే, దానిని సందేశంగా తీసుకోండి" అన్న సమాధానమే అందరికీ చెప్పారు అమ్మ.

శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో అన్నాడు :

**"జన్మ కర్మచ మే దివ్య మేవం యోవేత్తి త్వతః**
**త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున** (గీత : 4-9)

అర్జునా ! నా జన్మకర్మలు దివ్యములు. అనగా లోకోత్తరములైనవి. ఈ విషయాన్ని ఎవడు తత్త్వదృష్టితో తెలిసికొంటాడో, అతడు శరీరమును త్యజించిన తరువాత మరల జన్మించడు. నన్నే చేరుకొంటాడు."

అమ్మ జన్మకర్మలను తత్త్వదృష్టితో మనము తెలిసికొనగలిగితే మనకూ ఆ ఫలితమే తప్పక లభిస్తుంది.

అనేక సందర్భాలలో సంభాషణల రూపంగ అమ్మ అందించిన వాక్యాలు మనకు మార్గ నిర్దేశం చేస్తాయి. అమ్మవాక్యాలు ఉపనిషత్సారాలు. ఎంతో క్లిష్టమైన భావాలను గోరుముద్దలు తినిపిస్తున్నట్లు, మనకూ చిన్న చిన్నమాటలలో మనస్థాయికి దిగి, మనకు పూర్తి అవగాహనను పెంచేందుకు ఉపయోగపడతాయి.

ఇంతకు ముందు "అమ్మ - అమ్మవాక్యాలు"ను మూడుభాగాలుగా ముద్రించారు. అవి లభ్యమవటంలేదు. అందుచేత సోదరీ సోదరులకు అమ్మ అమృతవాక్కులను అందించి అమ్మరూపులుగ దిద్దుకొనేందుకు శ్రీవిశ్వజననీ పరిషత్ మూడు భాగాలను సుందరమైన ఆకృతితో, మంచి కాగితాలపైన అందించాలని యీప్రయత్నం.

సోదరీ సోదరులు ప్రతి ఒక్కరు యింకొకరికి ఈపుస్తకాన్ని అందించాలని విన్నపం. కొద్దినెలలలో "అమ్మతో సంభాషణలు" మూడు భాగాలను కూడా పునర్ముద్రించి అందజేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

అవ్యాజ అనురాగమూర్తి, మమతామయి అమ్మ కరుణ మనకందరికి అందాలని ఆకాంక్షిస్తూ

జిల్లెళ్లమూడి
21-7-2001

అమ్మసేవలో,
బొప్పూడి రామబ్రహ్మము

# పరిచయము

గుంటూరు జిల్లాలోని బాపట్లకు ఎనిమిదిన్నర మైళ్ళదూరములో జిల్లెళ్ళమూడి అన్న గ్రామమున్నది. ఆ గ్రామపు కరణము (శ్రీబ్రహ్మాండం నాగేశ్వరరావు) గారి ధర్మపత్ని సౌభాగ్యవతి అనసూయమ్మగారిని 'జిల్లెళ్ళమూడి అమ్మ' అని అంటూ వందలాది ప్రజలు దర్శనము చేసుకుని పూజాదికములు చేసి తీర్థ ప్రసాదములు తీసుకుని వస్తున్నారు. 'జయహోమాతా శ్రీ అనసూయా రాజరాజేశ్వరి శ్రీపరాత్పరి' అన్న నామ సంకీర్తనము అక్కడ నిరంతరము వినబడుతుంది. దర్శనానికి వెళ్ళినవారు వారికి ఫల పుష్ప కుంకుమాదులు సమర్పించి, ప్రసాదము తీసుకోగానే ఆమెగారు అందర్నీ 'భోజనము చేసి రండి నాయనా-' అని మాటతోనూ సౌజ్ఞలతోనూ చెప్తారు. అందరూ చేరువనేవున్న 'అన్నపూర్ణ' అనే భోజనశాలలో అన్నం తిని కొంతసేపు విశ్రమించి మళ్ళీ వారి కుటీరానికి వెళ్ళి సెలవు తీసుకుని వచ్చేస్తారు. జిల్లెళ్ళమూడి గ్రామికుల నివాసము, చాలా చిన్న గ్రామము. భోజనము మాట అటుంచి ఫలాదులు కూడా కొనటానికి దొరకవు. 'అమ్మ'ను చూడడానికి వెళ్ళే 'బిడ్డల'కు ఆకలిబాధ లేకుండానూ ఈ యేర్పాటు. 1958 ఆగస్టు వరకూ అమ్మను చూడడానికి వచ్చేవారు కరణముగారింటనే ఆతిథ్యము పొందేవారు. ఆ నెల 15వతేదీన కొందరు సోదరులు కరణముగారి అనుజ్ఞ పొంది ఈ యేర్పాటు చేశారు. ఈనాడు వచ్చే జనము ఎక్కువగా ఉండడము నిజమేగాని, ఆ రోజులలో కనీసము పది పదిహేను విస్తళ్ళయినా లేచేవట వారింట. ఆధ్యాత్మిక వికాసము నర్థించి తమ శ్రీమతిని దర్శించ వచ్చేవారి కాతిథ్యము నిచ్చి కరణముగారు ఆదరించినారన్నది గొప్పమాట, అపూర్వము.

అమ్మ మన్నవ గ్రామకరణము సీతాపతిగారి కొమార్తె. అమ్మ తల్లి రంగమ్మగారు జీవితములో చాలా దెబ్బలు తిన్నావిడ. అమ్మ పుట్టకముందూ తర్వాతా ఆమె కాన్పులు చాలా నష్టమయినాయి. అమ్మ ఆశ్లేషా నక్షత్రంలో పుట్టడంతో అందరూ తల్లిగండమని జడిశారటా, అనసూయ పేరు అందుకే

పెట్టారట. బిడ్డలు పోయిన బాధాస్మృతితో రంగమ్మగారూ, సీతాపతిగారి మేనత్త మరిడమ్మగారూ కూడా అమ్మను మంత్రసాని నాగమ్మకే పెంచమని ఇచ్చారు. కనుక అమ్మకు తొలి రోజులలోనే నాగమ్మ చిరుగుచీర ఉయ్యాలా,అది కట్టిన చింతకొమ్మా సన్నిహితాలయినాయి. మహాపురుషుల బాల్యంలో జరిగే వింతలు అమ్మ బాల్యంలోకూడా జరిగేయి. తేలూ, కుక్కా, పిల్లీ - అమ్మ పాదాల దగ్గర పడుకుని చచ్చిపోవడము అమ్మ జన్మనక్షత్ర బలముగానూ, అంతకుముందు చింతచెట్టుక్రింద విరామముగా కూర్చొని ఉండగా చెన్నకేశవ స్వామి, రాజ్యలక్ష్మి అమ్మవారు మసకమసకగా దర్శనము ఇవ్వడము తన మనోదౌర్బల్యంగానూ కనపడ్డాయి సీతాపతిగారికి.

అమ్మమ్మ రంగమ్మగారు మాత్రమే తనలో వినపడే ధ్వనులను ఆశాజనకాలుగా అన్వయించుకున్నారు.

గొల్లనాగమ్మ కంచంలోని (ఎంగిలి) మెతుకులతో అమ్మ తనకుతానే అన్నప్రాశన చేసుకున్నారు. మరిడమ్మగారి ఓపికా సేవాశీలమూ యోగానురక్తి అమ్మలో ఆ బాల్యంలోనే అనునదించాయి. మహామేధావి అమ్మ సంధా రహితం గానే తాను చూచినవాటి అంతర్యమును గ్రహించుకున్నట్టు తోస్తుంది,ఆ చిన్ననాటి అమ్మ పనులు వింటే. దానిమ్మచెట్టు క్రింద కుడికాలు మడతపెట్టి పాదము మీద కూర్చుని ఎడమకాలుని చూచి అరమోడ్పు కన్నుతో చేతిలోని దానిమ్మపూవును చూస్తున్నట్టుగా వున్న అమ్మను పెత్తల్లి అడిగేరట; 'ఏమిటమ్మా అట్లా కూర్చున్నావూ?' అని. తప్పించుకోవడానికి అవకాశము తక్కువ! 'శాంభవీ ముద్రలే' అన్నారు. పెద్దావిడ బిత్తరపోయారు. 'నీకెవరు చెప్పారమ్మా' అన్నారు. ఉన్నమాటే, 'మరిడమ్మ తాతమ్మ అన్నారమ్మా ఇది సాధ్యమేనా?- అనిపించింది అన్నపూర్ణమ్మగారికి. అయితే "చెప్పిందా? చేస్తుంటే చూశావా?" అని అడిగారావిడ మరిడమ్మగారు తలుపులు వేసి మరీ చెపుతారు. పెండ్లికానివారికి చెప్పరు (పనికిరాదుగా?) మరి ఈ చిన్నపిల్లకు చెప్పేరా అది సందేహం. అన్నపూర్ణమ్మగారిని చిక్కించుకునే చిక్కం అల్లేశారు అమ్మ; 'చేస్తుంటే చూశాను, అడగ్గా చెప్పింది' సరి; ఇంకేం అడగ్గలరు? ఈ తెరలు వేసే ధోరణే ఈనాటికీ తనలీలలూ, ముందు చెప్పడాలూ, అమ్మ అన్వయించడములో కనపడుతుంది.

మరిడమ్మగారు రెండేండ్లేనా నిండని ఈ పిల్లకు చెప్పేరా? చెపితే 'శాంభవీముద్ర' పేరు చెప్పేరేమో. మరి అయితే ఆసనమూ ముద్రా 'చూచి' ఈ 19నెలల పిల్ల నేర్చుకున్నదా? అయితే ఎలాగ వచ్చాయీ? అంటారా? చేపపిల్లకు ఈత ఎవరు నేర్పాలి?పండ్లు కొని తెచ్చిన బండివానికి రెండు పండ్లిమ్మనీ ఇద్దరు కూతుళ్ళను పెట్టుకుని కూర్చున్న అంధురాలికి తనచేతి బంగారుగాజు ఇచ్చేయమనీ, ఏ అమ్మగారు చెప్పారూ?- ఏ అమ్మ ఇస్తుంటే చూచారు ఈ చిట్టి అమ్మ? తాను తొడుక్కున్న పరికిణీ చొక్కా గుడ్డలులేని ఇంకొక అమ్మాయికి ఏ అమ్మాయి ఇస్తుంటే చూచారూ?- ఏ అమ్మ చెప్పగా విన్నారు? నాడు జీడిపప్పు అమ్మే పిల్లకు ఒక కానీ జీడిపప్పు కొని ఇమ్మనీ, నేడు హాస్పిటలులోని కుష్టురోగులకు పాయసము వంటివి వండించి పంపమనీ ఎవరు ఒరవడి పెట్టారు ఈ అమ్మకు? 'అసలైన అమ్మకు అందరూ బిడ్డలే.' స్టేషనులో అనవసరంగా దబాయించిన ఉద్యోగీబిడ్డడే; పులిగోరు పతకం లాగబోయిన పోలీసూ బిడ్డడే. అందుకనే అన్నారు; 'ఉండు నీ చెయ్యి నొప్పి పుడుతుంది. నేనిస్తాను ఉండు-' అని అమ్మ.

అమ్మకు మూడేండ్లు గడిచేసరికి రంగమ్మగారు చాలా బలహీనురాలై పోయారు. అమ్మ తర్వాత ఆమెకు ఒక పిల్లవాడు పుట్టిపోయాడు. మరికొన్ని నెలలకు గర్భస్రావమైనది. ఈ రుగ్మతవల్ల ఆమె చాలా దిగజారిపోయారు. మందు తినడానికి బాపట్ల వెళ్ళారు. పినతండ్రి చంద్రమౌళి చిదంబరరావు గారింటికి. పాపమక్కడ డాక్టరు పొరబాటువల్ల ఆమె- కోలుకున్నవారే - అకస్మాత్తుగా మరణించారు. మరణమంటే ఏమిటో అమ్మ ఎరక్కపోలేదు. రంగమ్మగారి శరీరము దహించుకు పోడాన్ని తాతగారు చిదంబరరావుగారికి చూచినట్లుగా వర్ణించి చెప్పేరు. తల్లి మృతశరీరాన్ని చూచి అమ్మ ఏడవలేదు. ఆమె ప్రశ్నలు 'పుట్టేవారంతా ఎవరి దగ్గర్నుంచి వస్తారూ? చచ్చిపోయి ఎక్కడకు వెళ్తారూ? దేవుడు పంపినవాళ్ళు ఆయన పిలిస్తే మళ్ళీ ఆయన దగ్గరకు పోతే మధ్య మనమేడవడమెందుకూ?' అన్నవి ఆ పసివయసునుంచీ ఆమెకున్న జ్ఞానాన్ని ప్రకాశింపజేస్తాయి.

తరువాత అమ్మ తన పెద్దవారెక్కడ ఉంచితే అక్కడ సహనదేవత

అవతారంగా మెలిగారు. 'ఎవరున్నారు చెప్పుకుండేందుకూ?' ఈ దశాబ్దిలోనే అమ్మను ఆహారము వదిలింది. 'తల్లిలేని పిల్ల' అని అందరూ నోటితో అంటారుగాని చేతులతోనూ గుండెలతోనూ ఎవరంటారూ? ఎంతకాలమంటారు? చిదంబర రావుగారు ఒక్కరు అమ్మలోని స్వతః ప్రకాశమును చక్కగా గుర్తించారు. 'సైకిలెక్కేను, మోటారెక్కాను, గోడెక్కేను, బుజమెక్కేను, గుర్రమెక్కేను, ఏనుగెక్కేను, తాటిచెట్టెక్కేను'-అని అమ్మ అన్న మాటలు ఈ దశాబ్దివే అయి వుండాలి. ఈనాడు తన 'పిల్లలు' పొలాలు కొయ్యడానికి వెళుతుంటేనూ, నీళ్ళతో బుంగలు తెస్తుంటేనూ అమ్మ చెప్పే మెలకు గమనిస్తే ఆమె మేధాశక్తివల్లనే కాక జ్ఞప్తిని బట్టే చెప్పారా అనిపిస్తాయి.

అమ్మ మహామేధావి అన్నాను. మహామేధావుల ఆలోచనలు మొట్టమొదటగా ప్రశ్నవేసేదే సాంప్రదాయాల్ని. చివరి జవాబు మాత్రం పరమార్థానికి తగులుతుంది.అమ్మ పూలూ తులసిదళాలు, గుళ్ళోకి తీసుకువెళ్ళి అర్చకుడే దోచేస్తుంటేవాటిని కిందపెట్టి నిలబడ్డారు. అర్చకుడు 'అయ్యో అయ్యో' అని అరచి, కింద పడతావేం? తప్పుకాదూ? అమ్మవారిపూలు కింద పట్టవచ్చునా?' అన్నాడు. కిందనే కదా చెట్టు మొలిచింది? కింద మొలిచిన చెట్టుపూలు కింద పెట్టటం తప్పా? అమ్మవారికి పూజచేసే కుంకమూ, పసుపూ, పాత్రలూ,పళ్ళేలూ నివేదనలూ - ఇవన్నీ భూమిలోనే పుట్టాయిగా? తనతల్లి శరీరములాగే ఇవన్నీ మళ్ళీ భూమిలోనే కలుస్తాయి. 'ఇవి భూమిలోంచి వస్తున్నాయి; భూమిలోనే కలుస్తున్నాయి. కనుక భూమినే ఎందుకు పూజ చెయ్యకూడదూ? అన్నిటికీ ఆధారమైన ఈభూమినే దైవమని ఎందుకనరూ?- అని ప్రశ్నించారు అమ్మ. ఈ ప్రశ్నలే - నాడు కల్యాణానందులకు 'అమ్మ పేరు ఆధారము(భూమి); నాన్నపేరు ఆకాశము' అన్న సమాధానాలైనాయి; నేడు, 'జగన్మాత అంటే జగత్తుకు తల్లికాదు; జగత్తే తల్లి. 'అని అనిపిస్తున్నాయి. దేవాలయంలో కొట్టిన కొబ్బరి చిప్పను ముక్కలు చేసి అమ్మ - 'చూశారూ... ఒకటే యిన్నీ అయి వచ్చింది' అన్నారు అప్పుడు ; 'నీవు సాక్షాత్తు రాజరాజేశ్వరివమ్మా' అన్నప్పుడు 'మీరుకానిది నేనేదీ కాదు నాయనా'- అన్నారు.

కాలము దాని సహజవేగంతోనే సాగినా, అమ్మలోని సర్వ మాతృత్వం

మనోవేగంతో చరాచర ప్రపంచమంతటికీ విస్తరించి అత్తగారూ, భర్తగారూ, మినహాగా అందరినీ బిడ్డలుగా చేసుకుంది. చరమదశలో అత్తగారు కూడా - 'నువ్వు దేవత వనుకుంటున్నానమ్మా -కోడలివనుకోవటంలేదు' అన్నారు.

తన్ను వదిలిన ఆహారాన్ని ఇతరులకు-బిచ్చగాళ్ళూ, కాకులూ, కుక్కలూ, పందులూ - అన్నిటికీ అందించే ఆనాటి గుణము ఈనాడు మేనాలోంచి కాలవలో డింగీలో ఉన్న కళాసీ ఒళ్ళో పడేట్టు పండు విసిరించింది;దోమ దద్దురెక్కేటట్లు కుట్టితే- 'దోమ యిక్కడ ముద్దు పెట్టుకుంది.'అనిపించింది; కుక్కకు కూడా తీర్థము వేయించింది. ఆనాడు ఎవరేనా జడపీకితేనూ,తోసి పడగొట్టితేనూ- 'నాపరామరికే' అని చెప్పి సర్దిన సహనము ఈనాడు పీట లేకుండానే కూర్చుని పడ్డప్పుడు- 'తగలవలసినవి ఎట్లాగూ తప్పవు' అని అనిపించింది. 'ఊళ్ళో బయటచేరిన ఆడవారుంటేనే మైలపడే దేవుణ్ణి పూజచెయ్యడము ఎందుకూ?' అని నాడు అడిగించిన విమర్శ నేడు- 'నీకభ్యంతరము లేకపోతే (బయటచేరిన) నీ భార్యా నీవూ కలిసి ఇస్తే ఆ చీర కట్టుకుంటాను.'అని చెప్పించింది. నాడు పెదతాతకు బంగారుబిళ్ళ యిచ్చి బ్యాంకులోపెట్టి సొమ్ము తెచ్చుకోమన్న కారుణ్యమే నేడు - నగల్ని 'అబ్బాయి' ఇల్లు కాయడానికి బ్యాంకులో పెట్టమని ఇచ్చింది. నాడు తమ యింటి శుభాన్ని చూడరమ్మని ముత్తయిదువలనూ, మగవారినీ మాత్రమేకాక వితంతువులకూ విభూతి యిచ్చి పిలిచిన ప్రేమే నేడు- సందేహించే వితంతువులను'చేసుకోవచ్చునమ్మా పూజ. రండి' అని ఆదరిస్తున్నది.

లౌకికజీవన పథంలో సందేహదష్టులైన అనేకులకు అమ్మ- అవసరమే విలువైనది; ఇష్టంలేనిది కష్టం; (తాను) సహించలేనిదే హింస;భరించలేనిదే బాధ- అన్న సందేశామృతాన్ని పోస్తున్నారు.

'గుర్తు చూపించినవాడే గురువు'. అమ్మవల్ల గుర్తెరిగినవారేగానీ అమ్మకు గుర్తు చూపించిన వారు లేరు. కల్యాణానందులకు అమ్మ ఏడేండ్లవయస్సులో'మనస్సేమంత్రం; శబ్దమే బీజం' 'తృప్తి అంటేఇంతకంటే మరిలేదనే స్థితి.' 'తప్పించుకుందామన్నా తప్పనిది తరుణం' అని చెప్పారు. రాజమ్మగారికి -'అర్థంలేని ఆచారం పాటించనక్కరలే'దనీ 'సంకల్పమే దైవ'మనీ, "దైవం 'వాడు' గానీ 'అది'గానీకా"దనీ 'తెలియనిది లేకపోయినా తెలిసింది

లేకపోయినా ఒకటే స్థితి' అనీ 'సర్వత్రా భిన్నత్వం లేకపోవడమే పరిపూర్ణత్వ'మనీ దైవం తలుస్తేనే తాను తలుస్తాడు, తాను తలిచేది వేరేలే'దనీ - ఎన్నో చెప్పేరు. ఒకరిద్దరు సన్యాసులు అనుభవపూర్ణము లయిన అమ్మ మాటలకు నాటి మారీచుడి లాగ ఏ మూలకో కొట్టుకుపోయారు. అమ్మకు గురువెవరూ లేరు. అమ్మ చూచిన వారిలో చదువుకున్నవారే గాని జ్ఞానులెవరూ లేరు. వారందరిలోనూ కల్యాణానందులే మెఱుగు.అమ్మను అంతగా కాకపోయినా కొంతేనా గుర్తించారు. రమణమహర్షి అన్నారట- ఒక్కొక్కరు తనకుతానే గురువు కావచ్చునని. అమ్మ ఏదీ సాధించటానికి జపముగానీ యోగముగానీ, మననముగానీ చేసినట్లు ఎవరూ చెప్పలేదు. అమ్మేతానై 'తెలిసి చేసిన సాధనంటూ లేదు' అన్నారు.

పరమేశ్వరుణ్ణి తండ్రిగా, ప్రభువుగా, తల్లిగా, మిత్రునిగా భావించుకుని కొల్చిన భక్తుల కథలు పెక్కులు మనము విన్నాము. వారి అర్చనలో పరమేశ్వరుడు వేరూ, వారు వేరూను. యోగావసానంలో కూడా 'అంతా రామమయం' అని ఉండేదే రాముడొకడు' అని జగమంతటిలోనూ తమ దైవాన్ని దర్శించుకుని ఆ లడ్డు రుచి అనుభవించడానికి తాము వెరుగా ఉండినారు కొందరు, ఆనందతీర్థులవంటివారు. 'ప్రభో నేనూ నీవూ ఒకటే కాని నాదృష్టి నీ పాదములమీద' అన్నది ఇంకొక స్థితి, రామానుజులది కాబోలును. తనలోనూ బయటా అంతా ఒకటే అన్నది మరియొక స్థితి, ఆచార్యశంకరులది కాబోలును. వీరి జిజ్ఞాసలు 'నేను' 'తాను'తో ప్రారంభిస్తాయి. 'నేను' 'తాను'తో ప్రారంభిస్తాయి. 'నేను నీ దాసుడను; నేను నీ అంశమును; నేనే నీవు. -అని ఆంజనేయుడన్న స్థితులవి. అమ్మచర్యలే యోగముద్రతో ఆరంభమూ, కారుణ్యముతో గమనమూ, మాతృత్వముతో ప్రకటనమూనూ. 'అన్నీ నావే కనుక' అన్నదే అమ్మ స్ఫురణ. 'ఒకటే (ఈ)అనేకమయింది.'అన్నది అమ్మ బోధ. (చూ. 'మహోదధిలో తరంగాలు) 'దానికి' ఆమె అమ్మ' అన్న సంకేత మేర్పరచడమూ, 'దాని'తో తన అభేద స్థితిని ప్రకటించడమూ రెండు సన్నివేశాలు కావు; మరి ఒక్కటే. 'నీవు లేనప్పుడు నేనే అమ్మనై ఉంటాగా?' అన్న మాటను మనము సరిగ్గా వింటే -రంగమ్మగారికడనే చిట్టి అమ్మబిడ్డ; తక్కినచోట అమ్మయేనని అన్వయము అవుతుంది; పరమేశ్వరుణ్ణి అమ్మగా కొలచిన రామకృష్ణవంటివారు ఉన్నారుగానీ ఆ పరమేశ్వరుడే అమ్మగా

వచ్చినదెప్పుడూ, ఇదివరకూ? అమ్మ తొలిప్రశ్నయే 'ఇదంతా దేనినుండి వచ్చినది?' అని. తరువాత ఆమె పలుకులు ఆ ప్రశ్నలకు జవాబులై, ఆమె చేతలు దివ్యమై ఆనాడు ఉండినవీ; ఈనాడూ ఉన్నవి. నలుగురూ అమ్మను గుర్తించిన 1956 సం॥ తరువాత భక్తుల రికార్డు నుండి మనకందిన అమ్మవాక్యాలలో మానవమాధవే స్ఫురిస్తుంది అంతటా. మానవిగా జిల్లెళ్ళమూడి కరణముగారి భార్య అమ్మ. ఆ సంబంధమే లేకుంటే అమ్మ మనకు అంది ఉండకేపోను. కష్టమో నిష్ఠూరమో ఆమె ఆ గిరిలో ఉండబట్టే మనము 'పుణ్యమహోపుణ్యమహో పుణ్యం తవ దర్శనం' అని అనుకోగలుగుతున్నాము. అయితే అరణ్యవాసము చేసే శ్రీరాముడికి అయోధ్యాబంధమూ, కంసవధానంతరము శ్రీకృష్ణుడికి తలిదండ్రుల బంధమూ ఎంత మాత్రమో- అమ్మకూ బ్రహ్మాండమువారి బంధమూ అంత మాత్రమె. ఆమెగారికి ఇది వరకు లేనిదీ, ఇప్పుడు కొత్తగా వచ్చానదీ ఏమీలేదు. (అయితే ఒక మాట చెప్పాలి. పాలకోసం రాళ్ళు మొయ్యవలసిన అవసరమేమీ మనకు లెకుండా చేశారు. శ్రీ నాగేశ్వరరావుగారు) మాధవిగా - మాధవిగానే జిల్లెళ్ళమూడి వచ్చే అశేష జనానికీ ఆరాధ్యము.

'ఇదంతా దేని నుండి వచ్చినది?' అన్న ప్రశ్నకు 'అదే ఇన్ని రూపాలుగా వచ్చినది' అని అమ్మ జవాబు. కదలేది కదలించేది అదే. కదలిక దాని స్వభావము. కర్త, కర్మ, క్రియా -- ఒక్కటె. మూడు కావు. ముందు కర్తా, తరువాత క్రియ ద్వారా కర్మా కావు. కర్త కర్మ క్రియ లనాది. వ్యవహారానికె అది మూడు గాని వాస్తవానికి ఒకటే. 'నేను అదీ అనడము లేదు. నేను ఇది అంటాను.' సర్వం ఖల్విదం బ్రహ్మ. తాను ఒకటి తలిస్తే దైవం మరొకటి తలుస్తాడు - కాదు. దైవం తలుస్తేనే తాను తలుస్తాడు. సంకల్పమే దైవం. దైవసంకల్పం లెనిది, నీది అంటూ వేరే ఏదీ లేదు. అన్ని సంకల్పాలకూ ప్రేరణ, జీవం - దైవమే. అన్ని రూపాలూ, గుణాలూ, క్రియలూ అతనివే. మంచి చెడ్డలన్నవి పరిమిత మయిన మమకారము గల మానవుడి మాటలు. హెచ్చూ తగ్గూ మాత్రమే - వ్యష్టి మాత్రమే - గానీ సృష్టిలో మంచి చెడ్డలన్నవి లేవు.

మానవత్వానికి లక్షణం పరిమితి మాత్రమే. మమకారం అందరికీ ఉంటుంది. దైవానికీ ఉంది. అయితే మానవుడిది పరిమితి గల మమకారం.

దైవానికున్న మమకారం సర్వత్రా ఉంటుంది. మానవుడికి పరిమితమయిన రూపం ఉంది. దైవానికి ఉన్నది ఒక రూపము కాదు, సర్వరూపత్వము. మానవుడికి ఈ గుణము కొంతా, ఆ గుణము కొంతా ఉంటుంది. గుణాలన్నీ దైవానివే. దైవము సర్వ సత్త. సర్వ శూన్యత్వం కాదు. భ్రాంతి అన్నది పరిమితమైన మమకారమే. మమకారానికి పరిమితి -- పోతే అంటే భ్రాంతి పోతే, మిగిలేది బ్రహ్మమే. అంతా నాదే- అనుకున్నవాడు మానవుడు కాదు - బ్రహ్మమే.

అయితే బ్రహ్మత్వ సిద్ధికని మనము చేయవలసిన దేమిటీ? పుస్తకాలు చదవడము కాదు. సాహిత్యముతో రాహిత్యము కాదు. ఏ శక్తి నీకు 'చేయవలసిన దేమిటి?' అన్న ప్రశ్న కలిగించిందో అదే తరుణం వచ్చినప్పుడు అనగా తన కిష్టమయనప్పుడు ని చేత చెయిస్తుంది. అంతవరకూ ఊరికే కూర్చోనా? - అంటావా? కూర్చోలేవు. అన్ని క్రియలూ ఆయనవే. నువ్వు కూర్చోవడమేమిటి? కూర్చోబెట్టేదీ, ఆలోచన చేయించేదీ, పని చేయించేదీ ఆయనే. ఇక 'నీ'వంటూ ఏదీ లేదు. తనకు కావల్సిన విధంగా తనకు కావలసినప్పుడు ఆయన చేయించు కుంటాడు. 'నేను' అని ప్రత్యేకంగా అనుకునే 'నీ' చేత. ఆయన అనుకోనిదీ చేయించనిదీ 'నీవు' ఏమీ చేయలేవు.

కనుక 'నేను చేయవలసినది' అని నీకు తోచేది చెయ్యి; తొందర చేసేవాడు వాడేగా? 'సాధన' అని అంటున్నది వాస్తవానికి లేదు. చెయ్యగల అవకాశాన్ని గుర్తుంచుకోడమే సాధన అన్నది. నీకు ఏది సాధ్యమైనదో అది సాధన. ఇతరులు చెప్పినదీ కాదు; నువ్వు చేతామనుకున్నదీ గాదు; మరి నీ చేత ఆ శక్తి చేయించినదే సాధన. కనుక నువ్వు సాధన చెయ్యడమనగా ఏమిటి?

'ఎన్ని చెప్పినా నేను చేస్తున్నాననిపిస్తున్నదే, మరి ఏమిటి చెయ్యడమూ?' అంటారేమో - అవును, అనిపిస్తుంది. అలాగా అనుకోవడమే - 'నేను' అంటూ వేరుగా వున్నానుకోడమే - మానవత్వం. మనకు తట్టే సంకల్పాలు మన స్వంతం అనుకోవడమే మానవత్వం. సుఖానికి దారి చేస్తున్నట్టుగా కనబడుతూ కష్టాలకు దారి చేస్తుంది - ఈ 'నావి' అనుకోవడము. నీకు తట్టే ఆలోచనలూ సంకల్పాలూ నీవి కావు. అన్ని సంకల్పాలూ ఎవరివో, ఆయనవే! నీవి అని ఎంతకాలము అనుకుంటావో, అంతకాలమూ సంకల్ప బంధము - అంటే సంసార బంధము -

నీకు ఉంటూనే ఉంటుంది; సుఖదుఃఖాలు పడుతూనే వుంటావు. నీకు తట్టే సంకల్పాలు నీవి కావనుకోవడమే సంకల్పరాహిత్యము.

'ఈ అనుకోవడము మాత్రము నాదా?-' అంటావా? కాదు; కాదు; కానే కాదు. ఆయన అనిపిస్తేనే అనుకుంటావు. కనుక 'ఏం చెయ్యాలీ?' మళ్ళీ మొదటికే వచ్చాము. అయితే ప్రతీ ఫిర్ ? అన్న కథాశ్రవణలోలుప నవాబు ప్రశ్నకూ అనంత కథాకథకుని 'తుర్' (మరొపిచిక మరోధాన్యపుగింజ ఎత్తుకుని 'తుర్' మని పోయింది') అన్న జవాబు ఉంటూనే ఉంటుంది. దీనికి జవాబు ఇదుగో. నీకు వచ్చే సుఖాలూ దుఃఖాలూ - అన్నిటినీ ఏర్పాటు చేసిన ఆయన నీకోసంకల్పించిన సముద్రకెరటాలు. హాయిగా పైకీ కిందికీ తూగుతూ ఈదులాడుతూ ఆనందించు.

స్త్రీలు అడుగుతారు ఈ అమ్మను, 'ఏం చెయ్యమన్నారూ'?అని నీ భర్త నీకు ప్రత్యక్షదైవం. నీకు అవసరాలు రక్షణా ఇచ్చే పరమేశ్వరుని ప్రతీక నీ భర్తను అర్చించు. నీకు వేరే మంత్రము ఎందుకూ? నీ దగ్గర లేడంటావా? భర్త అంటే భావన; ఆ శరీరము కాదు. నీ మెళ్ళోని మంగళసూత్రాలు భగవంతుడిచేత కట్టబడినవి? ఆయన పాదాలు. నీకింకా వేరేమి కావాలీ? అర్చించు-అని చెప్తారు అమ్మ. భర్త దగ్గరలేడని అనుక్షణమూ వేదన పడుతూన్న గృహిణి ఒకామె అమ్మను అడిగేరు నాకేమిమార్గం?' అని చేస్తూనే వున్నావు గదమ్మా?ఎవరు నీకు కావాలనుకుంటున్నావో వారికోసము వేదన పడుతూనే ఉన్నావు ఏడుపు అంటే కన్నీళ్ళు కాదుగా? వేదన అనే అగ్ని హృదయంలో ప్రవేశించి అన్ని మమకారాల్నీ రాగద్వేషాల్నీ దగ్ధం చేస్తున్నది. ఇదే హఠయోగం; ఇదే భక్తి. సర్వకాలాల ఉన్నప్పుడు ఇదే జ్ఞానం. నిష్కామకర్మ ఇదే. నీకు తెలియకుండానే నువ్వు దీపము చేసే పూర్ణ యోగము చేస్తున్నావు. నీ యత్నం పూర్తి అయినప్పుడు నీవు స్త్రీ జాతికి అలంకారమవుతావు' అన్నట్టుగా చెప్పేరు అమ్మ. ఈ పూర్ణయోగాన్ని పురుషులకు అన్వయిస్తే.... నువ్వు చేసే ప్రతిపనీ - భౌతికమూ ఆధ్యాత్మికమూ అన్న పేరులు పెట్టకుండా -ఆయన నిర్ణయప్రకారమే అనీ ఆయన సేవే అనీ చెయ్యి.-' అవుతుంది. నీ కామమేది లేదు దీనిలో; కనుక ఇది నిష్కామకర్మ. ప్రభు నిర్ణయం గుర్తించి సేవ చేస్తున్నావు, అది భక్తి. -ఏదో అనంతశక్తి ప్రభావమేఇదంతా అన్నదే జ్ఞానం. జ్ఞానం అంటే కాగితం మీద రాసి పెట్టేదికాదు; పై అనుభవమే జ్ఞానం నీ

యింద్రియాల్ని పై సేవకోసం మడతపెట్టి మనస్సును కేంద్రీకరింప జేస్తున్నావు; ఇదే హఠయోగము. ప్రతికేంద్రములోనూ ప్రభువు విభూతినే చూస్తున్నావు; ఇదే రాజయోగం. అమ్మ చెప్పేపూర్ణయోగమిదే. కర్మ, భక్తి, యోగము, జ్ఞానం - ఒకదాన్ని విడిచి మరియొకటి లేదు.

శాస్త్రపాండిత్యము కాక అనుభవజ్ఞాన మన్నది. అధ్యాత్మిక విజ్ఞాన చరిత్రలో ఎప్పుడు వచ్చినదైనా, సమకాలిక విజ్ఞానాన్నే కాక అధ్యాత్మిక శాస్త్ర పరిభాషనే మార్చేస్తుంది. అమ్మవాక్యాలలో - బోధనలలో అనలేము - అమ్మ 'అది అటు కాదు, ఇటు' అంటూ ఎప్పుడూ చిన్ముద్ర ధ్వనించనైనా ధ్వనించరు, అమ్మ బిడ్డలకు చెప్పినట్లే చేస్తారు.-వేదాంత పరిభాష మారిపోతుంది. (1) 'కర్మ అకర్మ,వికర్మ-అంటే ఏమిటి?'అని ఒకరు అడిగేరు అమ్మను. ఈ పదముల సంప్రదాయార్థము ఏదైనా కానివ్వండి- అమ్మ అంటారు: నాకు 'కర్మ అకర్మ - రెండే కానవస్తున్నాయి' అని కర్మ అంటే పని. అది జరగడము అందరికి తెలుస్తూనే వుంది. ఇక 'అకర్మ' అంటే తాను కర్మ కాకుండా, కర్మకు ప్రేరణ చేసెదట కర్మ మనమంతా చేస్తున్నాము. అనుకుండే పని. అకర్మ ఈకర్మకంతా ప్రేరణ చేసేది. 'వికర్మ అనగాఏమిటీ? అదీ కర్మే. (2) 'సంసారమంటే సంకల్పమే' అన్నారు మూల్పూరివారితో అమ్మ. ఊహామాత్రంగా, సృష్టి జరగని ఆ కాలములో బ్రహ్మకు సృష్టి చెయ్యాలని కలిగిన సంకల్పాన్ని ఊహిస్తే, ఆ సంకల్పఫలమే సృష్టి, సృష్టితో బయల్దేరిన సకల సంకల్పాలూ సంసారాలూనూ! అమ్మ సృష్టికి ఆది అంటూ లేదంటారు. అప్పుడు మరి సంకల్పమే- ఆ ఆది సంకల్పమేకాదు, దాని నైసర్గిక ఫలితాలైన అన్ని సంకల్పాలున్నూ సంసారమే మరి! (3) అన్ని ఆకారాలూ ఆయనవే కనుక నిరాకారుడూ, అన్నిగుణాలూ ఆయనవే కనుక నిర్గుణుడూ, అన్ని క్రియలూ ఆయనవే కనుక నిష్క్రియుడూనట. తెలుపు అన్ని రంగులూ చేరినదీ, ఏ ప్రత్యేకరంగూ కానిదీనూ, పంచదార అన్ని ఆకారాల్లోను పోతపోయ వచ్చును, దానికొక ఆకారమంటూ లేదు. పరమేశ్వరుడు అనంత కల్యాణ గుణ పరిపూర్ణుడు -అన్న పూర్వపు పరిభాష 'అనంత గుణ పరిపూర్ణుడు'గా మారుతుంది. పరబ్రహ్మను ఊహాబద్ధ బ్రహ్మమునుగా కాక 'ఊహాపర' బ్రహ్మగా చెప్పడానికి ఆకారం చేత బద్ధుడు కాడు, గుణాల చేత బద్ధుడు కాడు, క్రియలచేత బద్ధుడు

కాదు- అంటూ వర్ణించారు కాబోలు. 'ఇదేదికాదు, ఇది కానిది'అని కాబోలు దాని తాత్పర్యము. అమ్మ మాటలలో -'అదీ అని అనుకోను; ఇదే' అన్ని రూపాలూ, ఇంకా రాబోయే రూపాలూ; అన్నీ గుణాలూ; అన్ని క్రియలూ; సర్వమూ- బ్రహ్మమే. అనంతత్వమూ ప్రత్యేకతారాహిత్యమువల్ల అవాఙ్మానస నిర్వచనాగోచరుడు పరమేశ్వరుడు కానీ, 'ఇది' కాకపోవడము వల్ల కాదు. నేతి నేతి - అనడము క్రమ మినహాయింపు కాదు, ఏకదేశత్వ మినహాయింపు. (4) అమ్మమాటలలో నిష్కామకర్మకు సత్తలేదు - అనగా 'నవిద్యతే భావో' చెయ్యడానికి ప్రేరణవాడే అయినప్పుడు నువ్వు చేసేది ఏముందీ ఇంక? కర్మకానవస్తోంది; చేయించేది కానరావడము లేదు ఆ కర్తవాడే, నువ్వు కావు. ఇక నిష్కామకర్మ నువ్వు చెయ్యడమనగా ఏమిటీ? (5) మిథ్య అంటే లేనిదని కాదు; ఇదే రూపంతో, గుణంతో ఉండనిదీ మారిపోయేదీ- అని అర్థము వస్తుంది అమ్మ మాటలలో. (6) మాయ అన్నది లేదు; స్వభావమే ఉన్నది. 'సంకల్పమే సృష్టి అయినప్పుడు 'మాయ' అని ఇంకొకమాట ఎందుకూ అంటారు అమ్మ. జగత్తు లేనిదికాదు; ఆత్మకు ప్రతియే జగత్తు. ఆత్మను తెలుసుకోవాలంటే జగత్తు ద్వారా తెలుసుకో. జగత్తును అన్వయించుకోవాలంటే ఆత్మద్వారా అన్వయించుకో. రెండూ ఒక్కటే; రెండు కాదు. (7) అందరికీ సుగతే. సంతత నరకము లేదు; సైతాను మన ఊహాకల్పనే; వేరే లేడు. తేడాలే తప్ప మంచీ చెడ్డాలేవు (8) సమాధి అన్నది అమ్మ మాటలలో సర్వ సమానత్వము. తానే అయివున్నా, లోకమువైపు చూచినా - చూచేది తననే' అన్న స్థితి. తానే అయి వున్నప్పుడు ఎక్కువాలేదు; లోకాన్ని చూసినప్పుడు తక్కువా లేదు. ఈ వ్యాపారంలో 'లాభనష్టాలు లేవు' (9) ప్రారబ్ధము అంటే భగవంతుని నిర్ణయము. తొట్ట తొలి జన్మలోని అనుభవం అంతకుముందు మనము చేసిన కర్మకు ఫలితము కాదుగా? ఆ జన్మలోని అనుభవము భగవంతుడిచ్చినదే కావాలిగా ? ఇంకెప్పుడు మాత్రము భగవంతుడిచ్చినది కాకపోతుందీ?

'అమ్మా - అమ్మవాక్యాలూ' అన్న ఈ పుస్తకము అమ్మ తనను చూడవచ్చిన వారితోనూ ఇతర సందర్భాల లోనూ అన్న మాటలు. బాలికలు వ్రాసిన డైరీలూ, భక్తులుచెప్పిన సంగతులూ ఆధారము వీటికి. వాక్యాలన్నీ వేర్వేరు వ్యక్తులకు

వేర్వేరు సందర్భాలలో చెప్పినవి, పుస్తకాలలోని మాటలు కాక అడిగినవ్యక్తికి తెలిసేటట్టుచెప్పిన జవాబులవడముతో ఒకే సందర్భానికి వేర్వేరు రీతులలో తీరిన జవాబులలాగ కనపడవచ్చును. అవన్నీ జవాబులే; ఏ ఒక్కటీ పూర్తియైనది కాదు అన్నమాట. అమ్మ ఒక విషయాన్ని గురించి వ్యాఖ్యాన ప్రాయంగా గానీ బోధనా పద్ధతిలో గానీ కొంతసేపు చెప్పరు. అప్పుడూ అప్పుడూ అన్న వాక్యాలను అర్థము కాగలవన్నంత పరిమాణంలో- కూర్చిన ఫలితమీ పుస్తకము. మా చిన్న కొలతకు అందినంత సామరస్యాన్ని బట్టి చేర్చాము వాక్యాల్ని. పాఠకులు మా లోపాల్ని పరిహరించుకొని అమ్మమాటలలోనే వినిపించుకోండి అని వేడు కుంటున్నాము. ఈ పుస్తకానికి సంబంధించిన మానవత్వము మాది; మాధవత్వము అమ్మది.

అమ్మ సన్నిధిలో ఉంటూ అతి శ్రద్ధాభక్తులతో అమ్మ దినచర్యను వ్రాస్తూ అమ్మ మాటలను అందించిన శ్రీమతి వసుంధర, కుమారి భవానీ, కుమారి బాలాత్రిపురసుందరీలకూ, లభ్యమయిన అమ్మవాక్యాలను తమతమ డైరీలలోనూ హృదయాల్లోనూ నిక్షిప్తపరచి అందించిన వివిధ సోదరులకూ, వాటినన్నిటినీ అధికశ్రమతో అత్యధిక శ్రద్ధతో సంకలనం చేసి పుస్తకరూప మేర్పరచిన డాక్టర్.శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారికీ మా కృతజ్ఞతతెలుపుకుంటున్నాము.

ప్రేమతో

మీతోడబుట్టినవారు

**ప్రకాశకులు**



# విషయసూచిక - మొదటిభాగము

# అమ్మ

1. "తల్లి అంటే తొలి."

2. నిండు ఎఱుపు కుంకుమ వన్నెగల జరీపేటంచు చీర; అదే వన్నెలో ఉన్న రవిక; వ్రేలుముడి; ముడిలో ముడవబడిన మల్లెలూ, మరువమూ, మందారాలు; భ్రూకుటిని సదా పూర్ణబింబాకృతితో శోభిల్లుతుండే కుంకుమ బొట్టు; దాని దిగువ విభూతితో దిద్దబడిన సన్నని అర్ధగీత;ముక్కున బులాకి; కుడి భుజానికి రాళ్ళదండవంకి; రెండు చేతులనిండాఎఱుపువన్నె గాజులూ; వాటికి ఇరువైపులా బంగారుగాజులూ; వాటిముందు తెలుపు వన్నె రాళ్ళగాజులూ - సర్వాభరణాలతో అమ్మ హాల్లోకి వచ్చారు.

3. అమ్మ కేచీర అయినా బాగుంటుంది.

4. స్నానం చేయకుండా చీర మార్చినా చేసినట్టే ఉంటారు అమ్మ.

5. 'అమ్మకు సూటైన కలర్ జాకెట్‌గుడ్డ తీసుకురండి'
"అమ్మకు అన్నీ సూటే."

# జిల్లెళ్ళమూడికిదారి

6. ఎత్తైన బండిలో కూర్చోవటంతో దారికి రెండువైపులా వున్న తుమ్మకొమ్మలు తగులుతున్నాయి మాకు. అమ్మ అన్నారు."జిల్లెళ్ళమూడిబాట ఇదే, రావటమూ బాధే. వెళ్ళటమూ బాధే. ఎవడో ప్రాప్తం వుండి నిల్వవున్న వాడికి తప్ప వచ్చివెళ్ళేవాడికి బాధే"

# అన్నపూర్ణమ్మ

7. తొలిరోజులలో దర్శనానికి వచ్చిన పోరిమాణిక్యమ్మగారితో - "భోంచేశారా?"

8. 'నేను అన్నానికి రాలేదమ్మా నిన్ను చూడటానికే వచ్చాను.'
"నాకు భోజనం (ముఖ్యం)."

9. "వేళ చాలా అయింది నాన్నా . అన్నం తిన్నారా?"
'లేదమ్మా.'
"ముందు భోజనం చేసిరండి, పూజచేసుకుందురుగాని."

10. రెండు గంటలకి ముగ్గురొచ్చారు.
"వాళ్ళు అన్నాలు తిన్నారోలేదో కనుక్కుని అన్నానికి తీసుకెళ్ళండి."

11. పూజ మధ్యలో కొందరన్నయ్యలు ఊరికి వెళ్తామని సెలవు కోరితే "భోంచేసి వెళ్ళండ"న్నారు. వాళ్ళు ఉందామా వెళదామా అన్న సందిగ్ధంలో పడినవారు అమ్మ అన్న ఈ మాటతో ఉన్నారు.

12. "మీరు నడిచి వెళ్ళాలి నాన్నా, పొద్దు ఎక్కుతుంది. వంట అయినంత వరకూ తిని వెళ్ళండి."

13. రామకృష్ణ ఉత్తరాలు రాస్తుంటే ఎవరో మొక్కుగా తెచ్చిన ఉండ్రాళ్ళు ఇచ్చి, ఆయన వాటిని పక్కనబెట్టి రాస్తుంటే -"ముందు తినరా, తర్వాత రాయొచ్చు" అన్నారు.

14. జిల్లెళ్ళమూడినుంచి శారదాంబగారిని ఏడోమైలురాయికి తీసుకు వెళ్ళడానికి వచ్చిన రిక్షావాలా తొందరపెట్టాడు. వారు బయల్దేరారు. అమ్మ బయటికి వచ్చి అక్కడ కూర్చున్న రిక్షావాలాను చూసి"భోంచేశాడా అతను?" అని అడిగారు.

15. ఒక అంధ భక్తుడితో మాట్లాడి -

"సరే భోజనం చేసిరా.తీసుకెళ్ళి పెట్టించమ్మా. అతన్ని తీసుకొచ్చిన రిక్షా అతన్ని కూడా పిలిచి అన్నం పెట్టించండి."

16. "భోజనం చేసి వెళ్ళండి నాయనా-"

'అక్కడ చేస్తాం అమ్మా.'

"ఎక్కడ?"

'చీరాలలో రాగానే తయారు చేయిస్తామని చెప్పేరు.'

"అక్కడ తయారు చెయ్యాలి. ఇక్కడ తయారు చేసే వుంది."

17. కూలీలు వచ్చారు. వాళ్ళకు దర్శనం కాగానే కొబ్బరీ కుంకుమా ప్రసాదం ఇవ్వమన్నారు. చివరకు ఒక వృద్ధుడు వచ్చి చెయ్యిజాపాడు-

"వాళ్ళ కిచ్చారు నాయనా" అని మంచం మీద కనకాంబరాల మాల వుంటే అది ఇచ్చారు -"చెయ్యి జాపేవుగా" అని.

18. 'ఎక్కడికి పోనూ, ఉద్యోగం లేనిదే?'

"అంతవరకూ ఇక్కడ వుండు."

19. "నేను చెప్పే సలహా: మీకు ఇష్టమైతే అబ్బాయి అమెరికానుండి వచ్చేదాకా అమ్మాయిని ఇక్కడ ఉంచండి."

20. "నీ పరిస్థితులు ఎట్లాగున్నా నరే - అమ్మదగ్గరకు రావటానికి సందేహించొద్దు."

21. "అమ్మా నాన్నా ఎక్కడుంటారు?"

'జంషెడ్పూరులో.'

"సెలవలకు అక్కడికి వెళ్తుంటావా?"

'చాలాదూరం కదండీ, వేసవి సెలవులకు వెళ్తుంటాను.'

"మరి మధ్యలో అప్పుడప్పుడు ఇచ్చే సెలవలకు?"

'వెళ్ళను.'

"అయితే ఈ తడవనుంచి ఇక్కడకు వస్తాండు. నా దగ్గర నీకు భయమేమిటి నాన్నా?"

22. తిరుపతి నుంచి వస్తూ భార్యాభర్తా అమ్మను చూసి వెళ్ళాలని వచ్చారు. టెంకాయకోసం కూర్చున్నారు. కాని గజేంద్రమ్మ ఎంతకూ రాలేదు. చివరకు అమ్మే హాల్లోకి వెళ్ళి-

"నాన్నా అన్నం తిని రండి" అన్నారు.

"టెంకాయ కొట్టాలమ్మా."

"టెంకాయ లేకపోతే ఫర్వాలేదులే నాన్నా. పోనీ తర్వాత కొట్టుకుందురు గాని-ముందు అన్నం తిని రండి."

23. పెండ్లినాడే అమ్మ మెల్లగా అందరినీ "భోజనం చేసి వెళ్ళమ"ని చెప్పారు.

24. ఎవరికో సుస్తీగా వున్నదనీ, దానికి వుపశమనం కోసం వచ్చామనీ అన్నారు. అమ్మ గొంతునొప్పితో మాట్లాడలేకుండా వున్నప్పటికీ -

"నాకట్లాంటిదేం తెలీదు.. నాకేం తెలీదమ్మా. డాబా దగ్గరికెళ్ళి భోజనం చేసి రండి."

'ఇక్కడకు రావడమే వుపశమనం.'

"ఎక్కడకు వచ్చినా ఏవీ పోవు. మనది మనం అనుభవించాల్సిందే."

వారు ప్రసాదం తీసుకుని బయల్దేరేరు.

"నాయనా అన్నం తిని వెళ్ళండి."

'ప్రసాదంగా తీసుకుని వెళ్తామమ్మా.'

"అందుక్కాదమ్మా - మీకెండెక్కుతుందనే ఉద్దేశంతో"

వారు భోజనాలకి వెళ్ళారు.

25. అమ్మా ! ఎట్లా వున్నది నీ వంట్లో?'

నిన్న నువ్వు చూసినది ("కడుపులో మంట" అనరు!) ఎక్కువైందమ్మా. ఒక రాత్రివేళ మజ్జిగ తెప్పించి తాగేక తగ్గింది."

"ఈ పూట గూడా తాగుతావా అమ్మా?"

"మజ్జిగ (భోజనాలుచేసే) వాళ్ళకే చాలటంలేదుటమ్మా. ఎందుకు? వద్దులే."

26. సరస్వతమ్మగారు ఇక్కడకు వచ్చివెళ్ళి దాదాపు పది నెలలు గడిచాయి. ఈ మధ్య ఎంత ప్రయత్నించినారాలేక పోయారట. చివరకు ఈనాటికి రావటానికి అవకాశం కలిగిందట. ఇది ఆమె చెప్తుంటే-

"చూశారుగా? ముందు భోజనం చేసి రండి" అన్నారు.

'ఇంకా ఇప్పుడు ఏమి తింటాం? ఇన్ని రోజుల తర్వాత వచ్చాం. కాసేపు నీ దగ్గర కూర్చోనీయమ్మా! ఎప్పుడూ చేసే భోజనమే కదా!' అమ్మ నవ్వి మెత్తటి అరటిపళ్ళు తీసుకు రమ్మనమన్నారు. రెండు రెండు పళ్ళు అందరికి యిచ్చి తినమన్నారు.

'ప్రసాదమా అమ్మా?'

" కాదమ్మా .... ఎండనబడి వచ్చారు కదూ ! ముందు ఇవి తినండి. తర్వాత భోజనం చేద్దురుగాని."

వాళ్ళు తిన్న తర్వాత లేచి లోపలకు వెళ్తూ- "నేను స్నానం చేసి వస్తాను. ఈలోగా మీరు భోజనం చేసిరండి" అన్నారు.

27. బామ్మగారు మరణించినప్పుడు బాబాయి కనిపించగానే -

"కాఫీ తాగేవా నాయనా?"

28. "అందరినీ పంపించిన పెట్టునాకెందుకూ? అందరూ వున్న పెట్టే నాక్కావాలి."

# అందరిల్లు

29. "ఎక్కడైనా ఒకరి యిల్లుగాని, ఇది అందరియిల్లు కాదటమ్మా?"

30. "ఎవరి కుటుంబం వారిది; అన్ని కుటుంబాలు కలిస్తే అది సకుటుంబం."

31. "ఎక్కడినుండి వస్తుంది? ఎట్లా నిర్వహింపబడుతుంది?- అన్నది మీ కనవసరం. దేనివాడు దానికున్నాడు."

32. " ఇంతమంది అన్నం తింటుంటే నీకు ఒక్కడికీ భోజనం లేకుండా లేదు. ఇది ఆస్తి గల సంస్థకాదు. దీనికి చందా ఇవ్వమని ఎవరినీ యాచించింది లేదు.ఎట్లా వస్తుందో ఎట్లా నడుస్తుందో మనకు అనవసరం. ఇది అందరిల్లు. ఇక్కడ ఎవరి ఓపికకు తగినట్లు వారికి పని ఉంటుంది. ఊరికేనే ఎవరూ కూర్చోరు. ఉండడానికి ఆశ్రయమిచ్చేదల్లా ఆశ్రమమే కాని ఇది ఆశ్రమం కాదు; ఇల్లు. అనేక రకాల మనస్తత్వాలు ప్రవృత్తులూ కల వ్యక్తులందరూ కలసి వున్న ఇల్లు. అందరితో సర్దుకు పోవటమనేదీ, అందరిలో లోపాలుచూడక మంచినే చూడటం అనేదీ అంత తేలికైన విషయాలుకావు. నువ్వు ఇక్కడ ఉండటానికి నాకు అభ్యంతరం లేదు."

33 "నాకు మీరేమి బరువు కాదు. నాకు మీరు ఉండటం బరువనిపించి నప్పుడు ఈ ఆవరణే వుండదు."

34. 'ఇన్ని రోజులు ఇక్కడ ఉండదలుచుకుంటే వేరే వండుకు తినాలా? ఇక్కడ ఏమయినా పెడతారా?'

" మీ ఇష్టమమ్మా కల్లో గంజో ఇక్కడున్నదే తాగి ఉంటామంటే అట్లాగే ఉండొచ్చు. వేరే వండుకు తింటామంటే అట్లాగూ ఉండొచ్చు. ఇక్కడ ఉండే సమయం వచ్చినప్పుడు ఇన్ని ఆలోచనలు లేకుండానే ఉండటం జరుగుతుంది. ఆ తరుణం వచ్చినప్పుడు తప్పించుకుందామన్నా తప్పదు. లేనప్పుడు ఉందామని వచ్చినా ఉండలేరు."

35. "ఇక్కడ ఎవరూ ఏ పనీ చేస్తున్నారని నేను అనుకోను.ఇక్కడేదో అన్నదానం

జరుగుతున్నదనీ, ఇట్లామరెక్కడా చూడలేదనీ అంటారు కానీ అదినేననను. ఎవడి అన్నం వాడికుంటే వాడు తింటున్నాడు కానీ మనం పెట్టేదేమిటి? అది ఇక్కడ లేకపోతే వాడు రాలేడూ; వచ్చినా తినలేడు."

36. "అందరూ కలిసి భోజనం చెయ్యండి అని నేననలేదు. వంట మడితోనే చేయిస్తున్నాను. 'ఎవరెట్లా తింటే వారికట్లా పెట్టండి అని చెప్పాను. అసలు కలిసి భోజనం చెయ్యటం అనేది ఎట్లా వచ్చింది? తన కిష్టమైనవాడు ఎవడినైనా పక్కన కూర్చోబెట్టుకుంటాడు. తనకిష్టం లేకపోతే ఎవడినైనా సరే చూడకూడదంటాడు. అట్లాంటి వాదనలు జరిగినప్పుడు అన్నాను - అందరూ కూర్చుని తినండి -అని"

37. ఒకసారి అన్నపర్తి ఆయన ఒకాయన వచ్చి అమ్మా రాజరాజేశ్వరివై ఉండి కూడా ఇట్లా చేస్తున్నావేమిటి? 'వర్ణాశ్రమవిధాయినీ, అన్నారు గదా?' అన్నారు.

"రాజరాజేశ్వరి అనీ, వర్ణాశ్రమవిధాయినీ అనీ.... ఎప్పుడైతే ఉన్నదో- 'ఏకాకినీ' 'విభేదినీ' 'భేదరూపా', అనీ దాని పక్కనే ఉన్నదిగదా ?"అన్నారు అమ్మ.

38. 'ఎన్నాళ్ళని ఆ అమ్మాయి (నీ భార్య) పుట్టింటి దగ్గర ఉంటుంది?"
'ఉద్యోగం లేదు. ఏం చెయ్యనూ?'

" అంతవరకూ ఆ అమ్మాయితో ఇక్కడ ఉండు."

39. మరణోన్ముఖుడైన పాపాయిని గురించి అమ్మ-

"పాపాయిని ఇక్కడినుండి కదిల్చి మరేఊరికి తీసుకెళ్ళొద్దు. ఇక్కడ వెళ్ళమనేవారు లేరు: అవుననేవారూ, కాదనేవారూ లేరు. కనుక ఇక్కడే అట్టేపెట్టండి."

40. బాల ఒకసారి అన్నది 'ఇక్కడలేనిదీ లేదు; మరోచోట ఉన్నదీలేదు.పేరు చింతకాయ పచ్చడీ చారూ అని వచ్చింది కానీ ఎన్ని చేయిస్తున్నాము? ఏకూరల రోజులలో ఆ కూరలు వస్తూనే వుంటయ్. బస్తాలు బస్తాలు

కూరలు ఎవరికోసం వస్తున్నాయి? ఒకయేడు సంవత్సరాదినాడు ఇక్కడున్న వారందరికీ తలాకాస్తా సీకాయ పెట్టారు. ఎవరిక్కావలసివస్తే వాళ్ళు తలంటిపోసుకున్నారు. అతిచిన్న పండుగయిన చిలుకు ఏకాదశినాడు కూడా తలంటిపోసుకుని పిండివంటలు చేసుకుంటారిక్కడ.'

41. 'అమ్మా! సామాన్యమయిన కుటుంబాలలోనే జరగటం కష్టంగా ఉంటుంది. అట్లాంటప్పుడు ఇక్కడ ఎట్లా జరుగుతున్నదనేది ఊహించుకుంటే ఏమిటోగా ఉంటుంది.'

"దీన్ని గురించి ఆలోచించే పనిలేదు. అంటే అంతటా పెట్టేది నేనైనప్పుడు ఇక్కడ గురించి ఆలోచనే లేదు. ఎవరన్నంవాళ్ళు తిని పోతున్నారు. ఉండగలిగితే ఎన్నాళ్ళయినా ఉండొచ్చు. భోజనానికి ఇబ్బంది లేదు."

42. "నా దగ్గరకు వచ్చేవారిలో రకరకాల తరగతుల వారుంటారు. భాగ్యవంతులు తమకున్న దానిలో తోచింది ఇస్తారు. బీదవారూ వారికున్న దాన్లోది ఇస్తారు. బలవంతమేమిలేదు.ఇచ్చే శక్తిగల భాగ్యవంతుడు నన్ను చూచి ఒక్క క్షణంలో వెళ్లొచ్చు. ఇవ్వలేనివాడు సంవత్సరం....ఇంకా ఆపైగా ఉండొచ్చు. ఏదైనా ఇక్కడ అందరికీ సమానమే."

43. 'మేము ఆ వందమందినే భరించలేకపోతున్నాం. మీరు ఇక్కడ ఇంత మందికీ భోజనం-'

"అక్కడ మీరు పెడుతున్నారు నాన్నా. ఇక్కడ వాళ్ళ అన్నంవాళ్ళు తిని వెళ్తున్నారు."

44. 'అమ్మా! ఈ రోజులలో బంధువులు యింటికొస్తే అన్నంపెట్టటానికి భయపడుతున్నాం. ఒక్కపూట అన్నంపెట్టలేకపోతున్నాం. ఏవేళ ఎందరు వచ్చినా భోంచెయ్యమని అంటావు. ఇంత అన్నదానం ఎట్లా జరుగుతున్నది?'

2 "వాళ్ళన్నం ఇక్కడ ఉన్నది. వాళ్ళు తింటున్నారు-అనుకుంటున్నాను గానీ నేను పెడుతున్నానని అనుకోవటంలేదు, నాన్నా. ఆ భావం నాకు

లేనినాడు ఇదెట్లా జరుగుతుందో తెలీదు. ఈ చింతకాయ పచ్చడీ చారూ లేకపోతేగంజి పోసుకుతింటారు. గంజీ లేకపోతుందీ..... చెరువులో నీళ్లుపోసుకుతింటారు. ఆ అన్నం కూడా లేకపోతే....... వాళ్ళ అన్నం యిక్కడ లేదనుకుంటాను. అంతేగానీ నేను పెట్టలేకపోయానని అనుకోను."

45. ఇక్కడ ఉన్నా ఎవరు ఊరికే ఉన్నారు?ఎవరికి తగ్గపని వాళ్ళకున్నదని ఉంటూంటే..... దారి అదే ఏర్పడకపోదు."

46. "ఇక్కడ కూర్చుందామన్నా కూర్చోవటానికి అవకాశం లేదు. ఇక్కడికి తగ్గ పనులు ఇక్కడున్నాయి."

47. అమ్మా- ఈ ఆవరణలో పూచికపుల్ల కూడా పనిచేస్తుంది.

"పూచికపుల్ల కూడా అంటున్నావేమిటి? అట్లాగేమీ అనుకోవద్దు- పూచికపుల్ల పిల్లలకంటే ఏమీ తక్కువగాదు - పిల్లలెంత ఉపయోగ పడతారో పూచిక పుల్లలు కూడా అంతగానే ఉపయోగపడతయ్- నిద్దరలేస్తే యిల్లు చిమ్మటానికి పూచిక పుల్లలు ముందు అవసరం. వస్తువులు ఉండీ మనిషి లేకపోతే వస్తువుల ఉపయోగం లేదు. మనిషి ఉండీ వస్తువులు లేకపోయినా మనిషి ఉపయోగం లేదు."

48. ఈ ఆవరణలోని చిత్రమే అది! ఎవరు లేకపోతే ఆపని జరగదను కుంటామో ఆ వ్యక్తి లేకపోయినా ఆ పనిమాత్రం ఏదో విధంగా జరిగి తీరుతుంది.

49. ఇక్కడ ఒకే నామం చేయాలన్న పద్ధతిలేదు. కనుక అన్ని నామాలూ చేస్తుంటారు.

50. ఇది విశ్వకుటుంబం. అనేక రకాల మనస్తత్త్వాలు.

51. "(నేను) ఒకరిని ఉండమనేది లేదు; పొమ్మనేదిలేదు. అందువల్ల ఎవరు వస్తున్నారో ఎవరు ఎన్నిరోజులుంటున్నారో నాకు తెలీదు నాన్నా. అది రావటానికి....పోవటానికి.....ఉండటానికి..... అడ్డులేని ఆవరణం."

52. యార్లగడ్డ రాఘవయ్యగారు అమ్మ ఉండే కుటీరపు వరండాను ముఖమండపమనీ, హాలును గర్భాలయమనీ, హాలువెనుక గదిని అంతరాలయమనీ, దాని ప్రక్కగదిని అంతరాంతరాలయమనీ, స్నానాల గదిని పులికాపు మందిరమనీ...... అంటారు.

53. ఇక్కడ ఉండే సోదరీసోదరుల ప్రేమ ఒక విచిత్రానుబంధం..... తెలియని ఆప్యాయత, ప్రేమ, ఆదరణ, ప్రతి ఒక్కరి హృదయంలో నిండివుంటై.

54. 'అసలు ఇక్కడ ఈ అనుబంధం ఏమిటి? - పెళ్ళి అయిన పిల్లలూ, కాని పిల్లలూ అని కూడాలేదు. నిన్న గోపి కాత్యాయనిని ముక్కుపట్టుకు లాగుతానంటున్నాడు.'

55. "నా యింటికి వేరే హంగులు ఏమీ వద్దు. మీరు ఎటూ ఉండరు. ఇక్కడ నేను ఉంటాను. నాకు ఇదిచాలు. నాకేం వద్దు. డాబాలు అవీ...మీకు. ఈ పూరిగుడిసె నాకుచాలు. నాలుగు అడుగులున్నాను నాకు తగినట్లే ఉన్నది ఇది. కుంకుమభరిణల్లే -"

56. "ఆడవాళ్ళపని అని, మగవాళ్ళపనీ అనీ పనులకు భేదంలేదు; చెయ్యలేక మనకు భేదం తప్ప. ఇక్కడంతా ఆడపిల్లలూ మగపిల్లలూ చేసుకోవటం లేదూ అన్నిపనులూ?"

57. ఆ రోజుల్లో ధర్మయ్యగారు పాలు పితికేవారట. సుబ్బయ్య కుంపటి వెలిగిస్తే అమ్మ కాఫీ పెట్టేవారట. కాఫీపొడికూడా గింజలు వేయించి కొట్టి స్వయంగా చేసేవారట.

58. ఆ రోజులలో అమ్మ ఈ వచ్చివెళ్ళే వారందరికీ వంటా పెట్టూ చూడటమే కాక, ఇంట్లో పాచిపనీ గొడ్లదగ్గరపనీ- అన్ని పనులూ స్వయంగా చూసుకునే వారు. ఇంట్లో ప్రతీరోజూ కనీసం పది విస్తళ్ళైనా లేచేవట. వచ్చిన వాళ్ళందరితో రాత్రి పన్నెండు గంటలవరకు మాట్లాడుతూ వాళ్ళు అడిగేవాటికి సమాధానమిస్తూ తిరిగి వేకువజామునే లేచి నాన్నగారికి కాఫీయిచ్చి ఇవతలి పనులు చేసుకుంటూమరొకవైపు అందరికీ ఫలహారాలు తయారుచేసి అందిస్తూ మడిగట్టుకొని పదిగంటలకల్లా

భోజనం సిద్ధం చేసేవారట.

59. 'అంతమంది ఆడపిల్లల్నీ మగపిల్లల్ని వేసుకుని నిందలేకుండా ఎలా నిర్వహిస్తుంది ఆవిడా?'

'అక్కడ వికారం లేదు.'

# అమ్మకు పూజలు

60. నాకు యిక్కడ పూజ చేస్తున్నా 'అమ్మ' అని చేస్తున్నారా? పార్వతి అనీ రాజరాజేశ్వరీ అనీ.....ఇంకా ఏవో వాళ్ళ ఇష్టదైవ రూపాల్లో చూస్తుంటారు."

61. దసరాలలో వరసగా- బాలాత్రిపురసుందరి, జ్వాలాముఖి, వైష్ణవి, బ్రాహ్మణి (బ్రాహ్మి) లక్ష్మి... అన్నారు.

62. నాగులచవితినాడు కొందరు అమ్మ నోట్లో పాలు పోశారు.

63. వాళ్ళమానాన వాళ్ళు పూజలు చేసుకుంటూంటే .... అమ్మ ఇతరులకు చిన్న చిన్న జవాబులు చెపుతుంటారు. పూజ తనకుకాదు; వారి ఇష్టదైవానికి.

64. "పూజ అంటే ఏముంది నాన్నా. నీ నమస్కారం పూజకాదూ? నీ నమస్కారం పూజే. నీకు ఎట్లా కావాలంటే అట్లాగే చేసుకో నాయనా-"

65. 'పూజ ఎప్పుడు చేసుకోమంటారు?'

"ఎప్పుడైనా సరే నేనున్నానుగదా-ప్రయత్నం అక్కరలేదు, ఇక్కడికాళ్ళను ఇటు పెడతా."

66. "జనం వస్తున్నారు,నీళ్ళు తోడమను."

67. పురోహితుడు మంత్రాలు పఠిస్తూండగా పాదుకలకు కుంకుమతో డాక్టరుగారూ ఆయన కుటుంబమూ పూజ చేశారు. కుంకుమపూజ కాగానే అమ్మ ఇంట్లోకి వెళ్ళి డాక్టరుగారు, వారి తమ్ముడూ పెట్టిన రెండుచీరెలూ కట్టుకుని వచ్చారు. ఈ మారు గులాబిపూలు, తమలపాకులతో పూజ పాదాలనుండి కంఠం వరకూ చేశారు.

పూజకాగానే కిరీటం పెట్టారు. ఐదు ఆరు క్షణాలు అలా ఉంచి తర్వాత తీశారు. డాక్టరుగారి పూజ కాగానే అందరూ వాళ్ళు తెచ్చిన పూలూ పళ్ళూ, సమర్పించి టెంకాయలు కొట్టి హారతి ఇచ్చారు.

68. 20-10-64నాడు వరుసగా తులసీదళాలూ, చేమంతిపూలూ తోటలో ఉన్న అన్ని రకాల ఆకులూ పూలతో అక్కడి బృందం పూజ చేశారు.

69. టొమాటో ఆకులతో, తులసీదళాలతో, బొప్పాయి ఆకులతో పూజలు జరిగేయి.

70. (దసరా) నవమినాడు అన్ని ఆకులతో పూజ జరిగింది.

71. 'బెండాకులతో పూజ వద్దులేమ్మా, నూగు....'
"మీకంటే నూగా?"

72. 6-12-1964నాడు కుమారీ, హేమా మరమరాలతో పూజచేశారు. 1966జన్మ దినోత్సవాలలో శేషగిరిరావు గారు ఎఱ్ఱ గులాబీపూలతో పూజ చేశారు. 1966 దసరాలలో బెజవాడ వర్తకులు 8 బస్తాల కొబ్బరి చిప్పలతో పూజచేశారు.

73. ఒక అన్నయ్య అమ్మ చేతిలో అరటిపళ్ళు పెడుతూ ఉండగా ఒక పండు జారి అమ్మ పాదాలమీద పడింది. ఆ అన్నయ్య 'అయ్యో' అనే లోగానే అమ్మ "ఫర్వాలేదు" అంటూ ఆపండు తీసుకు తిన్నారు.-'ఎంత తప్పు చేశాను?'- అని అన్నయ్య బాధపడకుండా భరద్వాజ ఆ పండును తన కిమ్మని అడిగినా అమ్మ ఇవ్వలేదు.

74. పంగిపురం శ్రీమతి పూజ చేస్తుంటే తమలపాకుమీద పురుగు కనపడింది.దాని దులపబోతుంటే అమ్మ-
"ఫర్వాలేదమ్మా, ఆ పురుగేం చేస్తుంది?"

75. పూజ అయాక నిన్న (3-7-64) వారు తెచ్చిన మామిడిపళ్ళు సంచిలోనుండి తీశారు. అన్ని పళ్ళూ ఎలుక కొఱికింది; రాత్రి మందిరంలో పెట్టారేమో సంచీని. పాపం, ఆయన కళ్ళ నీళ్ళ పర్యంతం అయ్యారు.
"ఫర్వాలేదు నాన్నా, ఎలుకతింటే ఏం? ఎలుక రూపంలో అమ్మే వచ్చి తిన్నదేమో?" అని ఎలుక తిన్న పండు ఒకటి తాను తిన్నారు.

76. కాశీరావు: పండు ఎలుక కొఱికిందమ్మా - అని చూపించారు.
"ఫర్వాలేదులే...." అంటూ చేతిలోది తీసుకొని కొరుక్కొని ఇచ్చేశారు.

77. ఆయన కొట్టిన టెంకాయ అంతా దూదిలాంటి మొవ్వ ఉన్నది. ఆయన

'అయ్యో' అనేలోగా అమ్మ ఆ పువ్వుని కొంత కొరికేరు.

78. టెంకాయ కొట్టేరు; అది కుళ్ళి పోయింది.

"కుళ్ళు, ఫర్వాలేదు" అన్నారమ్మ.

79. జగాపురం వాళ్ళు అమ్మకు పూజ ఏట్లా చెయ్యాలో దానికి ఏమన్నా విధానాలున్నాయేమోనని సందేహిస్తుంటే - భాస్కరరావు అన్నయ్య 'ప్రత్యేక విధానాలు ఏమీలేవు' అని దగ్గరుండి చేయించారు.

80. 'అసలు పూజ అంటే ఏమిటి?'

"తన తల పగలకొట్టటమే."

81. ఎవరైతే ఏం? 'అమ్మ' అని నమస్కారం చేస్తున్నారు. దేవాలయానికి వెళ్ళాం; ఆ రాయిని దైవంగా భావించి నమస్కారం చేసుకుంటున్నాం కదా! అది ఏ రాయో, ఎక్కడిదాంతో చేశారో, పాకీదొడ్డిరాయో, బజార్లో రాయో దేనితో చేశారో- మనకెందుకు? దాన్ని దైవం అని మనం దండం పెడుతున్నాం కదా!"

82. 'బజారుకెళ్ళొచ్చిన గుడ్డ విడచి స్నానవేమన్నా చెయ్యాలా? (అదీఅక్కరలేదా?)'

"నీ ప్రవర్తన నీకు తెలీదూ? దాన్ని బట్టి ఎట్లా(ఏదియుక్తమని) తోస్తే అట్లా చెయ్యి-"

83. వారికి ఇక్కడ అలవాటు తెలియక కుంకుమ పాదుకల మీద కాక అమ్మ పాదాలమీద వేశారు. మేము చెప్పబోయాము - వద్దని. అమ్మ వారించారు. మమ్మల్ని. వాళ్ళకు తోచినట్లుగా చేసుకోనిమ్మని.

84. అలాగ అన్నయ్య (శేషగిరిరావుగారు)ను చూస్తూ నిమిలిత నేత్రులయ్యారు అమ్మ. ఆ కొన్ని క్షణాలలో ముద్రలు కూడా వచ్చాయి. అప్పుడప్పుడూ మాట్లాడుతున్నప్పుడూ, పూజలోఉన్నప్పుడూ- కొన్ని క్షణాలు అంతర్ముఖులవటం చూశాము.

85. మహానైవేద్యం పెట్టుతున్నప్పుడు అమ్మ మేము పూజజేసిన వేపాకు

తీసుకుని గరికతో చిన్న విస్తరి కుట్టి అందులో పెట్టమన్నారు. పెట్టాక నైవేద్యంతో పాటు ఆ విస్తరికూడా తిన్నారు.

86. "గంధం చేతులకు రాయాలంటే చేతులకు, కాళ్ళకు రాయాలంటే కాళ్ళకు... మీకెట్లా తృప్తిగా వుంటే అట్లా చెయ్యొచ్చు."

87. ఒకాయన అమ్మ పాదాలను తాకి నమస్కరిస్తే - ఇంకొకాయన 'తాకకూడదు'- అన్నారు.

"ఫరవాలేదు నాన్నా తాకవచ్చు. కూడదు... అని లేదు."

88. "మీ ఇష్టం నాన్నా - మీరు ఏ రోజు చెయ్యమంటే ఆ రోజే చేస్తాను (అన్నప్రాశన). నాకు అన్నీ మంచిరోజులే."

89. గుంటూరునుంచి ముగ్గురుఆడవాళ్ళు వచ్చారు. ముగ్గురిలో ఒకామె వితంతువు. ఆవిడ తాను పూజ చేయవచ్చునో కూడదో అని సందేహిస్తుంటే అమ్మ-

"ఏం ఫర్వాలేదమ్మా ,చేసుకోవచ్చమ్మా -"అన్నారు.

ఆ ఇద్దరికీ కుంకుమబొట్టూ, ఆవిడకు విభూతీ పెట్టారు.

90. '(ఆడవాళ్ళు) 'దూరంగా' వున్నా మీ ఫోటోకు పూజ చేసుకోవచ్చా?' "చేసుకోకూడదనే నియమమేమీ లేదమ్మా ..... రక్తమంతా ఈశ్వరతత్వమే."

91. భార్య బయట చేరిందని ఒకాయన బాధపడుతుంటే -

"నీకు పట్టింపు లేకుండావుంటే మీ ఇద్దరూ కలిసి చీర యిస్తే కట్టు కుంటాను."

92. "అందరికీ తీర్థమేశారు. ఎదురుగా కుక్క నుంచుంటే దానికీ వేశారు.

93. "లేవలేదనుకుంటున్నారా - ఏమ్మా?"

93. "నేను లేవలేదనుకుంటున్నారా - ఏమ్మా?"

'అనుకుంటున్నారమ్మా.'

"అయితే లేచి వాకిట్లోకి వెళ్తా" - నంటూ మెల్లగా లేవబోయినారు.

"కాని లేవటానికి ఓపికలేదు.

'వద్దులే .... పడుకోమ్మా కాసేపు'

"నీళ్ళు తోడమని చెప్పమ్మా-"

94. తాతగారి మృతశరీరం ప్రక్కన కూర్చొని ఉండగా గుంటూరునుంచి వచ్చినాయన టెంకాయ కొట్టటానికి సందేహించారు.

"దీనికి దానికి సందేహంలేదు. దేనికదే."

95. తాతగారి చితికి నిప్పు అంటించి డ్రెయిన్‌లో స్నానాలుచెయ్యడానికి వెళ్ళినపుడు పిల్లలందరూ శ్రీసూక్తమూ మంత్రపుష్పమూ చదువుతూ అమ్మకు అభిషేకం చేశారు.

96. బామ్మగారి క్రతువు జరుగుతున్నప్పుడు ఒకవైపుహారతులూ నమస్కారాలూ జరుగుతూనే ఉన్నాయి.

97. తాతగారు అపరక్రియల అనంతరం అమ్మ స్నానం చేసి ఒడ్డుకురాగానే ఆకివీడు నుంచి వచ్చినాయన దండవేసి పళ్ళు చేతికిచ్చారు.

98. బామ్మగారి శరీరం స్మశానానికి తీసుకువెళ్ళినపుడు అమ్మకూడా వెళ్ళేరు. అక్కడ పన్నాలవారు అమ్మ పాదాలమీద పూలువేసి పూజచేసి నమస్కారం చేశారు.

99. అమ్మ గుండె జలుబుతో విపరీతంగా దగ్గుతూ మాట్లాడలేక సైగతో చెప్పేటప్పుడు కూడా చూడటానికి వచ్చేవారికి ప్రసాదాలు ఇవ్వడానికి హాల్లోకి వస్తూపోతూ ఎన్నిమార్లైనా తిరిగేరు.

100. ప్రసాద్ అన్నయ్య '108 టెంకాయలు కొట్టుకుంటాను' అన్నాడు.

"మీ ఇష్టం, నేను పడుకుంటాను మీరు చేసుకుంటారా?"

'నీ ఇష్టమమ్మా పూజకి వచ్చి కూర్చోవాలని ఏమీ లేదు. నువ్వు పడుకున్నా చాలు.'

అమ్మ అన్నారు కాని పూజ ముగిసేవరకు కూర్చున్నారు.

101. "(పాదాలు) ముట్టుకుంటే మంటలు పుడుతై అంటారు. శారదామాయి

కూడా అట్లాగే అరికాళ్ళూ అరిచేతులూ మంటలుపుడుతై అంటుంది. పాదాలు ముట్టుకుంటే ఎదుటివాళ్ళ పాపాలవల్ల కాళ్ళు మంటలు పుడ్తయ్యట. అదే జరిగితే వాళ్ళలోని గొప్పదనం అంటుకోవాలిగా?

నేను అందరినీ తాకుతూనే ఉన్నాను. అనేక వేలమంది తాకి, నమస్కరిస్తూనే ఉంటారు. అందువల్ల నేను ఇట్లా మారేనంటున్నారు. కానీ నేను అట్లా మారడానికి కారణాలు వేరు."

# సర్వత్రా మమకారం

102. "అసలైన అమ్మకు ఎవరిని చూసినా బిడ్డ అనే అనిపిస్తుంది."

103. "వరలక్ష్మి - ఏం చేస్తున్నావు?"

'బామ్మకు కాఫీ పెడుతున్నాను.'

"బామ్మ కోడలికి కూడా పెట్టు-"

'ఎంత చక్కగా అన్నావమ్మా! బామ్మ కోడలట!నాన్నగారి -

"భార్యను."

'సుబ్బారావూ, హైమా, రవిల...అమ్మవూ-'

"కాదు. ఆ విషయంలో పిల్లల తల్లిని"

104. "రాధ అహర్నిశలూ నామం చేసినా కష్టం లేదు కానీ ఆహారం తీసుకోడు. అదే నాబాధ."

105. నువ్వు మజ్జిగన్నమన్నా తిని రా,-"

'నీకు తలంటిపోసి -'

"ముందునువ్వు అన్నం తినొస్తేనే పోయించుకుంటా లేకపోతే పోయించు కోను వెళ్ళిరా-."

106. "ఏం బాధపడకమ్మా. అబ్బాయి నా దగ్గరే ఉన్నాడు."

107 మాట్లాడుతుండగానే శాయమ్మగారు ఉప్మా తీసుకొచ్చారు. తాను కొంచెం నోట్లో పెట్టుకుని కొంచెం రవికి పెట్టి,అక్కడున్న మిగతావారికి తలాకాస్త పెట్టి ఎక్కువ మిగిల్చి- అన్నం తినరు కనుక మేష్టరుగారు వద్దంటున్నా "తినునాన్నా" అని తినిపించారు.

108. జీపుకారులో వెళ్ళుతూ..... ఎదురొచ్చిన రెండెడ్ల బళ్ళలో ఒకతను లేస్తే -"అన్నం తిన్నావా నాయనా?" అని పలకరించి-"మనం కాస్త అన్న మూట కట్టుకొచ్చినా బాగుండేది-" అన్నారు.

109. మన్నవ వెళ్తున్నంతసేపూ, వెంట తీసుకెళ్ళిన పటికబెల్లమూ, దారిలో కొన్న పదకొండు అరటిగెలలూ దారిపొడుగుతా పంచుతూనే వెళ్ళారు. ఒకచోట మేనాలోనుండి వంగి అరటిపళ్ళు విసిరేస్తే డింగీలో ఉన్న ఒకతని ఒళ్ళో పడ్డాయి.

110. "మీకు డబ్బున్నది గనుక(మావూరు రమ్మని) అడగ్గలుగుతున్నారు. కారున్నది గనుక కారుమీద తీసుకు వెళ్తానంటున్నారు.కాని డబ్బులేనివాడు అడగలేడు కదా! నాకు ప్రతివాడి దగ్గరకూ వెళ్ళాలని వుంటుంది. ఉన్నవాడు కార్లలో తీసుకెళ్ళొచ్చు; గాలి గదుల్లో ఉండొచ్చు. కానీ లేనివారు 'మనం అమ్మకు అన్ని సౌకర్యాలూ చెయ్యలేం కదా' అని నన్ను రమ్మని అడగలేరు కదా! నేను అటువంటి వారిళ్ళక్కూడా వెళ్ళగలిగిన్నాడు బయల్దేరతాను."

111. "నేను బయల్దేరడానికి చాలా వుండాలి. ఒక గుడిసెలోకి వెళ్తే వాడికి పెట్టటానికి తీసుకెళ్ళాలి. వాడు ఏమీ అమ్మకు పెట్టకపోతినే అనుకోకుండా వాడిచేత పెట్టించుకోవడానికి నేనే తీసుకెళ్ళాలి."

112 "నేనంటూ కదిలితే మొన్న చీరాల వచ్చినట్లు ప్రతి ఇంటికీ రాగలగాలి. కూలీనాలీ చేసుకునేవాళ్ళూ, చెంచులవాళ్ళూ, పాకీవాళ్ళూ - అందరిళ్ళకూ వెళ్ళగలిగితేనే ప్రయాణం అనేది పెట్టుకుంటా. 'అమ్మకు ఏమీ పెట్టలేం కదా' - అనుకునేవాళ్ళున్నారు. వాళ్ళకు పెట్టి వాళ్ళచేత పెట్టించుకోవాలి. చూడాలని వున్నా రావటానికి కాళ్ళు లేనివాళ్ళూ కుంటి గుడ్డి ముసలీ ముతకా- అందర్నీ నేనే వెళ్ళి చూసి రాగలగాలి. అట్లా అయితే బయల్దేరాలి."

113. "ఒకింట్లో ఆమె కూలికెళ్ళి తెచ్చి వండుతుండేది. ఆమె ఇంట్లో ఏమీ లేవని బాధపడుతున్నది. అక్కడ వాళ్ళ పిల్లలు అన్నాలు తిని కంచాలు కడిగిన నీళ్ళు ఉంటే అవి తాగాను. ఇంకో ఇంట్లో అతను 'పుట్టిమీదిదితీసి ఆవతల పెట్టవే' అని భార్యను హెచ్చరిస్తున్నాడు. "నేను పుట్టిదగ్గరకు వెళ్ళి (మాంసం) కొంచెం వేలుతో తీసి నోట్లో పెట్టుకున్నా. ఇంకో యింట్లో చేపలకూర అట్లాగే అందరిళ్ళలో. ఇవన్నీ విని కాశీకృష్ణాచార్యులుగారు

'అమ్మరాజరాజేశ్వరే కాని వర్ణ సంకరం చేసింది' అన్నారట.

114. "కుష్టువాళ్ళకూ తినాలని వుంటుందికదా? ఇట్లా వాకిళ్ళముందు తిరిగేవాళ్ళ కేదయినా తినటానికి దొరుకుతుంది. కానీ హాస్పటల్లో పెట్టీ,పెట్టకా...కనుక వాళ్ళకు పెట్టాలి."

# నాన్నగారి మాటల్లో అమ్మ

115. మీ అమ్మగారు నడుం బిగించి కోడలుగా, అమ్మగారుగా అన్నీ చేసింది కదమ్మా!

116. నాకేం జ్ఞాపకం ఉండవండీ. మీ అమ్మగారే అన్నీ జ్ఞాపకం పెట్టుకుని చెబుతుంది.

117. "నాన్నగారు పొలం వెళ్ళాలిట. నిన్ను చూసి వెళ్తారటమ్మా.'

118. ఆఁ. అట్లా ఆశీర్వదించు!' (వడుగు అయిన తర్వాతే పెళ్ళి చేద్దామని)

119. 'జనం వచ్చినట్టున్నారు. ముందు నాలుగు మానికలు బియ్యం వేయించి వాళ్ళకు పెట్టేస్తే సరిపోతుంది.'

120. అమ్మకు గొడుగు పట్టే ఉమతో నాన్నగారు -

'సరిగా పట్టమ్మా. ఎండతగలకుండా పట్టమ్మా' అన్నారు.

అమ్మను స్టూలువేసుకుని కూర్చోమన్నారు.

121. శుక్రవారం అష్టోత్తర శతనామావళి పఠిస్తూ అమ్మకు 108 బుంగలు నీళ్ళు పొయ్యాలని అనుకున్నాం. నీళ్ళు పొయ్యడం మొదలుపెట్టాంగానీ ఊళ్ళోవాళ్ళుకూడా మేమూ పోస్తామంటూ వాళ్ళూ తెచ్చిపొయ్యటం మొదలుపెట్టారు. ఇంతలో నాన్నగారు వచ్చి కేకలు వేశారు. అన్నినీళ్ళూ పొయ్యకముందే అమ్మ ఇంట్లోకి వచ్చారు.

122. 'నీకోసం వీళ్ళంతా వచ్చారు. నువ్వు అక్కడికి వెళ్తే వీళ్ళందరికీ అవస్థ పైగా అక్కడికి వెళ్ళినా కుంటి అబ్బాయనీ, గుడ్డిఅబ్బాయనీ మొదలుపెడతావు.'

# నాన్నగారు

123 "వారు నన్ను వదిలి పెడతానన్నా నేను వారిని వదిలిపెట్టను."

124. 24-10-63న మొహం కడుక్కుని నీళ్ళు తెమ్మని - ఆ నీళ్ళతో మంగళ సూత్రాలనభిషేకించి కళ్ళకద్దుకుని మూడుసార్లు తాగేరు. "ఈ తీర్థమే నాన్నా నన్ను పావనం చేసేది. ఈ తీర్థంతో నేను పావనమైతే మీకు తీర్థం వెయ్యటానికైనా అర్హత కలుగుతుంది. మిమ్మల్ని పావనం చెయ్యలేక పోయినా-"

125. అమ్మ ముందుగా నాన్నగారికి ఉగాది పచ్చడి పెట్టి వారి పాదాలకు నమస్కరించి మందిరంలోకి వచ్చారు.

126.. అమ్మ ఈనాడు తానై నాన్నగారికి అన్నీ చేస్తూండకపోవచ్చుగాని వారు అన్నం తిన్నారోలేదో ఏంకావాలో.. అని అహర్నిశలూ కనుక్కోవటమూ, ఆలోచించటమూ- ఇవి చేసేదాని కంటే ఎక్కువేగా?

127. "భర్త అంటే శరీరం కాదు- భావన"

128. 'ఇంజక్షన్లు చెయ్యమంటారా ఎన్ని?' -డా॥సాంబయ్య.

"వారెట్లా చెపితే అట్లా. ఎన్ని చెయ్యమంటారో అన్ని వారిష్టం."

129. 1-7-65న గజేంద్రమ్మ పాలుతేగానే-అమ్మకు కాఫీ కలిపిస్తే-

"ముందు నాన్నగారికిచ్చిరా-" అన్నారు.

130. 'ఇదిగో శుభలేఖమ్మా-'

"ఇది నాన్నగారు చించి చదివిన తర్వాత నేను చదవటం న్యాయం."

131. పొత్తూరి వెంకటేశ్వరరావుగారు హైదరాబాద్ నుంచి - తెల్లద్రాక్ష పండ్లగుత్తి తెచ్చిస్తే - "దీన్నీ నాన్నగారి కిచ్చిరండి -" అన్నారు.

132. బుద్ధిమంతుడన్నయ్య దినపత్రిక తీసుకొస్తే అది తీసుకుని

"ముందు నాన్నాగారికివ్వండి-" అన్నారు.

133. కొత్త టేప్‌రికార్డర్ తెచ్చి 'మొదట ఏది రికార్డు చెయ్యమంటావమ్మా' అంటే

"నాన్నగారు పద్యాలు చదువుతారేమో కనుక్కోండి - "

134. నాన్నగారు మొక్క జొన్నకండె చూసి - 'ఏం, తినమంటావా?' అని అడిగేరు.

"మీ ఇష్టం-"

135. 'ఇది (జందెం) స్నానం చేసివేసుకోవాలంటారుగా, వేసుకోమంటావా'? -

"మీ ఇష్టం -"

136. గయలో పిండం వదిలేస్తే తద్దినాలు పెట్టనక్కరలేదుట గదా'

అట్లా చెయ్యమంటావా'?-అని నాన్నగారు.

"నాకేం తెలుస్తుంది?"

'దాన్ని గురించి నీకేం భావం లేదా?.'

"ఏభావమూ లేకుండా ఎట్లా వుంటుంది? ఏదో భావం వుంటుంది."

137. నాన్నగారు "నువ్వుకూడా రోజూ రెండు ఫర్లాంగులు నడవరాదూ?'అంటే - డాబా మీద రోజూ నడిచేవారు.

138. 'అది (ఆ నల్ల కుక్క) మీ అమ్మగారి పెంపుడు కుక్కండి' - అని నాన్నగారంటే-

"మీకు కూడా."

139. 'అప్పుడు మీ అమ్మగారు పిలక బాగుండలేదన్నదిరా. అందుకనే తీసేశాను.'- నాన్నగారు.

"నేననలేదు"

'అన్నదిరా .....నువ్వు గట్టిగా నేనన్లేదు అను-'

"నేనెందుకంటాను? నే నను. నేనన్నాని మీరంటుంటే కాదని నేనెట్లా అంటాను? అనను."

'నువ్వన్నావు.'

"సరే"

140. 'అయితే ఇప్పుడు నువ్వు నాతో కంకర్ అవుతున్నట్లేగా?'

"ఒకప్పుడు కాకపోతేగా?"

141. నాన్నగారు మందిరంలో పడుకుని మూల్గుతున్నారు. అమ్మ నాన్నగారి దగ్గరకెళ్ళి చూసి కాళ్ళు పిసుకుతూ.. మందు వేయాలన్నారు.

142. నాన్నగారికి కొబ్బరినూనెతో డొక్క మీద పావుగంట రుద్దేరు. వాటర్‌బాటిల్‌తో కాపుచేసి వెళ్ళారు.

143. నాన్నగారికి టెంపరేచరు ఎక్కువైంది.

నాన్నగారి మంచం దగ్గిర కింద పక్క వేయించుకున్నారు- అమ్మ అయితే రాత్రంతా కూర్చునే వున్నారు సేవచేస్తూ.

144. 'వక్క పలుకున్నదా?' అని నాన్నగారు అడిగితే -

అమ్మయే లేచి వెళ్ళి తీసుకొచ్చి ఇచ్చారు.

145. గోపాలకృష్ణమూర్తిగారు వెళ్ళిపోతుంటే -

"నాన్నగారితో చెప్పేరేమో కనుక్కోండి-" అన్నారు.

146. (నాన్నగారి పేరు)చెప్పవలెనని ఆడపిల్లలు అడ్డగిస్తే -

"చెప్పేదేముంది? అది ఎప్పుడూ వున్నది. ఆ స్మరణ ఎప్పుడూ ఉన్నది-- అన్ని నామాలూ ఆ నామం అనుకుంటే అనామంలోవేగా ఇవన్నీ?'నా' సరే 'గే' అన్నప్పుడు దేహం కూడా వున్నది.నా దేహం అయినప్పుడు ఇంకా పేరు చెప్పటమేముంది?"

147. 'మేనమామకూతురూ ఒక భార్యే?' -అని ఒకరు.

'అట్లాగాదు అనేది. మేనత్తకొడుకూ ఒక మొగుడేనా? -అని ఇంకొకరు.

"మొగుడని ఎవరనుకుంటున్నారూ? దేవుడనుకుంటున్నానుగా?"

148. "ఆమెకింకా పాతివ్రత్య మేమిటంటారు. పాతివ్రత్యమంటే పతిని ఆధారం చేసుకుని పంచభూతాలనూ జయించటం."

149. "మనం తొక్కి విడిచి వెళ్ళినా మన పాదాలకోసం ఎదురుచూస్తాయి పాదరక్షలు."

4

# బామ్మ

150. "బామ్మ 'డికాక్షను కాసినిచ్చి నీవు కాసిని తాగమ్మా' అంటే ...కలిపి అమెకిచ్చి, నా వంతు దాచిపెట్టి - రెండోసారి ఇచ్చేదాన్ని."

151. 'ఏం మహా పాతకం చేనుకున్నానే అమ్మా - ఈ జబ్బు భరించమంటున్నావు? నువ్వు ఎందరికో అనేక జబ్బులు నయం చేస్తున్నావని నీ దగ్గరకు ఎంతో దూరం నుండి వస్తున్నారు కదా- మరి నాకెందుకు తగ్గదు? వాళ్ళకెందుకు తగ్గుతున్నాయ్? నేను ఈ బాధ పడటం నీకిష్టమా?' అని బామ్మ అడిగింది.

"నాకిష్టమే అనుకోవటానికి నేను నీ కోడల్ని కనుక అనుకోవచ్చు. ఎంతైనా కోడలు కోడలే కదా! మరి నీ కిష్టమైనవాళ్ళు, ప్రియమైనవాళ్ళు, నీ కొడుకులు, అక్కయ్య...ఎందరో ఉన్నరుగా- వాళ్ళను పిలుస్తాను. వాళ్ళకూ నువ్వు ఇష్టమేగా? నీ బాధ చూడలేరుగా? ఏమైనా నయం చేస్తారేమో నీ బాధ- పిలవనా?" ఈ మాటకు బామ్మ నవ్వింది.

152. "ఏది ఎట్లా వున్నా -కాస్తోకూస్తో దగ్గరకు తీసింది ఆమేగా? ఆమె ఏదన్నా అన్నదన్నమాటే లెక్కకు తీసుకుంటాంగాని - ఈ మాట తీసుకున్నంతగా చేసినదాన్ని లెక్కకు తీసుకోలేం."

153. బామ్మ కేన్సర్‌తో బాధపడుతున్న చివరి రోజులలో బామ్మతో- " ఇవాల్టి రోజున ఎవరూ దగ్గరకి రావటానికి వీలులేకుండా వుండే పరిస్థితి (వాసన అనరు) లేకుండా ఇంతమందిమి దగ్గర కూర్చున్నామంటే విశేషం గదూ?"

# విచక్షణలేని వీక్షణ

154. జగ్గాపురం విద్యార్థులు -'మళ్ళా ఎప్పుడురామమ్మా?'
"సెలవల్లో."

155. 'అవిడను తోడు పంపమ్మా -'
"నా దేమీలేదు. ఆమె వస్తే తీసుకెళ్ళు -"

156. 'నువ్వు మద్రాసులో ఉండగా నాగయ్య వచ్చాడా అమ్మా?'
"అప్పుడు ఊళ్ళో లేడు."

157. అమ్మ తనను రమ్మని కోరిన వారింటికేకాక రమ్మనమని కోరటానికి సందేహించిన వారింటికి కూడా వెళ్ళారు.

158. "ఆయనది దూషణ అని మన మనొద్దు. ఆయన వాళ్ళను దూషిస్తుంటే - మనం ఇంకొకళ్ళను దూషిస్తున్నాం. ఆయన పబ్లిగ్గా చెబుతున్నాడు. మనం లోపల వుంచుకుంటున్నాం. ఆయన పద్ధతే మంచిది."

159. 'వెళ్ళిపోయేదా అమ్మా?'
"వెళ్ళిపోవటమెందుకురా? వెళ్ళి వస్తుండు-"

160. "మనస్సు ఇక్కడుంటే చాలు నాన్నా? శరీరం ఎక్కడుంటేనేం?"

161. "ఎక్కడో వుండటానికి ఇబ్బందిగా వున్నది. కనుక అమ్మదగ్గరే వుండండి-"

162. "పరుగెత్తేవాడిని ఎప్పుడూ ఆపకూడదు. వాడితోపాటు పరుగెత్తి వాడు అలసిపోయి నిలబడినప్పుడు పట్టుకోవాలి."

163. పూర్వం ఒకాయన 'వాళ్ళకు కూడు గుడ్డాలే'దన్నాడు. తరవాత కుటుంబంతో దర్శనానికి వచ్చాడు. అమ్మ ఆయనకూ భార్యకూ బట్టలు పెట్టారు; వాళ్ళు వెంటనే వెళ్ళిపోయారు. భోజనానికి ఆగకుండా -
"కూడు వారికి ప్రాప్తంలేదు; ఏం చేస్తాం?" అన్నారు అమ్మ.

164. "కోపం, రోషం, కక్ష - యీ మూడింటినీ నువ్వు వదిలిపెట్టు వాళ్ళు నిన్నొదిలి

పెట్టేటట్లు నేచేస్తా -"

165. ఏ కులం పిల్లనయినా చేసుకుంటాననగానే సరికాదు. మనలో గుణభేదం పోనంతవరకు కులభేదం పోయినా ఒకటే; ఉన్నా ఒకటే. చేసుకుంటే చేసుకుంటాడు అనుకో కానీ... అందరూ అనే మాటలకు రోషపడకుండా ఉంటాడా? మాకు కులభేదంలేదు - అంటూ పెదవుల చివరలతో మాట్లాడేవాళ్ళ సంగతి ఇంతే."

166. "నాకు నీళ్ళు పొయ్యమ్మా-"

'వేడినీళ్ళు లేవమ్మా.'

"చన్నీళ్ళే పొయ్యి" - అని చన్నీళ్ళ స్నానం చేశారు.

167. "బార్లీలేవా?"

'కాగుతున్నాయమ్మా.'

"కాగినంతవరకేచాలు - తే....."

168. అమ్మకు బాధతో రాత్రల్లా నిద్రలేదు. తెల్లవారింది. రామకృష్ణా, గోపాలకృష్ణా దిగులుగానే వున్నారు.

కొంతసేపటికి అమ్మ బరువుగా కళ్ళు తెరచి వసుంధరవైపు చూసి, కంటిమీద చెయ్యివేసి-

"ఏమ్మా! నీ కన్ను ఎట్లా వుంది? ఈ పాడుచేత్తో కొట్టాను" అని నిమిరింది.

169. వసుంధర కంటికి దెబ్బ తగిలింది; వేడినీళ్ళు పెట్టారు కాపుకు, అమ్మ చెపితే-

అమ్మకు తలనొప్పి.

అమ్మకు కాచుదామని 'కాపుకు నీళ్ళివ్వు' అన్నది వసుంధర.

"కాదమ్మా - ముందు నువ్వు కాచుకో..."

170. వెంకన్న నోటి చొంగ పైటతో తుడిచారు.

కుష్టురోగి కాలు వొత్తి శుభ్రం చేశారు.

171. డాక్టర్ కమల ఉద్యోగంలోని అసంతృప్తితో విచారిస్తుంటే -

'పోనీ నా దగ్గరుండు,కొన్నాళ్ళు సెలవుపెట్టి ఉండు -"

172. పీట వున్నదని అమ్మ కూర్చోబోతే పీట ఎవరో తీసేయడం మూలాన పడిపోయారు. తల గోడకు కొట్టుకుంది. వెల్లకిలా పడడంలో శరీరం ముద్దగా అయింది.

ఒక అరగంట వరకూ మాట్లాడలేకపోయారు. పీట తీసినవారు తనది తప్పయిపోయింది అని ఏడుస్తూంటే అమ్మ -

"దెబ్బలు తగలవలసిన యోగ్యత ఉన్నప్పుడు ఎవరూ అడ్డురాలేరు. ఏదో రూపంగా తగలక తప్పదు. ఇందులో ఒకరు చేసేదేముంది?"

173. రుక్మిణీ-నీకు కోపమొస్తే నన్నుతిట్టు; నన్ను విసుక్కో- అంతేగానీ..వాడిని (రహిని) మాత్రం ఏమీ అనొద్దు-"

వాడికి పైజామా కుట్టించాలి: నార్ఁరొట్టెల బుట్ట చంకకు తగిలించి బజారుకు పంపితే వాడెట్లా ఉంటాడు?"

174. డాబా మీద కూర్చొని వుండగా మంచినీళ్ళు కావల్సివచ్చి హైమ లేచి వెళ్ళబోతుంటే రామకృష్ణ- హైమ అంతదూరం ఏం వెళ్తుందని- చిన్న హైమ (సాగరంగారి అమ్మాయి)ని వెళ్లి తీసుకురమ్మన్నారు. కాని అమ్మ- "వద్దునాన్నా - దాన్నేపోనియ్ అది ఎట్లాగు నడవాలిగా. నువ్వు వెళ్లు హైమా - ఇది పొలం వెళ్లొచ్చింది."

175. "దీని మాటలకు నాకు ఒక సామెత జ్ఞాపక మొస్తూంది....."

'ఏమిటమ్మా అది?'

"ఇప్పుడు చెప్పను -నీకు ఓపికలేదు. నవ్వటానికి. తర్వాత చెప్పి నవ్విస్తాను."

176. "కుక్కపోయిందా? పాతిపెట్టించండి. ఏదైనప్పటికీ భరించేశక్తి భూదేవికే ఉన్నది."

177. "శిక్ష అంటే మనిషిని సంహరించటం కాదుగా. గుణాన్ని సంహరించటమే.

మరణ మంటే వేరే ఏముంది? అదే."

178. హరిదాసుగారు- మర్నాడు బియ్యంలేవనీ; వడ్లు ఉన్నా మరదగ్గర మనుష్యులు లేరనీ, ఇంట్లో తిరగలి విసిరేవాళ్ళూ లేరనీ చెప్పారు.అమ్మ ఆ వడ్లు తను విసురుతామన్నారు. చూస్తూ అమ్మచేత ఎలా చేయిస్తాం? ఇక్కడున్నవాళ్ళం చేశాం. వడ్లు విసురుతున్నప్పుడు తనూ తిప్పారు; చేటతో చెఱిగారు.

179. 'మీ చేతిమీదుగా మీ ఫోటో ఒకటి ఇస్తే పూజలో పెట్టుకుంటాం. చిన్నదయినా యిప్పించండి.'

హరిదాసుగారు పొలం వెళ్ళారు. ఆయనే ఫోటోలు,పుస్తకాలు అమ్ముతుంటారు. విడిగా ఏమీలేవు. ఆయన వచ్చేటప్పటికి సాయంత్రం అవుతుంది. అమ్మ ఆ హాలులో ఉన్న ఫోటోలలో ఒకటి తీయించి ఇచ్చారు.

180. కాత్యాయని పెండ్లికి వెళుతుంది. జాకెట్లు లేవని రాధాకృష్ణ అన్నయ్యను బాపట్ల పంపాలనుకుంటే అమ్మ-

"పొద్దునేగదా వాడొచ్చాడు. ఇప్పుడెండలో వాణ్ణి పంపించటం దేనికి? నాదగ్గరున్నైగా.. అవి తీసుకో -" అని ఏరిచ్చారు.

181. సీతాపతి తాతగారు పోయిన 10వ రోజున - కామేశ్వరమ్మ అమ్మమ్మ వచ్చి గోలపెట్టి వెళ్ళిన తర్వాత రుక్మిణక్కయ్యను పిలిచి తలకు కొబ్బరినూనె పెట్టి తలంటి స్నానం చెయ్యమన్నారు.

అక్కయ్య 'ఎందుకమ్మా?'అన్నది.

"ఎందుకేమిటి రుక్మిణీ - నువ్వు మరచిపోయినా నాకు గుర్తున్నది ఇవ్వాళ నీ పుట్టినరోజని....."

'అయితే ఇప్పుడెందుకమ్మా? ఇవాల్టిరోజు...' అని అక్కయ్య అంటే -"దేనికదే-" అని శాయమ్మగారు నివేదనకని తెచ్చిన రొట్టె, కొబ్బరిహోళి రుక్మిణికి పెట్టి స్నానం చెయ్యమన్నారు.

182. "మీ వాళ్ళకు చెప్పిచేస్తే వాళ్ళు బాధపడతారంటున్నావు. తెలీకుండా

చేసినాబాధ తప్పదు కదా! ముందు చెప్తే వాళ్ళ బాధలో పాలు పంచుకుంటావు."

183. అమ్మ సత్యంతో -

"అమ్మను తీసుకెళ్తావా నాన్నా?... అది నీ ధర్మం అనా? లాంఛనానికా?"

'లాంఛన అని కాదు. నాధర్మం... నా అవసరానికనీ కాదు. తీసుకెళ్ళటం నా ధర్మమను కున్నాను.'

"అయితే నీకిబ్బందేమీ లేదన్నమాట."

'నా యిబ్బందికోసం అవసరం లేదు.'

అమ్మ లక్ష్మీనరసమ్మగారితో-

"వాడు చెప్పాల్సిందేదో చెప్పేడు. నీ యిష్టం ఆలోచించుకో-"

'నువ్వెట్లా చెప్తే అట్లా చేస్తాను...భారం నీదే గదా!'

"అట్లా ఎట్లా? దేనికదే (అన్నీ నావేనని వదలలేదుగా? అని అనరు) నీ వీలునుబట్టి చూడు-"

184. చేతికి దెబ్బ తగిలిందన్న భయంతో వున్నా, ఆ చేతితోనే కాళ్ళుపిసుకుతున్న ఆవిడతో-

"నువ్వు కాళ్ళు పిసుకు; నేను నీకు కాస్తాను"

185. 'పైగా జిల్లెళ్ళమూడి వెళ్ళుతారెమో... ఆమె శక్తినంతా నాకు ధార పోసింది. ఆమె దగ్గర యిప్పుడేమీ లేదు. అక్కడికి వెళ్ళొద్దు-నేను మన్నవకు కోడల్ని; ఆమె ఆడబడుచు. ఆమె శక్తి నాకు ధార పోసింది.... అని చెప్పుతున్నదమ్మా-' అని చెప్పారు బెజవాడలో 'అమ్మ'ను అని చెప్పుకుంటూ సొమ్ము వసూలు చేస్తున్న ఒకావిడ గురించి...

"ఇక్కడే (ధారపొయ్యటానికి శక్తి) ఉంటేగా? ఉన్న శక్తేదో అంతటా నిండి వున్నది. అది ఒకళ్ళు తీసుకునేదీలేదు; ఇంకోళ్ళు తీసుకునేదీ లేదు. ఏదో పసితనం...."

186. " పసితనమంటే తెలీకపోవటమే-అంతేకానీ వయసుకాదు."

187. "వాళ్ళు అనుమానంగా బాధగా వచ్చినప్పుడు వాళ్ళ బాధ పోగొట్టాలి; సందేహం తీర్చాలిగాని ఇంకొకటి చెప్పరాదు."

188. "నువ్వు అదలించకుండా బెదరించకుండ పని చేయించుకోవాలి. వాళ్ళతో బోతూ వాళ్ళను మనవైపు తిప్పుకోవాలి-"

'నాక్కూడాతగుల్తోందమ్మా నీ మాట.'

"ఎవర్ని గురించి అంటున్నా అందరికీ తగుల్తుంది."

189. "పూర్తి అస్తికుడయినా నాస్తికుడే: పూర్తి నాస్తికుడయినా అస్తికుడే. వాడికి దైవం తప్ప రెండోది నాస్తి. వీడికి 'నేను' తప్ప రెండోది నాస్తి."

190. "అవసరాన్ని బట్టీ సమయాన్నిబట్టీ కోపం ఉన్నట్లు కనిపించాలి. కాని నాకు ఏనాడూ మీమీద(కోపం) రాదు. అది వచ్చిన మర్నాడు నేను అమ్మనూ కానూ; మీరు ఇట్లానూ ఉండరు."

# నిర్వహణ

191. "మనం ఉన్నంతలో సరిదిద్దటం నేర్చుకోవాలి. లేనిదానిని గురించి ఆలోచించే కంటే ఉపాయంగా ఉన్నదానిలో పెద్దజీవితం గడపాలి-"

192. బహుశా జనం రేపుకంటే ఎల్లుండి రావచ్చు. రేపు గోంగూర పులుసుకూరే చెయ్యండి. దాన్ని పప్పు వెయ్యకుండా. నీళ్ళుకూడా తగలనియ్యకుండా ఉంచితే - వారం రోజులయినా ఉపయోగించొచ్చు. సాంబారు పెడతారు గనుక అన్ని రకాలముక్కలూ వేసి పెట్టండి. పదార్థాలు తక్కువయితే వడ్డన మీకు తేలిగ్గా ఉంటుంది. రవీ, పార్థా, నరసింహం గార్లకు- స్టోరురూమూ, గ్లాసులూ, చాపలూ, డబ్బాలూ ...జాగ్రత్తగా చూడటమూ, ఆ వస్తువులు ఉపయోగించటానికి యిచ్చినప్పుడు యిచ్చి మళ్ళీ అవి గుర్తుగా ఆ వ్యక్తి దగ్గరనుండి తీసుకోవటమూ, చిరంజీవి, రామమూర్తి -లాంటి వాళ్ళకి జనాన్ని అదుపులో ఉంచేపనీ-"

ఇట్లా ఎవరెవరు ఏపని ఎట్లా జాగ్రత్తగా చెయ్యాలో చెప్పారు. పళ్ళు వస్తాయి కనుక ఈ పనులు చేసేవాళ్ళంతా హైరానా పడకుండా ఆ పళ్ళు మధ్యమధ్య తీసుకెళ్ళి తినమన్నారు. ఒకవేళ అక్కడ సమయానికి వరలక్ష్మి లేకపోయినా ఆ అమ్మాయికోసం ఎదురుచూడక అవి తీసుకెళ్ళమన్నారు. తొమ్మిది అయ్యేసరికి విస్తళ్ళు వెయ్యటం ప్రారంభించాలన్నారు.

వీరయ్యన్నయ్యను బడలిక పని కాకుండాపై యెత్తున వుండి ఎక్కడ ఏది కావాలో కనుక్కుంటూ...వంటయింటికి, గొడ్ల దగ్గరకూ, తక్కినచోట్లకూ నీళ్ళు పంపటం - వంటివన్నీ చూడమన్నారు.

193. జిల్లెళ్ళమూడిలో ఉండగా ఒకావిడకు ప్రసవించేరోజులు దగ్గరకొచ్చాయి. 'ఈ ఊళ్ళో యిబ్బంది అవుతుందేమో....' అని ఒకరన్నారు.

" ఏం ఫర్వాలేదు. అటువంటి పరిస్థితి ఏర్పడితే నేనే మంత్రసాని నౌతాను. దిగులు దేనికి?" -అన్నారు అమ్మ.

194. గజేంద్రమ్మ దగ్గర కొబ్బరికాయల పీచు ఉంటే నానవేయించమని హరిదాసు గారికి చెప్పారు. దానితో కొబ్బరితాళ్ళు అల్లటం నేర్పిస్తారట.

195. "చేతులవంక పైరువంకా చూసి కొయ్యండి; మనుష్యులవంక కాదు. చేస్తున్న పనిమీద మనస్సు లగ్నమైనప్పుడు చేతులు తెగకుండా ఉంటయ్."

196. 'ఈ సాయంత్రం పూట వంటేం చేయాలి?'అని శాయమ్మగారు అడిగేరు.

"అక్కడ తోటకూర ఉందిగా - కాసిని వడియాలు వేయించి, చారుపెడితే -సరిపోతుందిలే....."

# అమ్మ మందలింపు

197. "నేను ఈ మంచమ్మీద కూర్చున్నానని నాకేమి తెలీదనుకుంటున్నారు. కాని నాకు గోడచాటులేదు. ఈ ఆవరణలో ఎవరేం చేస్తున్నదీ, ఎక్కడ ఏం జరుగుతున్నదీ నాకు తెలుసు. అంత కళ్ళు మూసుకుని కూర్చొనుండలేదు. అయినా మిమ్మల్నినేను ఏమీ అనకపోవటానిక్కారణం- మీదేమీ లేదని, ఆ పనులకు మీరు బాధ్యులుకారనీ - అనుకోవటమే."

198. "ఈ ఇనుప చువ్వలు తడిసిపోతున్నయ్. ఆ ఇసుక చూడూ- ఎట్లా పొడై పోతున్నదో.... యోగయ్యా! అ ఇసుక పైకి పోసి చుట్టూ బొంగులు పాతండి..."

--అని ఇసుక దిబ్బమీద కూర్చుని పిల్లలను పిలిచి ఇసుక పైకి పోయించారు.

199. "ఈ ఆవరణంలో ఏ వస్తువుకు రక్షణ ఉన్నది? ఎక్కడిదక్కడే పడేసి ఉంటుంది. చూస్తుంటారే తప్ప దాన్ని జాగ్రత్త చేయాలన్న ఆలోచన ఒకళ్ళకూ తట్టదు. అట్లా చాపల మీద పడుకుంటారు. లేచిపోయినప్పుడు చుట్టరు. పగలల్లా వాటిని కుక్కలూ, పిల్లులూ ఉపయోగించుకోవాల్సిందే. గ్లాసులు కనిపిస్తుంటే కాళ్ళతో తన్నుతూ వెళ్ళటం తప్ప చేత్తో తీసి పక్కకు పెట్టరు. ఆయన (శేషగిరిరావుగారు) ఒక్కడే ఎన్నని చూస్తాడు?"

200. కోటమ్మదీ, అల్లుడిదీ సంభాషణ వింటుంటే అందరికీ నవ్వొచ్చింది.

"నవ్వుతున్నారు కానీ ఈ రోజు (ఇక్కడనుంచి వెళ్ళేరోజు)మనకూ ఉందిగా ఒకరోజు-"

201. "ఈ జబ్బు నాకు వస్తే బాధ అర్థమౌతుందని అంటున్నావు. ముందుగానే వస్తుందో రాదో ఎట్లా చెప్ప గలుగుతాం? అన్నిటితోపాటు అదీ వస్తుందేమో ఒకసారి వెనక్కుతిరిగి ఆలోచించు- అత్తయ్యా! నేను ఇంత బాధో, ఇంతకంటే ఎక్కువబాధే అనుభవించానో -నీకు తెలీదా?"

-అంటూ ఆనాటి గుర్తులేవో చెప్పారు.

బామ్మ మరి మాట్లాడలేదు.

202. "ఇంత ఎండలో ఏం వెళ్తావు? ఏదయినా జీప్‌గానీ ఇంజనీరుగారికారుగానీ వస్తే - అందులో వెళ్లచ్చులే ...."

అన్నారు ప్రభాకర్‌తో.

కొంతసేపటికి జీప్ వచ్చింది.

203. 'మీలాంటి పెద్దలు వస్తే అక్కడ (శ్రీశైలంలో చేసే సంతర్పణ) ఇంకా అభివృద్ధి అవుతుందని....'

"అటువంటివి ఏమీ తగిలించబోకు నాన్నా -నేను పెద్దనూ కాదూ; ఏమీకాదు. ఒట్టుట్టి అమ్మను."

204. "ఆయనకు పొయ్యి పెత్తనం. నీకు కఱ్ఱపెత్తనం - పనికిరాదు. ఆడదిగాని, మగవాడుగానీ ఎవరి హద్దుల్లో వారుంటే బాగుంటుంది గానీ అతిక్రమించినప్పుడు ఆ సంసారం అభాసుగానే ఉంటుంది."

205. తాను కూడ జిల్లెళ్ళమూడి అమ్మనే అని ప్రచారం చేస్తూ ఒక పూర్వ నివాసిని తన యిప్పటి అనుచరులతో జిల్లెళ్ళమూడి వచ్చి-అమ్మకు ఎదురుగా పూజ చేయించుకోవడానికి సిద్ధమవుతూంటే అమ్మ అన్న మాటలు:

"దాని మంచికే వచ్చింది అది ఇక్కడికి. సమయం వచ్చిందీ. అది వచ్చింది. నేను ఒకేమాట చెప్తాను; ఇంకే (దేవత) పేరుతోనైనా వేషాలు వెయ్యి కానీ ఈపేరుతో మాత్రం వద్దనీ..."

అమ్మ ఆమెతోనూ, అనుచరులతోనూ అన్న చివరి ముక్కలు:

"ఇంటి పట్టున వుండి భర్తకు వండి పెట్టుకోక ఏం ఖర్మం యిది? నేలమీదనుండి కంటే కొండమీదనుండి పడితే ఎంత దెబ్బ తగుల్తుందో ఆలోచించటంలేదు. మీరు వేస్తున్న వేషాలూ నాటకాలూ అన్నీ తెలుసు. కాని నేను చెప్పేది ఒకటే - ఈ పేరుతో వద్దని మాత్రమే.మీకేమో 'జిల్లెళ్ళమూడి అమ్మ' అని అనిపించుకోవటం గొప్పకావచ్చు. కాని నాకు జిల్లెళ్ళమూడి కరణంగారి భార్య' అని అనిపించుకోవటమే గొప్ప. 'జిల్లెళ్ళమూడి అమ్మ' అన్నప్పుడు ఆ పక్కనే 'జిల్లెళ్ళమూడి కరణంగారి భార్య'అని వుంటుంది. నువ్వట్లా అనిపించుకోలేవుగా?-"

# గుర్తు

206. "ఒకసారి భారతిపిన్ని తిరణాలకు వచ్చింది. కిష్టయ్య గారి మంగా, భారతీ, సీతారత్నమూ-వీళ్ళంతా ఆడుకుంటున్నారు. అప్పటికి అమ్మ ఉంది. పులిపాక శేషయ్యగారు అన్నీ చేసి పెట్టారు ఊరేగింపుకు. 1931 ఏప్రియల్‌లో పాప పుట్టింది. 'మే'లో నన్నూ లోకనాథాన్ని తీసుకెళ్ళావు"

207. వర్ధనమ్మ బామ్మగారు నివేదన కలిపి పెట్టుతూ ఉంటే అమ్మ తిన్నారు. కామేశ్వరమ్మ అమ్మమ్మ; అత్తగారు పెడుతున్నదనా ఎక్కువ తింటున్నావు?

వర్ధనమ్మబామ్మ : అత్తగారు కాదమ్మా పెట్టటం - (భక్తురాలు)

అమ్మ : అత్తగారు కాకముందే (అంటే నా పెళ్ళికి ముందే) పెట్టావుగా- అదెప్పుడంటే...కిష్టయ్య తాతగారి పాకలో సుబ్బారావుకు అన్నం పెడ్తుండగా వచ్చాను. గోంగూరపచ్చడీ వెన్నపూసవేసి కలిప్పెట్టావు. 'మీ అమ్మ నా స్నేహితురాలమ్మా' అంటూ పెట్టావు.

208. వర్ధనమ్మగారితో అమ్మ -

"నువ్వు సీకాయపెట్టి (తలంటి)పోసుకుండే దానివి కదూ?" ఎన్నడో అమ్మ బాల్యంలో విషయం...

'నీకు గుర్తుందీ?'

209. ముక్తేశ్వరరావు గారిని అమ్మ గుంటూరులో 1940లో చూశారట. శాయమ్మ గారిని గుంటూరులో కుగ్లరు ఆసుపత్రిలో చూశారట. శేషగిరిరావుగారిని తన చిన్నప్పుడే చూశారట.

210. 10-9-64 మధ్యాహ్నం......

"నేనూ లోకమూ 1949 ఏప్రియల్ 17న పోట్లాడుకున్నాం. ఏ విషయంలో అంటే - ఆదర్శప్రేమ అనే నవల తెచ్చిచ్చాడు. రష్యన్‌వాడు రాసింది...."

211. 5-8-64న చెప్పారు.

"నేను1942మే జూన్'లలో చీరాల బేర్ హాస్పిటల్లో వుండగా కమలమ్మ

కూడా అక్కడే హాస్పిటల్లో వుంది. ఆమెను లాగుడుబండిలో లాగుతుండేవాళ్ళు. ఆమెకు రోజూ గుఙ్జబ్బండిమీద అన్నం వచ్చేది. ఒక రోజు నన్ను కూడ అన్నానికి రమ్మని పిలిచింది-"

212. 26-3-66నాడు రాత్రి 7 గంటలకు జమ్ములపాలెంనుండి కొంతమంది అక్కయ్యలు వచ్చారు. అందులో ఒకావిడ అడిగింది-

"నేను గుర్తున్నానమ్మా?'

"నీపేరు కమలమ్మ కదూ!'

1939 లో అమ్మ చీరాలలో బేర్ హాస్పిటల్‌లో ఉన్నప్పుడు అక్కడ రెండు రోజులు పరిచయమున్న వ్యక్తి ఆమె. ఇంకొక ఆమె గుఙ్జపువాతం చేసి బెడ్‌మీద వుంటే అమ్మ బార్లీ నీళ్లు కాచి ఇచ్చానని చెప్పేరు.

కమలమ్మ ఆశ్చర్యపోయింది.

213. 20-6-63నాడు దుగ్గిరాలనుండి ఇక్కడకు మొదటిసారి వచ్చిన ఒకావిడ అమ్మకు ఫలపుష్పాదులు సమర్పిస్తూ ....

'నేను జ్ఞాపకం ఉన్నానా?' అని అడిగింది.

"మీరు పిచ్చమ్మగారు కదూ!"

అమ్మ ఆమెను 1948లో చూసిందట.

214. "1939లో నేను రెండునెలలు కాఫీతాగాను. జనవరి 23నుంచీ ఆపేశాను.....

మళ్ళీ '13లో తాగటం మొదలుపెట్టాను"

215. భద్రాద్రిరామశాస్త్రిగారు మొదటిసారి రావటమూ, పి.వి.యల్.వి. ప్రసాదరావుగారు మూడోసారి రావటమూ-1960 జనవరి 14వ తేదినట.

216. 4-8-64నాడు-

నాన్నగారు: మరీ .... నేను హైమనెత్తుకుని, నువ్వు రవినెత్తుకునీ. సుబ్బారావు నుంచునీ తీయించుకున్న ఫోటో వుండాలి గదూ?

అమ్మ : అవును-'47 ఆగష్టు15న తీయించుకున్నాం.

217. నరసింహమూర్తిగారితో -

"మొదటిసారి నిన్ను చూడటం, చింతకాయలు తొక్కుతున్నప్పుడు రోటి దగ్గరే."

218. 27-2-64న రామకృష్ణారావుగారితో. - "నాన్నా - నువ్వు మొదటిసారి వచ్చినప్పుడు నీలిరంగు చొక్కా వేసుకుని మందిరంలో బల్లమీద కూర్చున్నావు కదూ?"

219. 6-1-65న హేమలతతో - "నువ్వు ఈ తడవ రావటం ఇక్కడకు ఐదోమారు కదూ?"

220. "నువ్వొకసారి వచ్చావు కదూ?"

'అవునమ్మా -'

"క్రితంసారి మీ అమ్మా నాన్నా, భార్యతో కలసి కదూ వచ్చింది? అప్పుడా అమ్మాయి జబ్బుమనిషిగా కనిపించింది. ఇప్పుడెట్లా వుంది?"

221. అన్నయ్య : అవునమ్మా మేమిద్దరమూ వస్తామని చెప్పాను. అదిగో మా ఆవిడ-

ఆ అక్కయ్య : మాది పోరుకాటి కుర్రమ్మా - జమ్మలమడక మాధవరామశర్మగారి--

అమ్మ : అవును - పోయినసారి చెప్పిన గుర్తున్నది.

222. 'అబ్బాయి వడుగు 16 రోజులపండగప్పుడొచ్చాను.'

"అప్పుడు రెండురోజులున్నారమ్మా?"

'అవును.'

223. 27-5-65 సాయంత్రం 6 గంటలకు పోరుకాటికుర్రునుంచి నలుగురు వచ్చారు. వాళ్ళు నమస్కారం చెయ్యగానే-

"భోజనం చేసొచ్చారా నాయనా?"

'ఆఁ'

"మే 5కు వచ్చారు గదా నాయనా-"

224. 23-2-66 నాడు బాపట్ల ప్లీడరు పులిపాక సీతారామశర్మగారితో-

''అప్పటికి మీకు తెలీదు. మీరు 60భోగిపళ్ళ రోజున వచ్చారు. 'అక్కడ'భోగిపళ్ళు పోశా''-నంటూ ఆ అన్నయ్యకు చేత్తో చూపిస్తూ గుర్తు చేశారు.

225. వాళ్ళకు చీర పెట్టాలని-

''సుబ్బులు పెట్టిన ఎఱ్ఱచీర వుండాలి అది తీసుకురా-''

'అది యిదివరకు యిచ్చావు గదమ్మా-'

''ఇవ్వలా చూసిరా-''

226. ''నాగపూర్‌లో ఉంటున్నావా?''

'అవును-అనంతపూర్ నుండి వస్తున్నాను.'

''వాళ్ళనిక్కడుంచి నువ్వు ఒక్కడివే అక్కడుంటున్నావా?''

'నా కింకా పెళ్ళి కాలేదు'

''నాకు తెలుసునాన్నా నీకు పెళ్ళి కాలేదని. మొదటిసారి వచ్చినప్పుడే చెప్పావు. నాకు బాగా జ్ఞాపకముంది; వాళ్ళు- అంటే తల్లిదండ్రుల-గురించి అన్నావు....జ్ఞాపకముందా? తల్లిదండ్రులకు పెరిగే వరకూ మనం పిల్లలమనీ, మనం పెరిగేక వాళ్ళు మనకు పిల్లలనీ- అంత జాగ్రత్తగా వాళ్ళను చూడాలనీ.... అన్నావు. అది గుర్తు పెట్టుకునే ఇప్పుడు వాళ్ళను గురించి నేను అడిగింది -''

# అమ్మ మెలకువ - లోకవ్యవహారాలలో

227. "పరిస్థితులకు మించిన గురువు ప్రపంచంలో మరెక్కడా లేదు. జిల్లెళ్ళమూడి చుట్టూ వరద వచ్చి బురద అయినప్పుడు పి.వి.యల్.వి. ప్రసాదరావుగారు వారి కుటుంబంతో వస్తూ - గండ్లు పడినచోట భార్యను ఎత్తుకుని దాటించారట. నడవలేకపోతే ఎత్తుకోవాలి; పరుగెత్తితే పట్టుకోవాలి? కూర్చుంటే లేవదీయాలి; లేస్తే కూర్చోపెట్టాలి - అని ఈ బురదనీళ్ళు బోధచేసినయ్. పరిస్థితులకు మించిన గురువు ప్రపంచంలో మరెక్కడా లేదు."

228. "తనుమూలమిదం జగత్ -
తనున్నప్పుడు తనకు ధనం కావాలి.
తను లేనప్పుడు (ధనం) ఎందుకు?
అందుకే తను మూల మిదం జగత్తు -"

229. "చక్కగా పాడేవాళ్ళు వాళ్ళకు తెలీకుండా, మనను మనకు తెలీకుండా-వాళ్ళతో తీసుకెళతారు."

230. 'నిజంగా చెప్పమ్మా- మా పాట శ్రావ్యంగా లేదా?'
"మీరనుకున్నంత కాకపోయినా మేము అనుకోనంతగా చక్కగా పాడేరు."

231. "యుగాంతరం యుగాంతరం అంటారు: అంటే లోకాలన్నీ ఏకమవటమూ, సముద్రాలు పొంగి ఒకేసారి అన్నీ మునిగిపోవటమూ -కాదు. ఒకవైపు నుండి పద్ధతులు మారటమే- యుగాంతరం. ఇవన్నీ మార్పులు కాదూ?"

232. "సుఖమంటే ఎవరిష్ట ప్రకారం వాళ్ళకు జరగటమే -"

233. "వీరపత్ని అంటే రెండర్థాలున్నాయ్. ఒకటి భర్త వీరుడైతే, రెండు తాను వీరవనిత అయితే-"

234. "ఏభాషా కలవంది సంస్కృతమేమో...కానీ సంస్కృతం అన్నిటిలోనూ కలుస్తుంది."

235. "మన చేతి వేడికి కరిగేదే వెన్నపూస అంటే-"

236. "ఒకనాటిమాట మరొకనాటికి బాటవుతుంది."

237. "తలంటి పోసుకుంటే తలనొప్పిరాదు. తలంటి అంటే వస్తుంది."

238. "ఆవేదన మనలోనిది కాని స్థానంలోదికాదు కదా! ఇక్కడ లేదనుకుంటున్నారు; అక్కడ లేదనుకుంటున్నారు. ఎక్కడున్నా ఉన్నదే."

239. "అనుభవం అన్నది నీది. శాస్త్రం శాస్త్రకర్తది. శాస్త్రం నీ అనుభవంకాదు, ఇంకొక డనుభవించి రాసింది."

240. "తెలుసుకున్నది తెలివి. అనుభవించేదే అనుభవం."

241. "మీరు పట్టుకోవటమనేది ఓపికలేనివాణ్ణి. కళ్ళులేనివాణ్ణి పట్టుకోనవసరం లేదు. దారి- కుడీ ఎడమా - అని చెప్తేచాలు; వాళ్ళే నడచి వస్తారు."

242. "మనం పదిమంది చెప్పింది వినగలం కానీ ఒక్కరు చెప్పినట్లు మాత్రమే చెయ్యగలం."

243. "మీరు కూలి యిచ్చేవాళ్ళను తినటం కాదు; కూలిని తినాలి."

244. 'చూడు ఆయనకెంతకోపం వచ్చిందో...'

"వచ్చేదేమున్నదీ? ఆయనకున్నదేగా-?"

245. "భోజనం చేశారా?"

'చేసి వచ్చాం. సెలవిప్పించండమ్మా-'

"(అబ్బాయికి పెట్టిన) పేరు గుర్తుందా?"

'గుర్తుంది.'

"ఏవిఁటి?"

'..............'

"కాగితమ్మీద రాసి ఇవ్వండర్రా - ప్రేమకుమార్ అని."

246. 'అమ్మా-పాపయ్య కూతురుకి ముక్కులో బటానీ గింజ పడింది. ఎట్లా వస్తుంది?'

'తుమ్మితే వస్తుంది. ఒక పొగాకుకాడ ముక్కులో పెడితే తుమ్మొస్తుంది. ఇవతలి ముక్కులో పెడితే ఆ ముక్కులోది పోతుంది."

247. 'ప్రాణాయామం చెయ్యటం వల్ల తరణోపాయం కలుగుతుందా?'

"ఆ సంగతి ఎట్లా వున్నా ఆరోగ్యానికి మంచిదే."

248. 'రాధ మడమలు పట్టుకుని ఎందుకు పాడేదమ్మా?'

"నాదం రావటానికి కొన్ని మూలస్థలాలు ఉంటయ్‌గా- కొన్ని స్థలాలనుండి కావాలన్నంతగా శక్తి చాలకపోతే - సీసా బిరడా తీయటానికి చేతిలో శక్తి సరిపోకపోతే కాళ్ళమధ్య శక్తితోనూ.... అదీ చాలకపోతే పొట్టకు అనించీ ఆ శక్తి నుపయోగించి తీసినట్టే ఇదీ."

249. 'భరతనాట్యమంటే ఏమిటమ్మా?'

"తాళజ్ఞానమేగా అది- ఒక చేతితోనే కాక శరీరంలోని ప్రతి అవయవమూ తాళంవేయటమే. భరతనాట్యం వస్తే వేరే ఆసనాలు అవసరం లేదు. ప్రతీ అవయవాన్నీ కదల్చటమూ, హావభావాలు చూపించడమూ ఎంత కష్టం?"

250. 'ప్రధాని ఎవరయితే బాగుంటుంది?'

"అన్ని దేశాల్ని గురించీ 'మన' అనుకునే మనస్తత్వం కలవాడయితే బాగుంటుంది."

251. "పదిమంది కలిస్తేనేగా లోకం?"

252. "నీళ్ళుకలిసినై. పైకి తేరుకునేది నూనే. సంస్కారమేగా పైకి తేలేది?"

253. "సంస్థ అంటే సమస్తమూ చేరిందేగా?

మంచీ చెడూ -అన్నీ."

254. "భరించలేనిదే బాధ."

255. "బాధలు మనం పెట్టటమేమిటి?

అవతలివాడికి పడే గుణం ఉంటేనే వాడు బాధపడతాడు. సున్నితమైన తత్వాలకు ఎంత సుఖపెట్టినా ఎక్కడో ఒక లోటు - బాధ కనిపిస్తూనే ఉంటుంది."

256. "తాను సహించలేనిదే హింస."

257. "ఇష్టంలేనిదే కష్టం."

258. "అవసరమే విలువైనది."

259. "భావం మారేది; స్వభావం మారనిదీ."

260. "తన భావమే స్వభావం."

261. "స్వభావం మార్చలేనిది; స్వభావమంటే పుటకతో వచ్చింది."

262. "సవరణ అవసరం లేనిది వివరణ."

263. "గణన క్కూడా అందనిది గండం."

264. "వర్గం లేనిది స్వర్గం."

265. "తనను తాను విమర్శించుకోవటం వివేకం."

266. "ఇతరులను విమర్శించటం అవివేకం."

267. "తనకొరకు చేసేది రాగమూ; ఇతరుల కొరకు చేసేది త్యాగమూ."

268. "ప్రేమించటమూ ద్వేషించటమూ తన కొరకే-"

269. "నవ్వుతూ అనుభవించేవాడి దగ్గరకు - ఏడుస్తూ అనుభవించేవాడు సలహాకు వస్తాడు."

270. "వైకల్యం లేకపోవటమే కైవల్యం."

271. "తల్లికైతే తప్పదు కాదు; తల్లికి తప్పే కనుపించదు."

272. 'అమ్మా ఓ సందేహమమ్మా.....'

"దేహమే సందేహం నాన్నా-"

273. "బానిసకు బాధలెక్కువ. స్వతంత్రుడికి బాధ్యత లెక్కువ."

274. "సంఘటనల కూర్పే జీవితం."

275. "జీవిత మొక వలయం...."

276. "రాగమూ, ద్వేషమూ కూడా 'కావాలి' అన్నదాని మీదనే ఆధారపడి ఉన్నయ్."

277. "ఒక బాధ తగ్గవలెనంటే మరొకటి రావాలి."

278. "జీవితంలో దెబ్బలు తిన్నకొద్దీ నిశ్చలత పెరుగుతుంది."

279. "శిల్పాని కందం రావాలంటే - ఉలిదెబ్బలవసరం."

280. "భావచేతన్యమే కవిత్వం."

281. "మహావాక్యాలు అనుభవం లేకపోతే మన వాక్యాలే -"

282. "శాస్త్రమంటే - శాసించేది; శాశ్వతమయిందీ."

283. "సాహిత్యంతో రాహిత్యం కాదు."

284. "ఏ ఆధారమూ లేనప్పుడు ధైర్యం దానంతటదే వస్తుంది."

285. "అధైర్యమే ధైర్యానికాధారం"

286. "గుణానికి మనకంటే ఎక్కువ వాళ్ళనూ,
ధనానికి మనకంటే తక్కువవాళ్ళనూ పోల్చుకోవాలి."

287. "ఇతరులతో తగాదా ఆడటం పోరాటమూ-
తనలో తానూ తనతో తానూ పోరాట్టమే ఆరాటమూ-"

288. "కోపదారులను జయించాలంటే - శాంతం కలవాళ్లే జయించాలి."

289. "మానవుడే తర్కం-"

290. "కలవరింత అంటే - ఒకడికలవరం మరొకడికి వింత.
ఆవలింత అంటే -ఆవలి వింతకు పోయే సూచన."

291. "తల్లి రక్షణకాదు; రక్షణే తల్లి."

292. "అడుగనేర్చితే; అమ్మ అడిగితేనే పెడ్తుంది.
శిశువైతే ఆకలి కనుక్కొని తానేపెట్టుంది."

293. "అమ్మ అడిగిన బిడ్డకు అడిగిందే పెట్టుంది.
ఊరుకున్నబిడ్డకు ఏమికావాలో తానే చూసి పెట్టుంది."

294. "ఆదర్శప్రేమా? ప్రేమే ఆదర్శమైనది -"

295. "కఠోర సత్యమా? సత్యమే కఠోరమైనది -"

296. "చేతులు కలవడమే నమస్కారం కాదు :
నమస్కారానికి సంస్కారమే ఆస్కారం."

297. "పంచామృతాలనగా - ఒకే అమృతం నుండి పంచబడ్డవి."

298. "పాలూ, పెరుగూ, మీగడా, వెన్నా. నెయ్యి-పంచామృతాలు."

299. "తనను కన్నవాళ్ళ మీదకంటే తను కన్నవాళ్ళ మీద ప్రేమ ఎక్కువ."

300. "మానవుని నడక నవగ్రహాలమీద ఆధారపడిలేదు.
రాగద్వేషాలనే రెండే గ్రహాలమీద. ఆ రెంటికీ ఆధారం 'నేను'."

301. "మానవుడు తనకు తాను మెప్పించుకున్నప్పుడే ప్రపంచాన్ని మెప్పిస్తున్నాననుకుంటాడు."

302. "సౌఖ్యం గలదారిగా కనపడుతూ దుఃఖాన్ని ఋజువు చేస్తుంది 'నాది' అనేది".

303. 'తాపత్రయం అంటే ఏమిటమ్మా?'
"దారేషణ, ధనేషణ, పుత్రేషణ - ఈమూడు త్రయం. తనమీదనే ఉన్నదనుకోవటం - తన యత్నమే, తా యత్నమే తాపత్రయం."

304. "ధర్మాన్ని చేపట్టితే నిత్యమైన వస్తువేదో తెలుస్తుంది."

305. "చిక్కించుకునే చిక్కం అల్లేవాడి దగ్గరుంటుంది."

306. "ప్రాణం యిచ్చినవాడే తీస్తాడు."

307. "ఇంత శరీరముంటే పాదాలకే ఎందుకు నమస్కారం?"
ఆ పాదమే పాదమ్మీదనే ఆధారపడ్డది కనుక-"

308. "ఎవరిపాలబడ్డ పనివారికి తప్పదు"

309. " అనుకున్నది జరుగదు. తనకున్నది తప్పదు."

310. "తిథులు విధిని మార్చలేవు."

311. "తానొకటి తలిస్తే దైవమొకటి తలుస్తాడు కాదు;
దైవం తలిస్తేనే తాను తలుస్తాడు."

312. "మరణించినప్పుడు- ఆ ప్రాణం ఎట్లా పోతుంది? ఎక్కడకు పోతుంది? అసలు ప్రాణమంటే ఏమిటి?-అంటే తెలీదు గదా... తెలిసినప్పుడు సైన్సు పూర్తి అయినట్లే-"

313. "రచనకూ విమర్శనకూ-పుష్పానికి దాని కాడకూ ఉండేటటువంటి సున్నిత సంబంధం ఉండాలి. అంతటి సున్నితమైన విమర్శయే మంచి రచనగ్గానీ మంచి గ్రంథానిగ్గానీ దోహదమిస్తుంది. విమర్శ వ్యక్తిగత ద్వేషంతో గానీ, కోపంతోగానీ చేస్తే - అది విమర్శ అనిపించుకోదు."

314. "మనం తిని మన చాకిరితో మరో మనిషికి అన్నం పెట్టాలి."

315. "వాళ్ళకు తెలిసే(మన) లోపంతో మనకు తెలీని మంచి వాళ్ళకు తెలీని మంచీ - ఏదో జరుగుతున్నది కదా-"

316. "క్షరంకానిదే అక్షరమైనప్పుడు - ఏ అక్షరం గొప్పది?"

317. "కోపం వేరూ; క్రోధం వేరూ.
క్రోధం ఆవతలివాడు నాశనమయ్యేవరకూ చేసే సాధింపు."

318. "కలత లేకపోతే నలతేం చేస్తుంది?"

319. "(తాళాలలోనా?) పాతాళం అంటే అర్థంకానిదీ;
వెయ్యటానికి వీలుకానిదీ -"

320. "అభిరుచే ఆకర్షణ."

321. "ప్రశాంతత మనసునుబట్టి కానీ ఊరునుబట్టి కాదుగా?"

322. "ఈ చోటులో ఏమీ లేదు. ఏ కారణంగా అశాంతి వచ్చిందో ఆ కారణంగానే అశాంతి పోవాలి. చోటుమారితే పోయేదేమీ లేదు."

323. "మనస్సు గాయపడ్డది. ఏకారణంతో గాయపడ్డదో ఆ కారణంతోనే మానాలి."

324. "కష్టం సుఖం మనస్సునుబట్టి ఉంటుంది. ఈ రెండూ ప్రతీవాడికీ తప్పవు. మనిషీ మనిషి నీడా ఎట్లాగో - ఈ రెండూ అట్లాగే తిరుగుతయ్."

325. "కోర్కె అనగానే....మంచం వద్దు -అనుకున్నా,చాపకావలసిందేగా? ఒకటి

వద్దుఅనుకుంటే మరొకటి కావాలనుకున్నది కోరికేగా?
కోరికలను జయించాలన్నది కోరికే అవుతుందిగా?"

326. "రాతితో కట్టేనే దేవాలయం కాదుగా? నీ హృదయంలో నామంతో కట్టు-"

327. "జీవితాలు అర్థమైనప్పుడు కదా జీవిత చరిత్రలు?"

328. "చక్కదనం యంత్రం వంటిది; గుణం మంత్రం వంటిది."

329. "మనకంటే పాములు నయమే. అవివాటికి అపకారం చేసిన వాళ్ళనే బాధపెట్తే- మనం మనకు తెలీని వాళ్ళనుకూడా పెడ్తాం."

330. "ఇతరులలో 'మంచి'ని చూడటమే మన మంచితనం.
ఇతరులలో 'చెడు'ను చూడటం మంచితనం కాదుగదా?
సర్వత్రా 'మంచి'ని చూడటమే మంచితనం."

331. "పిల్లలకు చెయ్యటం సేవే. అదీ సేవే గదా!
ఒక విగ్రహాన్ని దైవంగా నిర్ణయించుకుని చేసేదీ సేవే.
అది ఎంతో, ఇదీ అంతే-"

332. "చావటం మాటకొస్తే ......పుట్టిన వాళ్ళు పుట్టినట్లే ఉంటే - మళ్ళీ వచ్చేవాళ్ళకు స్థానం ఉండొద్దూ?"

333. 'నాకు మీ బోటి పెద్దల అనుగ్రహమూ, దైవమూ తప్ప ఇప్పుడు మరో ఆధారం లేదు.'

"ఆధారమే దైవమైనప్పుడు ఆధారం లేకపోవటమేమిటమ్మా? దైవం తప్ప ఆధారం లేదనుకున్నప్పుడు - ఇంకా అంతకన్నా కావలసిందేమున్నది?"

334. "మెదలకుండా ఉండటం సూక్తే గదా!"

335. "అది ప్రథమంలోనే తెల్సుకున్నానుగా : ప్రథమమే చివరగా?"

336. "ఇందిర ఎం.ఏ. చదివినట్టుగా ఉన్నదా? అసలు దానికే అనుమానం, తను చదువుకున్నానా లేదా - అని."

337. 'ఏమి అడగాలో తెలీడం లేదమ్మా-'

"ఏమి (అడగటమూ) అవసరం లేదు నాన్నా - "

# వాక్సమత్కృతి

338. 'వస్త్రాం కానీ నలుగురిలో అభాసు చేస్తే?'

"శభాష్ .... అంటారు."

339. "పేరేచర్ల కదిలిందే! రెండు మూడు నెలల నుండీ చాలమంది వచ్చారు. పేరేచర్లా -పేరే చరగా వుంది."

340. "పూజారికి ఉభయం ఇస్తేనే కానీ స్వామి అభయం ఇవ్వడా?"

341. ప్రభుదత్త బ్రహ్మచారి : అమ్మా జగన్నాథం వెళదామా?

అమ్మ : అంతా యిదే అయినప్పుడు ప్రత్యేకించి వెళ్ళేదేముంది?

342. 'ఘనుడైన మొనగాడు' అనటానికి బదులు -

'ఖలుడైన మనగాడు' అన్నారెవరో.

అమ్మ : మన గాడి తెలియాలంటే ఖలుడే వుండాలి.

343. 'శ్రుతి నిలవటం లేదమ్మా -'

"పోనీ - స్మృతి నిలిస్తే చాలు."

344. "మధురస్మృతా? స్మృతే మధురం. అది ఏ స్మృతి అయినా సరే- ఆనందం కానీ దుఃఖం-కాని ఏదైనా కానీ అది గుర్తుకు రావటమే మధురం."

345. "దేవులాడినా దొరకనివాడే దేవుడు. అంతటా వుండేవాడిని ఎక్కడని దేవులాడితే దొరుకుతాడు?"

346. 'అమ్మా దయ్యమంటు వున్నదికదా - కనిపిస్తాయా?'

"ఎందుకు కనిపించవు నాన్నా దయలేని వాళ్ళంతా దయ్యాలు కదూ?"

347. "జగన్మాత అంటూ (పూజలు అవీ చేసి) ఆమెను మేల్కోల్పటమంటూ జరిగితే నువ్వే జగన్మాతవు కదూ ?"

348. 'అక్కడ దైవాన్ని స్థాపించాలనుకుంటున్నాం.'

"దైవాన్ని స్థాపించేవాళ్ళం మనం కాదుగా?స్థాపించే శక్తి మనకున్నప్పుడు మనమే దైవాలం."

'భగవంతుడేం చేయిస్తే అది చేస్తాను.'

"ఏం తోస్తే అది చెయ్యి - తోచేటట్లు చేసేది వాడేగా-"

349. "జీవితమూ, జీవనమూ-రెండూ భగవంతుడిచ్చినవే -"

350. (నాన్నగారు తిరగమన్నారు గానీ) ఈ తిరగటం వల్ల నీకు రిలీఫ్‌గా వుందా?'

"రిలీఫ్:- రిలీఫ్ ఏమోగాని ఆ మాటమీద రీలీఫ్ ఇస్తుందన్న బిలీఫ్ వున్నది."

351. "అదేమిటమ్మా- నువ్వు ఎంత చెప్పినా మొగవాళ్ళ దారి వేరు వాళ్ళను అనటానికి లైసెన్సులేదు.'

"నువ్వు సైలెన్సుగా వుండు -"

352. "కమిటీలే కానీ అక్కడ కమిట్‌మెంట్ లేకపోవటం వలన ఈ గొడవలన్నీ జరుగుతున్నయ్."

353. "మదర్‌హుడ్ ఏమిటి? హుడ్డే మదర్‌కదూ -"

354. "డివైన్ మదర్ ఏమిటి?

మదరే డివైన్ కదూ-"

355. 'మరి అందరూ ఫిలాసఫీ చదువుతున్నారుగా?'

"థియరీలు చదువుతున్నారు."

356. "ఉండటమే స్పేస్ కదూ-

నేను ఇక్కడ కూర్చున్నాను. ఇదే కదా స్పేస్-"

357. "హోప్లెస్ - హోప్లెస్ అంటే బ్రాకెట్లో కుమారి."

'అంటే ఏమిటమ్మా? అర్థం చెప్పవూ?'

"ప్లేస్ అంటే స్థలం." అన్నారు నవ్వుతూ.

'మరి హో అంటే?'

"హో.... హైప్లేస్-"

358. 'బెస్టమ్మా-'

"బెస్టేరా కాదని నేనెట్లా అంటాను?"

'జెస్ట్!'

"మనకెవరికీ రెస్ట్ లేదు."

"ఉన్న వాళ్ళకుంది."

"వేస్ట్ మన మనుకోవటం."

359. 'కదిలితే ప్లేన్ అమ్మా -' అని ఒక ముసలాయన.

"అవన్నీ ప్లేన్‌లో వెళ్ళారు. ఇక్కడకు (జిల్లెళ్ళమూడికి) ప్లెయిన్‌గా వచ్చారు. ఆ చోట్లకు ప్లెయిన్‌గా వెళ్ళలేదుగా- పైగా హెచ్చు తగ్గులొస్తే అందులో పెయిన్."

360. "ఒకరి కోపం చూసి నీకూ కోపం వస్తే ఇద్దరూ ఒకటే."

361. 'అమ్మా మీ అనుజ్ఞ లేకుండానే ప్రసాదం తీసుకుని వచ్చాం.'

"అనుజ్ఞ లేకపోతే తీసుకోవటం ఎట్లా జరుగుతుంది?"

362. హైమా- అసలమ్మను పెట్టుకుని ఫోటోలకెందుకూ?'

అమ్మ- ఏమిటో కూసిందే పిట్ట!

363. "అన్ని ఉన్నయ్, అన్నప్పుడు-'పనికిరానిదీ'అన్నదీ దానిలోదేగా?"

364. "ఎంతసేపూ దైవధ్యాసలేదంటాడు. కానీ అట్లా అనుకుంటూ తలచుకొనేది - వాడినే"

365. "అమ్మా- కుమారి స్మారక చిహ్నం ఏమిటి?"

"నేనే"

366. 'ఏదో వంకతో ప్రతీదీ ఋజువు చేస్తున్నావు.'

"సృష్టి అంతా వంక చేతనే ఏర్పడింది కదా?-"

367. 'ఇక్కడ ఒకళ్ళకు గూడ వంట్లో సరిగా లేదమ్మా-'

"ఒక్క కన్నేమిటి నాయనా - అందరికీ రెండు కళ్ళున్నయ్‌గా."

368. "ఏవిటో ఇదంతా - నాకూ ఇల్లూ వాకిలి, మొగుడూ, పిల్లలూ, సంసారమూ,వాళ్ళకు రోగాలూ...."

'అయితే ఎందుకొచ్చావ్?'

"నేను వద్దనటం లేదుగా - ఉన్నయ్ అని చెప్తున్నా."

369. 'నీళ్ళు బాగా వచ్చినయ్యమ్మా -'

"ఇంట్లోకి వచ్చినయ్యా?"

'ఏం ఇంట్లోకొస్తే కానీ నీకు తృప్తిలేదా?'

"ఏవిటి నువ్వన్నది? అవును మరి, నువ్వు (వసుంధర) అన్నిటితో తృప్తి పడుతుంటే - నేను ఒక్కదానితో (నీటితో)నన్నా సంతృప్తి పడొద్దూ?"

370. "దొరకలేదని అబద్ధమాడకండి" అని అమ్మ.

'దేవునిముందు అబద్ధాలాడకండి' అని ఒకరు.

"అవును వాళ్ళు నిలబడి మాట్లాడింది అమ్మగారి దేవుని (అంటే నాన్నగారి) ముందేగా?-" అన్నారు అమ్మ.

371. "కుళ్ళు మీరనుకున్నంత చెడ్డది ఏమీ కాదమ్మా - మంచితనం నిలవుంటే అంతే.-"

372. శేషగిరిరావుగారు: నేను ఉంటేనే వరదలు. మళ్ళీ నేను అష్టమినాడు వచ్చేటప్పటికి వస్తుందేమో...

అమ్మ: నువ్వు వుంటేనే వరదొస్తుందా? అంటే-నువ్వు అభయమన్న మాట.

373. "అమ్మ 'ఓం' దిద్దబెట్టితే - ఆ 'ఓం' తప్ప మరొకటి నేర్చుకోము అంటారు ఈ పిల్లలు బళ్ళో" - అని అమ్మ.

'ఓం- అక్షరం ఒక్కటి గుర్తు పెట్టుకున్నా చాలు కనీసం.'

"పక్కన 'న' వున్నంత వరకూ 'ఓం' ఎట్లా గుర్తుంటుందీ?"

374. "మా ఊరికి బురద అని వంకా? బురద అయితే ఏం?కడిగితే పోతుంది. మన బురద కడిగినా పోదు. బురద ఒకటే కానీ తేడాలేదూ? మన బురద కనిపించదు.- అసలు, దైవమే బురద పూసుకున్నాడు."

375. "వీళ్ళు దొంగలు, దొంగలు - అంటారు. వీడి దగ్గరపోతే వాడి దగ్గరైనా వుంటుంది. నిప్పు అయితే మొత్తం ధ్వంసమవుతుంది."

376. 'నువ్వొక్కోసారి మాట్లాడుతుంటే - నాస్తికురాలవా అనుకుండేవాడిని."

"నా- అస్తికురాలనా?"

377. "ఎవరికైనా తప్పదు వచ్చినచోటకి పోక -"

378. "పెట్టించుకోలేదుకానీ అన్నీ పట్టించుకునే ఉన్నా."

379. 'మేము పరమ మూర్ఖంలో ఉన్నామమ్మా-'

"పరమ మూర్ఖత్వంలో ఉంటే ఏదో ఒకదాన్ని నమ్మటం జరిగేది; ఇన్ని సందేహాలకు తావెక్కడిది?"

380. "పీటలమీద కూర్చున్నవారంతా పీఠాధిపతులయినారు."

381. 'చెప్పమ్మా-'

"నేను చెప్పమ్మను కాను. ఒక్క చెప్పులకే కాదు మీ అందరికీ అమ్మను."

382. 'ఈ ముగ్గురి సారమూ నువ్వు తీసుకున్నావుగా-'

"అంతా నేనే తీసుకుంటే వికారమవుతుందేమో-"

'వికారానికి ఆకారముంది.'

"అంతా సాకారమే-"

'అది మమకారంతో కూడిన సాకారం.'

"అవన్నీ యీ ప్రాకారం లోనివే-"

383. 'మమ్మల్ని ఏం చేసి పోతున్నావమ్మ మన్నవ?

"మిమ్మల్ని ఏం చేయకుండానే వెళుతున్నాను. ఎక్కడికి వెళ్తాను? మళ్ళా వస్తానుగా-"

384. 'ఆయన గొంతులో గాంభీర్యం తగ్గింది.'- అని ఒకరూ.

'ఆశ్రమం మారిందికాదూ' - అని ఇంకొకరూ.

'ఆశయం మారలేదు; ఆశ్రమం మారింది." - అని అమ్మ.

'ఇప్పుడవధానం చెయ్యడం లేదనుకుంటా-' అని ఇంకొకరూ.

"వ్యవధానం లేక" - అని అమ్మ.

385. 'అమ్మా - ఆ సభలోనే కూర్చోవాలని ఏముంది? వచ్చి ఎక్కడ కూర్చున్నా పరవాలేదు' అన్నారు. ఎలాగైనా అమ్మను వారి గ్రామం తీసుకు వెళ్ళాలని. "ఆ సభలోనే కూర్చోవాలని ఎట్లా లేదో, ఇట్లాగే(అసలు అక్కడకు) రావాలని ఏముందీ?"

386. 'పుట్టిన రోజు బాగా జరుగుతుంది.'

"విడి రోజులలో ఉంటే విశ్రాంతిగా వుంటుంది."

387. అన్నయ్య : వీళ్ళింట్లో ఒక వారం రోజులుండి వస్తా.

అమ్మ : ఎందుకూ చావల్ ఖరాబ్?

అన్నయ్య చావల్ ఖరాబ్ కాదమ్మా - ఎవరన్నం వాళ్ళ కుంటుంది.

అమ్మ : ఆమాట వాళ్ళన్నారా? -నువ్వంటున్నావా?

అన్నయ్య: నేనే అన్నా.

అమ్మ: అయితే ఇందాకటి సంభాషణకు ఇది భిన్నంగా ఉన్నది.

(ఇందాకటి సంభాషణ ఇది)

అన్నయ్య : ఆకలేస్తున్నదమ్మా-

అమ్మ : చాలా ఆలస్యమయింది.

అన్నయ్య: ప్రొద్దుటినుంచి ఏమీ తీసుకోలా.

(ఎవరన్నం వారికుంటుందన్నారే,మరి తీసుకోకపోవడమేమిటి?)

--- ----- ------

అన్నయ్య : ఆసంభాషణ వేరూ, యీ సంభాషణ వేరూ.

అమ్మ : సంభాషణ వేరయినా విషయం ఒకటే. ఏది ఎవరికి ఎంతవరకో అంతవరకూ చేస్తారు. ఎవరెప్పుడో వాళ్ళప్పుడు భోజనం చేస్తారు నాయనా- అందరూ నవ్వుకున్నారు.

388. ఒక అన్నయ్య - అమ్మ అన్నం తినమంటే- 'ఇప్పుడొద్దమ్మా'- అన్నారు. తర్వాత అమ్మ మాగాయతో కలుపుతూంటే-వాసనలు వస్తున్నాయే. అని తయారయ్యారు.

389. అమ్మ రవికి తలంటబోయి నెత్తిమీద చాలా నూనె పెట్టారు. రవి మాట్లాడకుండా నుంచున్నాడు. అమ్మ లోలోన నవ్వుకుంటూ చేతులకూ, మొహానికీ పొట్టకూ చాలానూనె పట్టించారు. రవి మెదలలేదు.

"ఏంరా? ఇంత నూనె రాస్తున్నా మాట్లాడవు. ఇదే మొదటిసారి ఇంత నూనె రాయించుకోటం; ఆశ్చర్యంగా వున్నది."

'నిన్న మధ్యాహ్నం నుంచీ అన్నీ వింటూనే వున్నాను.'

అమ్మ రవికాళ్ళకు నూనె రాయబోయింది.

'వద్దమ్మా'-అని రవి అవతలకు వెళ్ళితే-

"అన్నీ చెప్పినమాటలు వింటున్నానంటివే?"

'కాళ్ళకు మాత్రం వద్దు-'

390. అమ్మకు తలంటి పోసి ఒకావిడ- 'చిక్కుతీసేదా అమ్మా?'

"నా చిక్కు ఎవరు తీస్తారూ? ఎవరూ తియ్యరు. అందరూ చిక్కుల్లో పడేసేవారే."

391. 'ఇష్టదైవమేమిటి?'

"ఆ యిష్టమే ఇష్టదైవం."

# అమ్మకు తెలియనివి

392. 'మావారు ప్రమోషను గురించి అడగమన్నారమ్మా'

"నా కేమీ తెలీదమ్మా-"

'లోకమాతవు నీకు తెలియనిదేముంది? మమ్మల్ని అన్నివిధాలా రక్షించాలి. అన్నీ మీరేగా -'

"అంత విశ్వాసముంటే మాటలే అవసరం లేదు."

393. 'కిష్టయ్య పుస్తకం వ్రాశాడుట. అచ్చువేయిస్తా -నంటే ఇస్తానన్నాడు.'

"నాకేఁవీ తెలీవటువంటివి."

394. 'అమ్మా- అమ్మాయికి సంబంధమెక్కడుందో చెప్పండి. వెళ్ళి చూస్తాను.'

"నాకు తెలీదమ్మా-"

395. 'ఈ అమ్మాయికి, మూగ, చెముడూనమ్మా-'

"నాకట్లాంటి వేమి తెలీవు."

396. 'ఆరోగ్యం సరిగా లేదండి-'

"నాకవ్వేమీ తెలీదమ్మా-"

397. చీరాల ముసలతను నమస్కారం చేసి -

'మా ఆడాళ్ళకు ఎప్పుడూ జబ్బేనమ్మా-'

"నాకు చెప్పి ఏమీ సార్థకం లేదు."

'మీకు చెప్దామనీ.....'

"నేనూ పుట్టు రోగిని."

'తీసుకు రమ్మంటారా ఇక్కడకు?'

"నాకవన్నీ ఏమీ తెలీవండి-"

398. 'ముగ్గురు పిల్లలు పుట్టిపోయారమ్మా-'

"నాకేం తెలియదమ్మా-"

399. 'ఈమె వంట్లో అనారోగ్యంగా ఉంటుందమ్మా-'

"అట్లాంటివి నాకేం తెలియదమ్మా-"

'మీరేఁవీ చెప్పనక్కరలేదు. వింటే చాలు. మా అత్మ తృప్తిగా వుంటుంది.'

"విన్నందువల్ల లాభమేమిటి? మాటలు కాదుగా కావలసినవీ?"

400. 'నాకు కీళ్ళ వాతమమ్మా-'

"నాక్కాళ్ళ నొప్పులు."

'అది బాహ్యానికేగా-'

"ఏం బాహ్యమో. అంతరం వుంటేగా?"

401. 'అమ్మా- మీతో మాట్లాడాలమ్మా-'

"చెప్పమ్మా- నేనేమీ చేసేది ఉండదు."

'ఇంట్లో పరిస్థితులు సరిగాలేవు. కోడలికి వంట్లో సుస్తీ....'

"నా కివేవీ తెలీవు..చెప్పటం తెలీదు."

'మీ దయ ఉంచండి మీకు తెలియక పోవటమేమిటి?'

"ఇవన్నీ నా దయవల్లే. ఈ ఇబ్బందులూ కష్టాలు - అన్నీ నా దయవల్లే

'అయ్యో, అయ్యో...... తొలగించమ్మా-'

"నా కవసరమని తోచిన్నాడు తొలగిస్తా-"

402. "ఆ చిక్కుల గురించి నాకేం తెలుస్తుంది నాన్నా? తెలిసింది ఒక్కటే. ఏది ఎట్లా జరగాలో అట్లా జరుగుతుంది. మన ప్రయత్నమేమీ లేదు. మానవ ప్రయత్నానికి ప్రయత్నం కల్పించే శక్తి మరోకటి వుందనీ, అది ఎట్లా చేయిస్తే అట్లా నడుస్తున్నామనీ- నా నమ్మకం."

403. "జబ్బేట్లా ఉన్నా బాధను బాధగా కాకుండా సుఖంగా అనుభవించటానికి - ఈ మంత్రాల వల్ల జబ్బులు తగ్గుతయ్ అనటం."

404. "దయ్యం లేదసలు మన మనస్సే దయ్యమూ; మన మనస్సే దైవమూ."

405. "బాధలు రావటానికి మార్గం ఉన్నప్పుడు పోవటానికీ ఉంటుంది.నీకీ

8

బాధలెవరిచ్చారో- వాళ్ళే ఆ విముక్తీ కల్పిస్తారు. దానికి సమయం రావాలి."

406. వాళ్ళు తమ కుటుంబబాధలూ, శరీరబాధలూ ఎవరికున్నవి వారు చెప్తుంటే విని చిరునవ్వుతో-

"నాకేం తెలుసునమ్మా- నాకేమీ తెలీదు. జబ్బులు ఆస్పత్రిలో చూపించుకోండి. బాధలు ప్రతీవారికీ తప్పవు. వాటిని కొందరు నవ్వుతూ అనుభవిస్తే -కొందరు ఏడుస్తూ అనుభవిస్తారు. అంతే -విధిని ఎవరు తప్పించుకుంటారు?"

# ఆనాటి అమ్మ

407. చిన్నప్పుడు అమ్మ తన తల్లితో -
"నువ్వు లేనప్పుడు నేనే అమ్మనై ఉంటాగా-"

408. అప్పుడు - అమ్మకు అయిదేళ్ళప్పుడు - హోమియో మాత్రలు(14వ నంబరూ 12వ నంబరూ) సీసాలు సీసాలు తినేది.

409. 'నన్నింతవరకూ ఎవరూ చదువుకుంటావా?-అని అడగలేదు. మీరడిగేరు కనుక, చెప్పండి.-"

410. "ఏదీ కావాలనేది అక్కరలేకుండా కావాలి."

411. 'నీ క్కూడా పెళ్ళి ఎందుకమ్మా?'
"పెళ్ళిలో పెద్దపులి వుందనుకునేవారి భయం పోగొట్టటానికి."

412. జాతకరీత్యా అందరికంటే అదృష్టవంతురాల్ని నేనొక్కదాన్నే. ఎందుకంటే 'ఇది అవస్థ' అనే చింత నాకు లేకపోవటమే నా అదృష్టం. అటువంటప్పుడు కష్టానికి, బాధకూ-చోటేదీ? ఎన్నిఉన్నా ఎంత సుఖంగా ఉన్నా-'నాకు లేదు' అనుకోవటమే దురదృష్టం. అదృష్ట దురదృష్టాలు రెండూ భావనలే."

413. 'పేకాట తప్పా అమ్మా?'
"నాకు ఏ ఆట ఆడినా తప్పులేదు. ముందుగా వచ్చిందీ లేదు. కూర్చుంటే రానిదంటూ లేదు. ఆట ఆడదామనుకున్నప్పుడు రాని ఆట లేదు. ఫలాని ఆట వచ్చుననీ లేదు."

414. "నేను దేనికోసమూ, ఏదీ చేసింది లేదు. ఆరాధన కూడా ప్రత్యేకంగా దైవమొకదాంట్లో ఉన్నదనీ ఆరాధించలేదు మీ అందరినీ ఆరాధించటమూ, మీరందరూ దైవమనుకోవటమే -"

415. "నాకు సాధన చేయ్యాలనీ లేదు. చేసిందీ లేదు. నేను ఏనాడు పూజచేసి ఎరుగను. దీపారాధన కూడా చేసి ఎరుగను."

416. "నన్ను సుఖపెట్టేవాళ్ళు ఎవరైనా ఉన్నారనుకుంటే బాధపెట్టేవాళ్ళు ఉన్నారనుకుంటాను. నన్ను ఎవరూ బాధ పెట్టలేరు."

417. "బాధనిపిస్తే కదా సహించటమన్నది ఉండటానికి? బాధపడని వాళ్ళనెవ్వరు బాధపెట్టగలరు? అన్నీ నేను కల్పించుకున్నవేగా- అనిపిస్తయ్."

418. "బాధలేకపోతే బ్రతకటం అనవసరం."

419. "బాధలేని బ్రతుక్కంటే చావు నయంరా, బాధంటే చైతన్యమే. అది లేకపోతే ఏమీ లేదు."

420. 'అమ్మా - లక్ష్మికి త్రిశూలముండదు కదా?'

"ఒకరితో పోలికేఁవిటి?"

421. చీరాలలో అమ్మ శిశువులకు పెట్టినపేర్లు :

ఇంద్రాణీ, మాధవి, కమ్మని అమ్మ, చిరంజీవమ్మ, సుధాకరి, సుహాసిని, జగన్మోహిని, జగన్మోహనుడు.

జిల్లెళ్ళమూడిలో : వాత్సల్య, అపర్ణ, ప్రేమకుమార్, రహి.

422. డాక్టర్ : ఏమ్మా నీకు (పురిటి) నొప్పుల్లేవా?

అమ్మ : ఎందుకులేవండి ఉన్నయ్.

డాక్టర్ : ఉంటే ఏమాత్రమూ వున్నట్లు కనిపించవేమిటి?నొప్పులు లేవేమోనని నొప్పులు రాకుండా వుండకూడదని ఇంజక్షన్ కూడా ఇచ్చారట. అమ్మ దానికీ మాట్లాడలేదు.

423. "నా నొప్పి తగ్గించనూ లేరు. ఒప్పించి మెప్పించనూ లేరు."

424. "నన్ను ఎవరూ తిట్టి ఏడిపించలేరు: కొట్టి ఏడిపించలేరు. వాళ్ళ మంచితనంతో ఏడిపించగలరు."

425. 'నేనొకటి అడుగుతాను, దాచకుండా చెప్తావా?

"దాచటమా? అది నాకెప్పుడూ లేదు. పంచటమే తెలుసు."

426. "నిన్ను దూషించాలంటే మాత్రం సామాన్యమా ? ఈ ఊరివాళ్ళందరూ అదృష్టవంతులే."

"ఎప్పుడూ అదృష్టవంతులే. ఏదో రూపేణా స్మరణ ఎప్పుడూ ఉంది. ఆనాడూ, యీనాడూ. అయినా దేనికీవాళ్ళు కర్తలు కానప్పుడు వాళ్ళననేదేముందీ?"

427. 'ఈ కుటుంబం వల్ల (అంటే మాతో ఉండటం వల్ల) నీ కేమన్నా ఆటంకం కలుగుతుందా?'

"నాకు దేనివల్లా ఆటంకం లేదు. ఇప్పుడు ప్రత్యేకించి వచ్చిందీ లేదు: ఒకప్పుడు లేనిదీ లేదు."

428. అమ్మ కాసేపు కూర్చుని పడుకున్నారు.వాళ్ళు అట్లాగే అమ్మను చూస్తున్నారు. ఏమీ పలకరించలేదు. అమ్మ మాట్లాడనూ లేదు. అమ్మ ఆ పడుకోవటం దాదాపు ఒక గంట గడిచాక లేచారు. అది నిద్రా, కళ్ళు మూసుకుని మేల్కొని ఉండే పడుకోవటమూ,అంటే- చెప్పలేను. ఎందుకంటే మధ్యలో హైమ వచ్చి చిట్టీ-బొట్టు పెట్టుకుని వెళ్తున్నప్పుడు కళ్ళు తెరిచి అక్షతలు తీసుకుని చల్లి మళ్ళీ కళ్ళు మూసుకున్నారు.

429. అమ్మ కళ్ళు మూసుకుని పడుకున్నారు. నాన్నగారు మాట్లాడుతూ -'నిద్రపోతున్నావా? మెలకువా?' అమ్మ కళ్ళు తెరిచి చూశారు.

430. శాస్త్రిగారు అమ్మ మంచం దగ్గర చాప మీద పడుకున్నారు. రాత్రల్లా ఆయన 'అమ్మా-' అన్నప్పుడల్లా అమ్మ 'ఆఁ'- అంటూనే ఉన్నారు.

431. అమ్మ రాత్రిపూట నిద్రపోతున్నట్లే పడుకుంటారు. కానీ ఎప్పుడు పిలిచినా పలుకుతూనే ఉంటారు.

432. 'కొంతమంది- అమ్మ మాట్లాడదు- అంటారు.'

"ధ్వని మీకు వినపడుతుంది అనుకున్ననాడు మాట్లాడుతా వినపడుతుందని అనిపించనప్పుడు మాట్లాడను."

433. 'ఒంటరిగా ఉన్నప్పుడు నీకు ఏమనిపిస్తుందమ్మా'

"ఏఁవీ అనిపించదు. నాకెప్పుడూ ఒంటరిగా ఉన్నట్లు తోచదు. పదిమందిలో ఉన్నట్టే అనిపిస్తుంది. ఇప్పుడేకాదు నేను ఒక్కదాన్నే ఉండే ఆరోజుల్లో కూడా."

434. 'నువ్వు(ఇలాంటప్పుడు) ఎలాగ నవ్వగలవమ్మా?'

"ఇందులో ఏముందీ? అంతా నవ్వుతూనే - ఆటల్లో దెబ్బతగిలితే

ఏమనుకుంటాం? అరటిపండంటాం.- ఇదీ అంతే."

435. "నాకంతా శిశువులే గానీ శిష్యుల్లేరు."

436. 'ఇదేమిటమ్మా - అంత పసుపు రాచుకున్నావూ?'

"నేనెప్పుడూ చూలింతనూ బాలింతనూ కదమ్మా -"

437. 'మీ సాధన ఏమిటమ్మా?'

"బిడ్డల్ని కనటమే. (పుట్టినవారందర్నీ తన బిడ్డలనుకోవటమే. చెట్లు పుట్టలూ - సర్వమున్నూ.)"

438. "మూడుఫోన్ల పిల్లవాడ్నికన్నా -గుంటూరులో... కొత్తపేటలో...ద్వారకాబాయి హాస్పిటల్లో. ఉజ్జా ఉజ్జా అని ఏడవకుండా ఇల్లా ఇల్లా అని ఏడుస్తున్నాడు."

439. "ఒక లక్షమంది పిల్లలుంటే అందరికీ 'రహీ' అని పేరు పెట్టుకుని ఒక్కసారి 'రహీ' అందులో ఒక పిల్లవాడిని పిలిస్తే అందరూ ఒక్కసారి 'ఓయ్.' 'ఓయ్'-అని పలికితే -అబ్బా! అప్పుడెట్లా వుంటుంది?"

440. "మిమ్మల్ని చూస్తే ఏమనిపిస్తుందంటే - ఇక్కడే పుట్టారు. పెంపుడిచ్చా ననిపిస్తుంది గానీ ఎక్కడో పుట్టారు; ఇక్కడికి వచ్చారని పించదు."

441. 'మీ రెవరమ్మా?'

"అమ్మను నాయనా -"

'ఎవరికీ?'

"నీకూ, మీకూ, అందరికీ-"

442. "అయ్యో! పిచ్చి తల్లీ -నువ్వే యిట్లా అనుకుంటే ఇంక నేనేం అనుకోవాలీ?- ఇంకా నీ పిల్లలు ఒకే రకం నాపిల్లలు చూడు- ఎంతమందో నానారకాలూ...."

443. "సంతాపం లేనిదే సంతానం."

444. 'రేపు కూడా ఇట్లాగే (కురుస్తూ) ఉంటుందంటావా?'

"నాకెట్లా తెలుస్తుందీ?"

'నీకు తెలుసుగా అమ్మా - చెపితే ఏమిటి నష్టం?'

"చెప్పకపోతే కష్టం మాత్రం ఏముంది ?"

# అమ్మ ఎఱుక

445. 'బృహస్పతి సిద్ధాంత మెక్కడైనా ఉన్నదా అమ్మా?'

"ఉంటయ్ నాన్నా - పీఠాధిపతుల దగ్గర ఉంటయ్. ఉంటే కంచిలో ఉండి ఉండాలి"

446. 'ముసుగు పెట్టుకుని పడుకున్నప్పుడు అరవిందాశ్రమ 'మదర్'తో యేదో మాట్లాడేదానివట?'

"దాని కేమొచ్చెలే-"

447. "నేను పుట్టినప్పుడు-నువ్వూ నాన్నా 'ఇక్కడ' బెండకాయలు కొన్నారు కదూ?... 27వరోజున జరిగింది బారసాల."

448. గిన్నెలో మిగిలిన అన్నం భరద్వాజకూ, నాకూ వరలక్ష్మికి పెడుతూ-"డోకు వచ్చేటట్లున్నదా?"

'తిప్పుతున్నది.'

అన్నం పెట్టటం అయాక స్నానం చేస్తూ -

"ఏం వాంతి అయిందా?"

'అయిందమ్మా-'

449. గుంటూరునుంచి మధ్యాహ్నం వచ్చిన ఇద్దరన్నయ్యలు-

'వెళతాం అమ్మను చూసి-' అన్నారు.

ఆ మాట అమ్మకు చెప్తే అన్నారు-

"ఈ రాత్రికి ఉండి రేప్పొద్దున్నే వెళ్ళమనాన్నని చెప్పు సంతోషిస్తారు." వసుంధర చెప్పింది.

'అమ్మ దయ' అంటూ నమస్కారం చేశారు.

450. వాళ్ళు పూజ చేసుకొని రాళ్ళ ఉంగరం అమ్మ చేతికి పెట్టారు. అమ్మ అన్నయ్య చెయ్యి పట్టుకుని చూసి

"దెబ్బ తగ్గిందా?"-అన్నారు.

రెండు సంవత్సరాలనాడు సుబ్బారావు అన్నయ్య అమ్మకు చెప్పారు సోడా బుడ్డి పగిలి ఆయనకు దెబ్బతగిలినట్టు. అమ్మ అడిగేరు.

451. "ఇప్పటినుంచే (బస్సుకోసం) ఎందుకు అక్కడ పడి ఉండటం - అయినా నాకెందుకూ అనవసరంగా మాట?"

452. 11-10-62 ఉదయం బెజవాడ వారితో -

"పర్చూరులో సుబ్బారావు అనేవాడుంటాడు. వాడు బాగా పాడతాడు."

సుబ్బారావు సాయంత్రానికి రానే వచ్చాడు.

453. ఉదయం గం.8.30ని.లకు-

"కాశీరావు అన్నయ్యకు 20 రోజులు సెలవు పెట్టి రమ్మని రాయి. ఎంతో దూరాన ఉన్నాడు. దగ్గరవున్నవాళ్ళకేంగానీ వాడికి రాయమ్మా-"

మధ్యాహ్నం రెండుగంటలకల్లా అన్నయ్య వచ్చారు.

454. శేషగేయాలను సుబ్రహ్మణ్యం అన్నయ్యను చదవమంటూ-

"నువ్వు ఆఫీసులో కోపం వచ్చి మాట్లాడుతావే - అట్లా చదువు-"

'వింటున్నా వన్నమాట.'

455. కిష్టయ్య తాతగారికి మోకాళ్ళలోంచి నీరు వస్తున్నదని కామేశ్వరరావుగారు చెప్పారట.

"అట్లావున్నప్పుడు ఇన్నాళ్ళుండడు. ఆ రోజే (శనివారం) పోయి వుంటాడు."

'అట్లా అనకు, మా తల్లీ -'

"ఏమో మరి నాకట్లా అనిపిస్తాంది."

తరవాత బుధవారంనాడు సత్యనారాయణగారు వచ్చి కిష్టయ్యగారు పోయినారనీ, ఆనాటికి అయిదురోజులనీ- చెప్పారు.

456. కమల దుర్గాష్టమినాడు ఎఱ్ఱచీరా రవికా సమర్పణ చేసింది. అమ్మను శంఖు చక్ర త్రిశూల కిరీట ధారిణియై అలాంటి చీర ధరించి వస్తే-

చూడాలనుకుంది. అమ్మ ఆ రోజు నవమి అయినా సరిగ్గా ఆ చీర కట్టుకుని అలాగే వచ్చారు.

457. 'నేననుకున్నాను- మా చెల్లెలి కూతురుకి పెండ్లికుదిరితే, పెండ్లి కొడుకునూ అమ్మాయినీ దర్శనానికి పంపిస్తానని --'

"కుదిరిందా?" (ఏమయిందీ అనరు;)

'ఆఁ-'

458. అమ్మ రుక్మిణక్కయ్యతో -

"మీ అమ్మాయి ఎట్లా వున్నాది? ...... పథ్యం చేస్తున్నావా?"

'చేస్తున్నానమ్మా - అవీయివీ ఏమీ తినటంలేదు. పథ్యంగానే తింటున్నాను.'

"పథ్యంగా నువ్వు తింటున్నావని నేను అనుకో ననుకో. ఇవ్వాళ ఏం వేసుకుని తిన్నావు? చింతకాయ పచ్చడీ, పప్పువేసుకున్నావా?"

నవ్వుతూ- 'వేసుకున్నానమ్మా.'

459. సుబ్బయ్య: రేపు పండగ కదా-బృందానికి సెలవు యివ్వమంటావా? లేక పని చేయించమంటావా?

అమ్మ : నాకేం తెలియదు.

సుబ్బయ్య : అట్లా అయితే ఎట్లా గట్టిగా చెప్తే బాగుంటుంది.

అమ్మ : ఇట్లా ప్రతి విషయంలోనూసలహాకు వస్తున్నావా?చేసేవాళ్ళు వాళ్ళు; చేయించేది మీరు. మీ కెట్లా యిష్టమైతే అట్లా చేయండి - ఇందులో నా సలహా ఏముందీ?

సుబ్బయ్య యీ సమాధానంతో వెనక్కు తగ్గి వెళ్ళాడు.

అమ్మ : (నవ్వి) సుబ్బయ్య వచ్చింది - యీ మాట అడగటానికి కాదు. ఈ వంకతో వచ్చాడు విసురుగా.

466. ఇవ్వాళ పన్నాల రాధాకృష్ణశర్మ అన్నయ్య వ్రాసిన 'అశ్రులహరి' అన్న పుస్తకం అవిష్కరణ. ఉదయమే అన్నయ్య వస్తారు. అనుకుంటే- ఇంతవరకూ రాలేదు. గోపాలకృష్ణ అన్నయ్య అమ్మతో ఆ మాట అంటే -

"వాడక్కడ(అప్పికట్లలో) చేస్తూనే వున్నాడు అశ్రులహరి. పేరుకు తగ్గ పుస్తకం. వస్తాడులే-"

అలాగే అన్నయ్య సాయంత్రానికి వచ్చారు.

461. మహారుద్రాభిషేకం జరపటానికి ఆహూతులయిన 11 గురిలో 9 మందే వచ్చారు. మిగిలిన ఇద్దరికోసమూ ఆదుర్దా పడుతుంటే - అమ్మ అన్నారు.

"కాసేపాగితే వాళ్ళే వస్తారేమో-"

అలాగే జరిగింది. మహాన్యాస పఠనం జరుగుతుండగా అనాహూతులిద్దరూ ఆహూతు లొకరూ వచ్చారు.

462. ఒక అబ్బాయి అమ్మకు బంగారు బొట్టు తెచ్చాడు.

"ఎందుకూ?" అన్నారు అమ్మ.

అబ్బాయి మాట్లాడలేదు తిరిగి ఇవ్వబోతే-

'వద్దు -మీకే తెచ్చాను.' అన్నాడు.

అమ్మ నవ్వి- "ఎందుకూ?పరీక్షకు వెళుతున్నావా?" అన్నారు. అమ్మ అసలు విషయం తెలుసుకున్నారని ఆ అబ్బాయి కూడా నవ్వుతూ -

'అవునమ్మా-'అన్నాడు.

"ఇదివ్వటానికీ నీ పరీక్షకు సంబంధం లేదు. "

463. "ఎవరో వచ్చినట్లున్నారు. చూడు-" అని అమ్మ.

'వచ్చారమ్మా- నూతి దగ్గర కాళ్ళు కడుక్కుంటున్నారు.'

"ఎవరూ?.....గుడ్డాయనా, కళ్ళులేనాయనా?"

హనుమయ్య వెళ్ళి చూసి -'అవునమ్మా- కళ్ళు లేనాయనే.'

464. క్రోసూరి కరణంగారు పూజ చేయబోతూ-

'నా ఇష్టదైవం సీతాదేవిగా భావించి పూజచేసుకుంటా'-ననుకున్నారు.

అమ్మ స్నానంచేసి వారింట్లో పెద్దపటంలోని సీతాదేవి చీరవంటిదే కట్టుకొచ్చారు.

465. పొన్నూరు నుండి సుబ్బారావట వచ్చారు. వస్తూనే అమ్మ మంచం మీద కాళ్ళవైపు పడిపోయారు.

"చాలించు సుబ్బారావు - నీ గురించి నాకు తెలీదూ?"

అతడు సరిగ్గా కూర్చుని- నాకు ఏమీ తెలియదమ్మా' అవి సంచిలో నుండి అద్దమూ, దువ్వెనా,కుంకుమభరిణా, పాదుకలూ, కొంతడబ్బు, విసనకఱ్ఱ, జందెమూ తీసి అమ్మ మంచము మీద పెట్టారు. 'నీ కోసం తెచ్చాను' - అంటూ.

"ఎట్లా తెచ్చావు?"

..... ....... ...... ........

"అమ్మ మీద పోట్లాడి జాతర చేసి...... ఆ డబ్బుతోనేగా ఇవన్నీ కొన్నది?"

........ ......... .........

"ఇవన్నీ నేను తెమ్మనమని చెప్పేనా?"

'నాకు తోచిందీ, తెచ్చాను.'

"సరే- ఇది చాలునాకు" -అని కుంకుమ పెట్టుకుని అన్నీ తిరిగి ఇచ్చేశారు.

466. రామకృష్ణను అమ్మ 'సదానంద్' అన్నారు.

అయ్యంగారిని 'ప్రమాదానంద్' అన్నారు.

(ఈయన హెచ్చుగా విమర్శిస్తుంటారు సంస్థలను)

467. వేదాంతంవారి కోడలు జిలెళ్ళమూడి వస్తూ బాపట్లలో బట్టల షాపుకు వెళ్ళి చూసి - నల్ల స్పన్ సిల్కు చీర కొనుక్కుందామనుకున్నారు. కాని ఆనాడు కొనలేదు. జిలెళ్ళమూడి వెళ్ళినప్పుడు అమ్మ యిచ్చిన చీర చూసి ఆ అమ్మాయి -

"నా మనస్సు గ్రహించి అమ్మ ఈ చీర యిచ్చింది" అన్నారు.

468. రెండో శ్రావణ మంగళవారం. బాపట్ల నుండి ఇద్దరక్కయ్యలు వచ్చారు. అందులో చిన్నామె ఎం.ఏ. విశాఖపట్నంలో పి.హెచ్.డీకి పని చెయ్యడానికి వెళ్తున్నారు. వాళ్ళకు తెలిసినవాళ్ళు అమ్మను గురించి చెపుతూండేవారట.

ఒకరోజు కలలో అమ్మ బులాకీతో కనిపించారట. విశాఖపట్నం వెళ్తూ అమ్మను చూసి వెళ్ళాలని వచ్చారు. అమ్మ స్నానం చేసి తెల్లచీర కట్టుకుని హాల్లోకి వచ్చారు. అమ్మను చూసి ఆమె తనకు 'కలలో కనుపించిన అమ్మా కాదా?' అన్న సందిగ్ధావస్థలో పడ్డారు. ఇంతలో అమ్మయేదో పని ఉన్నట్లు లోపలకు వెళ్ళి బులాకీ పెట్టుకుని హాల్లోకి వచ్చారు. ఆమె సందేహం తీరిపోయింది. సందేహనివృత్తి కావటంతో దుఃఖాన్ని ఆపుకోలేకపోయారు. అమ్మ దగ్గరకు తీసుకుని ఓదార్చాక రెండు పాటలు పాడారు.

469. చీరాలలో శ్యాంసన్ (లేడీడాక్టర్) ఆస్పత్రికి వెళ్ళినప్పుడు- పులిహోరా, దోసకాయ పప్పూ, అన్నమూ తీసుకు వెళ్ళారమ్మా. అవి ఆ డాక్టరుగారికి యిష్టమట.

470. ఆయన టెంకాయ కొడుతూంటే నీళ్ళన్నీ క్రింద బోయినై. అమ్మ నవ్వుతూ - "అసలు ఆయనుద్దేశ మేమిటంటే - ఒక్క చుక్క గూడా పోకుండా కొట్టాలని. అన్నీ క్రిందనే పోయినై." ఆయన నవ్వారు.

471. "దూరశ్రవణ దర్శనాదులు ఆధ్యాత్మిక శక్తికి అత్యల్పాలు."

# అమ్మ - తన మాటలలో

472. "తోలునోరు కాదు కదూ, కనుక తాలు మాట లేదు."

473. "ఈ కలిలో నా కాకలిలేదు."

474. "శుక్ల శోణితాల కేది కులమో అదే నా కులం."

475. "అమ్మ పేరు ఆధారం (భూమి)
నాన్న పేరు అవకాశం (ఆకాశం)."

476. "యథార్థమే నా స్థితి."

477. "నా గాథ వెలలేని గాథ."

478. "అది నా విధి. విధి అంటే విధానమే."

479. "గుణభేదమే లేని నాకు కులభేద మేమిటి?"

480. "నాకు నేర్పు గల ఓర్పు అక్కర్లా.
సహజమైన ఓర్పు కావాలి."

481. "నా జీవితమే అబద్ధమూ; చరిత్ర బద్ధమూ."

482. "ఎన్ని - వచ్చినా వాటికీ మనస్సుకూ ఏమీ సంబంధం లేదనీ చెప్పటం కోసమే నా యీ పెళ్ళి."

483. 'జన్మ దినోత్సవానికా? అప్పుడా వూరి వాళ్లు వస్తారమ్మా - నాకు వాళ్ళను చూడటానికి మొహం చెల్లదు.'

"లోకంలో వుండి అమ్మను చూడలేక పోవచ్చును గానీ అమ్మ దగ్గరుండి లోకం చూడవచ్చును."

484. "నేనేం చదువుకోలేదు. పొయ్యి, చీపురు, రోలు-రోకలి, కత్తిపీట - ఇవే నా వేదాలు. పంచమవేదం - చేట."

485. "త్రిగుణాలు - ఉప్పు, కారం, పులుపు."

486. "వింటే విమర్శ కాని కంటే విమర్శ లేదు."

487. "హృదయం తెలుసుకోటానికి వాక్కుతో పనిలేదు."

488. "నేను ఆహారాన్ని వదల్లేదు. నన్ను ఆహారం వదిలింది."

489. "రాగద్వేషాలు కూడా రహితమైనదే అనసూయ."

490. "అందరికీ సమ్మతమైనదే నామతం."

491. 'మేమంతా ఎవరు? నువ్వు చెప్పు-'

"మీరంతా నేనే, మీదంతా నేనే, ఇదంతా నేనే-"

492. "నేను గురువును కాను. మీరు శిష్యులు కారు.

నేను మార్గదర్శిని కాను, మీరు బాటసారులు కారు.

నేను తల్లిని (అన్నీనీ), మీరు బిడ్డలు."

493. 'బ్రహ్మచర్యమంటే ఏమిటమ్మా?"

"నాకేం తెలుస్తుంది నాయనా - నేను నిండు గర్భిణిని."

494. ఒకరు అమ్మ సన్నిధిలో తమ కుమారునికి ఉపనయనం చేసుకుంటూ-

"నాందీముఖం పంక్తికి బ్రహ్మచారులు దొరకలేదమ్మా - ఏం చెయ్యమంటారు."

"అయితే, నేనే వస్తున్నాను పదండి" - (అని అమ్మే కూర్చున్నారు.)

495. 'నీవు సాక్షాత్తు రాజరాజేశ్వరివమ్మా-'

"మీరు కానిది నేనేది కాదు. నాయనా-"

496. "నేను నేనైన నేను.

నేను అంటే అనుసూయను అని కాదు.

అన్ని నేనులూ నేనైన నేను."

497. "నాది తెలిసీ తెలియని స్థితి."

498. "నాకేం తెలుసో తెలియదు."

499. "మీలో నేను దైవత్వం చూస్తాను.

నాలో మీరు మానవత్వం చూస్తారు."

500. "ఎప్పుడో కనిపెంచాను.
ఇప్పుడు కనిపించాను."

510. "మీరు హిందూమత సాంప్రదాయాలు పాటిస్తారా?"
"నేను ఒకటంటూ ఏదీ పాటించను."

502. "మీరు ప్రార్థన చేస్తారా?"
"మీరంతా నేననుకోవటమే నా ప్రార్థన."

503. "మీరు పూజ చేస్తారా?"
"మీరు కావలనుకోవటమే నా పూజ."

504. "స్వశక్తి అన్నది నేనే."

505. "నాకు మరుగూ లేదు? మఱుపూ లేదు."

506. "నేను ఎప్పుడూ వాళ్ళ వాళ్ళ స్థాయిలోనే మాట్లాడతాను."

507. "ఆరోగ్యం ఎప్పుడూ లేదు.
కులాసా లేకుండానూ లేదు."

508. "చెడ్డవాళ్ళను చూస్తే జాలేస్తుంది.
మంచి వాళ్ళను చూస్తే ఏడుపొస్తుంది."

509. 'జవాబుల కోసం వెతుక్కోవమ్మా-'
"ఎక్కడైనా పెట్టి మరిచిపోతే గదూ?"

510. "ఒక దోమ వచ్చి ముద్దు పెట్టుకున్నట్లిక్కడ పట్టుకుంది." అన్నారు. బుగ్గ దద్దురెక్కింది.

511. "నాకందరూ ముద్దొస్తారు. చక్కదనం వల్లనా? - కాదు. పందిపిల్ల కూడా ముద్దొస్తుంది. పేను చూడండి - ఎంత మృదువుగా వుంటుందో దాని శరీరం. వాళ్ళకు నా మీద వుండే ప్రేమవల్లా కాదు నన్ను ప్రేమించని వాళ్ళు కూడా ముద్దొస్తారు. పసితనం ముద్దొస్తుందా అంటే-వృద్ధులూ వస్తారు. అన్నదానం చేసేవారు ముద్దొస్తారు."

512. "నీ మంచితనం ఏడిపిస్తుంది నాయనా-
నన్ను ఎప్పుడైనా అదే ఏడిపిస్తుంది.
కొట్టీ తిట్టీ - ఎవరూ ఏడిపించలేరు."

513. "నా పాట్లు మీకు తెలిస్తే నన్ను పాడమని అడగరు."

514. "పాడతా, పాడతా .... ఎప్పుడో ఒకనాడు పాడతా - అప్పుడు అందరూ వినేటట్టు పాడతా."

515. "దండగా కట్టనూ, ఊడదీయనూ, కట్టనూ ఊడదీయనూ - ఇదేగా నేను చేసే నిర్వాహకం-"

516. "మమకారమంటే మిమ్మల్ని దగ్గరకు తీయటమూ, మీరు కావాలను కోవటమూ అనుకో - దీనిని మమకారమనూ, అనురాగమనూ - 'అయితే, నీ విరాగ మేమిటి?' - అనేవాళ్ళతో నా పోట్లాట ఏమిటో తెలుసా?
సర్వత్రా అనురాగమే విరాగమని-"

517. "ఇది మమతల గర్భగుడి. విరాగిని కాదుగా నాన్నా - కాబట్టి అందరినీ చూసుకోవాలనే వుంటుంది."

518. సతులకై కొన్నాళ్ళు - సుతులకై కొన్నాళ్ళు .... అన్న త్యాగరాజకీర్తన విని-
"నేనిప్పుడు అదే స్థితిలో ఉన్నాను. ఈ సంతానం కొరకేగా నాకిదంతా-"

519. "అయితే మేము (నీ పిల్లలం) కానట్లా?"
"అయినట్టూ కానట్టూ - అదీ నట్టే, ఇదీ నట్టే -"

520. "కుంకుళ్ళు వేసి వుంటావు. లేకపోతే నేను కనబడను. కుంకుళ్ళ గుర్తు చేదు, నేనే...."

521. "పాపం, వాళ్ళు వస్తున్నారమ్మా-"
"రానీయి - పాపం ఏముందీ?"
గడప దాటి లోపలకు వెళ్ళుతూ -
"నన్ను చూడటమే వాళ్ళకు పుణ్యం."

522. "ఇక్కడకు వచ్చిన వాళ్ళు ఎందు కేడుస్తారు?"

"పుట్టినప్పుడు ఏడుస్తారు, మళ్ళీ ఇక్కడికి వచ్చినప్పుడు ఏడుస్తారు. అంటే జీవితంలో నూతనత్వం కలిగినందుకు."

523. "నవ్వు సంతోషమూ కాదు.

కన్నీళ్ళు దుఃఖమూ కాదు."

524. 'ఎంత పుణ్యం చేసుకున్నామో, మిమ్మల్ని చూడగలిగేం.'

"నన్ను చూడటమే పుణ్యం."

525. 'ఏకాంతమంటే?'

"రెండు లేనిది...."

526. "ఎవరినీ నేను రమ్మనమనీ పిలవను; వెళ్ళమనీ చెప్పను. వాడొప్పుకుంటే ఈ క్షణాన ప్రసాదం యిస్తాను. నాకేమీ అభ్యంతరం లేదు."

527. 'ఆ శుభలేఖ అమ్మ పిలుపు అన్నమాట.'

"అఁ - అమ్మ పిలుపా? కాదు - అది పుట్టుకతోనే వుంది."

528. "రమ్మనమనే పిలుపు ఎప్పుడుంటుందో వెళ్ళమనీ అప్పుడే చెప్పవలసి వస్తుంది. నాకెందుకు యిదంతా? ఎవడికి ఎన్నాళ్ళు ప్రాప్తమో అన్నాళ్ళూ ఉంటాడు."

529. 'మీ ద్వారా కూడా పరిపూర్ణత పొందవచ్చా?'

"నా ద్వారా పొందట మేముంది? నేను అమ్మనే. అమ్మను కనుకనే స్వతంత్రం. అమ్మ వల్ల పొందట మేముంది? అమ్మను చూడటమే-"

530. 'మీ దయ ఉంటే ఈ ఒడుదుడుకు లుండవు.'

"నా దయ వున్నా ఒడుదుడుకు లుంటయ్. నా దయ ఒడుదుడుకులే నాన్నా-"

531. "మంచీ చెడూ; ఇష్టమూ అయిష్టమూ-

నా అనుభవరీత్యా లేవు."

532. 'అమ్మకు లెక్క కూడా వున్నదే?'

"అమ్మ లెక్కలేనిది గానీ, అమ్మకు లెక్క వున్నది. అంటే అమ్మ తుదీ మొదలు లేనిదనీ, సర్వమూ అమ్మేననీ, అమ్మకు మాత్రం అంతా లెక్కేనని-"

533. "అంతా నేనే అనుకుంటున్నప్పుడు ప్రత్యేకించి భక్తులు ఎవరూ?"

534. "సహజంలో నుంచి విశేషాన్ని విడదీసి, మళ్ళీ దాన్ని సహజం చేసుకోవాలి."

535. '(ఇవి) శ్రుతులలోవే గదమ్మా?'

"శ్రుతులు చదువుకోలేదుగా? స్మృతే."

536. 'నువ్వెవరివో చెప్పమ్మా-'

"వల్లగాని మిట్టప్రదేశం"

537. 'అమ్మా అమ్మకు తానే అయివుండటానికి కంటే లోకం వైపు చూడటానికే ఎక్కువ కాలం ఖర్చౌతున్నదమ్మా-'

"ఈ వ్యాపారంలో లాభనష్టాలు లేవు నాయనా-"

'నష్టమని కాదమ్మా - యోగులు సహజ సమాధిలో ఉంటారంటారు. మేము కొబ్బరికాయలు కొట్టి హారతి యిచ్చి - మిమ్మల్ని మావేపు త్రిప్పుకుని అకాలంలో సమాధి భంగం చేస్తున్నాం కదా - అని'

"నేను మీలో నన్ను చూసుకోనప్పుడుగా చిక్కు?"

# సంప్రదాయాలూ - అమ్మ

538. "అన్నీ ఆచరించేవాడికి ఏదీ అవసరం లేదు కానీ ఏదీ ఆచరించలేని మనకు ఇవన్నీ అవసరమే. ఏముందిలే - అని తీసెయ్యకూడదు. ప్రతీదీ చెయ్యాల్సిందే-"

539. 1964అక్టోబరులో ఒకనాడు అమ్మ ఆవరణలో అందరితో- "నేను మిమ్మల్ని ఏమన్నా అని వుంటే, మీ మనస్సులను నొప్పిస్తే క్షమించండి-"అన్నారు. మర్నాటి దినపత్రికలో ఆనాడు ఢిల్లీలో క్షమార్పణోత్సవం జరిగినట్లు పడింది.

540. "వేషభాషల్లో ఏముంది?- అనుకుంటాం కానీ అందులో కూడా వున్నది. బట్టకట్టుకునేది ఎందుకూ?- ఒళ్ళుదాచుకోటానికేగా? ఆ వుద్దేశం లోపించినప్పుడు బట్టలు వున్నా ఒకటే, లేకపోయినాఒకటే. ఈ పట్టుచీర ఒంటికిచ్చిన నిండుదనం ఆ టెర్లిన్ చీర ఇవ్వగలదా?"

541. "కుడీ ఎడమ కట్టుబాటుకోసం పెట్టారు గానీ- ఒక భాగం ఎక్కువనీకాదు. ఇంకొకభాగం తక్కువనీకాదు."

542. 'అమ్మా ఈ బొట్టెందుకూ, ఈ నివేదనలెందుకూ?'

" ఏది మటుకు ఎందుకూ? ఎందులో మటుకు ఏముందీ? ఉందనేవాడికి ఉంది."

543. బామ్మ ఉపవాసం వుంటే -నేనూ వుండి వంట చేసి పెట్టేదాన్ని."

'అయితే నువ్వు గూడ వుండేదానివన్న మాట. నివేదన ఎవరికి పెట్టేదానివీ? నువ్వేగదా మరి?'

"నేనేమి చేసేదాన్నికాదు బామ్మకోసం-"

544. వెనక అమ్మ పూళ్ళవాళ్ళు వీళ్ళూ వస్తే యీ నామం చెప్తుండేది:

"సీతారామ్ సీతారామ్ జానకిజీవన జయజయరామ్..."

వాళ్ళందరిమధ్య నిల్చుని చెప్పేది.

ఇంకొకటేమిటంటే-

"హరినారాయణ గోవింద, అరుణసారథి గోవింద పురాణపురుషా గోవింద, పుండరికాక్షా గోవింద, హరినారాయణ గోవింద...'

545. 'హరినారాయణ దురితనివారణ పరమానందం భజగోవిందం నారాయణ గోవింద...'

అమ్మ వచ్చి-"ఏఁవిటీ?"

హైమ - 'ఏం లేదమ్మా- నువ్వు నామం చేసేదానివని చెప్తున్నాను.'

అమ్మ - మొదటినామం చెప్పి ....అది నాకు బలే ఇష్టం-అన్నారు.

546. "చచ్చినవాడు తింటున్నాడో లేదో మనకు తెలియదు కదా? మనం పెద్దలందరిని తల్చుకుని ముద్ద అగ్ని హోత్రంలో వేసి తినటం-"

547. "చచ్చినవాడికొరక్కాదిది. బ్రతికి ఉన్నవాడు తన ధర్మం మరవకుండానూ ఈ కర్మా ఇవీనీ-"

548. 'అసలు ఈనోములూ, ఇవన్నీ -ఎందుకమ్మా?'

"అనుక్షణం దైవాన్ని మర్చిపోకుండా ఆరాధించటానికి-"

549. భరద్వాజ : జ్ఞానోదయమయింది ఆమె కేఁవిటి? సమాధిచేద్దాం. బాగుంటుందమ్మా-

అమ్మ: నన్ను గుర్తించటమే జ్ఞానోదయమనేది వారికుండొద్దా? సమాధీ, దహనం ఏదైనా సరే-

550. 'నువ్వు లోపలికిరాగానే (మరణించే బామ్మగారు) కదిలింది.'

"కదలటం చూసే లోపలికి వచ్చాను."

'క్రింద పెట్టించకుండా వచ్చావేం?'

"నాకిష్టంలేదు. నేనున్నట్లయితే దించనిచ్చేదాన్ని కాదు."

551. అత్తగారి క్రతువుకు కోడలు దీపారాధన చెయ్యాలికదా-మందిరంలోకి వెళ్ళి అమ్మ దీపారాధన చేసి వచ్చారు. అలా వెళ్ళినప్పుడల్లా వాకిట్లోనే పాదుకలు విడిచి,దీపారాధన చేసి వచ్చారు.

552. బామ్మగారి మృతశరీరానికి సాష్టాంగ నమస్కారం చేశారమ్మ.

553. సీతాపతి తాతగారు మరణించినప్పుడు అంతా చల్లగా జరిగిపోయింది. అమ్మ 15 నిమిషాలవరకూ చూసి తల దగ్గర దీపం పెట్టమన్నారు. ఎవరో- 'ఇంకా కొంతసేపు చూద్దాం ..(స్ఫురణ వస్తుందెమో)' అన్నారు.

"ఎందుకూ ఇంకా? అయినా దీపం వెలిగించినందువల్ల నష్టమేమిటీ?"

554. దీపావళి పండుగనాడు సీతాపతి తాతగారి ధర్మోదకాలు విడిచేరోజు. ఆనాడు అమ్మమ్మ సుమంగళీ చిహ్నాలు తీసినరోజు. అమ్మ సాయంకాలం తెల్లచీరా తెల్లరవికా ధరించారు. రుక్మిణక్కయ్య బ్రతిమాలినా పట్టుచీర "కట్టుకోలేను రుక్మిణీ" అన్నారు.

555. వసుంధరతో -"నాకు మొదటినుంచి భూదేవంటే ఇష్టం, నీ పేరదే, అందరూ మాకాదేముడూ, ఈ దేముడంటే.... నాకు భూదేవత ఇష్టం."

556. 'గుడ్డలు తడిగా వున్నయ్-'

"అవే ఆరిపోతయ్‌లే. మీకు బాధగా ఉండొచ్చు. నాకేంలేదు. భూదేవత కవన్నీ ఏమిటి?"

557. దుద్దుకూరు అక్కయ్య మెడలో మంగళ సూత్రాల్ని దొంగ తెంపుకు పోయాడు.

అమ్మ ఆమె తలనిమురుతూ.. "బాధపడబోకు-ఇంట్లో వున్నయ్. అది కట్టుకుని వెళుదువుగాని-"

'అవి పోయినందుక్కాదమ్మా బాధ.పోతే మళ్ళీ చేయించుకోవచ్చు. అవి పోయినై, ఆయన ఎట్లా వున్నారో-అని బాధగా వున్నదమ్మా.'

"అట్లాంటి పిచ్చి అనుమానాలు పెట్టుకోబోకు-"

558. మంత్రం బయటికి పోయినచోట గుర్తుకు రాకూడదని చెప్పారుట. అక్కడే గుర్తుకు వస్తుందట.

'ఎట్లా అమ్మా?'

"మలం పోతే మంత్రం గుర్తుకు వచ్చింది. సర్వత్రాగుర్తుండాలి కాని

అంతకంటే ఏం కావాలి?"

559. 'అమ్మా లలితా సహస్రం ఆడవాళ్ళు చేయకూడదంటారు ఎందుకమ్మా? చేస్తే ఏదో ఆహూతికావాలి?'

"అన్నీచెయ్యొచ్చమ్మా మనస్సే ఆహూతిచేస్తే-ఇంకా వేరే ఆహూతి ఎందుకు?"

560. "అమ్మవారు నెత్తి అణుస్తుందనీ అదనీ ఇదనీ -అంటారు. అదేమిలేదని నేననుకుంటాను.తల్లి నెత్తి అణుస్తుందా?"

561. తెనాలి స్వాములవారు వచ్చి-

'వర్ణాశ్రమవిధాయినీ' అన్నారు.

అమ్మ 'అందరిల్లు'లో వర్ణాశ్రమాలు పాటించడంలేదని ఉద్దేశ్యం. అమ్మ అన్నారు; దాని పక్కనే వుంది కదా- 'ఏకాకినీ, భూమరూపా, నిర్ద్వైతా ద్వైతవర్జితా...' అనీ-

# మానసీ - మాధవీ

562. "గొప్పకార్యం చేసినా కొద్దికార్యం చేసినా ఒకటే. నడిపించేది ఒకటయినప్పుడు నీ గొప్పతనం లేదు.-"

563. "విసనకఱ్ఱను చూసినా ఏ తడపను చూసినా అవి దేనిలో నుంచి తయారయినాయో, ఆ చెట్లూ, ఆ భూమీ, వాటికా రూపం సంకల్పించిన వాడూ నాకు గుర్తొస్తారు."

564. "ఏ దిక్కు తలాపిగా పడుకోబెడితే ఏముందర్రా? అన్నిటికీ దేముడే దిక్కు. నాకవేం లేవురా - నేను దగ్గరే వుంటాను. ఆ దోషమేమి వుండదు .... ఇందాకట్నుంచి దగ్గరే కూర్చున్నానుగా?"

565. సీతాపతి తాతగారు తన తల్లి పేరు మరణించిన భార్యపేరూ చెప్పుకుని దీపారాధన చేయించారు. అనంతపద్మనాభవ్రతం వాయనం అమ్మకు ఇచ్చుకోవాలని- తనే అనంతపద్మనాభస్వామినని అమ్మ అంటే ఇస్తానన్నారు. సరే అన్నారు అమ్మ.

"నేనే అనంతపద్మనాభస్వామిని-"

ఇది చెప్పి అన్నారూ, "అప్పుడు ఆ బ్రాహ్మడు అనలేదూ? అట్లాగే మాట అంటే ఏం బోయిందిలే అని నేనూ అనేశాను."

566. 'మీ ధ్యేయమూర్తు లెవరమ్మా?'

"నా ధ్యేయమూర్తులు మీరే-"

567. 'అనంతలక్ష్మి మీకు బంధువులౌతా రనుకుంటా?'

"పేరే అనంతలక్ష్మి - ఇంకా ఎందుకు కాకుండా వుంటుంది?"

568. ఏమిటండీ (ఈ పందెంతో) మళ్ళీ పాము కరిచిందటండి -మీరు పండిస్తారని పోయినా.'

"ఎటూ పండుతావులే-"

569. 'అమ్మా - నీ ముసుగు తొలిగిందమ్మా-'

"(తాము) ముసుగులో ఉండి ఇంకా (నాకు) ముసుగు కావాలంటారేమిటి?"

570. "నన్ను చూడటానికి మీరు రావాలి.
మిమ్మల్ని నేను చూసుకోగలను."

571. "ఇదివరకు చూశాను (ఈయనను)"
'నువ్వు చూడని వాళ్ళెవరమ్మా?'
"చూడనివాళ్ళు కనపడ రిక్కడ."

572. దేవీ పురాణంలో వున్నదమ్మా - సుగంధ ద్రవ్యాలు నీ కోసమే పుట్టినై -అని'
"అయితే దుర్గంధమో-"

573. "ఇది (ఆ తప్పు) మీదనిపించదు నాకు. మీకు ఆ స్వభావాన్నిచ్చి ఆ ప్రేరణ చేసిన శక్తి దనిపిస్తుంది. తల్లికి తప్పే కనిపించదు."

574. "అక్షరాభ్యాసం చేయడానికి అమ్మ 'ఓం' రాశారు ఆ అబ్బాయి అమ్మ వైపు చూస్తూ కూర్చున్నాడు.
చూడనీ ఇద్దరూ ఒకటేలే...."

575. 'అన్ని విషయాలు నీవి అని తెలిస్తే నీ అంతం తెలిసినట్టే.'
"నాకు అంతు తేల్చాల్సింది మీరేగా? నాకు అంతు అంటూ ఉన్నదని నాకు తెలియదు; ఉంటే మీకేగా?"

576. 'కర్మకు ఆధారమేమిటి?'
"కర్త"
'అయితే మానవులు చేసే దుష్కర్మ. సత్కర్మలకు ప్రేరణ ఇచ్చేది కర్తే నంటారా?'
"అవును కర్త ప్రేరణ వల్లనే-"
'మరి మానవులు దుష్కర్మ చేస్తున్నప్పుడు,దుష్కర్మ -సత్కర్మలు రెండింటికి కర్తలైన తల్లివి -మీరు ఈ బిడ్డల మనసులు మార్చి సన్మార్గంలో పెట్టవచ్చు కదా?'

"నాకు దుష్కర్మ కనపడితేగా?"

'మీరు మా మనస్సులు తిప్పి అన్నీ సత్కర్మలే చేయిస్తే జగత్తులో ఈ సంక్షోభం తప్పుతుంది కదా?'

"అవసరమైనప్పుడు తిప్పుతాను-"

577. 'అమ్మా -కొందరికి బాధాపూరితమయిన జీవితాన్ని ప్రసాదిస్తావు.మఱి కొందరికి సుఖప్రదమయిన జీవితాన్ని ప్రసాదిస్తావు. నీకు నిజంగా పక్షపాతం ఉన్నదమ్మా...'

"అవసరం విలువయినది నాన్నా-పూలు మాలగా కావాలనుకుంటున్నాను. కనుక దారంతో బిగించక తప్పదు. మాలను ధరించాలనుకుంటున్నాను కనుక బిగిస్తాను."

మునిమాణిక్యం: 'అమ్మా నాకొక వరం కావాలమ్మా-'

"ఏమిటి?"

'మరణం'

"అది నా చేతిలో వుందా?"

'మీరు సాక్షాత్తు రాజరాజేశ్వరి అయినప్పుడు అది మీ చేతిలో లేకపోవడమేమిటి?'

"అట్లాగే అయితే -జన్మ యిచ్చినప్పుడు నిన్నడిగి ఇచ్చానా? తీసుకునేటప్పుడు అట్లాగే తీసుకుంటానులే."

579. "అమ్మ - జిల్లేళ్ళమూడిలో మంచమ్మీద కూర్చున్న అమ్మ కాదుగా.
అమ్మ - అంటే ఆది అంతమూ లేనిది.
ఈసర్వానికి ఆది అంతమూ అయినది అమ్మ."

580. "వాళ్ళకిష్టమని పెడతానా? నాకు పెట్టాలనిపిస్తే పెడతాను."

581. "ఏ చెయ్యిపెట్టినా వాళ్ళ భావాన్నిబట్టి అమృతమనుకుంటే అమృతమే."

'ఆ భావమైనా నీ దయను బట్టేగా?'

"అవును-"

582. 'నేను మందుబిళ్ళలు తీసుకుంటే నీకు నొప్పి తగ్గుతుందాఅమ్మా?'-అని శేషగిరిరావుగారు.

"నీవు బిళ్ళలు వేసుకుంటే నాకు తగ్గదు; నేను వేసుకుంటే నీకు తగ్గుతుంది గానీ-" అన్నారు అమ్మ.

583. 'నువ్వు ఎప్పుడు ఆరోగ్యంగా వున్నావు తల్లీ? ఇవ్వాళ జ్వరమూ రేపు ఇంకొకటి ఎప్పుడూ జబ్బులుండాల్సిందే కదా-" అని సుబ్బయ్యగారు.

"అవును సుబ్బయ్యా-మీరు కూడా ఎప్పుడూ నా దగ్గర ఒక్కరే ఉంటున్నారా? ఒక్కొక్కరు కొంతకాలం ఉంటున్నారు అట్లాగే అవీనీ.."

'ఎంత అన్యాయంగా అన్నావమ్మా - మేమూ జబ్బులూ ఒకటే అనేగా?' అని గోపాలు.

"అవునురా. మీరు లేనప్పుడు ఇవీ ఉండవు."

584. మంగళ సూత్రాలు ముడిపడటం చూచి, ముడి తీస్తూ అమ్మ-

"ఇవి ముడిపడ్డాయి, అందుకే కాళ్ళ నొప్పులు (నాన్నగారికి)"-అన్నారు.

585. అమ్మ బామ్మగారి చేతిని (ఆవిడ మరణ శయ్యమీదుండగా)తన గుండెల్లో పెట్టుకుని-

"ఎందుకో నా చేతులు గుంజు(లాగు)తున్నై" అంటూ- "దీపారాధన చెయ్యటానికి ఏర్పాటు చేయండి.-" అన్నారు. లోపలికి వచ్చి-" రెండు చెంబులు (స్నానానికి నా మీద) పొయ్యండి...." అన్నారు. అక్కడ బామ్మగారు శాశ్వతంగా కన్ను మూశారు.

586. బండిలో బామ్మగారి చితాభస్మం గోతం ఉన్నది. 'తీసుకురండి' అన్నారు నాన్నగారు.

పురోహితుడూ, రామకృష్ణ, శ్రీరామమూర్తి, వాళ్ళూ శ్రమించి ఎత్తబోతుంటే అమ్మ ఆ గోతం లేవనెత్తేరు.

587. బామ్మగారి ధర్మోదకాలనాడు తన తండ్రికి ఫలహారం పెట్టేరు. తరువాత వచ్చి పడుకుని పొట్టమీద నెయ్యి రుద్దించుకున్నారు.

588. ఇంకా రెండు గంటలకు తాతగారు పోతారనగా అమ్మ చాలా బాధపడ్డారట ఒక అమ్మాయి అన్నది:

'ఆయన పడే బాధంతా నువ్వే ఇక్కడ ముందు పడ్డావు. ఇంక ఆయన హాయిగా పోరూ?'

589. ఒకన్నయ్యకు అగ్ని ప్రమాదం వల్ల ముఖంలో ఒక పక్క కాలినట్లుగా వుంది. అందరినీ మామూలుగా చూసి అమ్మ ఆ అన్నయ్యను గుచ్చి గుచ్చి చూశారు. తరువాత లోపలికి వెళ్ళి ముఖం కడుక్కుని వచ్చారు.

590. "ఏదో మంటగా ఆవేదనగా వున్నది. ఏదో వింటామర్రా..." అన్నారట అమ్మ. కిష్టయ్యగారు పోయారని తెలిసింది.

591. అమ్మ క్రాలివేళ్ళ ఆరు ఉంగరాలు ఊడిపోయాయి.

"ఏదోవింటాం" అన్నారమ్మ.

తరువాత కెన్నడీ మరణం విన్నాం.

592. మెహర్‌బాబాభక్తులు జిల్లెళ్ళమూడికి నడుస్తూంటే - ఆ బాబాను చూసినప్పుడు కలిగిన అనుభూతే కలిగిందట.

593. "కాకులూ, ఉసుళ్ళూ యివి విపరీతంగా ఎందుకొస్తున్నయ్యో..." తరువాత తెలిసింది- చరిత్రలో జరిగిన ఘట్టం జ్ఞప్తికి వచ్చి మననం చేస్తున్న రోజు.

594. మల్లిఖార్జునుడిని తొక్కి ఎద్దు నిలబడిందట.

'అమ్మా,అమ్మా...'అనుకున్నాడట. ఆ తరువాత అతనికి గుండె చిక్కబట్టటం కానీ మరేమీ గానీ లేదట. అప్పుడే అతనికి- అమ్మకు నొప్పిగా ఉన్న సంగతి -తెలిసి అన్నాడట:

'ఎందుకుండదూ? అంత ఎద్దు నాపై ఎక్కితే నాకు లేదు గానీ నొప్పి అమ్మకుండదా?'

595. రామరాజు కృష్ణమూర్తిగారు నిరాశతో చచ్చిపోవాలనుకుని గుంటూరులో ఎలక్ట్రిక్కు కరెంటు ముట్టుకున్నారు. ఆ వేళకు జిల్లెళ్ళమూడిలో అమ్మ చెయ్యి విదిలించారు. ఈ విదిలింపు దెబ్బ కొమ్మూరి డాక్టరుగారికి కొంత

తగిలింది. తరువాత కూడా కృష్ణమూర్తిగారు రెండుమూడు మారులు ఆత్మహత్యా యత్నం చేసి విఫలురై జిల్లెళ్ళమూడికి వచ్చినప్పుడు-

'నువ్వేమీ(సాయం) చెయ్యవు. కనీసం చస్తామన్నా చావనియ్యవేం?'

596. నైవేద్య సమయంలో వడపప్పు పెడుతున్నప్పుడు అమ్మ పళ్ళెంలో నుండి వడపప్పు గుప్పెడు తీసుకున్నారు. తరువాత వసుంధర ప్రసాదం పెట్టటానికి వడపప్పు యిస్తున్నప్పుడు చూస్తే ఆ పప్పుమీద అమ్మ పాదం ముద్ర ఉన్నది.

597. హరిదాసుగారి కుక్కను అమ్మ 'దమయంతీ' అనే వారట.

"దమయంతీ -ఒకపాట పాడ"-మనగానే అది పాడిందట .

అన్నయ్యగారు - 'ఇంకొకటి పాడించ' మన్నారు.

"దమయంతీ యింకో పాట పాడవే-" అనగానే మరో పాట పాడింది.

598. "మధురా ! అక్కడ మీనాక్షీ నగర్ అని వుండాలి. అడుగు."

'ఏఁవండీ-మీనాక్షీనగర్ అని వున్నదా అక్కడ?'

'ఆఁ'

కష్టసమయంలో అమ్మ వల్ల రక్షణ పొందిన ఒక యింటి కోడలు అక్కడ వున్న స్ఫురణ కలిగిన అమ్మ అడిగేరు. మీనాక్షీనగర్ మాట.

599. "ఇట్లారా దగ్గరకు - ఎంత ఏడుపొస్తే అంత ఏడు-"

'ఏఁవిటో .... మనస్సులో భయంగా వుంటుందమ్మా-'

"దేనికి?"

'ఎందుకో తెలియదు...'

"...ఏమ్మా యిప్పుడు కూడా భయంగానే వున్నదా?"

ఆమె ఉన్నదని తలూపింది.

అయిదు నిమిషాల తర్వాత...

"ఏమ్మా- యిప్పుడెట్లా వుందీ?" పోయినట్లు తలూపింది.

600. కూతురు పురుడు పొయ్యటానికి రమ్మని అల్లుడు దెబ్బలాడుతుంటే కోటమ్మ అమ్మ దగ్గరకు వచ్చి కన్నీళ్ళతో అమ్మ పాదాలు చూస్తూ కూర్చుంది. గభీమని ఏదో తట్టింది. ప్రసాదం అడక్కుండా వెళ్ళింది.

అమ్మ అన్నారు -"ప్రసాదం అడగలేదు, వెళ్ళేటట్లు లేదు." అమ్మ ఏమి స్ఫురింపజేశారో ఉపాయం-

601. "ఇతన్ని గుర్తు పట్టావా?"

1953లో వచ్చాడు. అమ్మతోగూడ వచ్చాడు. ఆమెకు మూర్ఛ జబ్బు వుంది'-అని సుబ్బయ్యగారు.

'ఇప్పుడు తగ్గిందా?' -అని రామకృష్ణ

'తగ్గింది ' - అతడు

"మందులిప్పించి వుంటారు" -అమ్మ

'కాదు ఇక్కడకు వచ్చి వెళ్ళిన తరువాత తగ్గినయ్. మందులు ఏవీ యిప్పించలేదు' అతడు.

602. అమ్మ వంటయింట్లోకి వెళ్ళి అప్పుడే దించిన (అన్నం) గుండిగలో చెయ్యి పెట్టి తియ్యబోతే వంటబ్రాహ్మడు 'ఉండమ్మా' అని గరిటతో తీశాడు. 11-6-65న అతడు చేత్తో తియ్యబోతే-

"చెయ్యికాలుతుందినాన్నా -గరిటతో తియ్యి" అన్నారీ అమ్మ.

603. 11-6-65న పెద్దపెట్టున గాలి వీస్తోంది.

అమ్మ "ఇంకా రా ఇంకా రా-" అన్నారు. ఎక్కువైంది గాలి.

604. "నేను అడవుల దీవి వెళ్ళి మూడునెలలుంటా. వెళుతా...వెళుతా...ఎప్పుడో వెళుతా...."

'వాళ్ళ ఆస్తి అంతా చుట్టబెడతావా?'-శేషగిరిరావుగారు.

మూడునెలలుండి ముచ్చటగా చుట్టబెడతా. అమ్మగారికేం ఆహారం కావాలంటారనుకో- ఇటురా నాయనా, అని -కల్లువుంతా నరమాంసమూ-ఇక్కడ కొస్తాడే రోజూ పటానికీ పువ్వు బెడతాడే అతడి నడిగి తెప్పించుకుంటా."

'రోజుకొకముంతా'? -మహాదేవ్.

"చాలదు గంట కొక ముంత. ముందు కుష్టువాళ్ళను పంపిస్తా తర్వాత నే వెళ్తా లేకపోతే నేనే వెళ్ళి వాళ్ళందరికీ కబురు చేస్తా."

605. "ఈ ఊళ్ళోవాళ్ళ కిదొకటి కలిగిందిరా - ఈమె దాటిన తర్వాత ఈ ఊళ్ళో ఎవరుంటారూ?'- అని. మొన్న ఒకాయన ఆంధ్రదేశంలోకల్లా జిల్లెళ్లమూడి మహాక్షేత్రమవుతుందని చెప్పారు.

'నీళ్లు లేవు. ఇంతమొండి కేసుకుందేమిరా? ఈ కప్పలు చచ్చే నీళ్ళు ఈ కప్పలు చచ్చే నీళ్లు త్రాగుతూ వుండాల్సిన పని ?' -అని వీళ్ళు."

'డ్రైను కాలవ దాకా యిళ్ళు పడితే అక్కణ్ణుంచీ నీళ్ళు తెచ్చుకుంటుంటే .... అదే జీవనదైతే-'

'ఎటూ జీవనదేగా - మానవరూపంలో ఉన్నది. కనుక అనుకుంటుంటారు.'

"రూపం ఉన్నా లేకపోయినా - జరిగేదే క్షేత్రం."

# జిల్లెళ్ళమూడి యాత్రికులు

606. "వృథాగా వచ్చి పోవటం లేదు.

వచ్చే సంకల్పమే కొంత ఫలం.

రావటం ఎక్కువ.

తర్వాత వృథా ఎన్నటికి కాదు."

# ఏదో శక్తి

## శిశువు అలవాటు

607. "పిల్లవాడు మొదటిమారు పాలు కుడిపితే తాగలేడు. క్రమంగా నేర్చుకుంటాడు.

ఎవరు నేర్పారంటారూ?

స్వభావమా?- ఆ స్వభావమే భగవంతుడు."

608. 'నేను ప్రశ్నలు అడుగలేనమ్మా - నాకు తెలియడమన్నది ఎలాగమ్మా?'

"పుట్టగానే ఏడవటమూ, పాలు తాగటమూ ఎవరునేర్పారూ? వారే నీకు తెలిసేటట్లు చేస్తారు."

## ఆలోచనలు

609. "మన కడుపున పుట్టిన బిడ్డ మనస్సే తెలియదు. ఆలోచన తర్వాత ఆలోచన ఎందుకొస్తుందో తెలియదు."

610. "ఆలోచన వచ్చిందని వచ్చిన తర్వాత తెలుస్తుంది. కానీ ఎక్కడనుంచి వచ్చిందీ తెలియలేదు. కూర్చుందామనిపించింది; కూర్చున్నాను. ఆ అనిపించింది (ఎవరివల్లో) అర్థంకావటంలేదు. ఆ అనంతమైన శక్తిని పరిమితిగల (శరీర) ఆకారంలో చూద్దామనే గదా ప్రయత్నం?"

611. "ఆలోచనలెట్లా వచ్చినై? ఏదోశక్తో, దైవమో, ఏదో ఒకటి ఏర్పరచాలి. ఆ శక్తికి ఆకారం ఉండాలి కదా?(పూర్వ జన్మ కర్మవల్ల అంటారు.అయితే) మొట్టమొదటి జన్మలోని ఆలోచనలు ఎక్కడ(నుంచి) వచ్చినై? పాప పుణ్యాలు ఉన్నయ్యన్నా - అదే కారణం. ఆ శక్తే కారణం."

612. "ఆలోచనలు మెదడుకు స్వభావమంటాడు నాస్తికుడు.

ఆ స్వభావమే నేను భగవంతుడనుకుంటాను."

## తరుణం

613. "అవును మరి; సమయం వస్తే మీరే వస్తారు. ఇదంతా ఎందుకూ? సమయం రాకపోతే మీ యింటి ప్రక్కకు వచ్చినా మీరు చూడగలిగారా? ఇప్పుడు సమయం వచ్చి - మీరే వచ్చారు."

614. "సమయం వస్తే ఏదీ ఆగదు. భర్త ఉంటే తప్పదా యోగ్యత. లేకపోతే పీటలమీద పెళ్లికూడా తప్పుతుంది. రోజు వస్తే అన్నీ అనుకోకుండానే జరుగుతయ్."

615. "మీ ప్రయాణం ఎట్లాగో ప్రతీదీ అంతే. బస్సులు అందవనుకున్న సమయంలో అందుతయ్. దొరకవనుకున్న సమయంలో దొరుకుతయ్. ఎక్కే యోగ్యత లేకపోతే బస్సు అందినా ఖాళీలుండకపోవచ్చు. ఉంటే మధ్యదారిలోనే ఎక్కించుకోవచ్చు."

616. "తరుణం అంటే తప్పించుకుందామన్నా తప్పనిది. "

617. "తరుణమే ఋణం."

## బుద్ధి

618. "ఏర్పడిన దానిని వివరించేది పరమాణు సైన్సు. ఏర్పడటానికి ఆధారమైనది పరమార్థం."

619. ప్రత్యేకంగా బుద్ధిమంతుడయ్యేదేముంది?-ప్రతివని బుద్ధే చేస్తున్నది.గాబట్టి."

## విధి

620. "విధి అంటే తప్పని సరి అయినది. విధియే దైవం"

621. "తిథులు విధిని మార్చలేవు
విధి అంటే విధానమే."

622. "విధి వర్షంలాంటిది. కొందరికి అనుకూలంగా,కొందరికి ప్రతికూలంగా వ్యవహరిస్తుంది."

623. "గుణాలు కూడా కట్టుబడి ఉన్నయ్."

624. "ఎవరూ మనకున్న దానిని వదిలించలేరు: లేనిదాన్ని తెచ్చిపెట్టలేరు."

625. "డబ్బు మొదట్లో ఇచ్చినదెవరో, తీసి వేసినదీ వాడే. ఆ దైవమే అన్నింటికీ."

626. "చేతలు చేతుల్లో లేవు."

627. "ఏదైనా ఆచరించటం మన చేతుల్లో ఉన్నదా? ఎప్పుడు ఏది తోస్తే అది చెయ్యటమే. మనకర్థం కాని శక్తి ఏదో ఒకటి ఉందిగా? కాని మనకర్థం కాని శక్తి ఏదో వుండిపని చేయిస్తున్నా - మనం చేస్తున్నాం కనుక 'నేను' అనుకోక తప్పదు. మనను నడిపించేది వేరే ఏదో ఉన్నా - మన కాళ్ళు నడుస్తున్నయ్ కనుక నడుస్తున్నాం అనుకోక తప్పదు."

628. "ప్రేరణను మీరు ఏదైనా అనండి- ప్రారబ్ధం అనికానీ భగవంతుడని కానీ మరేదైనా సరే, లేకపోతే వీటన్నిటికి కారణం మనమే అనండి. అంతా నేనే చేస్తున్నానని కానీ, లేదూ అంతా మనది కాదు, ఏదో శక్తి చేయిస్తుంది. అని కాని అనుకోండి- కానీ కొంత నేనూ కొంత ఏదో శక్తి చేయిస్తుంది అనుకోవటం చిక్కే. ఇందులో ఏదో ఒకటి అనుకుంటే ఫర్వాలేదు."

629. "బొంగులూ, రాటలూ, తాటాకులూ, పందిరీ - ఇన్నున్నయ్. అవి కనిపిస్తున్నయ్ కాని వాటిలో శక్తి అర్థంకావటంలేదు."

630. "కాళ్ళూ నడుస్తున్నయ్ కనుక మనమే నడుస్తున్నాం అనుకుంటాము. కాని నడిపిస్తున్న శక్తి అర్థంకావటంలేదు. ప్రేరణ అర్థంకాదు; ప్రయత్నం అర్థమవుతుంది. (అది దైవానిది; అది కనబడదు ఇది మనది అనిపిస్తుంది.)"

631. 'సంకల్పం రావటానికి అధారమేఁవిటి?'

"ప్రేరణే -

సంకల్పం తరువాత చేసేది ప్రయత్నం."

'ప్రేరణకాధారమేఁవిటి?'

"ప్రేరణే దైవం."

632. "పడటానికీ, పడకుండా వుండటానికీ, పడినా దెబ్బలు తగలకుండా వుండటానికీ, మూడింటికి కారణం ఒకటేగా?"

633. "తెలిసినా తెలియకపోయినా; చూసినా చూడకపోయినా, నమ్మినా, నమ్మకపోయినా-ద్వంద్వాలూ, ద్వంద్వాల కాధారమైన శక్తి ఒకటి ఉన్నదనీ, సర్వమూ తనే జరుపుకుంటుందనీ తెలుసుకోవాలి."

634. 'ఈ పాపాలకూ పుణ్యాలకూ-మూలమేమిటి?'

"ఈ ప్రపంచమంతా రావటానిక్కారణమేదో - అదే."

635. "పదిరూపాయలు చేతిలోకి వచ్చినప్పుడు 'అమ్మ ఇచ్చింది' అనుకుంటున్నప్పుడు - ఆ పదిరూపాయలూ తీసేసినది మటుకూ అమ్మ కాదూ?"

636. "అయినప్పుడున్న అమ్మ దయ, కానప్పుడు మాత్రం లేదూ?"

637. 'ఏదో, ఆ కొండకు మనమై వెళ్తే - '

"కొండకు వెళ్లటం, ఆ నమస్కారం చెయ్యటం - శాసనంలోవే".

## ప్రారబ్ధం

638. "అర్హత అన్నది నీది కాదుగా?

నీ కే అర్హత ఇచ్చాడో అది అనుభవించాలి.

ప్రారబ్ధం భగవంతుడు."

639. "మొట్టమొదటి జన్మలో వీడికి ప్రారబ్ధం లేదుగా అసలూ? (వాడు) ఇచ్చింది వీడు చేస్తున్నాడు. తను ఇచ్చింది వీడు చేస్తున్నాడు. మరి ప్రారబ్ధం (ఇచ్చింది) వాడేగా?"

640. "ఎవరికి ఏరూపంగా ఇచ్చినా ఇచ్చేదొకడే. అందరికీ తలా ఒకరకంగా ఇస్తాడు."

## రూపం

641. 'అమ్మా - నువ్వు మామూలుగా గుర్తుండవు. ఏదైనా బాధ కలిగినప్పుడే గుర్తుకొస్తావు.'

"ఎట్లా అయితేనేం, నాయనా - గుర్తుండటానికి? ఆ రూపంలోనైనా

గుర్తుంటానుగా-"

642. 'భగవంతుడికి రూపం యొక్క అవసరమేమిటి? తను చెయ్యదలుచు కున్నవి అక్కడే వుండి ఎందుకు చెయ్యకూడదు?'

"ఒక నాటకం వ్రాశామనుకో - దాన్ని ప్రదర్శించి - నప్పుడుండే ఆనందం వింటే ఏముందీ? నామరూప రహితుడే కాదు; సహితుడే అని చెప్పటానికి అవకాశం రూపం. అందరికీ అర్థమై ఆనందించటం కోసం రూపం. రూపం ఉన్నందువలన శక్తి పెరిగేదీ లేదు; తరిగేదీలేదు."

643. "గుడిలో అమ్మవారుంటుందిగా - అక్కడ దేవు డెవరనీ? రాయి దేవుడా? - నగలు దేవుడా?- అసలీ పదార్థాలన్నిటినీ యిచ్చిన భూమి దేవుడా? ఈ జగత్తు దేవుడా?- అన్నీనా?"

644. "అన్నిటిలో ఉన్న శక్తే దేవుడు. దేవుడికి రూపం లేదనను; అన్ని రూపాల్లో వున్నాడంటాను."

645. "భగవంతుడికి ప్రత్యామ్నాయం దేవాలయాలు."

646. "సూది మోసను కూడ స్థలం లేకుండా సర్వం నిండి ఉన్న వాడంటు న్నప్పుడు - మళ్ళీ సూదులవసరమయినయ్ గదా - సర్వాన్నీ నిండిన దాన్ని గుర్తించలేరు గనుక రూపం నామం అవసరం."

## అంఅ

647. "అమ్మ అంతులేనిది; అడ్డులేనిది; ఆధారమైనది.

అమ్మ పేరు ఆధారం; నాన్నపేరు అవకాశం.

ఆధారమంటే - ఇప్పుడు .....మీరున్నారు. ఉయ్యాలబల్ల మీద కూర్చున్నారు. మీకు బల్ల ఆధారం; బల్లకు గొలుసులాధారం; గొలుసుకు దూలం; దూలానికి గోడలు; గోడలకు భూమి; భూమికి ఆకాశం - ఇట్లా ఆధారం సర్వత్రా వ్యాపించి ఉన్నది."

'దానికి విశేషం లేదా?"

"ఆశక్తిని మించినది లేదు."

648. 'అమ్మ అంటే నిర్వచనం ఏమిటి?'

"అంతులేనిది; అడ్డులేనిది; ఆధారమైనదీ--"

'నిజమే - జగన్మాత అంటారు.'

"జగత్తుకు తల్లికాదు - జగత్తే తల్లి. తల్లిలేనిదే జగత్తెక్కడుంది? ఆధారమైనదీ, అంతులేనిదీ- అన్నాను. పూలు ఉన్నాయనుకో - వాటికి దారం ఆధారం దండ గుచ్చటానికి. పూలకు కొమ్మ; కొమ్మకు చెట్టు; చెట్టుకు భూమీ ఆధారం. దీనికి (ఆధారత్వానికి) అంతు ఏముంది? సర్వానికి సర్వమూ ఆధారం."

649. "అమ్మలోనుండి ప్రకోపింపబడ్డవాడే నాన్న. ప్రకోపింపజేస్తుంది గానీ ప్రకోపించదు అమ్మ."

# సృష్టి

650. 'భూకంపమెట్లా కలుగుతుందీ?'

" 'దాని' వల్లే. కంపానికి వ్యుత్పత్త్యర్థం లేదు. స్పందనానికీ లేదు. పువ్వు విచ్చిన తర్వాత తెలుస్తుంది గానీ ఎట్లా విచ్చుతుందో తెలీదు. జరిగేటప్పుడు తెలీదుగానీ జరిగిన తర్వాత తెలుస్తుంది. జరుగుతూ ఉన్నప్పుడు తెలిసేది చైతన్యం - అంటే కదలిక కనిపిస్తుంది; స్పందనం కనపడదు."

651. "ప్రథమంలో స్పందనం కలిగినప్పుడే ఎవరెవరి నడకలు వారికి ఏర్పడ్డయ్ ఆ స్పందనం అనేక రూపాలై కూర్చుంది."

652. "ఆ శక్తికి ఇదంతా ఇట్లా అయిపోవటం సహజం."

653. "సృష్టి సహజం."

654. "అసలు కారణం అసలుకే తెలియాలి."

655. "తాను కర్త అయిన, కార్య కారణాలు తెలుస్తయ్."

656. "శ్రీ చక్రమంటే ప్రపంచం.

భావం చేత రూపం ఏర్పరుచుకోవాలి."

657. "సృష్టి అనాదీ, నాదీ."

658. "సృష్టి అంటే మనుష్య రూప(ము మాత్ర)మే కాదుగా? అనుక్షణం జరిగేదే-"

659. "సృష్టి అంతా మూడింటితో కూడి ఉన్నది.

(వస్తు) రూపం లక్ష్మి

(ఉపయోగ) విజ్ఞానం సరస్వతి

(వస్తు) శక్తి పార్వతి."

660. "పంచభూతాల సమ్మేళనమే గాయత్రి."

661. "కోరికలను తీర్చేటప్పుడు కామేశ్వరైనది.

లాలించేటప్పుడు లలిత అయినది.

ఆడుకునేటప్పుడు బాల అయినది.

అసలిన్ని రూపాలెక్కడివీ?-అన్నీ ఆ దేవతేగా-"

662. "రూపం పురుషుడు; లోని శక్తి ప్రకృతి.

రెండూ ఒకొదాన్ని విడిచి మరొకటి లేదు."

663. "అసలు - ఒకటి రెండయినప్పుడే ఘర్షణ ఉంది."

664. "వికారంతోనే ఆకార మొచ్చింది."

665. "అద్దానికి రంగుపూస్తేనే కానీ ముఖం కనిపడదు."

666. "సమిష్టి యొక్క వ్యష్టిత్వమే ప్రపంచం."

667. "చూసే వస్తువూ, కనపడే వస్తువూ రెండున్నయ్ కదూ? అది హెచ్చూ తగ్గూ కాలేదా, మరి?"

668. "అన్నం ఉన్నది....... అది ఆరోగ్యవంతుడు తింటే పడుతుంది. అనారోగ్యవంతుడు తింటే విషమవుతుంది."

669. "వ్యష్టిత్వమే తప్ప మంచి చెడ్డలంటే - ఏవి?

మంచిచెడ్డలంటే హెచ్చుతగ్గులే - అనుకుంటాను."

670. "పాపం పుణ్యం - విచక్షణ ఏముంది? రెండని నేననుకోవటంలేదు. అదిన్నీ వీడి (మానవుడి)కి ఉందనుకోవటం లేదు."

671. "పరిణామమే కానీ నాశనం లేదు."

672. "రూపాంతరమే కానీ రూప నాశనం లేదు."

673. "నిర్ణయానికి నిర్ణయించినవాడు కూడా బద్ధుడే."

# అనుగ్రహం

674. "చూస్తే కనపడను; కనపడితే చూస్తారు."

675. "స్థితులు మనం పొందటం కాదు.
దైవం యివ్వటమే.
మానవులకే కాదు జీవజంతువులన్నిటికీ-"

676. "కొత్తగా కళాశాల పెట్టారు కదా - అభివృద్ధిలోకి వచ్చేటట్లు ఆశీర్వదించండి-"
"కళాశాల ఏర్పాటయ్యే రోజునే అదీ నిర్ణయమయ్యున్నది."

677. "నేను మీలో కలవకపోతే - మీరు నా దగ్గరకు రాలేరు."

678. "ఆయా సమయాల్లో ఆయా పనులు చేయించటమే కరుణ."

679. "అనిర్వచనీయమైనదే ఆశీర్వచనం."

680. "అన్నీ తనే అనుకునే మనస్తత్వమే దైవత్వమనీ, కొంత మాత్రమే తన దనుకోవటం మానవత్వమనీ, ఈ రెండు స్థితులనూ ఇవ్వాల్సింది కూడా ఆ శక్తియేననీ - అనుకుంటున్నాను."

681. 'మీ అనుగ్రహం కావాలమ్మా -'
"అది ఎప్పుడూ ఉంది. మీ పనులవటమూ అనుగ్రహమే. అవకపోవటమూ అనుగ్రహమే."

682. "మీకు దరిద్రం వచ్చిందని బాధపడవద్దు-
ఆ దరిద్రం కూడా నేనే."

683. 'మీ ఆశీర్వచనం కావాలమ్మా -'
"అది ఎప్పుడూ ఉంటుంది. అయినపనీ కానిపనీ - అంతా ఆశీర్వచనమే."

684. 'ఆ వాతావరణంలో ఎట్లా ఉంటానో అమ్మా-' .
"అట్లాంటి వాతావరణం కూడ అమ్మ కల్పించిందనుకుంటూ ఉండు-"

# ప్రాయశ్చిత్తం

685. "వేరే ప్రాయశ్చిత్తమేముందీ? -పశ్చాత్తాపమే ప్రాయశ్చిత్తం."

# ఉపదేశం

686. 'తన్ను తాను తెలుసుకున్నవాడు ఉపదేశం చెయ్యడన్నాను. నిజమే కదా అమ్మా?'

"ఎట్లాంటి వాడికైనా ఉపదేశం అవసరమనేందుకోసం అట్లాంటి వాడి ఉపదేశం. బిడ్డ ఒకడు ఉదకం కావాలంటాడు. ఒకడు అప్స్ కావాలంటాడు. మూడోవాడు మంచినీళ్ళబిందె వైపు చూపిస్తాడు. ఉదకం అన్నవాడికే కాదుగా మంచినీళ్ళిచ్చేదీ? అప్స్ అన్నా మంచినీళ్లే ఇస్తుంది. బిందె చూపించినవాడికి మంచినీళ్లే ఇస్తుంది తల్లి."

687. "సందేహ నివృత్తి చేసేదే సందేశం."

688. "తెలియనిదేదో తెలియజెప్పిన వాడే గురువు.

నా యందు గురి గల వాడైనా గురువే (ఎవరికైనా)."

689. "గుర్తు చెప్పినవాడే గురువు."

ఉపదేశం అంటే దైవసన్నిధిని చేర్చటం.

690. "సర్వానికీ ఆధారమని తెలుసు. అయినప్పటికీ... అ చెప్పినందు వల్ల అదొక గురి."

691. "కాలువ నిండుగా ప్రవహిస్తున్నా - దాహమయితే దిగటానికి రేవు కావాలి."

# బ్రహ్మచర్యం

692. "బ్రహ్మచర్యమంటే కేవలం పెండ్లి చేసుకోకపోవడం కాదు. బ్రహ్మచర్యమంటే లింగభేదమూ, రూపబేధమూ, స్పర్శభేదమూ లేకుండా ఉండటం."

693. "పెళ్ళికాకముందు మేము బ్రహ్మచారులమంటే విశేషమేముందీ? పెళ్లికాక పోయినంత మాత్రాన వాడికి ఆ భావం కలగదని ఏముంది? మరి, అప్పుడు బ్రహ్మచర్యం ఏముంది? సంకల్పం కలిగి అవకాశాలు కలిగినప్పుడు వెనక్కు రావాలి - అదీ కలగని రోజు."

694. "స్త్రీ అయితే ఏది జరిగినా చలించని స్థితిలో ఉండాలి - బెల్లం తింటున్నా ఆ రుచి జిహ్వ గ్రహిస్తున్నా చలించని స్థితిలా - "

695. "పెళ్లి ఎందుకు? కోరిక కలిగినప్పుడు దారి తప్పకుండా వుండటానికీ, ఎవరి మనస్సు వారు అదుపులో ఉంచుకోవటానికీ-"

696. "నాకు అందుకే నచ్చదురా - భార్యను అమ్మగా చూడాలనటం ఎందుకంటే - మాటలో అన్నంత సులభం కాదు ఆ స్థితి రావటం. అది ఎటూ రాదు. దాని బదులు నానా అవస్థాపడి అధోగతి పాలవటం జరుగుతుంది."

697. "శరీరానికి అంటుకోవటమే ప్రధానమా? మనస్సుకు అంటుకోవటం కాదా?... మనస్సు క్షాళనం కానిదీ మనస్సులో బ్రహ్మచర్య స్థితి ఏర్పడనిదీ- శరీరాన్ని జాగ్రత్త పెట్టినంత మాత్రాన బ్రహ్మచర్యమౌతుందా?"

# ఆచరణ

698. "ఆచరించే వాడికి (బైబిలైనా,గీత అయినా, కొరాను అయినా) ఏదయినా ఒకటే. అది లేనివాడికే ఇన్ని మార్గాలూ. ఇన్ని పుస్తకాల అవసరమూ....."

700. "ఏది చదివినా ఆచరించేవాడికి ఏదైనా ఒకటే. ఆచరించలేనివాడే - దానిలో ఏముందీ, దీనిలో ఏముందీ - అని వెతుకుతుంటాడు. కాని చివరకు వెతకటంతోనే సరిపోతుంది."

701. 'అమ్మా - ధర్మం, ధర్మం అంటున్నారు కదా? ఏది ధర్మం ? దానిని మేమెట్లా ఆచరించాలి?'

"మన శాస్త్రాల్లో ధర్మాలన్నీ చెప్పే ఉన్నయ్. నాన్నా - అవి ప్రతీ మానవుడికి కొన్ని పనులను నిషేధించినయ్. కొన్నిటిని శాసించినయ్. కాని ఎవరూ నిషేదించిన వాటిని మానుకుంటున్నదీ లేదు; శాసించిన వాటిని ఆచరిస్తున్నదీ లేదు. అంటే ఈ విధి నిషేధాలను బట్టి కాదు మనిషి ఆచరిస్తున్నది. తనకు ఎప్పుడు ఏది అవసరమో అది ఆచరిస్తున్నాడు. అంటే మనిషిని అవసరమే నడుపుతున్నది. అందుకే అవసరమే విలువయినదనిపిస్తుంది నాకు."

702. 'అమ్మా మేము మాంసాహారులం. మరి హింస పాపంకాదా? మేమేమి చెయ్యాలంటారు?-అదీగాక ఆహారం కోసం చేసేది కొందరు హింస అంటారు; కొందరు కాదంటారు. ఏది నిజమమ్మా?'

"హింస అంటే సహించలేనిదే నాన్నా - మేకలను కోసేవాడు ఆవులను నరకటం సహించలేడు. కోళ్ళను కోసేవాడు గొఱ్ఱెలను చంపటం చూడలేడు. సర్వమూ ప్రాణమయమే అనుకున్నప్పుడు అన్నం తినటమూ, కూరగాయలను కోయటమూ, మంచినీళ్ళు త్రాగటమూ కూడా హింసే కనుక ఏది హింస, ఏది కాదు అన్నది సమస్యకాదు. ఎవరు ఏది సహించలేరో - అదే హింస కాబట్టి - దానిని మానుకుంటే సరిపోతుంది. అదీ మానుకో గలిగితే---."

703. 'అన్ని విధాలా అన్యాయం చేసినవాళ్ళు పైకి వస్తున్నారు; న్యాయమూ, ధర్మమూ అంటూ వాటిని పట్టుకుని ప్రాకులాడే నా బోటివాడు అణగారి పోతున్నాడు. ఏం చెయ్యమంటావమ్మా?'

"నీ చేతనయితే నీవూ అట్లాగే నడూ-"

704. "మీ ప్రయత్నం మీరు చెయ్యండి. సమయం వస్తే అదే జరుగుతుంది. అవుతుందీ, కాదు - అని ఎవరు చెప్పినందువల్లా ఆగేదేమీ లేదు."

# ఆచారం

705. "ఆచారమంటే ఆచరించటమేనని నా ఉద్దేశం. నా దృష్టిలో (స్నానమే చెయ్యాలి అన్నలాంటి నియమం) ఇలాటివేమి ఉండవు. చెయ్యటం ప్రధానంగానీ ఇవన్నీ లేవు. సందేహమే అనాచారం. శ్రద్ధాభక్తులతో పాకీదొడ్లో చేస్తే మట్టుకేం? నా దృష్టిలో ఎక్కడున్నా ఒక్కటే. చెయ్యటం ప్రధానం. పాయిఖానా దొడ్డి వేరైంది కాని అది మన కడుపులోదేగా - శ్రద్ధాభక్తి కంటే ఆచారమేముంది?

ఆచరించటమేగా ఆచారమంటే---"

# సాధన

706. 'జగన్మాతను వర్‌షిప్ చెయ్యాలంటే అచంచలంగా వుండడమెట్లా?'
"ముందు యీ వర్‌షిప్ చెయ్యటానికి ప్రేరణ ఏది కలిగించిందో అదే చేస్తుంది."
'మానవులు చంచల స్వభావులు కదమ్మా-'
'ఈ చంచల స్వభావం కూడా అందులోదే కదా? జగన్మాతే, అమ్మే - అన్నీ అనుకుంటున్నప్పుడు - ఇక యిందులో నీ ప్రమేయ మేముందీ? చంచల స్వరూపంగా ఉన్న అమ్మ ఎప్పుడో అచంచలంగా చేసుకుంటుంది. .... .... ఈ నామాల్లో కూడా అన్నారే - చపలాయై నమః. చంచలాయై నమః - అనీ ......"

707. "నువ్వేమీ చెయ్యవద్దు నాయనా -ఆ దైవం ఏం చేయిస్తే అది చెయ్యి-"

708. 'నీ సాధ నేమిటి?'
"సర్వసాధారణమైనదే సాధన."

709. "నా దృష్టిలో సాధకులే లేరు" (అది చేయించేది చేసేవాళ్ళే)

710. 'ఆత్మను తెలుసుకోవటానికి మార్గమేమిటి?'
"ఏ మార్గమయినా మంచిదే."
'ఏదైనా మీ నోటివెంట చెప్తే ఆ మార్గాన పోదామని .....'
"మీ రెట్లా పోదామనుకుంటారో అట్లాగే చెయ్యండి. ఆత్మకు మార్గమే ముందీ? కనపడే దంతా ఆత్మే అయినప్పుడు మార్గ మెక్కడికనీ?"

711. "ఏది సాధ్యమైతే అదే తరుణోపాయం. మీకు ఏది సాధ్యమయితే అది చెయ్యండి - దీని వల్లా దాని వల్లా వస్తుందని ప్రత్యేకంగా ఏమీ లేదు మోక్షానికి."

712. "జరిగింది ప్రోగ్రాం కానీ వేసింది ప్రోగ్రాం కాదు."

713. "సాధ్యమయితే సాధనా? సాధన చేస్తే సాధ్యమా?"

714. "సాధన మాత్రం సాధ్యమవుతుందా? సాధ్యమయినదే సాధనగానీ- సాధన చెయ్యాలంటే చెయ్యలేము."

715. "రోజూ ఎన్ని గంటలకు నిద్రలేస్తారూ? "

'5 గంటలకు'

"లేచి ఏం చేస్తారు?"

'టీ త్రాగుతాను.'

"సరే - నిమిషం పెరక్కుండా నిమిషం తక్కువ కాకుండా రోజూ 5 గంటలకు టీ త్రాగండి. ఏ ఊరు వెళ్ళినా సరే- ఎటువంటి పరిస్థితుల్లో నయినా సరే- 5 గంటలకు టీ త్రాగండి. నేను కొత్తసాధన చెప్పటంలా. రోజూ మీరు చేసేదేగా?"

'అమ్మా చెయ్యటం కష్టమమ్మా- నిద్రమెలకువ రాకపోవచ్చు. ఒంట్లో కులాసా లేకపోవచ్చు. పొరుగూరిలో వీలుకాకపోవచ్చు.'

716. "నువ్వు చెయ్యగలిగింది సదా చెయ్యటమే ఆధ్యాత్మిక సాధన. తిట్టగలవా? ఎప్పుడూ తిడుతూ ఉండు. ఎవరైనా 'ఈయన కోపిష్టి' అంటే - నేను అతనితో - నీ కోపం తగ్గనక్కరలేదు నాన్నా - సదా కోపంగా ఉండు. (అదే సాధన) అంటాను."

717. "నీకు సాధ్యమయినదే సాధన అంటే - మోక్షానికి ఇదీ దారి అంటూ లేదు."

718. "సాధన చెయ్యటం కూడా మన చేతిలో లేదు నాన్నా -ఒడ్డున కూర్చుని కబుర్లు చెప్పటానికేం?- ఇది చెయ్యండి అది చెయ్యండి -అని. ఏదీ మన చేతిలో లేదు. నేను మీరు కోరినట్లు ఏదైనా మంత్రం చెప్పినా దానిలో మనస్సు నిలవటానికి మీకు సాధ్యం కావద్దూ? నిలవటం అన్నది సాధ్యమయితే మీరు ఇంత దూరం వచ్చేవారు కాదు. ఏదీ మనవల్ల కాదు. తరుణం వచ్చినప్పుడు అదే అవుతుంది. "

719. "సాధన చెయ్యాలంటారు. చెప్పేవాడికది సాధ్యమయినది (చెప్పాడు

కదా?); వినేవాడి కిది సాధ్యమైనది. తలూపేడు. ప్రయత్నం చెయ్యమంటే ఎలా చేస్తాడూ? ప్రేరణ లేనిదే ప్రయత్నం ఎక్కడినుంచి వస్తుందీ?

సాధ్యమయిన దానినే సాధించటం జరుగుతుంది కానీ సాధన చేసి సాధిస్తారన్నది కాదు జరిగేది.

సాధిస్తే సాధ్యమైనదనేది వాడుకపదం."

720. "జరిగినదే ముహూర్తం."

721. "నీకు ఏది తోస్తే అది చెయ్యమంటాను. నువ్వు చేసేదీ, నువ్వు చెయ్యగలిగేది- ఏదీ లేదంటాను. నువ్వు చేసేదేమీ లేదంటే - నీకు నిస్పృహ కనపడొచ్చు. 'అమ్మ యిట్లా చెపుతుందెమిటా? కాళ్ళు ముడుచుక్కూర్చోమంటుంది-' అనుకోవచ్చు.

నేను చెయ్యమన్న సాధన నువ్వేటూ చెయ్యలేవు. జపం చెయ్యీ, యోగంలో ముక్కు బిగించుక్కూర్చోమంటే - నువ్వేటూ కూర్చో లేవు. అందుకే నీకు ఏది చెయ్యాలనిపిస్తే అది చెయ్యమంటాను. ఏ సాధన గొప్పదీ అంటే - ఒక సాధన గొప్పదనీ ఒక సాధన తక్కువనీ నాకు లేదు కానీ... ఆ సాధన నువ్వు చెయ్యగలగాలిగా? మనం చేసేది ఏమీ లేదని నా వుద్దేశం. శాస్త్రం చదువుతాం, శాస్త్రం చదివేనూ; చదివినట్లు చెయ్యలేక పోయాను - అనేదే మిగులుతుంది.

ప్రతివాళ్ళూ సాధన అవసరం అని చెప్తారు. వారు చెప్పేదాంట్లో కర్త - చేయించేది - అర్థం కావటం లేదు. కర్మ అర్థమవుతున్నది."

722. "అందరికి తెలియటమే తోస్తున్నది గానీ ఎవరు చేస్తున్నదీ తెలియటం లేదు.

చేద్దాము అనుకున్నది ప్రేరణ; చేసింది క్రియ. క్రియ మనదిగా కనిపిస్తున్నది. కర్త ఎవరో తెలియటం లేదు.

14 కర్త ఎవరో, క్రియ వారిదే ననిపిస్తుంది నాకు."

723. "ఏది మనకు ధ్యేయమో అది చెయ్యాలి.

ఇన్నిలేవు.

అన్నీ అదే."

724. "తోచిందేదో చెయ్యి. తోపింపజేసేవాడు వాడేగా?"

725. 'అవకాశాన్ని గమనించటం సాధన."

# మంత్రం

726, "శబ్దమే ఆత్మ (యొక్క) శబ్దం అయినప్పుడు ఇంకా ఈ నామం ఆ నామం అనేముంది?"

727. "ఏది చేసినా ఒకటే. అన్ని మంత్రాలు ఒకటే. ఎందులోనైనా ఒకే శక్తి ఉన్నది - పేర్లూ అక్షరాలూ మార్పు తప్ప."

728. "శబ్దమే మంత్రం.

ధ్వని వేరు గానీ శబ్దం ఒకటే."

729. "ఎవరే మంత్రం చేస్తున్నారో ఆ మంత్రాధి దేవత తప్ప వేరే ఎవ్వరూ లేరు."

730. "అదే చెయ్యమని అనలేదు. ఎవరేది చెయ్యమన్నా అదే అనుకుని చెయ్యమన్నా. (ఆ బాలా త్రిపురసుందరే అనుకుని చెయ్యమన్నా.) ఆ విశ్వాసం నీకు దృఢంగా ఉంటే ఎవరేమి చెయ్యమన్నా ఏమీ ఫరవాలేదు. ఏది చేసినా ఒకటే."

731. "చరమదశలో ప్రతి మంత్రానికి ఒకే అర్థం వస్తుంది. ప్రతి వస్తువునూ అదే రూపంగా చూడటమే ఏకాగ్రత.

ఏకాగ్రత అంటే పటమ్ముందు కూర్చోవటం కాదు."

732. "అర్థం తెలిసి అశుద్ధానికి పూజచేసినా వాడికే చెందుతుంది."

(పేడ అశుద్ధం కాదూ? పేడతో గౌరిని చేసి పూజచేస్తున్నాం కదా)

733. "హరేరామ - అంటే అమ్మ కాదూ? జయహో మాత - అంటేనే అమ్మ అని ఏమిటి?"

734. "డబ్బాలో పసుపుకు నమస్కారం పెడతామా? నీళ్ళతో గడిపి ముద్దగా చేస్తే గౌరి అని దానికి పెడతాం. గోడకు రాచి బొట్లు పెట్టి పోలేరమ్మ అంటున్నాం. ఉపయోగించే పసుపు ఒకటే - ఇక్కడా,అక్కడా. కాని సర్వత్రా చూడలేం కనుక పరిమితిలో చూడటంలో ఇవన్నీ - "

735. "సర్వత్రా ఉన్న దైవాన్ని గుర్తించ లేనప్పుడు గుడి ఆధారమైనట్లు ...."

736. "ఏదైనా చదువుతున్నాడనుకో, నాన్నా - అక్షరం పొరపాటు చదువుతాడు. అందువల్ల ఏదో చేస్తుందనుకోవటం పొరపాటు. భావం ఒకటే. అది మనస్సుది. కాని పదం మారింది. అందువల్ల ఏ దోషమూ లేదు. (కావాలని మనస్సు అనుకోలేదుగా -) అది ఏమీ చెయ్యదు. అది వీళ్ళ భ్రమ."

737. "నువ్వు నామాలు తప్పు చదివినందువల్లా, ఒప్పు చదివినందువల్లా నాకు వచ్చే నష్టమూ లాభమూ ఏంలేదు. 'విద్యాయ నమః' అంటూనే 'అవిద్యాయనమః' అంటున్నారుగా- వినేవాళ్ళను గురించి అన్నాను. అక్షరం తప్పు చదివితే పదం అర్థం మారిపోదూ? అది వినేవాళ్ళకు ఎంత బాధగా ఉంటుంది? దాని అర్థం నీకు తెలిసి నీవు తప్పు చదివినా నీకు భావం తెలుసు కనుక ఫర్వాలేదు. చదువుతున్నప్పుడు దానిలో భావం అర్థం చేసుకోవాలని అనుకుంటుండేవాళ్ళకు ఈ చిన్న పొరబాటువల్ల ఎంత నష్టమో చూడు-"

738. 'సాధనకు మంత్రం అవసరమా? ఎంతవరకు ఉపయోగపడుతుంది?'

"అసలు మంత్రమంటే ఏమిటి? ఓపిక లేనివాడు కఱ్ఱపట్టుకున్నట్లు. మనస్సుతో మనస్సును గుర్తించాలి కనుక మనస్సును మాటల్లో పెట్టి మంత్రం చేసి మనస్సు మంత్రమయింది. మంత్రాన్ని తాను చేస్తున్నాను అనుకుంటూ మనస్సుతో మనస్సును గుర్తించింది. ఓపికలేదనుకో - ఓపిక లేనివాడికి కఱ్ఱసాయం చేసినట్లే. మళ్ళీ ఆ కఱ్ఱను పట్టుకోవాలిసింది వాడే."

739. "మంత్రమంటే - వాళ్ళు యిచ్చింది మాటే అయినా నీ మననంతో మంత్రమయింది. అది మంత్రం కాదని నువ్వు అనుకున్నప్పుడు అది నీకు ఒక మామూలు మాటతో సమానంగానే ఉంటుంది."

740. "మంత్రమంటే ఏమిటి? మనస్సే కదా! మననం చేత మంత్రం అవుతుంది."

741. "మంత్రమంటే అక్షరమాలేగా - ఉన్న అక్షరాలలో ఏరి వాక్యాలు రూపొందించి వాటికొక భావన కల్పించి చెవిలో చెప్పేదేగా?

వాడు ఇచ్చింది మాటేగాని నీ మననంతో మంత్రమయింది. మననమే మంత్రం; అయినా కొన్ని సమయాల్లో పఠించకూడదు- అని పెద్దలు నిషేధం చేసింది - తక్కిన పనుల్లాగే నియమ రహితంగా, నిష్ఠలేకుండా చేస్తారని -"

742. "శ్లోకం యొక్క అర్థమే మంత్రం."

743. "తృప్తినీ, హాయినీ, శాంతినీ - ఇచ్చి సందేహ నివృత్తి చేయగలిగిందే మంత్రం."

744. "మంత్రం శాస్త్రంతో ప్రపంచం చాలా బాధ పడుతున్నది. నెత్తి అణుస్తుందనీ అదనీ, ఇదనీ అదరగొట్టేస్తున్నారు."

745. "శ్రీ విద్య అన్నారుగానీ స్త్రీ విద్య కాదు."

746. "శ్రీ విద్య చెప్పి, - జాగ్రత్త. అది నెత్తి అణుస్తుంది-అని చెప్పేటప్పటికి అజాగ్రత్త ఎక్కువవుతుంది. అది చెప్పకుండా ఉంటే మామూలుగానే వుంటుంది. అప్పుడు మంత్రమందు ధ్యాసపోతుంది; మాటలయందు ధ్యాస కలుగుతుంది."

747. "ఇవన్నీ ఏం లేవు నాన్నా - అసలు మంత్రమంటే ఏమిటో తెలిస్తే ఈ సమస్యలే ఉండవు. నేను మనస్సే మంత్రమంటాను. మనకు మనస్సు అంటే ఏమిటో తెలియదు గనుక మంత్రం అని అక్షరాలలో పెట్టి దాని ద్వారా మన శక్తిని మనం అర్థం చేసుకుంటున్నాం.

కొన్ని అక్షరాలను కలిపి దానికో పవిత్రత నిచ్చి నువ్వు మననం చేస్తే అది మంత్రమయింది. నువ్వు 'కాదు' అనుకుంటే అవి అక్షరాలేగా - దీన్ని అంతా (మంత్రంగా) గుర్తిస్తున్న దెవరూ? నీ మనస్సు, (మరి) అప్పుడు నీ మనస్సే మంత్రం కాలేదూ? ఈ మంత్రం చేస్తే నెత్తి అణుస్తుందనీ, ఆ మంత్రం చేస్తే ప్రమాదం అనీ చెప్తుంటారు కదా- అవి కూడా ఏం లేవు. ఏ మంత్రంలోనైనా ఒకే శక్తి ఉన్నప్పుడు ఇంకా నెత్తి అణచటాలూ, ప్రమాదాలూ ఎక్కడనుండి వస్తయ్? ఈనాడు గురువులు అని చెప్పుకుంటున్న వాళ్ళందరూ గురువులేనా? మన మనస్సే గురువు. గుర్తే

(గుర్తించిన జ్ఞానమే) గురువు ... ... మీరు ఏ గురువుల దగ్గరకూ వెళ్ళ నక్కరలేదు. మీరు సాధన చెయ్య యత్నించినా చెయ్యనివ్వకుండా ఏదో బలవత్తర శక్తి అడ్డు వస్తుంది కదా- ఆ అడ్డుపడే శక్తే దైవం. అది ఎట్లా నడిపిస్తే అట్లా నడుస్తున్నాం - తరుణం వస్తే ఆ శక్తే మీ సాధనను నడిపిస్తుంది."

748. "నీ మనస్సులో ఎక్కడ లక్ష్యముంటుందో అదే మంత్రం. మనస్సే మంత్రం."

749. "ఓం నమో నారాయణాయ-అనే దెట్లాగో
కామేశ్వరీ ప్రాణనాథాయ - అనేదీ అట్లాగే."

750. "గురువు పరబ్రహ్మ స్వరూపం అనుకున్నప్పుడు ఇంకా ఏ మంత్రమైనా ఎందుకూ? ఫలానా మంత్రం చెయ్యవచ్చుననిగానీ, చెయ్యగూడదనిగానీ ఏమీ లేదు."

751. "మనస్సిద్ధివుంటే మాటలే మంత్రాలు.
'ఇది ఏమిటి' - పంచాక్షరి.
'అసలు ఇది ఏమిటి?' - అష్టాక్షరి."

752. "రాజమ్మగారు ఇంతమందికి ఇన్ని ఇచ్చింది. చివరకు అన్నీ ఒకటే. అనంత శక్తి - అర్థం కానిది-ఇదంతా సృష్టించింది. (ఇది) చివరకు దానిలోనే చేరుతుందని చెప్పటానికే ఇవన్నీ - "

753. "మంత్రమంటే భగవంతుని రూపమే --"

754. 'అమ్మా - మంత్రపుష్పం నీ సన్నిధిలో మాత్రమే చదవాలిగానీ ఎక్కడపడితే అక్కడ చదివితే ఎట్లా ?'

"నేను అంతటా ఉన్నానంటూ - నా సన్నిధిని గిరిగీస్తున్నావేం?'

# పాతివ్రత్యం

755. 'పెనిమిటి అంటే ఏమిటమ్మా?'

"పెన్నిధి."

'పెన్నిధి అంటే?'

"దైవసన్నిధి, సన్నిధి అంటే లక్ష్యం."

756. "ఏ పరిస్థితిలోనూ తొణక్కుండా ధైర్యంగా ఉండమ్మా - ఎట్లా జరగాలో అట్లా సమయం వస్తే అదే జరుగుతుంది. నీ భర్త నీ దగ్గర లేడని ఆలోచించవద్దమ్మా - భర్త అంటే శరీరం కాదుగా. మన కళ్ళ ఎదుట ఉంటే భర్త. లేకపోతే లేదని కాదుగా? శరీరం ఎక్కడున్నా నీ భర్త నీ దగ్గరున్నాడు. శరీరమే ముఖ్యం కాదు అనుకున్నప్పుడు నీ భర్తనునీ దగ్గర నుండి ఎవరూ తీసుకోలేరు. ఆ నమ్మకం నీకు వున్నప్పుడు అదే నిన్ను రక్షిస్తుంది. నీ మెళ్ళో ఉన్న ఆ రెండు మంగళసూత్రాలూ అతని రెండు పాదాలు. వాటిని పూజించు-"

757. "అన్ని ఆభరణాలూ వేసుకోవటానికి అర్హతనిచ్చే ఆభరణం మాంగల్యం - ఈశ్వరుడి చేత కట్టబడినది."

758. "పెండ్లిలో తెరా? 'తెరతీయగరాదా?' అన్నాడుగా? తెరతీస్తే కనిపించెదెవరూ"

759. "తలంబ్రాలు అంటే తలంపులు. ఒకరికి తోచిన తలంపులు ఒకరికి చెప్పుకొనమని సూచన."

760. "ఒక పెన్నిధి అండన చేరటం పెండ్లి."

761. "ఆ అండను పొందే పరిణామమే పరిణయం."

762. "సర్వాన్ని అనుభవిస్తూ సర్వాన్ని విడిచిపెట్టేదే వివాహం."

763. "కళంకరహితమైన మనస్సును కళంకరహితంగా మరొక వ్యక్తికి అర్పణ చేయటమే కల్యాణం."

764. "భావం తెలుసుకుని ప్రవర్తించేదే భార్య.
బాధ్యత తీసుకుని భరించేవాడే భర్త "

765. "ఎట్లాంటి వాడైనా సరే - ఆయన సేవ చెయ్యటమే నీ ధర్మం."

766. "ఆయన ఏ దారిన బోతే నువ్వూ ఆ దారిన బోవటమే నువ్వు చెయ్యాల్సింది."

767. "ఆయన కాలి బూట్లలో మట్టిగూడ పవిత్రంగా చూడాలి. ఆ శబ్దంలో మంత్రాన్ని వినాలి. అన్నీ ఆయనే అని సేవించాలి (భార్య)."

768. "కల్లు త్రాగే భర్త వస్తే కల్లే వాడి చేతికి తెచ్చి యిచ్చి అందులో ఆనంద మనుభవించాలి."

769. "పాతివ్రత్యానికి చరమదశ భర్తకూడా భార్యను అమ్మా అని పిలవటం."

770. "అస్తమానమూ నువ్వు ఆయనదగ్గరుంటే నా దగ్గరున్నట్లే."

771. "పాతివ్రత్యం పూర్ణమయిన అద్వైతానికి తీసుకెళ్తుంది.
యోగం తీసుకెళ్తుంది.
జ్ఞానం తీసుకెళ్తుంది."

772. "సూత్రం అంటే ఒకరకంగా యిముడ్చుకునేది అని అర్థం. దారం బంగారంతో చేసిన తాళిబొట్లలో యిమిడి ఉన్నది. దారంలో తాళిబొట్లు ఇమిడి ఉన్నయ్. ఒకదానిలో యింకొకటి ఇమిడి ఉన్నది. ఇముడ్చుకునే శక్తి రెండింటికీ ఉన్నది. అదే అర్థనారీశ్వరి. అర్థనారీశ్వరుడంటే - ఒకదానిలో ఒకటి యిమిడి ఉండటమే. ఇట్లా ఇమిడిపోయిన శక్తిని ఆరాధించాలంటే ప్రత్యక్షంగా మెడలో గట్టిన సూత్రాన్నే ఆరాధించాలి. దారమూ బొట్లూ - రెండూ కలిస్తే సూత్రం. దారం లేకపోయినా సూత్రం కాదు. బొట్లు లేకపోయినా సూత్రం కాదు. ఆ రెండు బొట్లూ భర్త పాదాలు. ఆ పాదాలకు ప్రేమ అనే పాశంతో మూడు ముళ్ళూ వేసుకుని పట్టుకుని ఉంటుంది. ఆ మూడుముళ్ళే త్రిపుటి. ప్రేమ అంటే భక్తి. బిడ్డలమీది ప్రేమ వాత్సల్యం ప్రేమ ఒక్కటేగానీ - స్థానాలనుబట్టి పేర్లు మారుతూంటయ్. ఆ రెండు

పాదాలే శరణ్యం. ఇహానికి పరానికి కూడా. ఆ చరణాలే ఆచరణీయం. త్రిపుటి అంటే సృష్టి. సృష్టి అంతా త్రిపుటి మీదనే ఆధారపడి ఉంది."

773. మంగళసూత్ర రూపేణా భర్త పాదాలు భార్య కంఠాన ఎట్లా బంధింపబడి ఉంటాయో, యజ్ఞోపవీత రూపేణా భార్య భర్తతోటే సదా ఉంటుంది."

'అమ్మా - అందరికీ యజ్ఞోపవీతాలుండవు గదా?'

"కంకణాలు కట్టుకుంటున్నారుగా -"

774. "సహన మనేది కేవలం ఆడదానికే కాదు.మొగవాడికి్కూడా ఉండాలి. మనస్సే కారణం కానీ స్త్రీ పురుష భేదం కాదు. ఎట్లాంటి వాళ్ళయినా సహించవలసిందే, సహనమనే దేవతను ఆరాధించాలంటే బాధలనేవి పూజాద్రవ్యాలు. అన్నీ బాధలే అయినప్పుడు ఇంకా సుఖం వేరే ఏమున్నది? బాధపడుతున్నారా? - పెడుతున్నారా? అనే ప్రశ్న వస్తుంది. బాధపడుతుంటే కదా బాధ పెట్టేది? పడనప్పుడేం పెడతారు?"

775. "సర్వాన్ని స్వాధీనం చేసుకున్నదే సాధ్వి."

# ధర్మం - మమకారం - ప్రేమ

776. "రుక్మిణి - కృష్ణుడు నా భర్త అంటుంది.

సత్యభామ - నేను కృష్ణుడి భార్యను - అనుకుంటుంది.

(రాక ఏమి చేస్తాడు అని)

"రాధ- నువ్వెవరైతే నాకేమీ? నువ్వే కావాలి, నిన్ను వదిలి ఉండలేను- అనుకుంటుంది."

777. "రుక్మిణి దగ్గర కృష్ణుడు లేకపోవచ్చు, కృష్ణుడి దగ్గర రుక్మిణి వుంటుంది. సత్యభామ దగ్గర కృష్ణుడుండొచ్చు గానీ సత్యభామలో కృష్ణుడు లేకపోవచ్చు.

రాధ ఉచ్ఛ్వాస నిశ్వాసాలే కృష్ణుడు."

778. "ప్రేమ ఉన్నా ధర్మానికి కట్టుబడక తప్పలేదు. అది అన్ని వందల మైళ్ళ దూరం నుంచి నా కోసం పరుగెత్తుకు వచ్చినా భర్త దగ్గరకు పంపించటం నా ధర్మం.

ప్రేమ కంటే ధర్మం గొప్పదని ఋజువు చేసింది - యీ అర్జంటు ప్రయాణం."

779. "కారణ (జన్యమైన) ప్రేమ పరిమితమైంది. అది కేవలం ప్రేమించే వ్యక్తీ, ప్రేమింపబడే వ్యక్తుల వరకే పరిమితమైంది."

780. "రహీ అంటే - ప్రేమ, ఆనందం.

ప్రేమకుమార్ అంటే - ప్రేమకుమారుడు.

రహీ అంటే ప్రేమే.

వాత్సల్యం అంటే - అనసూయ."

'అనసూయ పరిచారికగా ఉన్నదమ్మా - మాతృత్రయం దగ్గర.'

"మాతృత్రయం కలిస్తేనే అనసూయేమో..."

781. "ప్రేమ అంటే- భగవంతుడి యందుండే దానిని భక్తి అంటాం. మామూలుగా మనుష్యులయందుండే దానిని ప్రేమ అన్నాం."

782. "ప్రేమ వేరూ, గౌరవం వేరూ, కావాలనుకోవటం వేరూ - భగవంతుడి యందు చూపించే దానిని భక్తి అంటాం. భర్తయందూ, తల్లియందు గౌరవం క్రిందనే లెక్క వేసుకోవచ్చు."

783. "ప్రేమ యొక్క రూపాంతరమే కోపం"

784. "ప్రేమ కంటే భక్తి గొప్పది."

# నమ్మకం

785. "మీ దర్శనం చేసుకుంటే జబ్బు రహిత మవుతుందని .... ఎన్నాళ్ళనుంచో రావాలనుకుంటుంటే- ఇవాల్టికి రాగలిగాం.'

"ఆ నమ్మకం మీ కున్నదా?"

'ఆఁ-'

"అయితే రహితం కావాలి."

786. "నమ్మినవాడు ఎప్పుడూ చెడిపోడు; పూజ చేసేవాడికి ఏమీ ఉండదు; చేయించుకున్న వాడికే నమస్కారం చెయ్యటం కన్నా చేయించుకోవటంలో ఉన్న బరువు వాళ్ళకు తెలిస్తేగా? అమ్మ - అని వెళ్ళి నమస్కారం పెడుతున్నారు. కానీ ఈమె అని కాదుగా? వాళ్ళకేం, వాళ్ళ నమ్మకమే వాళ్ళను రక్షిస్తుంది."

787. "ఉచ్ఛ్వాస నిశ్వాసాలు సమంగా వుండటమే విశ్వాసం."

788. "విశ్వాసమే భగవంతుడు."

# మనస్సు

789. 'మనస్సు నిలవకపోతే ఏం చెయ్యాలమ్మా?'

"ప్రయత్న మంటూ ఒకటి బయలు దేరిందిగా? మనస్సు నిలుపుకుని దీని ద్వారా ఏదో పొందాలనుకునే ఒక భావం కలిగింది మనస్సులో. అది అంతకు ముందు లేనిది; మధ్యలోనో ఎప్పుడో బయలుదేరింది. ఆ బయల్దేరటానికి క్కారణమైనదే ఎప్పుడో ఒకప్పుడు నీకు (తను యిచ్చి ఉన్న దానిని) ఇస్తుంది. దానిని తరుణం అంటాను నేను. లౌకిక విషయాలకు ఏ శక్తి సహాయపడుతుందో అదే ఆధ్యాత్మికాలనే వాటికి సహాయపడుతుంది."

790. 'మనస్సు అస్వతంత్రురాలుగా?'

"స్వతంత్రురాలూను. రెండు చూసినప్పుడు అస్వతంత్రురాలు. మనస్సు దైవమయినప్పుడు అస్వతంత్రురాలెట్లా?'

791. "సంకల్పం వేరూ, దైవం వేరూ, మనస్సు వేరూ కాదుగా?"

792. "ఆత్మచేతనే మనస్సు ఏర్పడ్డది. దానికి వినాశం లేదు. రూపాంతరమే కాని రూపనాశనం లేదు."

793. "మనస్సు అంటేనే కదలిక (చలనం). అది లేకపోతే మనస్సు అనేమాట వర్తించదు."

794. "మనస్సు అంతటా ఉంది కదా - కేవలం గుండె దగ్గరే కాక, ప్రాణం గూడా శరీరం మొత్తంలో ఎక్కడుందీ అంటే - ఏం చెప్తాము. తడి గుడ్డలో తడి ఎక్కడుందీ అన్నట్లు?

795. "మనస్సే మంత్రం - శబ్దమే నిజం."

796. "మనస్సుతో మనస్సును నేరుగా గుర్తించలేడు గనుక వేరొక దానిని ధ్యేయంగా పెట్టుకుని గుర్తించటం మంత్రజపమంటే."

797. "కొంగ జపం-కాకిమంత్రం. సంధియే ఏకాకి."

798. "మనస్సు లయమయ్యే చోటు ఆలయం."

799. "హృదయ మంటే సర్వమూ గుర్తించేది."

# మాహాత్మ్యాలు

800. "ఏమిటో - ఈ మాహాత్మ్యాలలో వచ్చే నమ్మకం ఎంతసేపు? అసలు మాహాత్మ్యమంటే ఏవిఁటీ?- లీలేగా. ఈ ప్రపంచం సృష్టించటమే మాహాత్మ్యమైనప్పుడు అందులో యివన్నీ ఒక లెక్కా? ఇవి మూర్ఖంగా ఉన్నవాళ్ళకు లక్ష్యం చూపించటం వరకూ ఉపయోగపడతయ్ కానీ, ఇవే ఆధారం అని నమ్మినప్పుడు - ఇవి లేనప్పుడా నమ్మకం కూడా అట్లాగే పోతుందిగా? ఇట్లా కలిగిన నమ్మకాలు ఎంతకాలం నిలుస్తయ్?"

801. "ఒక పావలా పెడితే కర్పూరం వస్తుంది. ఈ కర్పూరం దేనికి తియ్యటం? దానివల్ల 'జనం అహో వచ్చింది' అని చెప్పుకోవటానికి ఉపయోగపడేదే కానీ ఇది దేనికీ పనికి వచ్చేది? ఇట్లాగే ప్రతీదీని. కాదా? శక్తి అన్నది నువ్వు చెప్పిన పాములో మాత్రమే ఉన్నదా? ఇంకో దానిలో మాత్రం లేదూ? ఇప్పుడు ఆ బుట్టకు ఆ ఆకారం రావాలంటే ప్రాణశక్తి లేకపోతే రాదు? మన చేతులకు చేసే శక్తి, దానికట్లా అయ్యేశక్తీ, రెండింటికీ ఉన్నయ్. (ఏ)శక్తిలేకుండా ఉన్న వస్తువులే దసలు. అగ్గిపుల్లకు వెలిగే శక్తీ, కర్పూరానికి అంటుకునే శక్తీ, నీకు వెలిగించే ఉద్దేశమూ- ఈ మూడూ కలిస్తేనే అది వెలగ్గలిగేది. ఉన్న శక్తి అంతా ఒకటే కదా? అటువంటప్పుడు ఇవన్నీ దేని కసలు?"

802. "మహాతత్త్వానికి మాహాత్మ్యాలతో పని లేదు."

# అవతారం

803. "పాపభారం ఎక్కువై మార్పు చేయటానికి వస్తున్నాడంటారు. తాను పెట్టుకున్న నిర్ణయం అయిపోయి మళ్ళీ వస్తున్నాడంటాను. నాటకం వ్రాశాడనుకో - వాడే పాత్రధారి అయినప్పుడు - ఏం జరిగేది తనకు తెలిసినప్పటికి - చూస్తూ వూరుకుని తన పాత్రనుపోషించటమే జరుగుతుంది."

'అవతార మెందుకు?'

"అసలు ఎప్పుడూ ఉంది. అసలును అసలైనవాడే అర్థం చేసుకుంటాడు. అవతారం ప్రతీవాడూ గుర్తించటానికి లీల అనీ, ఆట అనీ అంటారు. రూపం వచ్చేసరికీ బద్ధుడౌతాడు. రూపం ఎప్పుడైతే కావాలసి వచ్చిందో అప్పుడు నిర్ణయానికి బద్ధుడు కావాలసిందే. చీర, రవిక, ఉత్తరీయం, ధోవతి - అన్నీ అవసరమే."

804. "కారణం లేకుండా అన్నీ తానే అయి, అన్నీ కారణాలూ తానే అయి తనవే అయి వచ్చిందే సంపూర్ణ అవతారం. ఒక కారణంతో చెప్పి వచ్చేది- కారణావతారం. ప్రతివాడూ అవతారమే కానీ, టైం రావాలి. అందరూ ఒకే తడవ అయితే - ఇంక సృష్టి దేనికి? ఎవరికి టైం వచ్చినప్పుడు వాళ్ళు-"

805. "ఇప్పుడు ఒక నాటక ముందనుకోండి - ఆ నాటకం వ్రాసిన వాడూ పాత్రను ధరించాల్సి వస్తుంది. అందులో దుఃఖపాత్ర వస్తే - అదీ; ఏ పాత్ర వస్తే అదీ - వేయాల్సిందేగా? తనే వ్రాశానని తనకు తెలుసు. అన్నీ తనకు తెలుసు కాని పాత్రధారణ వ్రాసేటప్పుడు కర్టెన్ తానై. ప్రేక్షకులు తానై, నాటకం తానై. చేయించేది తానే అయి, చేసేదీ తానే అయి అన్నీ తానే అయి - వ్రాస్తాడు. కానీ ఏ పాత్రను వేయాల్సి వచ్చినప్పుడు ఆ పాత్ర వేస్తాడు."

805. 'అమ్మా గాయత్రీ! ఇక్కడున్నావా?'-

-లక్ష్మీకాంతయోగి.

806. 'అమ్మ సాక్షాత్తు రాజరాజేశ్వరీ దేవి -' --కాశీకృష్ణాచార్యులు.

807. 'త్రేతాయుగంలోని సీతయే కలిలో అనసూయ'

--మన్నవ రామబ్రహ్మం.

808. అమ్మ 1962లో మద్రాసులో ఉండగా -

'అమ్మ లేకుండా జిల్లెళ్ళమూడి రాముడులేని అయోధ్యలా ఉంది.'

--పోతుకూచి రవీంద్రనాథ్.

809. 'ఇపుడు చిట్టెమ్మ వయ్యావు కిట్టమ్మా (కృష్ణుడు)'

--యార్లగడ్డ రాఘవయ్య.

810. 'అమ్మా - నీవు కైలాసం నుండి దిగి వచ్చిన పార్వతివా?'

--మూల్పూరి సుబ్రహ్మణ్యశాస్త్రి.

811. 'అమ్మ అంటే బమ్మే' --శారదాకుమార్.

812. 'అమ్మ కథే అవనిగాథా

అవనే అనసూయమ్మ కాదా ?' --రాజా

813. 'అమ్మా - నీవు మరియమ్మవా?' --ఒక క్రైస్తవ సోదరి.

814. 'అమ్మ మతాన్ని ఉద్దరించటానికి క్కాదు; మానవుణ్ణి ఉద్ధరించటానికి అవతరించింది.' --అర్. యస్. సుదర్శనం.

815. 'రామునిలోని ధర్మదీక్షా, కృష్ణునిలోని సర్వ సామర్థ్యమూ, బుద్ధునిలోని కారుణ్యమూ, క్రీస్తులోని సహనమూ --- అన్నీ ప్రేమలో సంగమించి ప్రేమమూర్తి అమ్మగా యీ పృథ్వీస్థలిపై అవతరించింది.'

# జన్మలు

816. 'ఈ జన్మ తర్వాత మరో జన్మ, మరో జన్మ...... తర్వాత మరో జన్మ. ఇట్లాగే సర్కిల్ అవుతుంటే - దీన్నుండి ఎప్పుడు బయటపడటమూ, ఎప్పుడు విముక్తి - అని?'

"వాడు పుట్టిన సర్కిల్ రైటైతే భయానికి అవకాశంలేదు.... ...... ముందు జన్మల సంగతి గుర్తులేదు. మనం శాస్త్రాలను నమ్మి భయపడటమే గదా? లోగడవి గుర్తుంటే ... ముందు జన్మలను గురించి ఆలోచించవచ్చు. అందాకా ఎందుకు? పుట్టినప్పటినుండి నీ జీవితం ఒక విధంగా జరుగ లేదు. పరీక్షలు ప్యాసవటమూ, తప్పటమూ ప్యాసయితే సంతోష పడటమూ - నీ ఆలోచన తర్వాత నీ బిడ్డల గురించి ఆలోచన తర్వాత నీ బిడ్డల గురించి ఆలోచన. ఈ జన్మలోనే యిన్ని రకాలుగా మారుతుంది కదా! అట్లాగే ఎన్ని జన్మలెత్తుతామో, ఎన్ని జన్మలెత్తామో ... అనవసరం. జరిగిన జన్మలను గురించి తెలుస్తే - జరుగబోయే జన్మలను గురించి తెలుస్తుంది.

ఏం జరిగినా నాకెందుకూ? అమ్మకెదురుగా కూర్చున్నాను. అన్నీ ఆమె చేయిస్తుంది - అనుకుంటే ఏ బాధా లేదు."

817. "చచ్చిపోయి ఈ శరీరం వచ్చిందాకా ఎక్కడ వున్నట్లు? ఆ విషయం చెప్తే జన్మల సంగతి ఆలోచిద్దాం-"

818. "మఱపే మరణం."

819. "మరణమంటే పరిణామమే."

820. "పరిణామానికి చరమదశ బ్రహ్మ స్వరూపం."

821. "తెలిసినవాడికి జన్మల్లేవు.
తెలియనివాడికి ఏది ఏమౌతుందో తెలియదు.
ఒక జన్మకేది కారణమో అన్ని జన్మలకూ అదే కారణం."

822. "జన్మక్కారణం అకారణం."

823. "తెలిసినవాడికి-వాడిక్కాదు కదా! ఎవరికీ అనేక జన్మలున్నయ్యనిపించదు. ఏక జన్మేకదా! 'ఆత్మ నశించదు' - అనుకున్నప్పుడు ఆత్మలోనిదే కదా జీవత్వం! ఆత్మకు లేని జన్మలు మరి జీవత్వానికి ఎక్కడ నుండి వస్తయ్?"

824. "తెలిసిన వాడికి రెండు లేవు. తెలియని వాడికి భయం తప్పదు. ఈ భయం వల్ల ఆగుతాడా? --- ఆగడు --- మరి, యీ పునర్జన్మ ఉన్నదీ, లేదూ--- అన్న ఆలోచన. చర్చల వల్ల ప్రయోజనం?"

825. "మొట్ట మొదటి' జన్మకేది ఆస్కారమో - ఈ సంస్కారాలన్నిటికీ అదే ఆస్కారం."

826. "జనన మరణాలను గురించి క్రుంగు పొంగులు లేకపోవటమే అమృతత్వం."

# సన్యాసం

827. "వివాహం చేసుకుని గృహస్థుగా ఆధ్యాత్మిక సాధన చేయటం కోటలో ఉండి యుద్ధం చేయటం. సన్యసించటం కోట విడిచి యుద్ధానికి వెళ్ళటం."

828. 'సన్యాసం ఎందుకూ పుచ్చుకోవటం?'

"తనున్న స్థానాన్ని గుర్తు చేసుకుంటూ అయినా కట్టుబడతాడని."

829. "ఇట్లావుండి సాధించలేనన్న జంకు కలిగిన తర్వాత ఒక కట్టుబడికి ఉండవచ్చునన్న ఉద్దేశంతో సన్యాసం తీసుకోవాలనుకుంటారు."

'కాషాయ వస్త్రధారులందరూ ఆ జంకు కలిగితేనేగా ఆ బట్టలు మార్చటం?'

"తప్పకుండా - గుడ్డమార్చినందుకు దాని కోసమయినా మనస్సులో ఏమున్నా - ప్రయోగాలుండవు. కొన్ని నియమాలకు కట్టుబడి ఉంటారు."

830. "మంచమ్మీద వద్దు - చాపమీదే పడుకుంటాననటం కోరికే. తెల్లగుడ్డ వద్దూ, కాషాయగుడ్డ కావాలనటమూ కోరికే."

831. "ఆ కోరిక లేని స్థితిని సంపాదించుకోవటానికి ప్రయత్నం సన్యాసం."

832. "బుద్ధుడు వెళ్ళాడని వెళ్ళటం కాదు. ఆయన వెళ్ళినట్లుగా వెళ్ళాలి. అయనై వెళితే అందరూ బుద్ధులే."

833. "నీ కోసం నువ్వు సన్యసించావు గానీ లోకకల్యాణం కోసం కాదు."

834. "సన్యాసి కావాలెగానీ పుచ్చుకొనటం కాదు."

835. "వైరాగ్యమంటే వేపాకు తిని ఉండటమే కాదు. ఏది దొరికితే అది తృప్తిగా స్వీకరించటమే."

836. "లింగభేదం, రూపభేదం లేనివాడు సన్యాసి."

837. "సర్వభక్షకుడయిన నాడే భిక్షకుడవుతాడు."

838. "జిహ్వను జయించటమంటే ఏది అందితే అది తినటం. వేపాకు తింటాను - అంటే అదీ కోరికే."

839. "దిగంబరి ఏమీ సోకనివాడు.
అవధూత ఏమీ అంటనివాడు"

840. "మమతలేని మతమే అందరికీ సమ్మతం. అదే నా మతం."

841. "కామినీ కాంచనాలను వదలటం మాటా? అది కోరికను జయించమన్న మాట కాని ఆ కోరికకు లక్ష్యం ఏది అయితేనేం?"

# కర్మ

842. "పుణ్య మొస్తుందని చెయ్యమన్న పనులు చెయ్యగలవా? నరక మొచ్చినా ఫరవాలేదని చంపమంటే చంపగలవా? చెయ్యలేవు. అన్నీ ఆ కర్మే చేయిస్తుంది."

843. "నీలో దృఢ విశ్వాసమున్నప్పుడు నువ్వనమ్మిన శక్తే - మంచికానీ, చెడుకానీ - అన్నీ చేయిస్తుందనుకుంటావు. ఆ నమ్మకం సరిగా లేనప్పుడు మంచి ఆ శక్తీ, చెడు నీ కర్మ చేయిస్తుంది అనుకుంటావు. ఆ కర్మ కూడా ఆ శక్తిదేగా? ఈ సర్వమూ ఒకే శక్తిచే నడిపింపబడుతున్నప్పుడు కర్మవేరూ, శక్తి వేరూ కాదుగా?"

844. "నిష్కామ కర్మకు వర్జ్యకాలం ఉత్తమమైనది."

845. "నాకు అకర్మ - కర్మ తప్ప మూడోది కనిపించటంలేదు. కర్మ కనుపిస్తున్నది, అకర్మ కనిపించదు. ఈ కర్మక్కారణం (ప్రేరణ)అకర్మ అనుకుంటాను. మనసు ప్రేరేపించేది కనిపించని శక్తి అనేగా? అది అకర్మ."

846. "పురుషకారమూ, దైవసహాయమూ - రెండూ ఒకదానివే."

847. "సర్వ బాధ్యతలూ నీవి, అని - దైవాన్ని విశ్వసించినప్పుడే - అది ఆత్మార్పణ మౌతుంది. ఇక అక్కడ మిగిలినదంటూ ఏముంటుంది?"

# భక్తి

848. "భక్తి బాల్యం వంటిది.
అది పామయినా తెలియదు; ఆడుకుందామన్న ధ్యాసలో ఉంటాడు. కత్తి అయినా తెలియదు; దేన్ని కావాలనుకుంటాడో అది కావాలి. దేన్ని నమ్ముతాడో అది కావాలనుకుంటాడు. (భక్తుడు)"

849. "గాఢత్వమే భక్తి మూఢత్వం."

850. "మమకారం అందరికీ ఉంటుంది. భగవంతుడి యందుంటే భక్తుడంటారు."

851. "నిగ్రహం కొరకే విగ్రహారాధన."

852. "నిగ్రహం ఉంటే ఏ గ్రహాలూ ఏమీ చెయ్యలేవు."

853. "తానెప్పుడూ (వాడి పనేనని) తన శక్తి నుపయోగించటమే ఆరాధన"

854. "ధారణయే అరాధన"

855. "ధ్యాస కూడా క్రియే."

856. "దూషణ కూడా ఒక విధమయిన ఆరాధనే."

857. "లడ్డు అవటంలోకన్నా తినటంలో రుచి ఉంది."

858. 'లక్ష్మణుడికీ భరతుడికీ తేడా ఏమిటమ్మా?'
"లక్ష్మణుడు రాముడి దగ్గరున్నాడు; భరతుడు రాముణ్ణి దగ్గరుంచుకున్నాడు."
'ఏది విశేషం'
"ఏదైనా ఒకటే"

859. "ఏకాగ్రత అంటే ప్రతి ఆలోచనా, కనపడేవన్నీ ఒకటిగా చూడటమే. ఏది చూచినా, ఎందులోనైనా ఒకే వస్తువును చూడటమే ఏకాగ్రత."

860. "ఎన్నాళ్ళు రాముడి దగ్గర లక్ష్మణుడున్నా తనివి తీరలేదు. (భరతుడికి) పాదాలు తన దగ్గరున్నయ్ గనుక ఎప్పుడు నెత్తినపెట్టుకుంటే అప్పుడు ఆ పాదమూ తనైనాడు."

# జ్ఞానభక్తి

861. "శంకరాచార్యులు స్తోత్రం చేయని దేవుడంటూ లేడు. 'దేవి' అంటూ ప్రతి ఒక్కరినీ స్తోత్రం చేశాడు; ప్రతీ ఒక్కరినీ వర్ణించాడు. అందరినీ ఒకే అమ్మలో చూశాడు. (ఆ అమ్మను తనలో చూశాడు) అదే అద్వైతమంటే."

862. "అన్నిటిలోను ఒకటినే చూడటం అద్వైతం."

863. "ఎక్కడ బట్టినా శ్రీ చక్రం చూడగలిగితే - ఇదంతా ఎందుకూ?"

864. 'ఏకాగ్రత ఎట్లా వస్తుందమ్మా?'

"ఆ పదానికి అర్థమే సరిగ్గా తెలియదు. ఎప్పుడెక్కడ ఎట్లా ఉన్నా ఒకే ఒక లక్ష్యమ్మీదనే మనస్సు వుండటమా?"

865. "నాట్యం ప్రదర్శించేవాడు భక్తుడు, నాట్యం తనైనవాడు జ్ఞాని."

866. "విశిష్టతే అద్వైతం - అని రామానుజులు.

అద్వైతమే విశిష్టత - అని శంకరులు."

867. "శబ్దమే - నిశ్శబ్దం. ఆత్మశబ్దమంటూ వేరే లేదు. శబ్దమే ఆత్మశబ్దం."

868. "నీ చేత నిన్ను తెలుసుకుని నీవౌవుతున్నావు. గుర్తుతో గుర్తించి గుర్తు నశించటమే."

869. "సక్రమంగా గణించటం చేతనైతే సమాధాన మొకటే."

870. "సర్వ సంకల్పాలూ తానైతే ఇతరుల మనస్సులోనిది తెలుస్తుంది."

871. "సర్వమూ సర్వానికే ఆధారం."

872. "అంతా అయిందీ, అర్థంకానిదీ అద్వైతం. దేనికదిగా ఉండి అన్నీ తనైనప్పుడు - ద్వంద్వమైనటువంటి ఆనందమేదైతే ఉన్నదో - అదే అద్వైతం."

# జ్ఞానం

873. 'మేము అజ్ఞానంలో పడి కొట్టుకు పోతున్నామమ్మా-'
"లేదు, నాన్నా - నా దృష్టిలో మీరు పరిపూర్ణమయిన జ్ఞాన స్వరూపులు."

874. "ఉన్నది లేనట్లు కనపడటమే భ్రాంతి."

875. "ఉన్నది ఉన్నట్లు కనపడటమే లో చూపు."

876. "భ్రాంతి అంటే మమకారం."

877. "భ్రాంతి వదిలితే బ్రహ్మ."

878. "చీకటే వెలుతురు కాధారం."

879 "మనం కూడా ఆ వడ్లగింజలో బియ్యపుగింజలా (దాగి) ఉన్నాం. మనలో దోషాలు అట్లా తొలగించుకుని ఆ విధంగా వేరుకావాలి."

880. "నిజంగా ఎవరో చేయిస్తున్నారనే భావం వస్తే ఇంకా ఏముందీ."

881. "జ్ఞానం పొందటమే కానీ జ్ఞానం వల్ల పొందటమేమీ లేదు."

882. "బ్రహ్మజ్ఞానం కాదు; జ్ఞానమే బ్రహ్మ."

883 "జ్ఞానం వృద్ధాప్యం వంటిది. ఇంకా నాకెందుకూ అనే స్థితి. పండు పండిన తర్వాత తొడిమ దానంతట అదే ఊడిపోతుంది. అన్నీ అనుభవించి ఇంకా ఇవన్నీ నాకెందుకనిపిస్తుంది."

884. "రెండుగా కనపడటం అజ్ఞానం."

885. "భిన్నత్వం లేనిదే ఏకత్వం."

886. "అంతా జీవమయం. నాదృష్టిలో జడమే లేదు."

887. "నేను చేస్తున్నాననుకునేది మానవత్వం. వాడు ఇస్తున్నాడనేది జ్ఞానం. అన్ని తానైనది దైవం.

సర్వమూ ఏదో ఒక శక్తి; అమ్మో, దైవమో, శక్తో - మనం కాదు దీనికి కర్తలం అనుకున్నది జ్ఞానం కావచ్చు,భక్తి కావచ్చు ఈ రెండింటిలో ఒకటి.

ఒక వస్తువు మీద విశ్వాసం చూపించినప్పుడు భక్తి అనుకుందాం. లేదూ-దానంతట అది తెలిసినప్పుడు జ్ఞానం అని మనం అంటున్నది దాన్నే. ఇంకోటి దైవం ఉన్నది. ఎవరిమీదో బాధ్యత వేశామనుకున్నప్పుడు భక్తి ; మనది కాదు కర్తవ్యం. మనకర్థం కానిది ఏదో ఉన్నదనుకున్నప్పుడు జ్ఞానం; ఇదంతా నాదీ (నీదీ) అనుకున్నప్పుడు మానవత్వం; సర్వమూ తానైనప్పుడు దైవమూ."

888. "రామానుజుడు తన దైవాన్ని చూశాడు.
శంకరుడు తనలో దైవాన్ని చూశాడు."

889. "ఎక్కడికక్కడే అనంతం."

890. "నేను నీవుగా ఉన్న అహంకార బ్రహ్మ"

891. "నేను నేనుగా ఉన్న అహం బ్రహ్మాస్మి"

892. "తనలో 'నే' ననేదే అంతటా వుంది."

893. "కర్మ, క్రియ కర్తలోవే"

894. "కారణానికి అర్థం తెలిస్తే - కార్యాలన్నీ తానే అవుతాడు."

895. "మొదట్లో (అంటే తెలియనప్పుడు) మౌనం.
చివర (తెలిసినప్పుడు) మౌనం."

896. "జ్ఞానమే భగవంతుడు. సర్వాన్ని తెలుసుకున్న తెలివే జ్ఞానం."

897. "నేను ఎవరు?
కేకవేసినదీ విన్నదీ నేనే, చూసేది కండ్లయినా గుర్తించే గుర్తు నేనే."

898. "నేనెవరు? అన్న ప్రశ్నకు సమాధానం దండలోని దారమే. పూసలు పక్కకు లాగినప్పుడు నేననే దారం కనిపిస్తుంది."

899. "గుర్తించే గుర్తులేక దీపమున్నా గుర్తించలేరు."

900. 'అద్వైతానికీ విశిష్టాద్వైతానికీ తేడా ఏమిటి?
"పండు మొత్తం చూపించి అద్వైతమన్నాను? చెక్కుతీసి విడిగా పండును చూపించి - విశిష్టాద్వైతమన్నాను."

901. "తన్ను తాను గుర్తించినవాడు సర్వాన్ని గుర్తిస్తాడు."

902. "అనాత్మ అని బయల్దేరితేగా ఆత్మ అని తెలిసేది?"
ఏది అవునూ, ఏది కాదు - అనీ తెల్పుకున్నది వివేకం."

903. "ఈ గోడా ఆ గోడా మధ్యనున్న సందు నిర్వికారం. ఇది ఉండటానికి ఆధారం అకారమేగా? ఈ రెండూ గుర్తించిన స్థితి వికారం లేని ఆకారం."

904. "అన్ని రూపాలూ ఒకటేననే స్థాయి రావటమే దైవత్వం."

905. "కర్త, కర్మ, క్రియ ఒకటే ."

906. 'జ్ఞానానికీ ప్రేమకూ సంబంధమేమిటి?'
"ప్రత్తికీ దారానికి ఉండే సంబంధమే. రెండూ ఒకే పదార్థమయినా ప్రత్తిని చూస్తే దారం జ్ఞప్తికి రాదు. దారాన్ని చూస్తే ప్రత్తి జ్ఞప్తికి రాదు."

907. "పతనమా? పతన మనేదీ లేదు. ఒక మెట్టు ఎక్కిన తర్వాత అది నిజమయిన జ్ఞానమయితే మళ్ళీ పోదు."

# మాయ

908. 'పరమేశ్వరుడు నిర్లిప్తుడుగా ఉంటే - మాయే ఇదంతా చేయిస్తున్న దంటారు. అది నిజమేనా? వాడి ప్రేరణేగా ఇదంతా? మాయ అని ఎందుకనడం - ఆయన ప్రేరణ అయినప్పుడూ?'

"నడక అవసరమని అనుకున్నాడు; అంటున్నాడు; నడిపిస్తున్నాడు. ఎవరో దైవం ఉన్నాడు; చేయిస్తున్నాడు - అనుకుంటే ఏమీ ఉండదు. ఎవరూ ఏమీ చేయించటం లేదు; ఇది సహజమే అనుకుంటే ఏ ప్రశ్నా ఉండదు. 'మాయ' అని నే ననను. ఇదంతా తన సంకల్పమే అంటే ......ఆ కనపడే కారణం తనయినప్పుడు ఇక రెండుగా ఎందుకూ? ఉన్నది ఒకటిగా తోచటం (కోసం మాయ అన్నారు. 'ఇది' లేనిది అన్నారు) లేనిది ఉన్నట్లుగా అనుభవించటమంటే (అది లేదంటే) ఎట్లా ? కాలునొప్పి పుడుతుంటే - లేదనుకోమంటే ఎట్లా? లేకపోతే దానిక్కారణమనే నువ్వనే వాడివి వేరే లేవేమోగానీ - నా కాలు నొప్పి మాత్రముంది. నేను ఆకలితో మలమల మాడుతుంటే, నువ్వు తింటుంటే, నువ్వు తింటూ నా కాకలి లేదనుకోమంటే?; అంతా లీల,మాయ అనేవి అనుభవం లేని పలుకులుగా ఉన్నయ్. నిలదీస్తే సమాధానం రాదు. శాస్త్రం లోనిది నిజమయితే ఇప్పుడు నే చెప్పింది కాదని... దైవాదీనం జగత్సర్వం అనమనూ -"

# మిథ్య

909. "నేను జగత్తు సత్యమంటాను. మిథ్య అంటే లేదని కాదుగా? మార్పు. మార్పు ప్రతి వస్తువుకూ ఉన్నది. మారేది మారని దాన్లోంచి పుట్టింది"

910. 'మిథ్యకర్థం 'లేదు' - అని కాదు మార్పు అనుకుంటాను. నాలుగెకరాలు సంపాదిస్తున్నాడంటే - తాను లేకపోయినా తన పిల్లలు తింటారనే ఉద్దేశం తోనేగా? అది సంపాదిస్తూ (జగత్తు) మిథ్య అంటే ఎట్లా? తను పోయినా ముందు ఉంటుందనేగా? అప్పుడు జగత్తు సత్యం కాకుండా ఎట్లా ఉంటుంది?"

# అద్వైతం

911. "ఇది కాదు ఇది కాదు - అంటూ అంతా అదే ననటం."

912. "ఒక పువ్వును చేతికి దీసుకుని ఈ పువ్వును - కాడా, పువ్వూ రేకులూ- అన్నీ కలిపితే అద్వైతమూ.... విడదీస్తే ద్వైతమూ."

913. "అంతా అయినదీ, అర్థ కానిదీ అద్వైతం."

914. "అన్ని రూపాలు ఆయనవే కనుక రూపరహితుడు."

915. "అన్ని గుణాలూ ఆయనవే కనుక గుణ రహితుడు."

916. "అన్ని నామాలు ఆయనవే కనుక నామ రహితుడు."

917. "అన్ని సంకల్పాలు ఆయనవే కనుక సంకల్ప రహితుడు."

918. "ఉత్తమమైనటువంటిది తనైతే - అల్పం తానుకాదా?"

919. "ప్రజ్ఞానం బ్రహ్మ అయితే - అజ్ఞానం ఎందుక్కాదు?"

920. "అన్నం పరబ్రహ్మ మయితే అశుద్ధమో ...?"

921. "అంతా లేదన్నా సరే - పూర్తిగా ఉన్నదన్నా సరే. ఈ రెంటి స్థితీ ఒకటే."

# యోగం

922. "యోగం యవ్వనం లాంటిది. నాకు స్వాధీనం కానిదేమిటి అంటుంది."

923. "అలవాట్లు కొన్ని సాంప్రదాయ సిద్ధంగా వస్తున్నయ్. సాధనకు శరీరంలో కొన్ని స్థానాలిచ్చారు. బొట్టు పెట్టుకునే చోట మనసు నిలపమనీ విగ్రహారాధన వద్దనీ, బ్రహ్మ నేనిక్కడ మాత్రమే ఉన్నాననడు గదా? సర్వవ్యాప్తమయిన వాడు ఫలానా చోట లేడని కాదుగా? మనస్సు నిలపటానికే యివన్నీ. గుళ్ళో విగ్రహాన్ని మనం చూచినా అంతే--"

924. 'యోగానికి ఆహార నియమం అవసరమా?'

"యోగసాధనకు ఉప్పూ, కారమూ, పులుసూ కూడదని చెబుతున్నారు. వీటివల్ల ప్రకోపాలు కలుగుతయ్యని అంటున్నారు. ఉప్పూ కారమూ తినని ఇతర దేశాల్లో కూడా ప్రకోపాలు కలుగుతూనే ఉన్నయ్. మిరపకాయలు తినకపోవచ్చు కానీ మిరపకాయలో ఉన్న గుణం మన శరీరంలో ఉన్నది. మనసుకూ ఆహారానికి సంబంధం లేదు."

925. గోవాడ అక్కయ్య 'ఏకాగ్రత కలగటానికి కనుబొమ్మలమధ్య దృష్టినిలిపితే ఏర్పడుతుందంటారు కదా, అది సాధ్యమౌతుందా?-' అని అడిగింది.

"సర్వత్రా ఉన్నదానిమీద దృష్టి నిలపలేవు కనుక ఒక గుర్తులో చెప్పటం ఈ ఫోటోలూ, గుళ్ళూ, మంత్రాలూ - ఇవన్నీ ఎందుకు అవసరమో ఇదా అందుకే; లక్ష్యానికి హేతువయినది. అంతేకానీ - ఆ కనుబమ్మల మధ్యనే శక్తి ఉన్నదని కాదుగా? అదొక గుర్తు."

926. "శ్వాస ఆగి కూడా బ్రతకవచ్చు. ప్రాణమంటే శ్వాసకాదు."

927. "అవయవాలచేత మనస్సు కట్టుబడేది ప్రాణాయామం. మనస్సు చేత అవయవాలు కట్టు బడేది భక్తి."

928. "ఆధారమాధారమయితే అంతా సహస్రారమే."

929. "నన్ను నీవు కలుపుకోమని పైకి వెళ్ళిందే - బ్రహ్మ స్వరూపం-ఉచ్ఛ్వాసం. క్రిందికి దిగిందే - మానవరూపం -నిశ్వాసం"

930. "ఒక అతీతమైన శక్తి గోలోకం."

931. "స్థితులు పొందటం కాదు - ఏర్పడి ఉంటయ్. మానవులకే కాదు - జీవజంతువు లన్నిటికీ."

932. "సత్తాలో మార్పు తెచ్చేవే స్థితులు. అవి ఏర్పడితే మరి పోవు."

933. "చెప్పేది, చేసేది, చూసేది - సాంఖ్య తారక అమనస్కులు."

934. "ఏ యోగం చేసినా భక్తే."

# సంకల్ప రాహిత్యం

935. 'మనస్సులో ఏ సంకల్పమూ లేకుండా జీవించాలనుకుంటే-?'
"సంకల్పమే మానవత్వం. సంకల్పమే దైవత్వం. లేకుండా ఉండాలను కోవడం కూడా సంకల్పమే.

936. 'సంసారంలో ఉన్నాము. సంకల్ప రహితులమయి దీనిలో నుండి విముక్తులమెట్లా అవుతాం?'
"సంసారమంటే సంకల్పమే."

937. "భగవత్సంకల్పం కాదు; సంకల్పమే భగవంతుడు."

938. "చేసేవాడి సంకల్పం చేత ఏర్పడ్డ ఈ సృష్టి సంకల్ప రహిత మెట్లా అవుతుంది? సృష్టికర్తే సంకల్ప రహితుడు కాలేదు. మన సంకల్పమెట్లా పోతుంది? ఈ సంకల్పం మనది కాదనుకోవటమే సంకల్ప రాహిత్యం.

939. "సంసార బాధ్యతలే ఆధ్యాతిక సాధన నాయనా - ఆధ్యాత్మిక సాధన అంటే వేరే అదేదో కాదు? నువ్వు చేసే ప్రతీ పని భగవత్సేవయనీ భగవదాజ్ఞానుసారమే ననీ అనుకోగలిగితే - యీ సంసారం ప్రతిబంధకం కానేరదు."

940. "నోటిలో పటికబెల్లం వేసుకున్నా తీపి అంటని స్థితి (ధ్యాసలేనప్పుడు) - సంసారంలో ఉండి జయించటం.
గృహస్థుగా వుండి - అన్నీ చేసి - ఏమీ అంటకుండా ఉన్నవాడు."

941. "ముక్తుడికీ అవతారానికీ తేడానా?
ముక్తుడు సంకల్ప రహితుడూ ; అవతార వ్యక్తి సంకల్ప సహితుడూ."

# వేదాంతం

942. "వేదాంతం మాట్లాడేది కాదు."

943. "చెప్పేది వినేది కానిది వేదాంతం."

944. "వేదాంతమంటే చెప్పేవాడికీ, వినేవాడికీ అర్థంకాదు. నాకు వ్యక్త పరచే భాషలేదు. మీకు అనుభవించే శక్తి లేదు."

945. "అనుభవాన్ని మాటల్లో పెట్టేటప్పటికి యదార్థం మరుగున పడుతుంది."

946. "అనుభవం శాస్త్రాన్నిస్తుంది కానీ శాస్త్రం అనుభవాన్నివ్వదు."

947. 'అయితే అమ్మా దాన్ని ఎలాగ తెలుసుకోవడం?'

"తనంతతానే తెలియబడేది వుంది. ఒకడు చూశాడనుకో - వాడికి చెప్పనవసరం లేదు. లేదనుకో - ఎన్ని పోలికలు ఇచ్చినా వాళ్ళు చూసినట్టనిపించదు. అనుభవించిన దాన్ని రూపకల్పన చేసి చెప్పాలి. అది ఎంత అర్థమవుతుందీ అనేది వినేవారి స్థితిని బట్టి వుంటుంది. ఉన్నదాన్ని ఉన్నట్లు ఎవడూ అర్థం చేసుకోలేడు."

948. "వ్యవహారం వినేవాడికి తెలిసినా తెలియక పోయినా చెప్పేవాడికి తెలుసు. వేదాంతం చెప్పేవాడికీ తెలియదు; వినేవాడికీ తెలియదు."

949. "రోగి వ్యాధి నయమైనది అని తను అనుకోవటం కంటే మీకు ఆ వ్యాధికి మూలకారణమేమిటో తెలుసు కనుక అది నిశ్శేషంగా నివారణ చెయ్యటమే వేదాంతం."

# మానవత్వం

950. "పొరపాట్లతో కూడిందే మానవత్వం."

951. "నేను చేస్తున్నాననేది మానవత్వం."

952. "కొంత తనదీ, చాలామటుకు దేవుడిదీ అనుకోవటం మానవత్వం."

953. "ద్వంద్వాల్లో తోచే సంకల్పమే మానవత్వం."

954. "పరిమితమయిన మమకారం మానవత్వాన్ని సూచిస్తుంది."

955. "సర్వత్రా అనురాగమే విరాగం,"

956. "దిగులే జిజ్ఞాస."

957. "ధ్యాసే ధ్యానం."

958. "ముముక్షుత్వమే మోక్షం."

# దివ్యత్వం

959. "తన పిల్లల వరకే పరిమితంగా ఉంటే పామరత్వం. అందరి యందూ ఉంటే భగవంతుడు."

960. "తన బిడ్డయందు ఏం చూస్తున్నామో అందరి యందూ దానిని చూడటమే బ్రహ్మస్థితిని పొందటం."

961. 'సంసారంలో ఉండి అద్వైతస్థితి సాధించట మెలాగా?'

"కూతుర్ని కోడల్ని ఒకే విధంగా చూసుకుంటే సరి-"

'అది సరిపోతుందా?'

"ఇది చూసుకోగలిగిన రోజున ప్రపంచమంతా (అట్లాగే) చూడొచ్చు."

962. "అందరి పిల్లల్నీ ప్రేమిస్తే విశ్వమాత కదూ?"

963. "దైవత్వంటే నాలుగు చేతులూ కిరీటమూ కాదు."

964. "సర్వత్రా ఉండే మమకారం మాధవత్వాన్ని గుర్తింపజేస్తుంది."

965. "ఏకత్వం గల సంకల్పమే దైవత్వం."

966. "భిన్నత్వం లేని మనస్తత్వమే దైవత్వం."

967. "అన్నీ తనే అనేటటువంటి మనస్తత్వమే భగవంతుడు."

968. "విచక్షణ లేని వీక్షణే అనుగ్రహం."

969. "ఎదుటివారిలో దైవత్వాన్ని చూస్తున్నంత సేపూ మనలో దైవత్వం కలుగుతుంది."

970. "సర్వత్రా పూజ్యభావాన్ని చూడగలిగినవారే పూజ్యులు."

971. "వాడు ఇస్తున్నాడనేది జ్ఞానం. అన్నీ తానైనది దైవం."

972. "దైవం గుర్తించేటట్టు ఎప్పుడూ ఉండడు. సర్వసామాన్యంగా ఉంటాడు."

973. "ఆధారం సాధారణమైనప్పుడు గుర్తించలేము."

974. "దైవత్వమంటే యిమిడివున్న శక్తి. శక్తి పెరిగేదీ లేదు; తరిగేదీ లేదు."

# పూర్ణయోగం

975. "దేనిని అయినా సరే పొందటానికి చేసే సాధన తపస్సే. దేనిని అయినా గాఢంగా ఆరాధించటం కూడా తపస్సే."

976. "అశాంతి శాంతిలోదే. అశాంతి లేకపోతే శాంతి యొక్క స్థితి ఏమి అర్థమౌతుంది ?"

977. "సహనమనే దేవత నారాధించాలంటే బాధలనే పూజాద్రవ్యాలు కావాలి."

978. "భక్తీ, యోగమూ, జ్ఞానమూ- ఒకదాన్ని విడిచి ఒకటి ఉండవు."

979. "ఎవరు దగ్గర లేరనుకుంటున్నావో, ఎవరు కావాలనుకుంటున్నావో - వార్ని ఆవేదనతో ఆరాధిస్తున్నావు. ఆరాధన అంటే ఆవేదనేనమ్మా- ఏడుపంటే కళ్ళనీళ్ళు కాదుగా? హృదయాన్ని దగ్ధం చేసే అగ్ని ప్రవేశించి దహనం చేస్తున్నది. అది సర్వమమకారాల్నీ, రాగద్వేషాదుల్నీ దహనం చేసే మహాయోగం. అదే అందరూ సర్వ సామాన్యంగా చెప్పుకునే హఠయోగం. అదే భక్తి (యోగం). సర్వకాల సర్వావస్థలయందూ ఉన్నప్పుడు అదే జ్ఞానం. అదే నిష్కామ కర్మ; అదే సర్వమూ."

# సమాధిస్థితి.

980. "అన్ని శబ్దాలు నీ శబ్దాలు కావటమే నిశ్శబ్దం."

981. "అంతా ఆత్మగా తోచటమే ఆత్మసాక్షాత్కారం."

982. "లోపల ఏదో వెలుపల అదే."

983. "ఆత్మకు ప్రతి మనమే(జగత్తు)."

984. "సర్వమూ సామాన్యమయిన - సర్వ సామాన్యం."

985. "సంపూర్ణ స్థాయి అంటే ఏమీ - తెలియని, అంతా తెలిసిన స్థితి."

986. "సర్వకాల సర్వావస్థలయందూ సమానస్థితియే సమాధి."

987. "సర్వకాల సర్వావస్థలయందు సహజమయిన సహనమే సమాధి."

988. "సమత్వమే సమాధి."

989. సమాధిస్థితి అంటే ఒకసారి ఏర్పడి ఒకమారు లేనిది కాదు; సర్వసమాన స్థితి. లేనిది కలిగినప్పుడు కలిగినది పోతుందిగా?"

# ఆనందం

990 "ఆనందం స్థలాన్ని బట్టి వచ్చేదికాదు నాన్నా. ఆనందం మనస్సుకు సంబంధించినది. (ఆనంద)పడేవాడు అయితే ఎక్కడున్నా ఎటువంటి సమయంలో నయినా పడతాడు. ఇంటిదగ్గర్నుండి బయలుదేరినప్పుడు మార్గమధ్యంలో ఏ చెట్టుకిందయినా కూర్చున్నప్పుడు రాయి కఠిన మయినదా - సున్నితమైనదా (నునుపైనదా) అని చూస్తాం. అది సహజం కానీ అది ఎటువంటిదయినా కూర్చోటానికి రాయి దొరికింది; అంటే చాలు అనుకునేటటువంటి స్థితి వంటిది ఆనందం."

991. "తృప్తి అంటే ఇంతకన్నా మరొకటి లేదనే స్థితి."

992. "వైకల్యం లేకపోవటమే కైవల్యం."

993. "తెలిసి అనుభవించేదే ఆనందం."

994. "ఈ ద్వంద్వాలు ఆ బ్రహ్మగా గుర్తించినదే బ్రహ్మానందము."

995. 'అమ్మా - అనేకమంది ప్రశ్నలు వేసి తమ సందేహాలు తీర్చుకుంటారు. కాని మాకు - ఇక్కడున్న వాళ్ళకు - అవి ఏమీ తెలుసుకోవాలనిపించదు. ఎంతసేపూ ఈ సన్నిధిలో ఉంటే చాలుననిపిస్తుంది. ఇట్లా మాకెందు కనిపిస్తుందీ?'

"సర్వవేదాల సారమిది. ఆ ఎందుకు అనిపిస్తుందో కారణం తెలుసుకుంటే చాలు."

996. "సర్వకాల సర్వావస్థలయందూ ఒడుదుడుకులు లేకుండా ఉండేదే ఆనందం. అగ్నిహోత్రంలో కాలుతున్నది ఏమౌతున్నదని దాన్ని గురించిన ఆలోచన లేకుండా తన లక్ష్యాన్ని ఆనందించటం."

# పరిపూర్ణత్వం

997. "సర్వత్రా భిన్నత్వం లేకపోవటమే పరిపూర్ణత్వం."

(ఏది చూచినా అక్కడకది పరిపూర్ణము - అనే తెలియడం పరిపూర్ణత్వమట)

998. "నేనేదో పెడ్తుంటే ఒడి పట్టడం కాదు. అన్నింటికీ ఒడిబట్టాలి."

999. "నా దృష్టిలో ఎక్స్‌పీరియన్సులేవు ఎవ్వరికీ. సర్వకాల సర్వావస్థలయందూ అంతా ఒకటేననే భావమేఎక్స్‌పీరియన్సు అంటే-ఏ అమ్మయితే ఉన్నదో అదే అన్నీ అనే భావమే - అమ్మ యిచ్చింది. అమ్మ చంపింది. అమ్మ పెళ్ళి చేసింది - అని తోచిన్నాడే ఎక్‌పీరియన్స్ గానీ లేన్నాడు లేదు."

1000. "తెలియనిది లేకపోయినా, తెలిసింది లేకపోయినా ఒకటే స్థితి."

# అమ్మపాదాలు

1001. డ్రయిన్‌లో అమ్మ నిలబడి ఉంటే బామ్మ అమ్మ పాదాలమీదుగా ప్రవహించే గంగను తీసుకుని త్రాగింది. బామ్మ తలపైన అమ్మ నీళ్ళు చిలకరించి మూడుసార్లు తనే ఆ పాద తీర్థాన్ని పట్టి స్వయంగా త్రాగించారు.

1002. 'ఇంకా టెంపరేచరున్నదా అమ్మా' - అని ఆయన అమ్మ పాదం పట్టుకున్నారు.

"పాదాలు చల్లగానే ఉంటయ్, నాన్నా-"

'అవునమ్మా - అవి మీవి అయితే కదూ?'

1003. కృష్ణభిక్షు దైన్యానికి జవాబుగా -

"అన్ని సార్లు పట్టిన ఆ పాదాలు నిన్ను రక్షించక పోతాయా?"

1004. "ఈ ఊరుకు ఒక పాదం చాలు."

'మిగిలిన పాదం అంతటా తిరుగుతుందా అమ్మా?' అమ్మ తల ఊపేరు అవునన్నట్లు.

1005. 'అమ్మ వాళ్ళిద్దరూ తన పాదాలకు పూజచేసిన పూలు తీసి వాళ్ళ నెత్తిమీద జల్లేరు.'

1006. 'మీ పాదాల్లో పార్వతీ పరమేశ్వరులు కనుపిస్తున్నారు.'

1007. "ఇంత శరీరం ఉంటే పాదాలకెందుకూ నమస్కారం అన్న ప్రశ్న.

ఆ పాదమూ పాదమ్మీదనే ఆధారపడ్డది కనుక -"

# అందరికీ సుగతే

1008. "ఎక్కడ పుట్టారో అక్కడే కలుస్తారు."

1009. "అందరిదీ తలా ఒక రాతయినా, చివరకు అన్నీ ఒకే రాతలో కలుస్తయ్. రాతకానీ, ఏదన్నా కానీ- "

1010. 'అందరికీ ఒకటే దండా అమ్మా?'

"అందరూ ఒకే దండకు కట్టుబడ్డారు కదూ; పూలు వేరైనా దారము ఒకటే. ఆ దారానికి అందరూ కట్టుబడ్డారు కనుక అందరికీ ఒకటే దండ."

1011. 'దుష్ట సంస్కార మున్నవాళ్ళ తరింపు ఎట్లా అమ్మా?'

"ఆ బాధ్యత తల్లిదేగా? వాడు బురద పూసుకున్నా ఇంకెట్లా ప్రవర్తించినా ఆ బాధ్యత తనది అనుకుంటున్నది కనుక వాడిదేమీ లేదు. ఎవరైనా తరింపజేస్తుంది."

1012. 'నా గతి ఏమిటమ్మా?'

"వాడిగతే నీగతి. అందరికీ సుగతే - కాస్త ముందు వెనుకల తేడా గానీ-"

# మనవి

'అమ్మ-అమ్మవాక్యాలు' మొదటి సంపుటం సిద్ధమైనప్పుడు. రెండోముద్రణానికి మహాచేరితే ఇంకో వందవాక్యాలకెక్కువ చేరగలవని అనుకున్నాము. వాటిని కూరుస్తున్నప్పుడు అమ్మ అన్నారు - అప్పుడు మళ్ళీ ఇదే ఎందుకూ అప్పుడు మరోకటి - అని. ఆనాడు ఈ రెండో సంపుటం ఇంతసైజులో రాగలదని మేము అనుకోలేదు. అమ్మ అన్నట్టు "అనుకున్నవి జరుగవు. మనకున్నవి తప్పవు" ఈ అనూహ్య సంఘటన జరిగినందుకు మేమే కాక పాఠక సోదరులూ సంతోషించడం అమ్మ దయవల్లనే. జయహో మాతా.

మొదటి సంపుటముతో పాఠకులకు అమ్మ పరిచయముకొంత కలిగి వుంటుంది. పెక్కురు 'అందరిల్లు'కు వెళ్ళి అమ్మను చూచి తీర్థప్రసాదాలు తీసుకుని వుంటారు. అయితే అంతటా వున్న అమ్మను గురించి వలెనే యీ రూపముతో వచ్చిన అమ్మను గురించిన్నీ చాలినంత తెల్సుకోవడం కొద్దిమార్లు వెళ్లి రావటంతో సాధ్యమయ్యే పనికాదు. ఈ 'వాక్య' సంపుటాలు వెలువరించడములో మా ఆశ - యెరుగనివారికి అమ్మను గురించి శ్రవణము చేయించగలమనీ. మననము చేయడము చదువరుల వంతు. తరువాతి ఫలితము నిధిధ్యాసనము మాకు ఇప్పటికి అందని పండు. 'వాక్యాలు' చదివిన సోదరులు చిరగమ్య యాత్రికులు యెవరు దానిని పండించుకొన్నా ఆసుగంధము ఆఘ్రాణించి మేము పండించుకున్నంతగా సంతోషిస్తాము.

అందరిల్లు - అనగా జిల్లెళ్లమూడిలో అమ్మ వుండే ఆవరణ - ఎవరికేనా వింతకాని వింత. ఇక్కడ అనేక మనస్తత్వాల వారుంటారు. అది నియమాలూ, నిషేధాలూ ఉండే ఆశ్రమం కాదు అందరిల్లు. ఎవరువచ్చినా లోకంలో లాగే అక్కడా వారి స్థానంవారి తిండివారికి వుంటుంది. పాలు ఎక్కువ మిగిలిననాడు పాయసము, కాకుంటే పెరుగు, లేకుంటే మజ్జిగ చేసుకుని తింటారక్కడ. రూపంతో వచ్చిన 'అమ్మ' "అన్నం తిని రండి ముందు" అని పంపిస్తారు. అందరూ కలిసి కూర్చోవచ్చును లేదా వారికి కావలసినట్లు కూర్చొని భోజనము - కోరితే

స్వయంపాకము - చేసుకొనవచ్చును. ఎవరికేనా సరే 'అందరింటి' గేటులు తెరిచేవుంటై. అది రావటానికీ పోవటానికీ అడ్డులేని అది రావటానికి పోవటానికి అడ్డులేని ఆవరణ. కొన్ని రోజులు అక్కడ ఉండదల్చుకుంటే - కలోగంజో అక్కడ ఉన్నదే తాగి ఉంటామంటే ఉండొచ్చు. వేరే వండుకునేవాళ్ళు వండుకోవచ్చు. చాలా కుటుంబాల వారున్నారు. అలాగ అక్కడ (అన్నపూర్ణాలయంలో) తినేవారు తింటారు. అది 'మన కుటుంబం'. అయితే ధర్మము తప్పి వచ్చి అక్కడు ఉండమని ఎవరూ అనరు; అమ్మా అనరు. మరొకచోట కష్టమనిపించేది అక్కడా వున్నది. చేసుకునేవారికందరికి ఎవరిపనివారికుంది. ఆడపిల్లలూ మగపిల్లలూ పొలముపని, నీటిపని, ఇంటిపని, వడ్డన, సంధ్యావందన - సుప్రభాతాలూ అన్నీ చేసుకుంటారు. ఆడవారు 'అక్కయ్య'లూ మగవారు'అన్నయ్య'లూను. అక్కడి పిల్లులూ, కుక్కలతో సహా ఎవరికంటె ఎవరూ తక్కువా ఎక్కువా లేదు. ఏదో పూజనాడు 'పిల్లి ముట్టుకున్నది' అని ఒకరు అంటే 'పిల్ల ముట్టుకున్నది' అన్నారు అమ్మ. తెల్లవారుజామున నాలుగు గంటలకూ సాయంత్రము ఆరుగంటలకూ జాగంట వాయించి సుప్రభాతమూ సంధ్యావందనమూ చదువుతారు. పూజలకూ, భోజనాలకూ గంటలే కొడతారు. పెండ్లికీ జాగంటే కొడతారు. మృతశరీరాన్ని శ్మశానానికి తీసుకు వెళ్ళుతూ జాగంటే కొడతారు. పెండ్లికీ ఆ జనాభానే హాజరవుతారు. శ్మశానానికి ఆ జనమే పిల్లలతో సహా నడుస్తారు. శుభకార్యాలూ అమ్మ చేతిమీదగానే జరుగుతున్నాయి. చావులూ ఆ చెయ్యే జరిపిస్తున్నది. నామకరణము, అన్నప్రాశనము, అక్షరాభ్యాసము, ఉపనయనము, వివాహము, అత్తవారింటికి వెళ్ళడము, పూజలు, పండుగలు, ఉత్సవాలు, మరణాలు, (ఈ అయిదు ఏళ్ళలో నాలుగైదు జరిగినయ్ అక్కడ) ఆబ్దికాలు - అన్నీ చూస్తారు. అక్కడ కాపురాలున్న వారూ, అగంతకులు, కష్టాలు అక్కడ వున్నాయి. అయితే లోకంలో సామాన్యులు ఏడుస్తూ అనుభవిస్తారు. అక్కడివారు అమ్మ సమక్ష భాగ్యంవల్ల నవ్వుతూ అనుభవిస్తారు. ఉండవలసిన లోకానికి అందరిల్లు చిహ్న రూపము. ఉండవలసినట్లుగా ఉండగలుగుతున్నదా? - అన్న ప్రశ్నకు అక్కడివారి ప్రయత్న దీక్షయే జవాబు. అక్కడికి వెళ్లేవారు దేవీ దర్శనానికి వెళ్లినట్లుగానే పండ్లు, పూలు, కుంకుమ, పసుపు, చీరె, రెవిక, గాజులు, బొట్లువంటివి తీసుకవెళ్లి ఇచ్చి

అమ్మ పాదాలకు పూజ చేసుకుని వస్తారు. వారిచ్చినవి స్వీకరించి వాటిని తిరిగిప్రసాదంగా ఇస్తారు అమ్మ. ప్రతిదినమూ కూడుతారు ఇలాగూ వచ్చేవారు. వారు హాల్లోనో, మందిరంలోనో చేరితే అమ్మ స్నానం చేసి సర్వాభరణాలతోవచ్చి కుర్చీలో కూర్చుంటారు. సహస్రనామాలో, అష్టోత్తరమో, శ్రీసూక్త పురుషసూక్తాలో యెవరో ఒకరు చదువుతారు. పూజ జరుగుతుంది పూజకు పూలో, పత్రాలో, కుంకుమో, పళ్ళో, మరమరాలో, బిస్కత్తులో, కొబ్బరిచిప్పలో ఎవరికి నచ్చినవి వారు వాడుకో వచ్చును. ఒక్కొక్కప్పుడు నాలుగయిదు గంటలు అలాగే కూర్చుంటారు అమ్మ. జనం హెచ్చుమంది లేకుంటే మంచంమీదే కూర్చుంటారు. వచ్చినవారు చుట్టూ కూర్చుని ఒక్కొక్కరు వచ్చి పువ్వులు అమ్మ పాదాలపై వేసి తీర్థ ప్రసాదాలు పుచ్చుకొని వెళ్తారు. అమ్మ ముఖంలో మామూలుగా కూర్చున్నప్పుడు, పూజకు కూర్చున్నప్పుడు ఏ భావ సంచలనమూ ఉండదు. మనందరికీ ఏదో భావము మన ముఖాలమీదనె కదుల్తూనె ఉంటుంది. మన కళ్ళు దేనినో స్ఫురణతో చూస్తూనే వుంటాయి. అమ్మ ముఖంలోగానీ, కళ్లలోగానీ యే ఉద్యమమూ కనపడదు. ఏ సందర్భంలోనైనా పిల్లనో పెద్దనో- తన కడుపున పుట్టినవారినైనా సరే - 'రా' అని పిలవటం వింటామే, ఆ పిలుపులో బంధము, భావము యేదీ స్ఫురించదు. అనునయమూ, వైముఖ్యమూ అన్నవి యే కొంచెమూ ఉండవు. ఆమెగారి కళ్ళు గాలిలో అటునుండి ఇటూ, ఇటునుండి అటూ తిరుగుతాయా అనిపిస్తుంది. ఈ అనాశక్తి - సక్తి - ఆసక్తికాని తత్వము. ప్రశాంతి అనీ అంటారు కొందరు - జిల్లెళ్ళ మూడిలో మొట్టమొదట తగుల్తుంది మనకు.

అమ్మ మంచం చుట్టూ చేరేవారు ఆమెను యేదైనా అడుగుతారు. జబ్బులూ భయాలూ సందేహాలు, చిక్కులూ రకరకాలుగా వుంటై ప్రశ్నలు. మొదటివి, ఆఖరివి గురించి నాకేమీ తెలియదంటారు అమ్మ. "యేడుస్తూ అనుభవించేవాడు నవ్వుతూ అనుభవించేవాడి దగ్గరకు సలహాకు వస్తాడు." అన్నారు ఒక సందర్భంలో. "కష్టాలు సుఖాలు వాడిచ్చినవే" అనడమూ విన్నాం. దయ్యాలూ, చేతబడులూ, నెత్తి అణచడాలూలాంటివేవీ లేవంటారు అమ్మ. మనస్సే దయ్యము, మనస్సే దైవమూ అనడమూ విన్నాము. ఇక-సందేహాలన్నవి

రెండువిధాలుగా వుంటాయి.

అమ్మ దగ్గరకు వచ్చాము కదా - యేమీ అడగకుండా వెళ్లిపోతే ఎలాగా? అన్నట్టు అడిగినవి. ఏదో తెల్సుకుందామని అడిగినవీనీ. అన్నిటికి అమ్మ తేడా చెయ్యకుండా సమాధానం చెప్తారు. అయితే పై మొదటిరకపు ప్రశ్నలకులమ్మ ఇచ్చే సమాధానాలు ఒక్కొక్కప్పుడు చురుకుగా వున్నట్టు కనిపిస్తాయిగానీ కొరికిచూస్తే కమ్మదనమే కాని కారం వుండదు. 'ఆత్మని తెల్సుకోవటానికి యేమార్గం మంచిది?' అని అడిగితే 'ఏమార్గమైనా మంచిదే" అన్నారు. సంసారములో ఉండి అద్వైతస్థితిని పొందడం ఎలాగా'అని ఒక గృహిణి అడిగితే కూతుర్ని, కోడల్ని ఒకలాగ చూసుకుంటే సరి" అన్నారు.... ఈ ప్రశ్నలకు జవాబులు తీపి ఎక్కువై మొగం మొత్తడమూ కద్దు. 'నీకు ఆశా అసంతృప్తి ఏమిటమ్మా?'అని అడిగితే "పిల్లలకోసం ఆశ; చాలక అసంతృప్తి"అన్నారు. 'మాలో ఉండి నీలో లేని దేమిటమ్మా?' అంటె "నాకోసం తపన" అన్నారు. .... ఈ జవాబులు అడిగిన మనిషినిబట్టి వుంటాయి - ప్రశ్న ఒకటే అయినా 'ధ్యానంలో బింబం నిలవట్లేదమ్మా. అనుగ్రహించమ్మా -' అంటే "ఆ బింబమే అనుగ్రహించాలి నాన్నా"అన్నారు. 'మనస్సు నిలవటలేదమ్మా?'-అంటె "నిలిస్తె అది మనసెకాదు నాన్నా-" అన్నారు ఇంకొకరితో. "నిలవడము లెదన్న బాధ ఇది వరకులెనిది ఇప్పుడు కలిగింది కదా. అలాగే తరుణం వచ్చినప్పుడు నిలుస్తుంది" అన్నారు మరొకరితో. మీ సాధన మేమిటమ్మా? అని అడిగితే ముగ్గురికి మూడువిధాలుగా సమాధానం వచ్చింది. అడిగిన వారి అంతస్థును బట్టి వస్తుంది అమ్మ జవాబు. ఈ సత్యము తెలుసుకుందామని అడిగిన రెండో ప్రశ్నలు- వెదాంతానికి సంబంధించి ఉండెటివి. - గమనిస్తే తెలుస్తుంది. వేదాంతాన్ని మనము వల్లించుకోవడమూ, మింగేయడమూ మాత్రమేకాని అరిగించుకోము. కనక ప్రశ్నలు అడిగినప్పుడు విన్న ప్రశ్నలె అడుగుతాము. అమ్మతత్వము అనుభవంనించి వచ్చేది శాస్త్రాల్లోది కాదు. కనుక అమ్మ ఇచ్చె జవాబులు శాస్త్రాలను తెగకోసుకుంటూ పోతున్నట్టు వినబడతై. 'అద్వైతం అంటే మీ ఉద్దేశం ఏమిటి? అని అడిగాడు ఒక పండితుడు. "అసలు ఆ మాటకు రెండు కానిది అని అర్థము." 'ఏ రెండూ కానిదీ'? 'కాకపోవడ మెలాంటిది?' అంటూ తర్కం పెంచుతారు వేదాంతులు. ఈ బాదరబంది అంతా

అసలు తెలియక శాస్త్రాల మాటలు పట్టుకొనివాటనే పిసికేవారికి. ఇక అమ్మ ఏమని చెప్పారు? "అంతా అయిన(ట్టి)ది." అన్నారు. శాస్త్రాలు నూరినపండితులు 'బావుంది' అని రాసుకున్నారు. ఈ అర్ధాన్ని వారే అడిగారూ సంకల్పరాహిత్యం అన్నది.లేదా అని. "చేసినవాడి సంకల్పం వల్ల వచ్చిన- ఈ సృష్టిలో సంకల్పం ఎట్లా లేకుండా పోతుంది? ఈసంకల్పం మనది కాదనుకోవటమే సంకల్ప రాహిత్యం" అన్నారు అమ్మ. శాస్త్రాలు చదివే "పండితులకు - సామాన్యంగా యేది పొందటానికైతే చదువుకున్నారో అది పొందలేక (పోవటంతో) చదువు మాత్రమే మిగుల్తుంది" దానిమీద తమ భాషాజ్ఞానాన్ని మెత్తి వాదన ప్రారంభిస్తారు. కుండలినీ జాగరణము తాను చేయగలనని ప్రచారము చేస్తుండిన యోగిగారొకరు అమ్మను 'మీకు కుండలిని జాగరణం అయిందా?' అని అడిగారు. అమ్మ అన్నారు "మీకు ఆ జాగరణం అయినప్పుడు ఈ ప్రశ్నకు తావులేదు" అని ఇంకొక స్వాముల వారు అద్వైతానికి విశిష్టాద్వైతానికి తేడా ఏమిటి? అన్నారు. ఇది పాండిత్య పరీక్షయే గానీ సందేహము కాదు. అమ్మమాత్రమూ సందేహానికే సమాధానం చెప్పారు. అక్కడి అరటిపండు ఒకటితీసి పండుమొత్తం చూపించి "ఇది అద్వైతం" అన్నారు తొక్క కొంత తీసి "ఇది విశిష్టాద్వైతం" అన్నారు. (చిదచిత్తులు వేరే అయినా కలిసే వున్నాయి అన్నట్లు) ఈ సమాధానము ఆయనకు తగలకపోలేదు. అయినా అన్నాడూ 'చదువుకో శాస్త్రం' అని వెనకటికి బాలసుబ్రహ్మణ్యస్వామిని బ్రహ్మగారు ఇలాగే దబాయించాడట.

సుబ్రహ్మణ్యస్వామికి వలెనే అమ్మకు గురువెవ్వరూ లెరు. ఆయనగారు పరమ శివునకు వలెనె ఈమె తన తాతగారికి - ఆయన తనను ఎత్తుకున్నప్పుడు చెవిలో చెప్పినట్లే చెప్పేవారు. వేదాంత రహస్యాలు. వేదాంతమని అనలేము.- జగత్తత్వ రహస్యాలు. అమ్మ చెప్పే తత్వము వేదాంతమని అనలేము - వేదాలసారమని చెప్పేతత్వం కాదు కనుక. చిత్రముగా వుంటుంది - అమ్మ చెప్పే మాటల తత్వాన్ని మాటలసాయం తోనే చెప్పుకోడము మనం చూసేది ఇదంతా ఎక్కణ్ణించి వచ్చింది? అన్నప్రశ్నే తీసుకుందాం. ఎవరైనా దేవుడు సృష్టిస్తే వచ్చింది అంటారు కదూ! అమ్మ సంగతేవేరు. గుళ్ళో విగ్రహాన్ని దేవుడు అని అంటాంగా అమ్మ అడిగారూ "గుళ్ళో దేవుడు. కుంకుమ. చీరెలు. పువ్వులు. పళ్ళెం ఇవన్నీ

ఎక్కణ్ణుంచి వచ్చాయి?" అని భూమి నుంచి అనే కదా జవాబు. గుళ్ళోని దేవునితో బాటు అన్నిటికీ ఆధారమైన ఈ భూమి (జగత్తు)నే కదా పూజ చేయవలసింది - అని కలత పడ్డారు చిన్ననాటి అమ్మ. ('సర్వం ఖల్విదం బ్రహ్మ' అర్థమేమిటి?) ఎన్ని ఆలోచనలు చేసినా "ఏదో శక్తి అంతా అయినట్టిది ఇదంతా అయి ఉన్నది."(లేదా వచ్చింది) అనే అనాలి. 'ఎందుకని అయి వచ్చింది' అని అడిగితే అమ్మ "నేను సహజమనే అంటాను" అన్నారు. కొందరు 'లీల' అంటారు. అమ్మ "అంతటా తానే ఉన్నప్పుడు లీలేంటీ?" అని అంటారు. "సహజంలో లీలవుండొచ్చు కానీ లీల సహజం కాదు." అంటారు. సహజం అన్నది ఎప్పుడూ ఉండేదే. కనక సృష్టికి పూర్వం లేదు - అన్న మాటే గదా! శాస్త్రాలు సృష్టితోబాటు ప్రళయం అన్నదాన్ని చెబుతై. అమ్మ అన్నారూ "ప్రళయం అంటారు. జగత్తంతటికీ రాదు" అని. ప్రతివస్తువూ మారుతూ ఉంటుంది. "మరణం అంటే పరిణామమే" గదా? జగత్తులో "పరిణామమే కానీ వినాశము లేదు."

ఆశక్తి ఇదంతా అయి రావడంలో అనంతమైన రూపానికీ, అసంఖ్యాక మైన నామానికి, అపరిమితమైన క్రియకీ, మమకారానికి, సర్వత్రా ఉన్న బలానికి, జ్ఞానానికి పరిమితి వచ్చేసింది. "అన్నీ తానే అనేటువంటి మనస్తత్వమే భగవంతుడు. కాగా పరిమిత మమకారం మానవత్వం అయింది. "భిన్నత్వంలేని మనస్తత్వం భగవంతుడు." కాగా "ద్వంద్వాల్లో నిలిచే మనస్తత్వమే మానవత్వం" అయింది. ఏది చేసేదైనా తానే అనుకునేది దైవత్వం కాగా "కొంత తనదీ కొంత దేవుడిదీ అనుకునేది మానవత్వం" అయింది. తాను సృష్టిగా మారడంలో వచ్చే బేధాలను హెచ్చు,తగ్గు అని మాత్రమే దైవత్వం గుర్తించుకుంటె వాటినె మంచి చెడ్డలుగా, కష్ట సుఖాలుగా, పుణ్యపాపాలుగా మానవత్వం చూస్తోంది. "ద్వంద్వాలకి ఆధారమయింది దైవత్వం" అయితే "ద్వంద్వాల్లో నలగడమే మానవత్వం" అయింది.

మానవత్వానికి గమ్యం ఏమిటి అన్న ప్రశ్నవేస్తే మోక్షము, కైవల్యము, నిశ్శ్రేయసము, అంటూ శాస్త్రులువార్లు చాలాచాలా చెప్తారు. "ముముక్షుత్వమే మోక్షం" "వైకల్యం లేనిదే కైవల్యం" "తృప్తే ముక్తి" అన్నారు అమ్మ. వాటి మాటేమో గానీ ..... ఇవేమో ఈ జీవితానికి సంబంధించినవిగానూ, జీవితంలోనే పొందడానికి

వీలైనవిగానూ వినిపిస్తాయి. మోక్షమంటే విదేహ ముక్తేనని అనరు అమ్మ. వారి దృష్టిలో "లౌకికానికి ఏ(దిసాయమై నడిపిస్తుం)దో ఆధ్యాత్మికానికీ అదే. అట్నుంచి చదువుదాము ఈవాక్యాన్ని. " ఆధ్యాత్మికానికి ఆధారము ఏదో లౌకికానికి అదే." ఈ దృష్టిలో (తత్ అనే ) 'అది' ఏదో మరణానంతరము మాత్రమే మనకు తారసిల్లేటదీ జీవితకాలములో మనయెడ ఉదాసీనము వహించి మనదారిని మనలను పోనిచ్చేదీ కాదు. కొంత మనము చేస్తుంటే కొంత తాను చేస్తుండేదీ కాదు. అంతా తానే అయినట్టిది. "తానొకటి తలిస్తే దైవము ఒకటి తలుస్తాడు - కాదు, దైవము తలుస్తూనే తాను తలుస్తాడు." "సర్వత్రా నిండి ఉన్నాడూ, ఇదంతా వాడి లీల అంటారు. లీల అన్నా వాడిలీలే కాని మన లీల ఏమీ కాదు. తన లీలే. మన (కర్మ ఫలిత) ప్రారబ్దమంటూ లేదు. ఇదంతా అవసరమై కలిగించుకున్నా డనుకున్నా తన అవసరమేగాని మన అవసరమేమీలేదు. అప్పుడూ మనం మిగల లదు. ఇదంతా సహజమనుకున్నా అద సహజం కనుక మనదేమీలదు. కాబట్టి మనంగా చేసేదేమీ లేదు." అన్నారు అమ్మ. ఇంకా వినండి: "నా మనోభావం ఒకటే నాయనా. చెయ్యాలంటే చేయ్యలేవు: చెయ్యొద్దు అనుకుంటే చెయ్యకుండా ఉండలేవు."అది చేయించేది చేసేవాళ్ళే ఎవరేనా." కాబట్టి బ్రతికినన్నాళ్ళూ 'అది' చేయించినట్లు చెస్తూ, మన పరిమిత మమకారానికి నచ్చినదాన్ని సుఖమని నచ్చనిదాన్ని కష్టమనీ అంటూ సుఖదుఃఖాల్లో నలిగి చివ్వరికి? -- చివ్వరికీ ఏమౌతామూ? ఆలోచిద్దాము.

ఎక్కడినుంచి వచ్చామూ మనమూ? పరమేశ్వరుని సంకల్పం వల్ల ఆయన నుంచి వచ్చాము తల్లితండ్రుల నుంచి కాదు. వారిద్వారా, భగవత్సంకల్పం వల్ల భగవంతుని నుండి వచ్చాము. ఆయనే కదా ఈ అంతానూ? మరి ఆయననుంచి (లేక 'అమ్మ'నుంచి వచ్చామనడానికి ఆక్షేపణ ఏమిటి? మనకు "జీవితమూ జీవనమూ భగవంతుడిచ్చినవే" జన్మలున్నాయి అని నమ్మితే తొలి జన్మలోని అనుభవాలకు కారణము భగవంతుడేకాని మన కర్మఫలితము ఏదీ అంటూ ఉండదు గదా కారణము కావడానికీ? నాటకంలో నటులకు సూత్రధారుడు సుఖ-కష్ట: గొప్ప-బీద: అతిబల-దుర్బల-భూమిక లిచ్చినట్లుగా భగవంతుడు మనకందరికి తన సంకల్పానుసారంగా భూమిక లిచ్చాడూ, మనలను ఆ భూమికల

చరిత్రలో నడుపుతున్నాడు. ఆయన మనకిచ్చిన భూమికలు అయిపోతే తనలో నుంచి తీసివారికి భూమికలిచ్చినవాడు తిరిగి తనలోకే తీసుకుంటాడూ:- అర్ధమేమిటి? ఆయన ఇచ్చిన జీవితములో నడవడమన్నది మన తప్పుగానీ ఒప్పుగానీ కాదు. కనక మనకు నరకము స్వర్గమూ ఎందుకని రావాలి?

'జీవితంలో మనా ఇతరులా- ప్రయత్నాలూ వాటి ఫలాలూ కనిపిస్తున్నాయి గదా? -వండుకుని తిందేగానీ వున్న ఆహారమేనా లభించదూ. మరి మన ప్రయత్నము లేకపోవడము ఏమిటీ?' అని అడుగుతారు. దానికి సమాధానము: "మనకాళ్ళు నడుస్తాయి కనుక మనమే నడిచేస్తున్నాము అనిపిస్తుంది." కాని ప్రేరణ ఎవరిదీ? "ప్రేరణ కనిపించదు" కనుక దాని సంగతి మనము పట్టించుకోము. అది లేదన్నట్లే మాట్లాడుతాము. "మొక్కులు పెట్టడానికీ, ఆకొండకు వెళ్ళడానికీ" అన్నిటికీ ప్రేరణ ఆయనదే. ఆ ప్రేరణ లేకుండా ఏ పనీ జరుగదు. ఏ ఆలోచనారాదు. ఏ రూపమూ ఏర్పడదు. మన జీవితాలన్నీ ఆయనయొక్క సంకల్పము నిర్ణయించిన ఎగుడుదిగుడు వంకరటింకర కాలిబాటలో సాగి గమ్యము చేరతాయి. ఏమిటి గమ్యమూ? ఆయనే! "రాతలన్నీ వేరయినాఅన్ని రాతలూచివరికి ఒకే రాతలో కలుస్తాయి." వాడి గతే నీ గతి. అందరికి సుగతే. కాస్త ముందూ వెనుకాగాని 'మళ్ళీ ఈముందు వెనకా ఏమిటి?' - అంటారేమో? కొన్ని జన్మలైన తరువాత' అని యేమీ కాదు. అందరికీ మరణం ఒకమారుగా రాదుగా?మరణానికి ముందు బెరంగజేబుకిలా జీవితం ఇచ్చినవాడే పశ్చాత్తాపమూ సత్యదర్శనమూ కలిగించి సుగతి కలిగిస్తాడు. 'ఎవరికేనా తప్పదు వచ్చిన చోటికి పోక.'

'అయితే, తప్పకుండా కలగ గల సుగతి కోసము ఇన్ని తంటాలేలా? హాయిగా 'ఋణం కృత్వా ఘృతం పిబేత్', లేకపోతే వాల్మీకి మహాముని పూర్వాశ్రమోద్యోగం' చేయరాదా-ఇహసౌఖ్యం పూర్తిగా లభిస్తుంది. పరానికా? క్షాళనము చేసే అమ్మ ఉండనే ఉన్నదిగా? అని అనవచ్చును కొందరు. వారికి సమాధానము నీకు పరలోకంలో శిక్షవస్తుందని గానీ, నికృష్టజన్మ వస్తుందని గానీ, ఝడిసి ఏ పనైనా ఒక పని చెయ్యడము మానేవా? - పోనీ మంచి ఫలం కోసం మంచిదనుకున్న పని గానీ చేశేవా? ఇహలోకంలోని ప్రత్యపకారము కోరి

ఒక పని చేసి, ఆ ఉపకారమేదో రాదనుకొని అనుమానం తట్టితే, వేరేమీ చెయ్యలేక 'పోనిలే పుణ్యం వస్తుందిలే' అనుకున్న మన పనులు ముందే పుణ్యం రావాలని అని చేసేవి కావుగా? వాటిని లెక్క వేసుకోరాదు. కనుక పరలోక అనుభవాల ఆశా.భయమూ కానేకాదు నిన్ను నడిపేది. వాటికోసం నువ్వు మానేవీ లేవ్వూ. చేసేవీ లేవు. ఏదో శక్తి అంతా తానే అయినా నీకు అర్థము కానట్టిది - చేయిస్తోంది నీచేతా, నా చేతా, అందరి చేతాను. కనక నువ్వు ఒకటి చేయ్యాలంటే చెయ్యలేవ్వూ మానాలంటే మానలేవు. 'మరి ఈ సాధనల మాటేమిటి? ఎందుకూ ఇవీ? ఇందరి చేతా యోగాలూ ధ్యానాలూ ఎందుకు చేయిస్తున్నట్టూ?' అని అడిగితే అన్నీ చేయించడము ఎందుకో ఇవి చేయించడమూ అందుకే. మ్రొక్కులు పెట్టించడము కొండకి పంపించడమూ ఆ శాసనంలోవే" అలాగే ఇవీనీ.

ఇక్కడ మరొక సందేహము : "పైన చెప్పిన తత్వమంతా'ఏది జరిగితే అదే భగవన్నిర్ణయము' అంటున్నదీ. 'మనము ఏమీ చెయ్యకుండా కూర్చోలేము.' అంటున్నది అయితే తాము చేస్తున్నాము అనుకునేవారు తమకు కావలసిన దాని కోసము యత్నము ఏది చెయ్యవద్దన్న అడ్డు ఏమి లేదుగా? దైవమూ - పరలోకమూ- ప్రశంసే లెకుండా మాకు కావలసినది చేసుకుంటామూ అయిన పని అవుతుందికానిది అవదు. ఇప్పుడు జరుగుతున్నదీ అంతెగా? మరి అమ్మమాటల తత్వమేదో తెచ్చిన కొత్త సందేశమూ సహాయమూ ఏమిటీ?-" అని ఇందాకా చెప్పిన మానవత్వపు గుణాలు ఒక మారు మళ్ళీ చదవండి ఆశా అసంతృప్తుల సముచ్చయమే మానవ జీవితము. అందరికీ సుఖము కావాలీ సుఖము అంటేఎ ప్పటికి ఏది కావలిస్తే అది జరగడము. ఇది అందరికీ అన్ని వేళలా జరుగదు. కనుక అందరూ సుఖేషు ఉద్విగ్న మానసులూ, దుఖేషు విశేషస్పృహులూ అవుతారు. దానికో తృప్తి అన్నదే లేదూ. వైకల్యమే జీవితము పాడుగునీనీ.

ఏది జరిగినా (ఏది జరక్కపోయినా) అనుద్విగ్న మానసులూ.విగత స్పృహులూ అయినవారికి చెప్పవలసినదేమీ లేదూ - ఉండదూ - వారికి ఏది కావాలనేది అక్కరలేకుండా కావాలి అంటే ఫలానిది కావాలనీ ఉండదూ, ఫలానిది వద్దని వుండదూ. ఉదాహరణకి వారికి "ఏదో ఫలానిది తినాలని వుండదూ. ఏది

తినవలసి వచ్చినా వద్దనిపించదూ." ఏది తమ వంతుకు అనుభవించ వలసివస్తే అదే చాలు వారికి వారి ఇంట ఎంతమంది భోజనం చేసినా "వారి తిండి ఇక్కడున్నది కనక తింటున్నారు" అనుకుంటున్నారూ. ఎవరేనా తినకుండానే వెళ్ళిపోతే "వారి తిండి ఇక్కడలే"దనుకుంటారు. వారికి స్నానానికి వేడినీళ్ళు కాస్తారనుకోండి. ఒకనాడు అవి ఉండవు: "పోనీ చన్నీళ్ళే పొయ్యి" అంటారు. వారికి ఇది అవస్థ అనే చింత (ఎప్పుడూ) ఉండదు. "వారు" దేనికోసమనీ ఏది చేసింది" ఉండదు. వారిని "సుఖపెట్టేవారూ బాధపెట్టేవారూ ఎవరూ" ఉండరు. "ఎప్పుడూ ఒంటరిగా ఉన్నట్టు తోచదు." వారికి వారిది "నేర్పుగల ఓర్పుగాదు. సహజమైన ఓర్పు" వారికి ఆరోగ్యం ఎప్పుడూ లేకపోవచ్చుగానీ కులాసా లేకుండా ఉండదు." వారు ఎవరినీ తప్పకుండా రమ్మని పిలవరూ: ఎవరికీ వెళ్ళిపొమ్మని చెప్ప"రూ. వారికి మంచీ చెడూ, ఇష్టమూ అయిష్టమూ లేవు. పాడిబట్ట సుఖమూకాదు తడిబట్ట బాధాకాదు. సింహాసనం మీద, కిరటం పెడితే కూర్చోడము అన్నది గొప్పాకాదు. కుష్ఠరోగి కాలు వత్తి శుభ్రం చేయ్యడము తక్కువా కాదు. ఏ బిడ్డని కావాలని ముద్దుపెట్టుకోరు. పెట్టుకున్నప్పుడు కళేబరమైనా సరే ముద్దు పెట్టుకుంటారు. అడిగిపెట్టించుకున్నప్పుడు వారు మనము అడిగినట్టే అడిగి పెట్టించుకుంటారు. కానీ కలిపి ఇంకొకళ్ళకు పెడతారు. వారు అన్నప్రాశనకు వచ్చినా, అంత్యక్రియలకు వచ్చినా ఒకలాగే ఉంటారు. మనకైతే ఎన్నో ఆలోచనలు. వారికొకటే ఆలోచన-అంతా అదే అని. కొట్టవలసి వస్తే వారు శివలింగంతో కుంకుడుకాయలు కొడతారు. వారికి ఒకరు చూసినవారు లాగా ఇంకొకరు ఎరుగని వారుగా ఉండరు. దగ్గరుంటే అంతా చూసినవారుగానే వుంటారు. లేచి వెళుతున్నప్పుడు అంతా చూడనివారులాగే వుంటారు. వారికి వైకల్యమూ అసంతృప్తి వుండవు. ఈ అమ్మ అలాంటివారు. అలాటి స్థితి వున్నదన డానికి వారే నిదర్శనము. ఇక ఎటు తిరిగి జీవితములో వైకల్యమూ అసంతృప్తీ కలవారికే, ఇవి లేకుండా వుండాలంటే ఏమి చెయ్యాలీ' అన్న ఆలోచన మతాలన్నీ దీనికే జవాబులు. జైనమతము 'నీకర్మల భారమే నీ కష్టాలకీ సుఖాలకీ కారణమూ, అనుభవించడము ద్వారా 'ఆ భారము వదుల్చుకో'- అంటుంది. బౌద్ధము 'దుఃఖము ఉన్నది, దానికి కారణము ఉన్నది, నివారణ ఉన్నది, మార్గమూ ఉన్నది'

అని అష్టాంగయోగము చెపుతుంది. కాని చేతామనుకున్నప్పుడల్లా చెయ్యలేడు మానవుడు. మహేంద్రపల్లవుని మత్తవిలాస ప్రహసన బౌద్ధుల చరిత్రమే నిదర్శనము. 'ఆది దంపతులు చేసిన పాపమే వారి వంశాన్ని వెంటబెట్టి హింసిస్తోందీ, దేవుని దూతా - దేవుని కుమారుడూ - ఇచ్చిన సందేశాన్ని పాలించితే జీవితానంతరము స్వర్గసుఖమూ స్వామి సన్నిధానమూ లభిస్తాయి' అంటాయి మరికొన్ని మతాలు. ఇవి ఆ సందేశాలపైనే ఉంచమనే విశ్వాసము పైన ఆధారపడతాయి. 'ఆ విశ్వాసము ఉంటేనే దాని ప్రకారము ఆచరిస్తేనే జీవితానంతరము సుఖము, అది లేకుంటే నరకమే' అంటాయి ఇవి. ఆత్మ అంతటా ఉన్నది. దానిని తెలుసుకుంటె నీకు పునరావృత్తిలేని ముక్తి కలుగుతుంది. లేకుంటే పితృయాన మార్గాన వెళ్ళి నీ కర్మను అనుసరించిన సుఖదుఃఖాలు అనుభవించి మళ్ళీ జన్మ ఎత్తుతావు.' అంటాయి ఉపనిషత్తులు. నీ కార్యారంభాలు, కామ సంకల్పవర్జితాలుగా నీ కార్యదీక్షా ఫలాపేక్ష రహితంగా వుంచి, సర్వము నాకు అర్పించు, నేను నిన్ను రక్షిస్తాను అంటాడు గీతాచార్యుడైన శ్రీకృష్ణుడు. ఇవన్నీ విని అనుసరించవలసిన మార్గాలు అమ్మ చెప్పేది దారికాదు, మరి గమ్యమే. 'పైవన్నీ మనల్ని 'పదండి జగన్నాథమునకు' అంటాయి. అవి చెప్పినట్టు- మనము చెయ్యకుంటే ముక్తి లేదట; అమ్మ అంటారు గదా "ఏదో మనకు అర్థంకాని విశ్వశక్తి జగత్తుగా నడుచుకు పోతోంది. జీవితాంతమున అందరికీ సుగతే. జీవితకాలములో 'అనుకున్నవి జరుగవు తనకున్నది తప్పదు.' కనక ఏది జరిగినా ఎవరు ఏది చేసినా మనం కాదు చేసేది మనని నడిపించే శక్తి 'మరొకటి ఉన్నదనుకోవటమూ తోచినదేదో చేస్తూ కష్టం వచ్చినా సుఖం వచ్చినా అదంతా ఆశక్తి మనవంతుకు తెచ్చిపెట్టినదే. అని హాయిగా అనుభవించటమూనూ కర్తవ్యము" అంటారు. అది జగన్నాథుణ్ణి తెచ్చి జగత్తు సర్వము మీద దింపే తత్వము. నీవూ, నీయంతట నువ్వు చెయ్యడమూ - అన్నదే లేదు సర్వమూ జగన్నాథమే కాదా ఇక్కడ. ఈ మూల నీ కర్తృత్వము కొంత వున్నదా? "సౌఖ్యంగల దారిగా కనబడుతూ దుఃఖాన్ని ఋజువు చేస్తుంది 'నాది' అనేది." "పడడడానికి, పడకుండా వుండటానికీ, పడితే దెబ్బలు తగలకుండా వుండటానికీ కారణము అదే". 'బాధలేదా?' 'కష్టమే లేదా?' "(నీవు) భరించలేనిదే (నీకు) బాధ." "(నీకు)

ఇష్టం లేనిదే (నీకు) కష్టం." "నీవు సహించలేనిదే హింస" నొప్పి కూడా వాడిచ్చినదే. నీకు వచ్చినది నీ వంతు. ఏమి వచ్చినా ఒడిపట్టు. హాయిగా అనుభవించు. తృప్తే ముక్తి.

ఇది కొత్త తత్త్వమే. ఇందులో లౌకికమూ ఆధ్యాత్మికమూ రెండూ లేవు. ఉన్నదంతా అదే. 'ఇది' వేరూ 'అది' వేరూ కాదు. అదే ఇది. వాడిక్రియా నీ క్రియా అంటూ రెండూ లేవు. ఉన్నదొక్కటే క్రియ. చెట్టు శాఖలాగ వ్యష్టిగా కనబడుతుంది - అంతే. అన్ని క్రియలూ, అన్ని సంకల్పాలు, అన్ని రూపాలూ, అన్ని నామాలూ వాడివే. మనము అనే 'ప్రజ్ఞానమూ అజ్ఞానమూ' సుగంధమూ, దుర్గంధమూ' 'అన్నమూ అశుద్ధమూ' 'పనికి వచ్చేవి పనికి రానివి' అన్నీ అదే -ఇదే. 'చేయవలసినది 'ఇది' అంటూ ఏదీ ఒక్కటీ లేదు. 'జరిగేది' మాత్రమే ఉంది. దేనిని జరిపించేదేనా 'అదే.' అయితే నేను 'చేతులు కట్టుకు కూర్చోడమేనా' అని అడిగితే అదీ నీ చేతుల్లో లేదూ. కూర్చుంటాను అని అనుకుంటావేమో గానీ కూర్చోవూ, ఎవరినైనా కూర్చోబెట్టే పని చేయించే ప్రేరణ వుందే. అది ప్రేరేచినట్లు జరగవలసినదే గానీ 'నేను వేరే యీ మూల నా కిష్టమైనట్లు చేసుకుంటాను' అని ఒక నీవు అనవచ్చునూ అక్కడ ఇంకొకడు అనవచ్చును గానీ అది జరిగి తీరదు. జగత్తంతటా వుండే ప్రేరణ ఈ నీ మూలలో అక్కడ అమూలలో జరగాలని నిర్ణయించినదే ఇక్కడా అక్కడా ఎక్కడా జరుగుతుంది. అది నీవనుకున్నదే కావచ్చునూ, దానికి వ్యతిరేకమైనదీ కావచ్చునూ దాన్ని రాసుకుంటూ పక్కకి పోయేద్దైనా కావచ్చు. నీవనుకున్నదే జరిగితే 'నేను చేశాను, నేను చేయించాను' అనుకుంటావూ. (లేకపోతే 'వాడు చేశాడు' అనుకుంటావూ), లేకపోతే 'విధి జరిపించింది' అనుకుంటావు. ప్రపంచమంతటా జరిగేది ఆప్రేరణ- అనగా దైవం - చేయించేటట్టు జరగగా, "నేను వేరు' అనుకునే వేరే వేరే పనులు 'నేను చేశాను' అంటే 'నేను చేశాను' అనుకుంటారు. ఇక సర్వమూ ఆ దైవం నిర్ణయించినట్టు జరుగుతుంది' అని అనుకునేవాడు ముమ్మిడివరం బాలయోగి లాగ అంతటికీ ప్రేరణ నిచ్చే విశేషాన్ని తనలో దర్శిస్తూ కూర్చుంటాడూ లేకపోతే జనకమహారాజులాగ లోకధర్మాన్ని తాను చేస్తూ సుఖదుఃఖాలకు అంటీ అంటకుండా వుంటాడూ కాదా! వేమనయోగిలాగా, రమణమహర్షిలాగా

మాటలతో, చూపులతో ఆ విశేషాన్ని అన్నివిధాల ఆర్తులకు అందిస్తూ వుంటాడూ, లేదా అమ్మలాగ కనపడే సామాన్యంలోంచి యోగులు విడదీసుకునే విశేషమే సామాన్యము అయి సాగుతున్నది అని గుర్తించి, విశేషాన్ని గురించి అడిగితే చెపుతూ, విసనకర్రలోనూ, తడవలోనూ, నొప్పిలోనూ, వ్యాధిలోనూ, పిల్లల ఏడుపులోనూ, మంత్రపుష్పంలోనూ, తనలోనూ, ఇతర్లలోనూ, అంతటా అదే చూస్తూ ఏది జరిగినా 'దాని టైము వచ్చిందీ అది వచ్చేసింది.' అని హాయిగా అనుభవిస్తాడు.

కొంత నాదీ కొంత దైవానిదీ అనుకునేవాళ్ళే సుఖదుఃఖాలలో ఉద్విగ్నులూ విశేషస్పృహులూ అవుతూ రెండింటి మధ్యా నలుగుతారు. వీరు తమకంటే తక్కువ నలిగేవారి సలహాలూ కోరతారు. వారు తాము నమ్మినది ఉపదేశం చేసి ఇలాగ ఇలాగ సాధన చెయ్యమని నిర్దేశిస్తారు. నమ్మకం అనేది టోపీలాటిది కాదూ; ఎవ్వరైనా అనుకున్నది చెయ్యలేరూ, తమకున్నదీ సాధ్యమైనదే చేస్తారు. గురువు లన్నవారు - ఆడవారికి ఒక పద్ధతీ, మగవారికి మరొక పద్ధతీ, చెప్పేవారూ - దక్షిణలు నిర్ణయించేవారూ, తాము చెయ్యనిదైనా చెప్పేవారూ కావడముతో 'సాధనలు' చేప్పేవీ వినేవీనే కానీ చేసేవి అవలేవు.'బ్రహ్మచర్యము కావాలి' అంటారు. "శరీరానికి అంటుకోవటమే ప్రధానమా? మనస్సుకు అంటుకోవటం కాదా?.... బ్రహ్మచర్యమంటే లింగభేదమూ రూపభేదమూ స్పర్శభేదమూ లేకుండా ఉండటం." అది సాధ్యమైన వాడెలాటివాడూ?.... "భగవంతుని గుర్తు చూపించిన వాడే గురువు" ఊరికే చెవిలో ఏవో అక్షరాలు- తాను శక్తితో పూరించినవిఅని చెపుతూ- చెప్పినవాడు గురుకాదు లఘువే. అంతటా వున్న భగవంతుని గుర్తు చూపించే వాడెలాటివాడూ....? మడీతడీ ఆచారమూ అన్నవి అసలు ఆచరించటము కన్నా ఎక్కువైనవి కావు. "అంతటా వున్న దేవుడికి మంత్రపుష్పం ఒక్కచోటనే అర్పించాలి అని గిరిగీయడ" మెందుకూ? అలాగ ఏ స్థితిలోనూ దైవచింతన చేయగలవాడెలాటివాడు?......... మంత్రం దైవానికి అక్షరరూపం. ఏ రూపమైతేనేం? అన్ని మంత్రాలూ ఆ ఒక్క దైవాన్ని సూచించేవే." వాటిలో భయంకరమైనవి వేరూ, సౌమ్యమైనవి వేరూ నేమిటి? ఏ శబ్దమైనా ఆత్మశబ్దమే అనుకునే వాడెలాటి వాడూ?... నమ్మకంతో చేసినదే పూజగాని పువ్వులతో నైతేనేం? శ్లోకాలతో నైతేనేం? మట్టితో కూడా పూజ చెయ్యగల వాడెలాటివాడూ?.....

సన్యాసమంటే భిక్షలూ పాదపూజలూనా? "కోరికలేని స్థితిని సంపాదించుకోవటం" కాదూ? "ఏమీ కావాలనేది అక్కర్లేకుండా కావాలనే" వాడెలాటివాడూ? .... కర్మఫలం భగవంతుడికి అర్పించమంటారు. 'కర్మ నేను చేసేది' అనీ 'నేను దీని ఫలం అర్పిస్తున్నా'ననీ అనుకునేవాడు 'చేసే' అర్పణం ఎలాటిదౌతుందీ? "అన్ని బాధ్యతలూ నీవే" అని చేస్తూ ఫలోన్ముఖం కావడం చూస్తూ "జరిగినది దైవనిర్ణయమే" అని వినోదించే వాడిది ఆత్మార్పణ కాదూ? "ఇక అక్కడ మిగిలినదంటూ ఏముంటుందీ?" సదా భగవంతుని సన్నిధానంలో - పూజా మందిరంలోనో దేవాలయంలోనో - వుంటే ఒకటీ, సదా దేవుణ్ణి తలచుకుంటే ఒకటీనా? భక్తి ప్రపత్తీ ఒకటి కాదూ? "ఎక్కడ బట్టినా శ్రీచక్రం చూడగలిగితే - ఇదంతా ఎందుకూ?" "కనిపించేదంతా దైవం అనుకోవటమే(కదా) జ్ఞానం. అన్నీ తానైన వాడేగా దైవం? సర్వములోని వాళ్ళమే కదా మనము." అకారణంగా ఆయన నుంచి వచ్చినది అదే రీతిగానే ఆయనను చేరదూ? "లోపలా వెలపలా అదే" అయినప్పుడు "అందరిదీ తలా ఒక రాతయినా చివరకు అన్నీ ఒకే రాతలో" కలవవూ?

పుట్టించే బ్రహ్మ దేవుడయితే గిట్టించే యముడూ దైవమే కదా?

కనక 'నేను చేస్తున్నా' ననుకునేవాడు ఏం చెయ్యాలీ?

"నాచేత దైవం ఏది చేయిస్తే అది చేస్తున్నాను" అనుకోవడమే కదా? అస్తు. అదే అమ్మ చెప్పేది.

'అమ్మా - అమ్మవాక్యాలూ' అన్న ఈ రెండో సంపుటానికి వాక్యాలు సేకరించి వ్రాసి ఇచ్చినవారు - సాగర్, బాబ్జీ భరద్వాజా, గోపాలకృష్ణమూర్తీ, వసుంధరా, బాలత్రిపురసుందరీ, భవానీకుమారీ, మంగ... పెక్కురు. వర్గీకరణము సేకరించిన వస్తువును బట్టి ఏర్పడటముతో కొన్ని కొత్తశీర్షికలు వచ్చాయి, వాక్యాలూ అన్నీ ఒక్కమారు అందకపోవడం వల్ల వర్గీకరణము వీలైనంత కచ్చితమూ కాలేక పోయింది. ఇవి మొదటి సంపుటములో లేనివాక్యాలే. అయినా ముందురావడము వల్ల మొదటి సంపుటమూ వస్తుబాహుళ్యమువల్ల రెండో సంపుటమూ దేనికది నిండే.

ప్రేమతో

మీ తోడబుట్టినవారు

**ప్రకాశకులు**

జిల్లెళ్ళమూడి

సాధారణ మహాశివరాత్రి

# విషయసూచిక - రెండవభాగము

# అమ్మ

1013. క్రిష్ణవేణక్కయ్యతో అమ్మ అన్నారు-

"నీళ్ళు తోడమ్మా-"

అక్కయ్య : తోడుతున్నారు.

అమ్మ : ఎవరు?

అక్కయ్య : మనకు ఉండలా వజ్రం.....

అమ్మ : వజ్రమా? ఎవరూ?

అంటూ ఉండగా అమ్మ పెద్దబ్బాయి సుబ్బారావన్నయ్య వచ్చాడు.

అమ్మ అన్నయ్యను చూసి -

"వాడి పేరు వజ్రంకాదు సుబ్బారావు" అని-

"ఇంతమంది యిక్కడ ఉంటే వాడిని వజ్రం అంటే నాకెట్లా అనిపిస్తుంది?" అన్నారు.

వెంటనే గోపాల్ అన్నాడు మహాదేవ్‌తో-

"మనలాంటి వాళ్ళు ఉంటే కానీ ఆయన వజ్రం అన్న సంగతి ఎవరూ గుర్తించరు కదూ?"

అమ్మ: నువ్వేమీ దిగులుపడ నక్కరలేదురా. అంతా వజ్రాలే. కానిదెవ్వరు?

1014. పుట్టినరోజునాటికి అమ్మకు తాను మాట యిచ్చిన ప్రకారం క్రొత్తనగలు అందివ్వలేక పోయానని బాధపడుతున్న వీరాస్వామి అన్నయ్యతో అమ్మ అన్నారు -

"బాధపడబోకు నాన్నా - వాటికి వచ్చే యోగ్యత ఉండొద్దూ? నువ్వు చెయ్యటం, చెయ్యకపోవటం కాదు. నువ్వు ఆరోగ్యంగా ఉంటే చాలు. నువ్వు సొమ్ము చేశావా లేదా అని పిలిపించలేదు నిన్ను. పూజ చూడాలనుకున్నావని పిలిపించాను. లే - నీ కూడా తీసుకువచ్చిన మనిషిని కూర్చోబెట్టుకుని ఈ పాతవాటికే మెరుగుపెట్టు - చాలు."

1015. అమ్మ స్నానానికి నీళ్ళు లేవు. భోజనానికి వెళ్ళబోతున్న మధు, శ్రీరామ్మూర్తి, సత్యం వాళ్ళు ఆగి అమ్మకు నీళ్ళు తేవటానికి చెరువుకు వెళ్ళబోయారు. అమ్మ వాళ్ళను వెనక్కి పిలిచి -

"నేను నీళ్ళు తర్వాత పోసుకుంటాను. మీరు ముందు అన్నాలు తినిరండి. మీరు తినక తెచ్చినా నేను పోసుకున్నా ఆ తృప్తి ఉండదు."

1016. 'అమ్మా అబ్బాయికి మనస్సు సరిలేదు. ఇక్కడుంటాడు-'

"ఇక్కడున్నందువల్ల తగ్గేదేమీ లేదు. ఉంటే ఎవరికీ బాధ లేదు."

1017. 'నా ఆస్తి మీకు అంకితం చేస్తున్నాను. నాకు ఇక్కడికి వచ్చి ఉండాలని ఉన్న'దన్న సంతమాగులూరు అన్నయ్యతో అమ్మ-

"ఆస్తి కాదుగా నాయనా అంకితం?- మీరూ. ఆ మీరు ఎప్పుడో అయి ఉన్నారు. నేను తీసుకోవటం కాని నువ్వు కావటం కాదు. అది ఎప్పుడో అయి ఉన్నది. నువ్వు ఇక్కడ ఉండాటానికి ఏ అభ్యంతరము లేదు. పొలం కొనుక్కో. నీ ఇల్లు నువ్వు కట్టుకుని, నీ గంజి నువ్వు కాచుకొని త్రాగొచ్చు. నా అభ్యంతరం లేదు. దానికైనా వాళ్లు ఉన్నారు. వాళ్లను అడుగు. కానీ ఇక్కడ ఉండటం అంటే చాలా కష్టం నాయనా. ఇక్కడ అన్ని రకాల ప్రవృత్తులు కలిగిన వాళ్లూ ఉంటారు. వీళ్లందరి మధ్యా ఉండటం చాలా కష్టం కదూ? అక్కడ ఏది కష్టమనిపించిందో అది ఇక్కడా ఉన్నది. నీ తత్వము అది అయినప్పుడు ప్రదేశం మారినంత మాత్రాన నీకా బాధ ఉండకుండా ఉండదు. అయితే ఒకటే తృప్తి. ఇక్కడ అమ్మ కనిపిస్తుంది. అందరూ నీలా వచ్చినవారేగా? వాళ్ళ మనస్సులు ఏం మారాయి? బయట ప్రపంచంలో ఎన్ని బాధలున్నాయో అన్నీ ఇక్కడా ఉన్నాయి. నీ అన్నం నువ్వు తింటూ నువ్వు దూరంగా ఉన్నా అవి నీకు తప్పవు. అది తట్టుకో గలిగే ఓర్పు ఉంటే సరే. అన్నీ ఆలోచించుకొని రా."

018. అమ్మ అన్నారు శాయమ్మగారితో -

"కాస్త చల్లార్చి పెట్టమ్మా ఆ పసికాయలకు. పెద్దవాళ్ళే ఆ వేడిని

చల్లార్చుకుని తింటున్నారు. పసిబిడ్డలు కదూ. వాళ్ళ బాధ మనకేం తెలుస్తుంది? అది తినాలన్న ఆపేక్షతో నాలుక కాలుతున్నా సహిస్తున్నారు. లేత చేతులు ఆ వేడిని భరించలేవు. చల్లార్చిపెట్టండి."

1019. దుర్గ పిన్ని పిల్లలతో ఆయాసపడ్తూనే లోపలికి హడావిడిగా రావటమే కాకుండా స్తిమితంగా కూర్చోకుండానే సంతోషంగా తన ప్రయాణం గూర్చి చెపుతుంటే ఐదు నిమిషాలు గడిచాక అమ్మ అన్నారు-

"ఎప్పుడో ప్రొద్దున - అదీ ప్రయాణం హడావిడిలో తిని ఉంటారు. ముందు వెళ్ళి భోం చెయ్యండమ్మా-"

'ఇప్పుడేగా వచ్చింది, భోజనానికేం తొందర?' అన్నది పిన్ని.

"నీ కోసం కాదు. పిల్లల కోసం. వాళ్ళకి పెట్టించు - పెడుతూ నువ్వు తిను."

1020. అమ్మ చాలా నీరసంగా ఉన్నారు. అయినా స్వయంగాలేచి వచ్చి పనిచేసి వచ్చి పడుకున్న పిల్లలను లేపి, అందరికీ తలా ఒక చెక్కరకేళి పండిచ్చారు. సున్నపు గానుగలు వేసి చేతులు పుండ్లుపడ్డ పిల్లలకు స్వయంగా అన్నం కలిపి నోట్లో ముద్దలు పెట్టారు.

1021. యేర్లగడ్డ వెంకటేశ్వర్లు పోయినప్పుడు అమ్మ ఆ కళేబరాన్ని స్నానం చేయిస్తూ ముద్దు పెట్టారు.

1022. రవి పుట్టినరోజు నాడు ఆవరణలో కాపురం ఉన్న వాళ్ళందర్నీ అన్నపూర్ణాలయంలో భోజనానికి ఆహ్వానించారు. అదే సమయంలో ఊరికి వెళ్ళబోతూ అమ్మ దగ్గరకు వచ్చిన సుబ్బయ్యను చూసి అమ్మ అన్నారు-

"నువ్వు కూడా రా సుబ్బయ్యా-"

సుబ్బయ్య: నేను ఊరికి వెళుతున్నానమ్మా. దైవాధీనాన్ని(కూతురు) నా బదులు పంపిస్తాను.

అమ్మ : దైవాధీనం వస్తే వద్దనటం లేదు. కానీ దైవాధీనం తిన్నంత మాత్రాన నువ్వు తిన్నట్లు నాకెట్లా ఉంటుంది?

సుబ్బయ్య: నాకు అర్థమయిందమ్మా. తప్పకుండా వస్తాను.

1023. "నాతో కొందరు అన్నారు- 'ఏమిటీ జనవరి ఫస్టు పండుగ ప్రాముఖ్యత మనకూ?' అని.

ఈ భేదం చూస్తున్నామే కానీ - అట్లా అని మనం వాళ్ళ తారీఖులు వాడుకోకుండా ఉన్నామా? ఎందుకీ పండగ అంటారేమిటీ? నిద్ర లేచినదగ్గర నుండి తారీఖులు చూసుకుంటున్నాము. కానీ పాడ్యమీ, విదియ, తదియ అని ఎంతమంది చూస్తున్నారు? 'మనది కాదు' అంటారు. మనది కానిదేమిటో తెలిసినప్పుడుగా ఇది వదిలేయటం. ఇక్కడ అన్ని పండుగలూ చేస్తాను. సూర్యోదయం ఉన్నది. సూర్యాస్తమయం ఉన్నది. దీనిలోదేగా ప్రపంచమంతా. ఉదయం అస్తమయం రెండూ చూస్తున్నాము. ఆ రెండు వేళల మధ్యదేగా ఎంత ప్రపంచమైనా. అది కానిది అంటూ ఏదీ లేదు. మామూలుగా నిమిషాలు గంటలు వాడినట్లుగా ఘడియలు విఘడియలు వాడుతున్నామా? దానిమీద ఆధారపడినంతగా దీనిమీద లేము."

1024. కస్తూరి (ఇక్కడ కొన్ని సంవత్సరాలు ఉండినామె) మామగారు అత్తగారు అమ్మ దగ్గర సెలవు తీసుకున్నారు. అమ్మ వాళ్ళిద్దరికీ ప్రసాదంతోబాటు బట్టలు పెడుతూ అన్నారు-

"కస్తూరి ఇక్కడ లేదనుకోకుండా ఇక్కడికి వస్తూండండి."

1025. అమ్మ ఒక అన్నయ్యతో అన్నారు-

"నాకంటే నువ్వే నయం. నీకు ఇంట్లోవాళ్ళూ బయటివాళ్ళూ అని తేడా తెలుస్తున్నది."

1026. అమ్మ పులిహోర తాను కాస్త తిని ముందు ఈ పూట కొత్తగా వచ్చిన వాళ్లకు, తరువాత నిన్న తిన్నవాళ్ళకు పెట్టారు. అమ్మ ఆ చిన్న గిన్నెలోని పులిహోర చేతినిండా తీసుకుంటూ ఎంత మందికో పెడుతున్నారు. మేము ఆశ్చర్యపోయాము.

1027. కోనా సుబ్బారావుగారి భార్య అమ్మతో చుట్టారికాలు తిరగవేసుకున్నారు.
వెంకాయమ్మగారు: మనమంతా దగ్గరవాళ్ళమే.

అమ్మ: అంతా దగ్గర వాళ్ళమే. అంతా ఆ మూడు సున్నాలలో వాళ్ళమే (అండ, పిండ, బ్రహ్మాండ) మళ్ళీ అంతా 'బ్రహ్మాండం'లో వాళ్ళమే.

1028. "నిన్నటినుండి నాకు చాలా కోపంగా ఉంది. ఆవరణలోని అందర్నీ నీళ్ళబండి తీసుకు వెళ్ళమన్నాను. నేను పోసుకుంటున్నది నీళ్ళుకావు. ఆ ఎద్దు రక్తం-అన్నాను. దాన్ని పీపాబండికి కట్టకపోతే నాప్రాణం హాయిగా వుంది."

1029. "చెప్పేదేముంది? వచ్చి వీళ్ళతోపాటు ఉండమను. స్వేచ్ఛకు అలవాటు పడిన తాను ఇక్కడ ఉండగలగాలి కదా? అతను ఉండటానికి నాకు అభ్యంతరం లేదు."

1030. అమ్మ ప్రసాదించిన నూతన వస్త్రాలను తీసుకుని నొచ్చుకుంటూ వెనిగళ్ళ సత్యనారాయణగారు అన్నారు. -

'నేను మీకు తీసుకురావలసినది - మీరే నాకు పెట్టారు.'

అందుకు అమ్మ -

"ఎప్పుడైనా నేనే మీకు ఇవ్వవలసినాదాన్ని" అని అన్నారు.

1031. "దేవాలయం ప్రతిష్ఠ అప్పుడు నవరత్నాలు పొయ్యాలన్నారు. నవరత్నాలు పుట్టింది యిక్కడే కనుక యిదే వేస్తున్నాను అంటూ మూటు దోసిళ్ళ మట్టి వేశాను."

1032. టెలీఫోను సౌకర్యమేర్పడి దానికి ప్రారంభోత్సవం జరిగిన రోజు అమ్మ ఎవరితో ఎంతసేపు మాట్లాడినా ఈ రెండు మాటలూ అందర్నీ అడిగారు; "నా మాట మీకు వినిపిస్తోందా స్పష్టంగా? మీరు భోజనం చేశారా?"

1033. శ్రీపాద : ఈ తల్లికి కోపం లేదు.

1034. నాన్నగారు అమ్మ ఓర్పుకు ఉదాహరణగా చెబుతుంటారు. 'కడుపులో పిండం పోయిన తరువాత కూడా మూడు రోజులు అలాగే తిరిగిందండీ' అని.

1035. కాసు వెంగళరెడ్డిగారూ, వారి కుటుంబమూ సెలవు తీసుకుంటున్నప్పుడూ

అమ్మ తీర్థప్రసాదాలతో పాటు వాళ్ళకు బట్టలు పెట్టారు.

వారు వెళ్ళబోతుంటే డ్రైవరునీ పిలవమనీ, అతనికీ తీర్థప్రసాదాలు ఇచ్చి బట్టలు పెట్టారు.

1036. నంద్యాలనుండి వచ్చిన దంపతులు అమ్మకు పూజ చేసుకొని ప్రసాదం తీసుకున్నారు.

అమ్మ డ్రైవర్ని కూడా పిలిపించి ప్రసాదం ఇచ్చారు.

1037. 1950వ సంవత్సరపు వరదలో ఒక కుక్క కొట్టుకువస్తే - "ఎక్కడో కుక్క అరుపు వినబడుతున్నది. మంత్రాయీ- చూచి రా" అన్నారుట అమ్మ. మంత్రాయి వెళ్ళి చిన్నకుక్క పిల్లను తెచ్చాడుట. అమ్మ దానిని పెంచారు.

1038. కోళ్ళపూడి సుబ్బమ్మగారు : అమ్మా - నేను ఇచ్చిన పండు హైమకు ఇచ్చావా?

అమ్మ : ఇవ్వలేదు. ఎవరికో ఒంట్లో బాగుండకపోతేనూ ఇచ్చాను. ఏం? ఎవరికి అవసరమైతే వాళ్ళకిచ్చాను, ఎవరయితే ఏం?

1039. 'ఈ (దుఃఖ) పరిస్థితిలో కొత్తబట్టలు పెట్టేరు (మీరు)'- అని అమ్మ మేనమామగారు.

"ఈ స్థితిలోనే అవసరం" అని అమ్మ.

1040. అనాడు రాత్రి అమ్మ కాఫీ అడిగారు. ఇంట్లో పంచదార లేదు. అమ్మకి కాఫీ ఇవ్వడానికి లేకపోయిందే అని కించపడుతూ అన్నపూర్ణ ఎప్పుడూ వాడని ఒక డబ్బా తియ్యటం, అందులో పంచదార వుండటం జరిగింది. ఆ పంచదార ఎప్పుడూ ఎవరూ అందులో పోసివుండలేదు?

1041. మెడ్రాస్‌లో సినీస్టార్స్ అన్నారు-

"మనం ఇన్నిరకాల మేకప్స్ చేసుకుంటాము. అమ్మ చూడు నిమిషంలో ఎట్లా మారిందో.....!" అని.

1042. 'భరద్వాజ చెప్పాడమ్మా...... కుందుకూరులో ఒక పని మనిషికి నలుగురు

పిల్లలు. వీళ్ళందరినీ పోషించేది ఎట్లాగా అని దిగులుపడుతూ పడుకుంటే కలలో నువ్వు కనపడి "నీకేమీ ఫరవాలేదు" అని చెప్పావుట. మరునాడు వాళ్ళ అబ్బాయికి 10 రూ-ల జీతమల్లా 30 రూ-లకు ప్రమోషన్ అయిందట."

1043. ఒకరు : మొన్న భోగినాడు మీరు కలలో నా తల మీద చెయ్యి పెట్టారు.

అమ్మ : ఆనాడు పిల్లలందరికీ మాడున చమురు పెట్టి తలంటి పోస్తుంటానుగా?

1044. ఇంకా పూజ ఆరంభం కాలేదు. మొదటి బస్సుకు వెళ్ళాలని త్వరపడుతున్న అన్నయ్యల ఆదుర్దా చూసి అమ్మ రామకృష్ణ అన్నయ్యతో అన్నారు - "పూజ తర్వాత చేయించుదువు గానీ ముందు వాళ్ళకు ప్రసాదం పెట్టించు-"

1045. జబ్బుచేసిన పెద్దకుక్క దగ్గరికి హఠాత్తుగా వర్షంలో బయలుదేరిన అమ్మను కాత్యాయని అడ్డుపెట్టింది. ఆమెకు సమాధానంగా అమ్మ-

"ఈ వర్షం, బురద ఇవన్నీ నాకేం కొత్తకాదమ్మా. వీటికి అలవాటు పడ్డదాన్నే. పాపం పిచ్చిది. దానికి నేనంటే ఎంతో ప్రేమ. దానికి ఓపిక ఉన్నన్నాళ్ళు నా దగ్గరికి వచ్చేది. ఇవ్వాళ దాని కోసం నేను వెళ్తాను-" అంటూ ఆ బురదలో నడిచి ఆ కుక్క దగ్గరకి వెళ్ళారు.

1046. 'నేను ఒక మంచిమాటన్నా, చెడుమాటన్నా, అన్నీ మీకు తెలుస్తాయని అనిపిస్తున్నది?' అని వెంకాయమ్మగారు అమ్మతో అన్నారు.

1047. ఈ మధ్య రోజూ ఒక ముస్లిం బాలిక అమ్మకు సవాశేరు టమేటాపండ్లు తూచి తెచ్చిస్తున్నది. ఈ రోజు కూడా అట్లాగే తీసుకు వచ్చింది. గజేంద్రమ్మ అడిగింది 'ఎందుకమ్మా రోజూ అమ్మకు పండ్లు తెచ్చిస్తున్నావు?' అని. ఆ అమ్మాయి చెప్పింది "అమ్మగారికి పండ్లిత్తే ఆ రోజు గంపెడూ ఒక గంటలో అమ్ముడుపోతాయి. లాభం కూడా రెట్టింపు వుంటుంది. అందుకని మా అమ్మ రోజూ పంపుతుంది.' ఆ అమ్మాయి చెప్పిన తీరుకూ, ముద్దు మాటలకూ అమ్మతో సహా అందరమూ నవ్వుకున్నాము.

1048. 'పిల్లలకు సుస్తీగా ఉందమ్మా - మీ చేతిమీదుగా తీర్థం కావాలి' అమ్మ తీర్థం యిచ్చారు. వాళ్ళు తీసుకున్నారు.

1049. అమ్మ అందరితోనూ మాట్లాడుతున్నారు. యేర్లగడ్డ రాఘవయ్యగారి కలవర పాటు చూసి అమ్మ "ఏమిటి నాన్నా" అని అడిగారు.

'ఏమీ లేదమ్మా. ఇందాకటి నుండీ వెంకన్న మాటలుగా వినబడుతున్నాయి. నువ్వేనా అమ్మా?'

(వెంకన్న రాఘవన్నయ్య కొడుకు. అతనికి మాటలు రావు. 'ఏమిటీ' అనాలంటే 'ఏత్తీ' అనేవాడు ముక్కుతూ. కొన్నాళ్ళ క్రితం ఇక్కడే మరణించాడు.)

1050. అమ్మ సుబ్బయ్యతో మాట్లాడుతూ -

"నేను ఏదన్నా కాస్త తొణికానంటే మీ పని ఏమవుతుంది?"

(26-3-67న ఈ మాట అన్నారు. 27-3-67న భూకంపం వచ్చింది.)

1051. యేర్లగడ్డ రాఘవయ్యగారు అమ్మ కాళ్ళు పడుతూ -

"తలాపి మార్చవే మమ్మా?"

అమ్మ : ఉత్తరం వేపున పెట్టాను.

రాఘు : ఎందుకమ్మా ?

అమ్మ : నేను ఏది ఎందుకు చేస్తానో అన్నీ తెలిసినట్లూ, ఇదొక్కటీ తెలుసుకుందా మనుకున్నట్లు మాట్లాడుతున్నావే?

1052. 'అమ్మా ! 8 సంవత్సరాలు వచ్చినా మాటలు రాలేదని మా అమ్మాయిని మీ వద్దకు తీసుకువచ్చావమ్మా. ఇప్పుడు ఆ అమ్మాయి అత్తా, తాతా... అంటున్నది.'

1053. నిర్మాణంలో పున్న నీళ్ళ టాంకీ క్రిందకు వచ్చారు అమ్మ.

నాన్నగారు : గాలి రావటం లేదు. మరీ ఉక్కపోతగా వుంది.

ఎటో ఆలోచిస్తున్నట్లున్న అమ్మ "వస్తుంది" అన్నారు. చూస్తుండగానే గాలి వీచింది. అందరమూ ఆశ్చర్యపోయాము.

1054. మన అందరి మధ్యా భోజనాని కన్నట్లుగా కూర్చున్నప్పుడు అమ్మ కావాలని అడిగి వేయించుకొనే పద్ధతి అంతా తాను తినేటట్లు వుంటుంది. కానీ అవన్నీ వేసి కలిపి మనకు పెడతారు. చాలా రుచిగా వుంటుంది. (పెట్టడం తప్ప తినడం చేతకాదు.)

1055. ఒక ఆబ్దికం సందర్భంలో నివేదనకు అమ్మకు పెరుగు వడ్డించాలి. అమ్మ వసుంధరా వాళ్ళ యింట్లో కనుక్కోమన్నారు. కానీ హోటల్‌లోని వారితో వుంచమని చెప్పే వుంచారు. కనుక వీళ్ళు హోటల్లో కనుక్కుంటే వాళ్ళు తీసి వుంచటం మర్చిపోయారని తెలిసింది. తప్పని సరి కనుక నాన్నగారి గది దాకా వెళ్ళి వసుంధరను అడిగాము.

అక్కడ వున్న వసుంధర 'నేను యిప్పుడే తోడువేశాను. ఇక్కడ ఈ టైములో పెరుగు దొరకదు' అన్నది. ఆ విషయం అమ్మకు చెబితే "పోనీలే తోడుకున్నంత వరకే తోడుకుంటుంది తీసుకురమ్మను" - అని తిరిగి కబురు చేశారు.

వసుంధర తీసుకు వచ్చింది. ఆశ్చర్యం! పెరుగు గడ్డలాగా తోడుకుని ఉన్నది. అది అమ్మకూ, భోక్తులకూ వడ్డించారు.

1056. 27-3-67న అమ్మ "ఒళ్ళు తిరుగుతున్నది. ఇవాళ ఏమిటో నాకు భూకంపం వచ్చినట్లుందర్రా" అన్నారు. రెండు గంటలలో భూకంపం వచ్చింది.

1057. రాత్రి మధ్యహాలులో మంచం మీద పడుకుని సుమారు గం.9.00ల వేళ "ఏదో ఠపేలుమని పేలిన చప్పుడయ్యిందిరా" అన్నారు అమ్మ.

'మాకేం వినిపించలేదమ్మా!' అన్నాము. కొద్దిసేపయిన తరువాత వెనుక గదిలోకి వెళుతుండగా అమ్మకాలివ్రేళ్ళ ఉంగరాలు రాలిపోయాయి. అక్కడ ఉన్న ఒకరు 'అయ్యో! యీ అయాదూ రాలిపోయా యమ్మా!' అన్నారు. "రాలిపోయే వాటిని పోనిరా!" అన్నారు అమ్మ.

మరునాడు ఉదయమే బాపట్ల నుంచి ఎవరో పేపరు తీసుకువచ్చారు. అందులో కెన్నడీని ఎవరో తుపాకితో పేల్చి హత్య చేసినట్లూ, మన

20

వాయుసైన్యాధిపతులు ఐదుగురు ఒక విమానంలో ప్రయాణం చేస్తుండగా అది కూలిపోయి ఆ అయిదుగురూ మరణించారనీ వున్నది.

1058. మే నెల 5వ తేది : వరండాలో వరుసగా వటువులు కూర్చున్నారు. పురోహితులు ఉపనయనాలు జరిపిస్తున్నారు. అమ్మ దగ్గర వుండి క్రతువును తిలకిస్తున్నారు. వెలిగీ వెలగని అగ్నిహోత్రాల పొగలకు ఎవరూ తట్టుకోలేకపోతున్నారు. అందరి కళ్ళ వెంట నీళ్ళు కారుతున్నాయి. కానీ అమ్మ కళ్ళలో చెమ్మలేదు. అమ్మ ఆ పొగలో నుండీ కళ్ళు విప్పార్చుకుని చూస్తూ అట్లాగే కూర్చున్నారు.

1059. రామకృష్ణ అన్నయ్య : నీకు చింత గింజలు యిష్టమా?

అమ్మ : నే వేసినవే అవి - చింతచెట్లన్నీ నే వేసినవే.

1060. 'నేను చస్తేగాని ఇక్కడ వుండే యోగ్యత లేదు' అన్న పూండ్ల మాణిక్యమ్మ గారితో గోపాలన్నయ్య అన్నాడు -

'ఈ పూటకి ఇక్కడ వుండకూడదూ?'

అమ్మ : చచ్చిన తరువాత ఎటూ ఇక్కడేగా వుండేది. పోనివ్వు (వెళ్ళనివ్వు)-

మాణిక్యమ్మగారు 1953 నుండి అమ్మను చూడవచ్చే వారిలో ఒకరు.

1061. వెళ్ళపోయిన హైమను గురించి కాబోలు దుఃఖిస్తున్నదనుకొని అమ్మను చూసి రుక్మిణక్కయ్య అడిగింది. "దేవుడికి కూడా దుఃఖం ఏమిటి?"

అమ్మ : దేవుడికి పెళ్ళీ, పెళ్ళామూ, మొగుడూ, కూతురూ, కొడుకులూ ఏమిటీ? ఇదీ అట్లాంటిదే.

1062. ప్రసంగవశాత్తు వచ్చిన తన కారుడ్రైవింగ్ విషయాన్ని గురించి అమ్మ "అయితే కావచ్చు" అన్న సమాధానానికి శ్రోతలలో ఒకరు నవ్వి -

'చీరాల బేర్ హాస్పిటల్లో ఉన్నప్పుడు టెన్నిస్ బ్యాడ్మింటన్ ఆడిన అమ్మ, దొరసానులతో కలిసి మెలిసి మసలిన అమ్మ, అందరిచేత అక్కడ కామన్‌ఫ్రెండ్ అనిపించుకున్న అమ్మ ఈనాడే వాడ్రేవులో స్టీరింగ్ మీద చెయ్యి వేసిందంటే నమ్మదగ్గ విషయమేనా?' అని అడిగారు.

1063. "పెట్టకుండా ఉంటే అందరికీ మానుకోవాలి. పెడితే అందరికీ పెట్టాలి. మొదలుపెట్టాను కనుక అందరికీ సమానంగా పెట్టాలి."

1064. బామ్మ ఎప్పుడూ అంటూ వుండేది అమ్మతో -

"నీకేం నువ్వు పండు పండావు. ఎప్పుడయినా తొడిమ వూడుతుంది. నువ్వుండ దల్చుకోబట్టి వుంటున్నావు గానీ."

1065. బాలయ్య : నేను పాపాలు చేస్తున్నానమ్మా. అన్నీ మోయవలసినది మీరేగా?

అమ్మ : నేనే భరిస్తాను నాన్నా.

1066. 'దేవలయాన్ని గురించి ప్రస్తుతం ఆలోచనవద్దు. నేను కనపడేంతవరకూ ఎవరూ దేవాలయంలో కాలుపెట్టలేరు."

1067. "సర్వానికీ నేనే మూలం."

1068. 'ఎక్కడయినా ఏ మాటనయినా సంస్కృతంలోకి సరయిన ట్రాన్స్లేషన్ చెయ్యవచ్చు గానీ, ఇక్కడ జిల్లెళ్ళమూడిలో పుట్టిన తెలుగు జాతీయాలకు సరయిన సంస్కృత పదాలు దొరకవు, దొరకవు, దొరకవు-' అని శ్రీపాదవారు 'అమ్మా - అమ్మ వాక్యాలూ' పుస్తకావిష్కరణ సందర్భంలో చేసిన ప్రసంగంలో ఉద్ఘాటించారు.

1069. అమ్మ అంటే సంపూర్ణావతారం కాదు. సంపూర్ణత్వం.

1070. భరద్వాజ : నీకు మూడు కాలాలూ వర్తమానమే కదమ్మా?

అమ్మ : అవును.

1071. 'చూడూ-అమ్మ కళ్ళు మూస్తే దేవాలయం తలుపులు మూతలపడినట్లు కనిపిస్తున్నాయి.'

1072. 'అసలు ఆ పాదాలే వేరు. ఆ పాదాలు చూడు-ఎంత బాగుంటాయో-'

1073. "ఏం కనుపించి నమస్కారం చేశావు సీతారాముడూ?"

'మా ఇలవేల్పు కుమారస్వామి కనిపించాడు.'

1074. బుచ్చమ్మ : (అమ్మ) తాను (మా యింటికి) వచ్చి నన్ను పిలిపించుకుంది.

శ్రీపాద : నాకు కూడా అదే జరిగింది. అమ్మ మా యింటికి వచ్చిన తరువాతే అమ్మను చూడాలని నేను వెళ్ళాను.

1075. 'అమ్మా! మీ మాటలు వింటుంటే వేదాల్లోనుండి మహా వాక్యాలు తీసి చేతికిస్తున్నట్లు ఉన్నాయి. నా వంటి అజ్ఞానికే యిట్లావుంటే, జ్ఞానులు ఈ మాటల్లో యెంత సారం తీసుకుంటారో......'

1076. 'ఏమి సమన్వయం చేస్తావమ్మా! నీకు యేవీ తప్పుగా కష్టంగా కనుపడవు. కష్టాన్ని కష్టంగా గుర్తించని తల్లివి.'

1077. 'నీకు మాట్లాడితే మళ్ళీ యింకొకరికి సూది మోపను సందు వుండదమ్మా!'

1078. గోపాల్ : కొందరు బాధలు కావాలని కొనితెచ్చుకుంటారు. ఎందుకని అమ్మా?

అమ్మ : ఒరేయి ! నువ్వు అనేది నన్నేగా. అవును, నేనే తెచ్చుకున్నాను.

గోపాల్ : (నవ్వుతూ) అందుకే అన్నారు - మరి నువ్వు బాధల భగవంతుడివని.

1079. 'మీ ఆధ్యాత్మిక శక్తి ఎవరికీ వద్దు బాబూ. మీకు బాధలు లేకపోవచ్చు. మీరే బాధ కావచ్చు. మా అందరికీ నేర్పడం కోసమైనా మీరు పడవలసిందే కదా? మా కంటికి కనపడుతున్నది కదా ? మీరు భగవంతుడో అవతారమో నా కనవసరం. మీ బాధల్లోని ఆనందాన్ని చూచి ఆనందపడే స్థితి నాకొద్దు. మిమ్మల్ని చూచి ఆనందపడే స్థితి కావాలి.'

1080. "ఎలాగ కనపడ్డాను?"

'ముందు నుయ్యి, వెనుక గొయ్యి, మధ్యలో మీరు, ఒక ప్రక్క అగ్నిగుండం, ఇంకో ప్రక్క మంటలతో హోరుమంటూ సుడిగాలి, పాదాల క్రింద సముద్రం, నెత్తిన హిమాలయ పర్వతం, గుండెలో శూలాలు - ఇటువంటి వాటితో దర్శనం ఇచ్చారు.'

"రాజుపాటలు చదివి పడుకున్నానంటివిగా? వాడి కథనాలు కలలోకి వచ్చాయేమో?"

1081. 'ఆ యమ్మ నోటిలో నాగేంద్రుడు ఉన్నాడట. ఆ యమ్మ పామును మింగిందట' అని చెప్పారమ్మా కొమరవోలాయన.

'ఆ రాత్రి నల్లని నాగుపాము మీ కంఠానికి మూడు చుట్లు వేసుకుని మూరెడు పొడుగు ఇవతలకు వచ్చి ముఖం వైపు పడగతో కాటువేస్తున్నట్లూ కాటువేస్తున్నప్పుడెల్లా విషాన్ని మూరు ప్రశాంతంగా స్వీకరించినట్లూ కనుపడిందమ్మా."

"కాటు వేసినప్పుడల్లా అమృతమే నాన్నా - ప్రశాంతమన్నావుగా?"

1082. 'శాస్త్రాలలో అమ్మ చెప్పింది ఉండదు కానీ అమ్మ చెప్పింది శాస్త్రమే' అని శ్రీపాదవారు.

# గుర్తు

1083. 'అయినా నీకు గుర్తుండక పోవడమేమిటి? ...... మీ అమ్మగారికి భలే జ్ఞాపక శక్తుండోయ్'.... అని నాన్నగారు.

1084. 'నాకు తృప్తిగా వున్నదమ్మా. ఎన్నిసంవత్సరాలైందో తల్లీ నిన్ను చూసి.'

"ఇరవై సంవత్సరాలకింద చూశావూ-1949 డిశంబరు 14న నేను మీ ఇంటికి వచ్చి 25 సంవత్సరాలైంది."

1085. "1955 ఆగస్టు14న కొమ్మరాజు నాగేశ్వరరావుగారూ, గంగరాజు వెంకటేశ్వరరావు గారూ, చెన్నాప్రగడ సూర్యనారాయణగారూ,కట్రపాటి మునసబుగారూ, డాక్టరు సీతాచలంగారూ, I.L.T.D. బయ్యరు కృష్ణమూర్తిగారూ, జాలమ్మగారూ వచ్చారు." అని 19-1-68 నాడు చెప్పేరు అమ్మ.

1086. '(రాఘవరావు) మామయ్యను ప్రత్యక్షంగా తెలుసుకుని చూడటం ఇదే మొదటిసారి అనుకుంటా'నని భద్రాద్రి రామశాస్త్రిగారు.

"నువ్వు కంకటపాలెం తిరిగే రోజుల్లో ప్రెస్‌దగ్గర కలుసుకున్నానని నువ్వే చెప్పావు. ఒకప్పుడు" అని అమ్మ.

1087. ఆ వృద్ధురాలు మరోసారి నమస్కారం చేసి తృప్తి నిండిన స్వరంతో అన్నది. 'నాకు తృప్తిగా ఉన్నదమ్మా, నేను తెచ్చిన ఈ బుజ్జిచీర కట్టుకుంటా వనుకోలేదు. ఎన్ని సంవత్సరాలైందో నిన్ను చూసి.'

అమ్మ : ఇరవై సంవత్సరాల క్రింద చూశావమ్మా - నేను మీ ఇంటికి వచ్చినప్పుడు.

1088. అమ్మ గదిలోకి వచ్చి కుర్చీలో సుఖాసీన అయింది. ఉదయమే వచ్చినా అమ్మ దర్శనం కాక నిరీక్షిస్తున్న రాళ్ళబండి వెంకటేశం ముందుగా గదిలో ప్రవేశించారు. నేను 'వీరు రేడియో ఇంజనీరు' అని నివేదించుకున్నాను. "నేనెఱుగుదును"అన్నది అమ్మ. వారి తండ్రి 1935లో బాపట్లలో

తహశీలుదారుగా పనిచేస్తున్నప్పుడు చిదంబరరావుగారింట్లో ఉండేవారట. అప్పుడు అమ్మకు 12 సం॥వయస్సు. ఈ మధ్య 33 సంవత్సనములు గతించాయి. వారిని అమ్మ పోల్చుకోవడమే గాక వారి కుటుంబంలోని ప్రతి ఒక్కరి పేరుతో వారి గుణగణాలు వారి బంధువుల విషయాలూ, వారు గుంటూరులో అద్దెకు ఉన్న యింటి సంగతులూ చెప్పేరు.

1089. హైదరాబాదు నుండి వచ్చిన ఒక అన్నయ్య అమ్మకు ఒక ఉత్తరమూ యాపిల్‌పళ్ళూ ఇస్తూ-

'వేణుగోపాలరావుగారు ఇచ్చారు. నమస్కారాలు చెప్పమన్నారు.'

అమ్మ : 58 లో వచ్చాడు అనుకుంటా.

అన్నయ్య : అవును. మొదటిసారి గోపాలరావుగారు రావటం, ఆరోజు వారు వేసుకున్న దుస్తులతో సహా చెప్తుంటే ఆ వచ్చిన అన్నయ్య ఆశ్చర్యపోయాడు.

1090. "ఇక్కడకు నువ్వు రావటం ఇదే మొదటిసారి కాని నేను నిన్ను చూశాను నాన్నా. పొన్నూరు నేను వచ్చినప్పుడు చూశాను" అన్నారు అమ్మ - అదే తొలిసారిగా ఇక్కడికి వచ్చిన ఒక అన్నయ్యతో.

1091. సంతమాగులూరు నుండి వచ్చిన ఒక P.W.D. అటెండరును చూచి "ఇది వరకు వీళ్ళ అన్నయ్య వచ్చినట్లున్నాడు" అన్నారు అమ్మ.

రామకృష్ణ అన్నయ్య అడిగాడు. ఆ అన్నయ్య 'వచ్చారండీ' అని చెప్పాడు. అమ్మ ఆ అబ్బాయిని చూస్తూ "పోలికలున్నై" అన్నారు.

1092. పెదపులివర్రు నుండి వచ్చిన అక్కయ్య-

'మా నాన్నగారి మనస్సు సరిలేదు.'

అమ్మ: నువ్వు యిదివరకు వచ్చావు గదూ?

అక్కయ్య : అవునమ్మా సంవత్సరమైంది.

అమ్మ : తెల్లచీర పెట్టినట్లు గుర్తు.

అక్కయ్య : అవునమ్మా.

1093. గోపాలన్నయ్య : అమ్మా మొన్న ఎవరో అంటున్నారమ్మా.....ఈమె మనతో

పొగాకు బేరన్‌లో పనిచేసినామేననీ-

అమ్మ : అవును. వాళ్ళతోపాటు నేను చేసేదాన్ని. ఆకులల్లేదాన్ని. బేరన్‌లో బొగ్గు వేసేదాన్ని. ఆకు ఏ ఆకు పైన వేస్తే బాగా రంగు వస్తుందో చూస్తుండేదాన్ని.

(నాన్నగారు పొగాకు కాల్పించే రోజులనాటి సంగతి)

అమ్మ : ఎవరూ అన్నది ? తత్వాలు పాడుకుంటూ వుంటాడే - ఆయనేనా? (పై జ్ఞాపకానికి వడ్డీ)

1094. అన్నయ్య : అవును అక్కడే నేను మిమ్మల్ని మొదటిసారిగా చూసింది.

అమ్మ: పందిరికి ఎదురుగా ఉన్న ఇంటిప్రక్క పాక ఉన్నది. అక్కడ ఉన్న అరుగు మీద కూర్చున్నట్టు గుర్తు. పూరింటికి ఇవతలి ప్రక్కన నువ్వూ ఇంకా ఇద్దరు ముగ్గురూ కలిసి కూర్చున్నారు.

అన్నయ్య ఆశ్చర్య చకితుడయ్యాడు - అన్ని వేలమంది ఉన్న పందిట్లో ఎక్కడో దూరంగా కూర్చున్న తనను చూసినదానికంటే ఆ గుర్తుకు.

1095. ఆమె : మీరు అబ్బాయిని తీసుకొని నిద్రకు వచ్చారు.

అమ్మ : అవును, 1941 డిశంబరు 14న. అప్పుడు మీరు చేసిన బజ్జీలు, పరమాన్నం గుర్తున్నాయి.

వాళ్ళు ఆశ్చర్యపడ్డారు - అమ్మ గుర్తుకు.

1096. గోపాల్ : నీకు ఏ ఉంగరానికి ఏ రాయి ఉంటుందో, ఎటువంటిదో అది - అవి కూడా గుర్తుంటాయా అమ్మా ?

అమ్మ : మీరు ఉండటంలా, అట్లాగే. పైకి రాళ్ళు ఒకటిగా కనిపిస్తాయి. కాని కట్టుబడిలో, రాయికోతలో, పరీక్షగా చూస్తే మార్పు కనబడుతుంది.

1097. అమ్మ : నువ్వు ఆగష్టు 19న గదూ వచ్చింది?

భరద్వాజ : అవునమ్మా.

1098. "నాకు గుర్తు ఉంటాయంటే నాకు అవి ఎప్పుడో జరిగినట్టు ఉండవు. అన్నీ ఇప్పుడే జరిగినట్టు ఉంటుంది. నేను చెప్పటంలో విశేషం ఏమీ లేదు."

# అందరిల్లు

1099. రామకృష్ణ : అమ్మా ఎవరో క్రొత్త ఎకౌంట్లు పెట్టుకుంటారట, నీకు పూజ చేసుకుంటారట.

అమ్మ : రమ్మను.

రామకృష్ణ : మరొకళ్ళు అన్నప్రాశన చేయించుకుంటూరట.

అమ్మ : నేను కాదన్నానుట్రా?

1100. డాక్టరుగారు : ఏముందీ ? ఇతని జీవితం అయిపోతున్నది. కనుక ఆ పెండ్లి పందిట్లో కాదు. అక్కడ జరిపించండి.

పురోహితుడు : పౌర్ణమి ఘడియలు ఇవి. ఈ అబ్బాయి పోతాడండి. ఆ పెండ్లి అభాసవుతుంది.

అమ్మ : అయితేమానె చేయమన్నాను. పెండ్లి కాగానే దంపతులచేత వాడికి నమస్కారం చేయించు.

1101. పోతుకూరి రవి మరణించిన తరువాత రోజు -

'ఇప్పుడు యిక్కడ అన్నప్రాశన చేసుకోవచ్చో లేదోనని అడుగుతున్నామండీ'.

అమ్మ : ఇక్కడ యివేమీ లేవు - అటు అవీ యిటు యివీ జరుగుతుండాల్సిందే.

1102. పోతుకూచి రవి చనిపోతే నరసింహమూర్తిగారి చేత కర్మ చేయించారు (ఈయన అతని బంధువుకూడా కారు).

1103. అరుణ పెళ్లిలోనే జరిగిన పోతుకూచి రవి మరణాన్ని గూర్చి ఆ అమ్మాయి మేనమామ ఆ అశుభానికి బాధ పడుతూంటే -

అమ్మ : ఇందులో మీరు బాధపడాల్సిన పనిలేదు నాయనా. వాడు ఈ రోజు పోవాలి, పోయాడు - ఈ ఆవరణలో రెండూ జరుగుతాయి. శుభం అశుభం రెండూ సమానమే నాకు.

1104. "నేను ఎవరినీ రమ్మనను, పొమ్మనను. ఏ పద్ధతీ కాని పద్ధతే ఇక్కడి పద్ధతి."

1105. అరుణ పెత్తల్లి అన్నది అమ్మతో -

"పెళ్ళికి విడిదిగా మీ మందిరం ఇస్తే మీ కోసం వచ్చిన జనం ఎక్కడ ఉంటారు?"

అమ్మ : మా మందిరం మణిమందిరం. అదే అందరికీ.

1106. "ఈ గేట్లు ఎల్లప్పుడూ తెరిచే ఉంటాయి - రావటానికీ పోవటానికీ. విశ్వ కుటుంబం కనుక రకరకాల ప్రవృత్తులు ఉంటాయి."

1107. స్వామిజీ : ఏమిటీ ఆ గంటా?

అమ్మ : సుప్రభాతం, సంధ్యావందనం చేస్తారు. తెల్లవారుజామున నాలుగు గంటలకూ, సాయంత్రం ఆరు గంటలకూ కొడతారు. శ్మశానానికి వెళుతూ జేగంట కొడుతున్నారు. పూజకూ, భోజనాలకూ గంటలే కొడుతున్నారు. పెండ్లికి ఆ జనాభాయే హాజరవుతున్నది. శ్మశానానికీ ఆ జనమే పిల్లలతో సహా నడుస్తున్నారు.

స్వామిజీ : శుభకార్యాలూ ఆ మనిషి చేతిమీదుగానే జరుగుతున్నాయి. చావులూ ఆ చెయ్యే జరిపిస్తున్నది.

1108. 14-4-66 నాడు ఇక్కడ (జిల్లెళ్ళమూడిలో) జరిగిన పెళ్ళికి ముహూర్తము అమ్మ పెట్టినదే. పంచాంగాలు చూసిన సిద్ధాంతులు కాదు. మంత్రాలు; సంధ్యావందనమూ; మేళాలు; నామ సంకీర్తనా, జేగంటాను.

1109. "ఆడవాళ్ళు కూర్చుని మగవాళ్ళు పనిచెయ్యటం నాకు ఇష్టం ఉండదు. కాని ఒకరికొకరు పనులలో సహాయపడటం, కలిసి చేసుకోవటం ఎంత బావుంటుంది? అందరూ అన్ని పనులూ చెయొచ్చు. అడవాళ్ళపనీ మగవ్వాపనీ అని పనులకి భేదం లేదు, చేయలేక మనకు భేదం తప్ప. ముందు ఇక్కడున్న ప్రతివాళ్ళు ఇది గుర్తు పెట్టుకోవాలి. ఇది నేర్చుకోవాలి."

1110. "మన పనులు మనం చేసుకోవటంలో తప్పు ఏమీ లేదు. మీకు ఇక్కడ

పని లేకుండా ఎప్పుడూ ఉండదు. పనిలేని తీరిక సమయాలలో ఇలాంటి రోజులలో (వర్షాకాలం) హాయిగా నామం చేసుకుంటూ కూర్చుని చేసుకునే పనులు చేసుకోవచ్చు. మనం తిని మన చాకిరీతో మరొక మనిషికి అన్నం పెట్టాలి. క్రొత్తవాళ్ళు వస్తే వాళ్ళు పనిచెయ్యలేదే అని బాధపడేకంటే మనం తలవంచుకుని మన పని మనం చేసుకుని మన శ్రమతో వారికి అన్నం పెట్టాలి. వాళ్ళు అన్నంలేక మన దగ్గరికి రావటం లేదు. మనం వాళ్ళకోసం పదార్థాలు వండటం లేదు. ఎవరైనా క్రొత్తవాళ్ళు రాగానే 'అన్నం తిన్నారా? మంచినీళ్ళు కావాలా?' అని ముందు కనుక్కుంటే చాలు. అవి అయిన తర్వాత అమ్మను చూడటం."

1111. అమ్మ శేషయ్యగారితో ---

"పుట్టినరోజు పండుగకు పదార్థాలు తక్కువ ఉండాలి. చేసినవి రుచిగా దండిగా ఉండాలి. అట్లా అయితే వడ్డన చాలా సులభంగా ఉంటుంది. అంతమంది మీద వడ్డన అందకపోతే కష్టం. పైగా నీళ్ళు త్రాగి త్రాగి వుంటారు. పదిహేను పిండివంటలు చేసినా అందరూ తినలేరు. అయినా అప్పుడు ఆకలికి ఏదో చకచకా తింటారేగాని ఎప్పుడు అమ్మ వస్తుందోననే ధ్యాసతో అన్నాల మీద ఆసక్తి ఎవరికుంటుంది?"

1112. "పనులు చేసే పిల్లలకు పకోడీలు చేసి పెడుతున్నారట. రేపు ఇడ్లీ చేసి పెట్టండి, జబ్బు చేయదు. తోడుపెట్టి ఒక పూట తియ్యటి పెరుగు వెయ్యండి" అన్నారు అమ్మ.

1113. అమ్మ జన్మదినోత్సవం నాడు ---

"నేను తలంటి పోసుకుని వచ్చేలోగా భోజనాలు చేసే వాళ్ళను చెయ్య మనండి. ముఖ్యంగా పసిపిల్లలూ, భజంత్రీలూ సుడివడకుండా వుంటారు."

1114. అమ్మ : అక్కడ యిసుక మీద నీళ్ళు పోయాలమ్మా.

పిల్లలు వెళ్ళబోయారు.

అమ్మ : ఇప్పుడేం చేస్తున్నారు.

మంగ : బండ్లు తోలి వచ్చామమ్మా.

అమ్మ : అయితే ముందు అన్నాలు తిని తరువాత నీళ్ళు పొయ్యండి.

1115. అమ్మ గొంతునొప్పితో దగ్గుతున్నారు. సావిత్రి రేగుపళ్లుతో తెచ్చిచ్చింది. అమ్మ తిరిగి యిచ్చేటట్లు అయితే అందరు ప్రసాదంగా తీసుకుంటారు. రేగుపళ్ళు 'వద్దని' ఎవరు చెప్పినా వినరు.

"రేపటి నుండి కోసుకు రాబోకండి. అవి తింటే జలుబు ఎక్కువ అవుతుంది. మీకిస్తే మీరు తింటారు. అందుకని నేనే తింటున్నా" నంటూ అమ్మే అన్ని కాయలూ తిన్నారు. ఆవరణలో చాలామంది - ముఖ్యంగా పిల్లలు జలుబుచేసి జ్వరంతో బాధపడుతున్నారు. అందుకు అమ్మ అట్లా చేశారు.

1116. 'హైమాలయ నిర్మాణానికి మందిరం అడ్డమంటున్నారమ్మా' (మందిర మంటే జనం వుండటానికి వసతికై డాబాలు కట్టకముందు వేసిన పూరిపాక. దానిని కట్టడం దాదాపుగా అమ్మ చేతులమీదుగా జరిగింది. అందుకని వీళ్ళు దానిని విప్పటానికి సందేహించారు.)

"వచ్చే జనానికి వసతి చూపించి ఆ మందిరం విప్పండి ---"

అన్నారు అమ్మ.

1117. స్నేహితులతో చేరి తాగి తందనాలేస్తూ డబ్బంతా నాశనం చేస్తూ, ఒక్క మగపిల్లవాడు తన ఆస్తిపాస్తులకు అడ్డమని కత్తితో పొడవటానికి ఉద్దేశించే ఒక అన్నయ్యతో అమ్మ ఒక గంట మాట్లాడారు. (అందరి మధ్యనే)

మొత్తానికి జరిగినదేమంటే వాళ్ళయింటి పై ఖర్చుకు అతని సంపాదన ఖర్చు పెట్టుకునేటట్లూ, అతిథి అభ్యాగతులకు అన్నం పెట్టేటట్లూ, తన పొలాల మీది పంట సంవత్సరానికి సరిపడ అనుభవించేటట్లూ, మిగిలిన దంతా పిల్లవాడి పేర బ్యాంక్‌లో పుంచేటట్లూ ఏర్పాటు. అతనికి స్థిరాస్థి తాకటానికి అర్హత లేదు. ఇదంతా అమ్మ సమక్షంలో జరిగినట్లు సాక్షుల సంతకాలతో సహా వ్రాసి ఇవ్వటం జరిగింది. అమ్మ ఆ అన్నయ్య తల మీద మృదువుగా నిమిరి లోపలికి వెళ్ళరు. కార్యక్రమమంతా గంటలో జరిగింది.

1118. రామకృష్ణ అన్నయ్య అన్నారు అమ్మతో --

"ఇక్కడ పూజాసమయంలో ఆడపిల్లలు శ్రీసూక్తం, మంత్రపుష్పం చదవటమూ, ఆడవాళ్ళు అబ్దికం పెట్టటమూ - చూస్తుంటే నీ సాన్నిధ్యంలో నిషేధాలు విధులు కాగలవనీ, అసాధ్యులు సాధ్యులు కాగలవనీ అనిపిస్తున్నది."

1119. తద్దినం నాడు అమ్మకు ఎదురుగ విస్తళ్ళు వేసి ఒక వేపున భద్రాద్రి రామశాస్త్రి గారికీ, రామకృష్ణ అన్నయ్యకూ వడ్డిస్తూ, మరొక వైపున రెడ్డిగారికీ వడ్డించారు. (బ్రాహ్మణుల యిళ్ళల్లో మామూలుగా అట్లా జరగదు.)

1120. అమ్మకు నివేదన జరుగుతున్నది. ఒక పిల్లివచ్చి అన్నపు పళ్ళెం ముట్టుకుంది. పిల్లిని నానాగోలా చేస్తూ తోలి పిల్లి ముట్టుకున్నదని ఆ అన్నం ప్రక్కన ఉంచబోతున్నారు.

అమ్మ : ఫరవాలేదు. ముందు నేను ముట్టుకున్నదే కదా! యింకా ఏమిటి?

శశిరేఖమ్మ : అయినా పిల్లి ముట్టుకుందిగా ?

అమ్మ : పిల్ల ముట్టుకుంది.

1121. 'ఇక్కడ ఉండవచ్చాండీ? ఎప్పుడుండ వచ్చు?' అని ఒకావిడ.

అమ్మ : మీ యిష్టం. ఇక్కడ ఎవరయినా వుండవచ్చు. ఎప్పుడైనా వుండవచ్చు.

1122. "వెళ్ళటానికీ వుండటానికీ అడ్డులేదు. కానీ ధర్మాన్ని తప్పివచ్చి ఉండ మనను"

1123. 'నే వెళ్తున్నానమ్మా, పిల్లలతో వచ్చి ఉంటాను.'

అమ్మ : నీ యిష్టం. నువ్వెప్పుడొచ్చినా యీ గేట్లు తెరిచే ఉంటాయి.

1124. అమ్మ కృష్ణభిక్షుతో ----

"తిరగాలనిపించినంత వరకూ తిరగండి. ఎక్కడికయినా వెళ్ళండి. కాదనను. కానీ యిక తిరగలేను అనుకున్నప్పుడు మీ దగ్గర ఉన్నది మీరివ్వ దలుచు కున్న వారికి ఇచ్చి రండి. ఎక్కడ ఉండనా అనే ఆలోచన వద్దు. యిక్కడికే రండి."

1125. "ఎంతమంది వచ్చినా ఎవరి స్థానం వారకుంది. అది తరిగేదీ పెరిగేదీ కాదు."

1126. 'ఇక్కడ ఉండే వాళ్ళకు భోజనమూ అదీ ఏర్పాట్లు ఎట్లానమ్మా? వేరే వండుకుంటారా?' అడిగారు స్వామీజీ.

అమ్మ : ఎవరిష్టం వాళ్ళది. వేరే వండుకునే వాళ్ళు వండుకుంటున్నారు. అక్కడ (అన్నపూర్ణాలయంలో) తినే వాళ్ళు తింటున్నారు. ఇది మన కుటుంబం.

1127. ఏప్రిల్ 10వ తేదీ అమ్మ హైమాలయం దగ్గర కుర్చీలో కూర్చున్నారు. చుట్టూ చాలామంది ఉన్నారు. ఇంతలో యింతమంది జనాన్నీ తప్పించు కుంటూ ఏదో పని ఉన్నట్లు ఒక కుక్క వచ్చి అమ్మ ముఖంలో ముఖం పెట్టి పరిశీలనగా చూచి వాసన చూచి వెళ్ళింది.

1128. "అందరింట్లో ఫలానా పని ఫలానా వాళ్ళవల్ల అవుతుందని చెప్పటానికి వీలు లేదు. ఆ సమయానికి ఎవరో ఒకరు వస్తారు, పని అవుతుంది. మాటలు సాగవు - కాని పని సాగుతుంది."

1129. 5 సం॥ల నుండీ అహిర్నిశం అమ్మ సాన్నిధ్యంలో వుంటున్న రామకృష్ణ అన్నయ్య ----

'చావుల విషయంలో అమ్మ ఎన్ని గంటల ఎన్ని నిమిషాలకు అంటే - అన్ని గంటల అన్ని నిమిషాలకు జరగటం చూస్తున్నాము.'

1130. 'అమ్మా ! నీవు లేచి తిరుగుతుంటే అవరణానికే చైతన్యం వస్తుంది. చావులు కూడా ఆనందంగా వుంటాయి.'

1131. "ఆవరణలో ఎవరికీ 'ఇది నాదీ' అనే భావం లేదు. ప్రతి ఒక్కరిలో ఆ భావం ఏర్పడాలి. ఎవరయినా క్రొత్త వాళ్ళు వచ్చి 'బావి ఎక్కడమ్మా?' అని అడిగితే 'అటు పో' అంటారు. చూపించదామని ఎవరికీ ఉండదు."

1132. 'దోవలో ఒక చెట్టయినా ఉందా? ఎండలో నడిచి నడిచి వచ్చిన వాళ్ళకు మంచినీరు యిద్దామని ఒకరికీ తోచదు."

1133. "ఇక్కడకు వచ్చేవాళ్ళు ఇక్కడుండే కుక్కపిల్లనూ, పిల్లిపిల్లనూ కూడా విలువగా చూస్తున్నారు. వాళ్ళు ఎట్లా చూస్తున్నారో యిక్కడికి వచ్చేవాళ్ళను మీరు అట్లాగే చూడాలి."

1134. "వచ్చే వారందరికీ 'ఆదరణ' అనే అనుపాకం చేసి పెట్టాలి. గుండిగ దిగితే గుండిగ ఎక్కాలి. ఎప్పుడు వచ్చిన వాడికేనా తీరిక లేదనకుండా అన్నం పెట్టాలి."

1135. "నిత్యాన్నదానం అంటే రోజూ అన్నం పెడుతున్నామని కాదుగా ? ఎప్పుడూ అన్నం పెట్టాలని."

1136. "మీ తిండి మీరు తింటున్నారని అనుకుంటున్నాను. ఒకడి తిండి మరొకడెవరూ తినలేరు. వాడి కడుపు నిండిన తరువాత ఒక్క ముద్ద పెట్టినా తినలేడు. నిండక ముందు ఒక్క ముద్ద తక్కువయితే లేవడు."

# అమ్మ మెలకువ - లోక వ్యవహారాలలో

1137. "దరిద్రమంటే ఏమిటి ?

ఒక భాగ్యవంతుడుంటాడు. వాడికి వస్తువు కావలసి వస్తుంది. డబ్బిచ్చి బజారుకి పంపిస్తాడు. అది అత్యవసరమైన వస్తువు. ఆ వస్తువు దొరకదు. వాడు దరిద్రుడా, భాగ్యవంతుడా? డబ్బుండీ అవసరాలు గడవనివాడూ, డబ్బు లేక ఎప్పుడేది కావాలో అది పొందేవాడూ - యీ యిద్దరిలో ఎవడు ధనవంతుడు? ఎవడు దరిద్రుడు? ఉండి ఉపయోగించుకోవడం చేత గాని వాడూ, ఆకలితో బాధపడి తింటానికి లేక ఎవరిని అడగటానికీ చేత కాక అడిగినా పెట్టేవాళ్ళు లేక బాధపడేవాడూ - వీళ్ళూ దరిద్రులు."

1138. ఆ పాపాయి తల కాస్త పొడుగ్గా ఉన్నది. లీల అడిగింది అమ్మని - 'తల తగ్గుతుందా?' అని.

అమ్మ : ఇవన్నీ యేం చేస్తాయి? బుద్ధి సొట్టపడకుండా ఉంటే చాలు. అది ఒకటీ బాగుంటే అన్ని వంకరలూ పోతాయి.

1139. "ఇట్లా రోజూ కొంత సొమ్ము గుర్తుగా వెయ్యడం మన దొడ్లో కాసిన పొట్లకాయ లాంటిది. ఎన్ని పొట్లకాయలు కోసి తిన్నా మన దొడ్లో కాసిన పొట్లకాయకు సాటిరావు అనిపిస్తుంది."

1140. అన్నయ్య : వాళ్ళు చిల్లికానీ కట్నం వద్దన్నారు.

అమ్మ : కట్నం తీసుకోనప్పుడు లాంఛనాలు అవీ జాగ్రత్తగా జరపాలి.

అన్నయ్య : లాంఛనాలు కూడ మనశక్తి ప్రకారం జరుపుకోమన్నారు.

అమ్మ : అనవచ్చు. కానీ మనమాట మనం దక్కించుకోవద్దూ ? కట్నం తీసుకున్నట్లయితే అంతా వాటిలోనే అనో, ఫలానా లాంఛనాలు జరపాలనో తెలిసి ఉంటుంది. అది లేకపోతేనే జాగ్రత్తగా ఉండాలి.

1141. (ఒక తల్లికి ఇచ్చిన సలహా)

"గిరిగీచి వాడిని ఇట్లా నడవ మంటే నడుస్తాడు కానీ అట్లా వదిలేసి

ఊరుకుంటే ఎట్లా ? .......... తెలియనివాణ్ణి పెద్దను చేసి బాధ్యత అంతా అప్పజెప్పినా బాగుండదు. చిన్నవాడు కదా అని తిట్టినా బాగుండదు. తెలివిగా పట్టుకొచ్చుకో----"

1142. తన సమీపంలో నేల మీద పారవేయబడి ఉన్న పురికొసను చేతులు చాచి అందుకుని నాకు యిస్తూ ----

అమ్మ : తోరణాలు కట్టడానికి ఉపయోగిస్తుంది. ఏమిటో నాకన్నీ యిటు వంటివే కనుపడతాయి.

1143. శేషయ్యగారితో అమ్మ ----

"వంటకు ఎట్లా వసతిగా వుంటుందనుకుంటే అట్లా కట్టించుకోండి దగ్గర వుండి - ఏ పనివాళ్ళకు ఆ పనిలో మెలకువ తెలుస్తుంది."

1144. రవి కోసం అప్పటికప్పుడు వెచ్చని నీళ్ళు కావలనుకున్న జ్యోత్స్నతో ---

"నీటిని ఏడుసార్లు గ్లాసులో కొద్ది ఎత్తులో తిరగబోస్తే చాలు ఆ గుణం వస్తుంది. నీటిలో అగ్నితత్వం వున్నదిగా?"

1145. "రెండు వస్తువులు కలిస్తే కాని మరో వస్తువు గుణం బయటకి రాదు. ప్రతి వస్తువులో ఉన్న సృష్టి రహస్యం అదే కదా ? ఇంగిలీకం పొయ్యి మీద పెడ్తే మందు అవుతుందా? దానిలో మరో రసం కలవాలి."

1146. "ఎంతమంది బిడ్డలున్నా తల్లికి ఏ బిడ్డకు ఆ బిడ్డే ఎక్కువనిపిస్తుంది. పెట్టుపోతల్లో, వాళ్ళ ఆరోగ్య పరిస్థితిని బట్టి తేడా ఉండొచ్చు కానీ ప్రేమ మాత్రం సమానంగానే ఉంటుంది. అందులో తరుగు ఉండదు."

1147. జనవరి ఫస్టు ఉత్సవానికి సరిగ్గా సమయానికి రాలేకపోయానని బాధ పడుతున్న ఆ సోదరునితో అమ్మ అన్నారు ---

"మీరు రాలేనందుకు బాధపడుతున్నారు. మరి ఇక్కడ కొంతమంది ఉన్నా చూడలేక పోయారు. అంటే వేరే కారణం ఏమీ లేదు. మన సంవత్సరాదికి ఇచ్చినంత ప్రాముఖ్యత దీనికి ఇవ్వకపోవటమే. కనుక దీని గురించి ఆలోచన ఉండదు."

1148. 'మనుష్యులకూ జంతువులకూ తేడా ఏమిటమ్మా?'

అమ్మ : నా అనుభవంలో నేను అనలేను. అవి మనకర్థమయ్యే భాషలో చెప్పలేక పోవచ్చుకానీ వాటిలోనూ వివేకంగలవీ, అవివేకంగలవీ ఉన్నాయి.

1149. ఒక సందర్భంలో నాన్నగారు అన్నారు -

'విశ్వాసానికి కుక్క జాతినే చెపుతుంటారు.'

అమ్మ : మనకు తక్కినవాటితో పరిచయం లేదు కనుక అనుకుంటున్నాము. అన్నింటిలోనూ విశ్వాసం ఉన్నది.

1150. 'నాన్నగారు ఎక్కిన బస్సు ఒక రాయి వల్ల తలక్రిందులవబోయిందట. అందరూ పడ్డదనే అనుకున్నారట. కానీ ఇంకొక రాయి అడ్డుతగిలి ఆగిందట.'

"పడిందీ, ఆపబడిందీ ఆ రాయి వల్లనే" అన్నారు అమ్మ.

1151. "చీకటి రాత్రే కాదు వెన్నెల రాత్రికూడా రజనే."

1152. "కలెక్టరు మారవచ్చుగానీ డిపార్టుమెంటు మారదుగా?"

1153. "మన్నవలో దేవత పుట్టిందని అనుకోవద్దు. దేవత పుట్టిన యింటి ప్రక్కనే 'దుర్మార్గుడు' పుట్టాడు."

1154. అమ్మతో రామకృష్ణ అన్నయ్య అన్నాడు ---

'అది మంచి లక్షణమే కదమ్మా, ఒకే దానిమీద లక్ష్యం ఉండటం?'

అమ్మ నవ్వి అన్నారు - "మంచిదేరా. ఒకే పనిమీద లక్ష్యం పెట్టుకున్నప్పుడు ఆ దృష్టి మంచిదే. కానీ అతను యాభై పనుల బాధ్యత వహించి, తక్కిన నలభై తొమ్మిదీ మరచిపోయి ఈ ఒక్క పనిమాత్రమే దృష్టిలో పెట్టుకుంటే ఈ పనులు ఎవరు చేస్తారు ? అయన నిర్వహిస్తున్నారని మిగతావారు పట్టించుకోరు. నష్టం ఎవరికీ?"

1155. "కుళ్ళు మీ రనుకున్నంత చెడ్డది కాదమ్మా. మంచితనం నిలవ ఉంటే అంతే. ఎట్లా అంటే - ఒక పండు పక్వానికి వచ్చినప్పుడు ఉపయోగించక నాలుగు రోజులు నిలవ ఉంచితే ఏమౌతుంది? కుళ్ళుతుంది."

1156. "ఆశ ఉండటంలో తప్పులేదు నాన్నా. అది లేకపోతే ఏమీ లేదు. ఆశే ఆధారం. ఆశ ఎట్లాంటిదీ అంటే నాన్నా - పుష్పానికి మొగ్గ ఎట్లాంటిదో జీవితానికి ఆశ అట్లాంటిది. ఆశ లేకపోతే జీవితం లేదు."

1157. "ఊహ కూడా స్వప్నమేగా. జాగ్రదావస్థలో స్వప్నం ఊహ."

1158. చాలారోజుల నుండి అమ్మ ఒక మంచి కారు కొనాలని అనుకుంటున్నారు. ఒక సందర్భంలో మిస్ మార్వా అమ్మను అడిగారు --

"ఈసారి అమెరికా నుండి నన్ను రమ్మంటారా? లేక ఆ ఖర్చుతో ఒక మంచి కారు కొని పంపించనా?"

అమ్మ : నువ్వే రా. కారు ఇక్కడయినా కొనవచ్చు.

1159. "దేనికి పనికి వచ్చేవాళ్ళు దానికి పనికి వస్తారు. ఎవరు ఎందుకు ఉపయోగపడాలో అందుకు ఉపయోగపడతారు. వీడు ఇందుకు పనికి వస్తే వాడు మరొక దానికి పనికి వస్తాడు. మన శరీరంలో ఉన్న అవయవాలు ఒకటి చేస్తున్న పని మరొకటి చేస్తుందా? కన్ను వింటుందా? చెవి చూస్తుందా? ముక్కు మాట్లాడుతుందా? అలాగే ఇందులో అన్నీ మన కవసరమే. అనవసర భాగం ఏముందీ?"

1160. "ఆ వడ్డెవాళ్ళని భోజనానికి ఒక పూట పిలుస్తున్నారు. కనుక వాళ్ళకు వీలుగా ఉన్న సమయంలో పిలవండి. ఉదయమే పనిలోకి వెళతారు కనుక మన వద్దన అందదు. సాయంత్రం పిలిచినా ఆ పిలుపు ప్రొద్దు గూకక ముందైతే వాళ్ళ అలవాటుకు సరిపోతుంది. పని చేసి చేసి ఉంటారా, పని నుండి రాగానే అన్నాలు తిని పడుకుంటారు."

1161. "ఆస్తి ఋణాలు తీర్చటానికే."

1162. 'తనకు యోగ్యత ఉన్నా లేకపోయినా ఇతరుల యోగ్యతను ఎందుకు విమర్శిస్తాడు?'

అమ్మ : అది వాడి యోగ్యత.

1163. 'మిమ్మల్ని వదిలి వెళ్ళాలనిపించటం లేదమ్మా, కాని సంసారం, భర్త,

పిల్లలూ ఉన్నారు. ఎట్లా వదిలి పెట్టటము?' అని తనని విడిచి వెళ్ళటానికి బాధపడుతున్న ఒక అక్కయ్యతో ---

అమ్మ : వదిలిపెట్టాలనుకున్నా వదిలిపెట్టగలవా? సంసార మంటే భర్తా, పిల్లలే కాదు; సంకల్పమే సంసారం.

1164. 'నా హృదయాన్ని కదిలిస్తున్నావమ్మా ---'

"కదిలేది హృదయం. హృదయాన్ని కదిలించటం కాదు. హృదయమంటే చైతన్యం."

1165. "ఏమి లేకపోతే చిక్కేలేదు. ప్రేమ వున్నదిగా? దానితో పాటు రెండోది గూడ ఉండక తప్పదు. కోపమంటే వేరేయేమున్నది? ప్రేమ ప్రకోపించి నప్పుడు యేమి చేస్తాడు. ముద్దు పెట్టుకుంటాడు. ఆ ముద్దు వచ్చినప్పుడు దగ్గరకు రాకపోతే కోపం వస్తుంది. ప్రేమ కోపానికి మూలమయింది."

1166. "అరికాలులో హృదయముందంటే ఎవరు కాదంటారు? తడిగుడ్డ మొత్తం మీద తడి ఎక్కడంటే ఎక్కడని చెబుతావు?"

1167. "బాకీదారు ఐ.పి పెట్టి సిల్కు చొక్కాలు వేసుకుతిరిగినా - తన కున్నంతలో కారం వేసుకు తినేవాడి కున్నంత హాయి వుండదు."

1168. "మరిపించి మరవాలి."

1169. "నీ కెప్పుడు ఉత్సాహంగా ఉంటే అదే లగ్నం అనుకుని చెయ్యి."

1170. "ఏమిటీ నువ్విక్కడ తిష్టవేశావ్? తమ్ముడి బాధ్యత నీదే."

'వాడి ఎడ్యుకేషన్ సంగతి చూస్తానమ్మా.'

"వాడి ఎడ్యుకేషన్ కోసం కాదు. నీ ఎడ్యుకేషన్ కోసమే చెబుతున్నాను. మీ బావ భరించవచ్చు గానీ అది బాగుండదు."

'నన్ను కావాలనుకున్న వాళ్ళు లేరమ్మా.'

"ప్రపంచంలో మనం కావాలనుకున్న వాళ్ళున్నా బ్రతుకుతాము. లేకపోతే మనని కావాలనుకున్న వాళ్ళున్నా బ్రతుకుతాము. ఈ రెండే లేనిదే ఉండలేము."

1171. 'ముసలమ్మకు జర్వం వచ్చింది. మలేరియాలా ఉందమ్మా వణుకున్నది.'

"ఊహుఁ."

'తొందరగా నీలో చేర్చుకోవమ్మా.'

"మనసులోది బయటకు వచ్చిందే! కాని నువ్వు పోవాలని ఆమె అనుకోదు గదా? నువ్వు ఎంత బాధన్నాపడు - అజీర్తి చేస్తుందో, వేడి చేస్తుందో అంటూ పెంచుతుంది. నీ కోసమే తాను పథ్యం చేస్తుంది."

1172. "చిన్న పిల్లలకు చెయ్యాలంటే ముద్దుగా ఉంటుంది. అదే పెద్దవాళ్ళకు చెయ్యాలంటే విసుగ్గా ఉంటుంది."

1173. అమ్మ అన్నారు - "అందం అంటే ఎక్కడికి రుక్మిణి? నీకు నచ్చింది మరొకరికి నచ్చదు. మరొకరికి నచ్చింది నీకు నచ్చదు. మనస్సును బట్టేగా అందం?"

1174. "ఓర్పు ఎవరికయినా ఉపయోగిస్తుంది గానీ ఆడది ఉపయోగించుకుంటే సహనం అంటారు. మగవాడు ఉపయోగించుకుంటే అసమర్థత అంటారు."

1175. "జీవితమంటే ఆశా అసంతృప్తుల కలయిక. అసంతృప్తితోనే ఆశపడు తుంటాము - ఇంకోనాటికైనా మంచి కలగదా, మన మనుకున్నది జరగదా అని. ఆశ అంటే నా దృష్టిలో ఒకటి నెరవేరగానే అది పూర్తి అయ్యిందని కాదు. అడుగడుగునా అదే ఉంటుంది. దానితో పాటే అసంతృప్తి. ఒక విషయంలో నీ ఆశ తీరగానే మరొక విషయంలో ఆశపడకుండా ఉండటం లేదు కదూ?"

1176. "మీ పిల్ల కోసమేగా ? అవసరమయితే మీరు (వారి కాళ్ళమీద) పడ్డా తప్పు లేదు. కాళ్ళు కడిగే యిచ్చారుగా?"

1177. "చిన్న పిల్లలు ఏడిస్తే మారాము అంటారు. పెద్దవాళ్ళు ఏడిస్తే కుళ్ళుమోతు తనం అంటారు. యేమి తెలియని వాళ్ళు చేసేదానికీ, అన్నీ తెలిసిన వాళ్ళు చేసేదానికీ యేడుపు ఒకటయినా తేడా యింతగా ఉంటుంది."

1178. "ఈ జారుడు వల్ల ప్రమాదమేమీ లేదు. నోరు జారితే ప్రమాదం గాని."

1179. "మౌనస్వామి అనగానే స్వామే కాక ఆయన చుట్టూవారు కూడా మౌనంగానే కూర్చుంటారు."

1180. "మనస్సుకు ఆలోచన లేకపోతే అది మనస్సే కాదు."

1181. "అన్నం విసుగు పుట్టదు గానీ, అనుపాకాలు విసుగు పుట్టిస్తాయి. ప్రాణం పై విసుగు పుట్టదు కానీ సంఘటనలు విసుగు పుట్టిస్తాయి."

1182. "కార్యార్థి లక్షణం తనను గురంచి అనేకం వినబడుతున్నా తలవంచుకొని ప్రశాంతంగా తనపని చేసుకోవటమే."

1183. "దృష్టిలో భేదం తప్ప ఉన్నదంతా ఒక్కటే. సైన్సు 'స్వభావం' అన్న దానిని మనం 'దైవం' అంటున్నాము."

1184. "అవయవాల లక్షణం బట్టి ఏ జబ్బయిందీ చెప్పవచ్చు."

1185. "పందిళ్ళు ఆపగలిగిన జనాన్ని డాబాలు ఆపలేవు."

1186. "ఏదయినా, ఎవరినయినా సంబంధం ఉన్న చోటే కదిలిస్తుంది."

1187. "నోటితో చెప్పకుంటే బాధగానీ అనుభవించడం తేలికే."

1188. "వదిలి పెట్టలేనిదేగా బాధ్యత."

1189. "అర్థం గాని మనుషులతో ఉండడమే అడివి."

1190. "వాడు వేసే ప్రశ్నలోనే వాడి సరుకు అర్థమవుతుంది."

1191. "నేను ఒక విషయాన్ని రెండుసార్లు రెండురకాలుగా చెప్పవచ్చు. కానీ అభిప్రాయం అదే; మాటలలో తేడా వస్తుంది."

1192. "తేలికైనదీ, బరువయినదీ అని విడదీయలేము. అందేది తేలిక. అందనిది బరువు."

1193. "ఒరిపిడి ఉండాల్సిందే కాని అన్ని చోట్లా ఒకే రకంగా వర్తించదు. బంగారానికి ఒరిపిడి పెడితే మెరుగు వస్తుంది. అదే మల్లెపువ్వుకు పెడితే చితికిపోతుంది."

1194. "రక్తమంటే ఎర్రగా ఉన్నదని కాదు. దేనిలోనైతే జీవాన్ని పోషించేది ఉన్నదో అదే రక్తం."

1195. "దేనినైనా తొందరగా మరిపించేది పాటయేనేమో. వాడికీ, వీడికి తెలియకుండా తనతో లాకెళ్ళుతుంది."

1196. "నిద్రలో అసలేమీ తెలియదు కదా? అలాగ ఆదరించమంటే యితరులు ఆదరించలేరు."

1197. "ఏదో ప్రళయం వస్తుంది, మారుతుంది, అంటున్నారు. కాదు. జగత్తు కంతా వస్తుందా? - రాదు. "

1198. "ఎప్పుడూ మంచీ-చెడూ, కలిమీ-లేమీ, కలిసే ఉంటాయి. ఒకడికి దరిద్రం రావచ్చు. ఒకడికి డబ్బు ఎక్కువగా ఉండవచ్చు. ఉన్నా - వాడి డబ్బు వాడి వాకిలి చిమ్మదుగా? వాడికి డబ్బులేని వాడు కావాలి."

1199. "ఎక్కడ లోపం కనబడ్డా ఎక్కడ మంచి కనబడ్డా మనకు ఆ మనిషి మీద ఉన్న నమ్మకాన్ని బట్టి తెలుసుకుంటాము."

1200. "ఎట్లా ఉంటే అది వర్జ్యకాలం నాన్నా? గణితం చెయ్యలేని కాలం - వర్జ్య కాలం."

'అయితే అది పనికిరాదంటారు గదమ్మా?"

"పనికి రాకపోవటం గాదు. వాడికి ఉపయోగపడటం లేదు."

1201. "పాకీవాళ్ళను తాకితే వస్త్రాలు విడిచేసి రమ్మంటారు. తాకింది గుడ్డ కాదుగా? మైలపడ్డది పిల్ల. గుడ్డవిప్పినా మైల ఎక్కడికి పోతుంది?"

1202. "మాట్లాడుకుంటుంటే నిద్ర రాదుగా? నీ శ్వాసను గమనిస్తూ నామం చేస్తూ పడుకుంటే తొందరగా నిద్రపడుతుంది."

1203. "పాకీవాళ్ళకు పావలా డబ్బులకు మనము ఆధారమై - మనకు పనికి వచ్చే పాకీతనానికి పనికిరానితనాన్ని అంటగడుతున్నాము."

1204. "అనుభవం మీద తెలిసింది నిలుస్తుంది. ఎవరన్నా చెబితే విన్నదాన్ని బట్టి నమ్మింది మరుపు వస్తుంది."

1205. "కొబ్బరినూనె ముఖానికి రాచుకుని సున్నిపిండి పెట్టి రుద్దుకుని స్నానం చేస్తే ముఖం నున్నగా బాగుంటుంది. స్నో కొంటారు గానీ ఈ పని చెయ్యరు. కొబ్బరి రుబ్బుతుంటే మెత్తగా నూనెలాంటి పదార్థం వస్తుంది. అది ముఖానికి రాచుకుని స్నానం చేస్తే ఎంత బాగుంటుంది? ఒళ్ళంతానూ రాచుకోవచ్చు. స్నో కొందామనిపిస్తుంది కానీ కొబ్బరి రుబ్బుకుని ఒంటికి రాచుకుని స్నానం చేద్దామని అనుకోరు."

1206. "పెద్దవాళ్ళు చిన్న ఆలోచనలు చేస్తే, చిన్న పిల్లలు పెద్ద ఆలోచనలు చేస్తారు."

1207. "ఇక్కడేనా, ఎక్కడేనా ఎవరు ఏది చేసినా ఎవరి తృప్తి కోసం వాళ్ళు చేసుకోవటమే."

1208. "అనుభవాలు చిన్నవేనంటారు. అంటే సాధ్యమయినవి చిన్నవీ, అసాధ్యమయినవి పెద్దవీను."

1209. "అమ్మ అంటే ఆడదీ, కనటమనీ కాదు. మాతృత్వం ఎక్కడుంటే అక్కడ అమ్మ ఉన్నది."

1210. "పండితులకు - సామాన్యంగా ఏది పొందటానికయితే చదువుకున్నారో అది పొందలేక చదువు మాత్రమే మిగులుతుంది."

1211. "కాలాన్ని అనుసరించి లక్షణాలు బహిర్గతం అవుతూ వుంటాయి."

1212. "జరిగేది మంచిపనే అయినప్పుడు ఖర్చుపడ్డా, మాట తప్పినా ఇష్టమే."

1213. 'వెన్నెల పూవులా? వెన్నెల పూవులంటే ఏమిటమ్మా?'

"నక్షత్రాల్ని అన్నాను."

1214. "అంతా భావనే, ఏదైనా - బాధించగలుగుతున్నాను అనేదీ- ప్రేమించ గలుగుతున్నాను అనేదీ"

1215. "నవల అంటే నూతనంగా సృష్టించింది. నాటకము అంటే లేనిదాన్ని ఉన్నట్టు నటించటము."

1216. "అధ్యాత్మికానికీ - సైన్సుకూ తేడా ఏముంది? ఉన్నది ఒక్కటే - మాటల భేదమే."

1217. "దుర్మార్గుడు తన దుర్మార్గాన్ని గుర్తించి సన్మార్గంలోకి మారి - నాకు శిక్ష వేయు-మని అడగటమే వాడికి శిక్ష. అటువంటి శిక్షే వాడికి రక్షణ."

1218. "ప్రతివాళ్ళకు ప్రతిదీ కావాలి. ప్రతివాళ్ళూ, ప్రతిదీ వాడికి కావాలి. ఇవి లేకపోతే వాడు లేడు."

1219. "దైవం పంపిన మనిషి దైవం ఇష్టం ప్రకారం దైవంలోకి పోతే మధ్యలో మనకు ఏడుపెందుకూ?"

1220. "శవంలోకూడా జీవశక్తి ఉంది కనుకనే పురుగులకు ఆహారమవుతున్నది."

1221. "మనిషి ఏది చేసినా తన తృప్తి కొరకే చేస్తాడు."

1222. "ప్రేమ అనేది ఉంటే నువ్వు ఏది చేసినా ఇష్టమే."

1223. "రెండు విభిన్న ప్రవృత్తులు కలిసి ఉండటమే కాపురం."

1224. "కాలం విలువ ధనం విలువ కంటే ఎక్కువ."

1225. "సంబంధమే బాంధవ్యము."

1226. "సత్యం ఎప్పుడూ కటువుగానే ఉంటుంది."

1227. "చెప్పేది అనుభావం; తనలో ఉద్భవించేది అనుభవం."

1228. "దుఃఖానికి చరమదశ సంతోషం. సంతోషానికి చరమదశ దుఃఖం."

1229. "ఎవరే దారిన పోతే వారిని ఆ దారిన పోనిచ్చి మెల్లగా ఇటు తిప్పుకు రావాలి."

1230. 'నిత్యయౌవనం - అంటారు, ఏమిటమ్మా?'

"ఎప్పుడూ ఉండేదీ, మారనిదీ."

1231. "పెద్దవాళ్ళకు ఎదురు తిరిగితే అనేక రూపాల్లో వస్తుంది."

1232. "తెలియని తనమే గుడ్డు; తెలిసినతనమే పిల్ల."

1233. "బిడ్డకొట్టింది దెబ్బ అనిపించదు. తల్లి కొడితే నొప్పి ఉండదు."

1234. "తరగటమేగా తర్కము."

1235. "ఎవరూ ఉన్నది వదిలించలేరు. లేనిది తెచ్చిపెట్టలేరు."

1236. "రూపం బీజమైనప్పుడు బీజరూపం ఏమిటి?"

1237. "వాస్తవంలో స్తవం ఉంది కానీ స్తవంలో వాస్తవం లేదు."

1238. "శిక్ష అంటే క్రమశిక్షణలో పెట్టటమే."

1239. "నా జీవిత చరిత్రా? పండితుడైన పామరుడు వ్రాయడు. పామరుడు అయిన పండితుడు వ్రాస్తాడు."

1240. "ఆగ్రహాన్ని నయం చేయాలంటే నిగ్రహం గలవాళ్ళే కావాలి."

1241. "వ్రాసినదే శాస్త్రం."

1242. "తల్లి ఉన్నవాళ్ళకు ఒక్కతే తల్లి. తల్లి లేని వాళ్ళకు అందరూ తల్లులే."

1243. "మాటలతో బాగు పడేవారు శాస్త్రాలతోనే బాగుపడతారు."

1244. 'తప్పు అంటే'

"నచ్చక పోవటమే తప్పు"

1245. "సంఘం అంటే సంబంధము."

1246. "భావానికి అందేదంతా రూపమే."

1247. "మాట వేరు. మనస్సు వేరు."

1248. "విశ్వాసం మారదు."

1249. "ఎవరు నలిగి ఉంటారో వారిమీద వాదు ఉంటుంది."

1250. "సుఖమంటే ఇష్టమైనది."

1251. "అనుకున్నది తన కోసం అనుకుంటాడు. అన్నది ఇతరుల కోసం అంటాడు."

1252. "లేనిదాని కొరకు ఆశించేది దుఃఖం. ఉన్నది చాలనుకునేది సుఖం."

1253. "ఇతరులను ఎగతాళి చేసేవాడికి ఏమీరాదు."

1254. "గుణం లేనివి ఉండవు."

1255. "శబ్దం ఒకటే. ధ్వనులు వేరు."

1256. "జరిగిపోయినది తల్చుకోవద్దు. జరగవలసినవి ఆలోచించండి."

1257. "ఎవరయితే చూసినవారు చూడనివారికి చూసినట్టు చేయగలుగుతారో వారే వ్రాతగాళ్ళు."

1258. "సుఖం మనస్సుకు సంబంధించినది గాని, పరిస్థితులకు సంబంధించినది కాదు."

1259. "ప్రతి వస్తువులో గుణ భేదం ఉంటుంది. గుణభేదమే మంచిచెడులు."

1260. "ఆయుర్దాయం తీరినవాడు మందులతో ఎట్లా బ్రతకడో ఆయుర్దాయం ఉన్నవాడు అట్లే చావడు."

1261. "తల్లికి బిడ్డ సొమ్ము; బిడ్డకు డబ్బు సొమ్ము."

1262. "ప్రేమ ఒక్కటే కాని స్థానాలను బట్టి పేర్లు మారుతూ ఉంటాయి."

1263. "మహమ్మదీయ అంటే - నాకు ఉరుదూ రాదు కానీ- గొప్ప మనస్సనుకుంటాను."

1264. "ధర్మంలో కట్టుబాట్లు ఉన్నాయి. ప్రేమలో కట్టుబాట్లు లేవు."

1265. "మనస్సుకు ఎంతైనా పవర్ ఉన్నది."

1266. "ఆదమరిపిస్తుంధి పాట.
ఆదరిస్తుంది నిద్ర."

1267. "మనల్ని కావాలనుకున్నవాడే బంధువు."

1268. "కరిచే దల్లా కోరికే. అంతకంటే ఏమీ లేదు."

1269. "అక్షరాలకి రసం కాదు. అక్షరంలోనే ఉన్నది."

1270. "బాకీ అంటే నేను పెట్టానని భావం ఉండటమే బాకీ."

1271. "సరిగ్గా అన్ని విషయాలు చూచినవాళ్ళే పెద్దవాళ్ళు."

1272. "చేస్తున్నా పోట్లాడేది కుమారుడు; పోట్లాడుతున్నా చేసేది తల్లి."

1273. "భారం వహించేశక్తి ఎక్కడ ఉన్నదో అదే మాతృత్వం."

1274. "ఎటువంటి వాళ్ళనైనా పెట్టుకుచేయడం సాధనే మరి."

1275. "రావణాసురుడు దుర్మార్గుడనీ, లోకకంటకుడనీ ఆ తల్లి ప్రేమించకుండా

ఉన్నదా? ఆ స్థానం అట్లాంటిది."

1276. సంవత్సరం నిండని తన పాపకు పాల ఉబ్బసానికి గాను ఇంజక్షను చెయ్యాల్సి వచ్చిన పరిస్థితికి విలవిలలాడుతున్న శారదను చూచి అమ్మ- "నువ్వే అమృతం పెట్టాలి. నువ్వే విషం పెట్టాలి. కన్న తర్వాత తప్పేదే మున్నది. తల్లివి కనుక రెండూ చెయ్యాలి."

1277. "అనుకూలమే మంచి."

1278. "శరీరమన్నది ఉన్న తరువాత అన్ని రకాలు ఉంటాయి."

1279. "ప్రేమ లేని చోట అసలు కోపం కూడా రాదు."

1280. "శృంగారం చేసేది. సౌందర్యం జన్మతః వచ్చేది."

1281. "హెచ్చుతగ్గులే రుచి."

1282. "క్రోధం లేకపోతే భయానికి తావు లేదు."

1283. "సత్రం అంటే అందరికీ స్వతంత్రమనా?"

# చమత్కారము

1284. 'మా కోడలు బంగారు రంగు పూసలతో నెక్లెసూ, రవిక చేతులకు లేసులూ అల్లింది. మీకు ప్రెజెంటు చేస్తుందట.'

"నేను అబ్సెంటు అయ్యానని మానుకుందా?"

1285. అమ్మ ఏవో కబుర్లు చెబుతూంటే అవి త్వరత్వరగా రాస్తున్న భవానీని చూసి "ఇప్పుడు నేను అన్నమాట వినబడిందా?" అన్నారు.

ఆ అమ్మాయి : (రోషంగా) నేనేమి మీ కోడలిని కాదమ్మా- వినబడక పోవడానికి.

అమ్మ : నాకోడలివి కాదు నా కూడలివి.

1286. వాకిట్లో సంజకళ్ళాపి జల్లి ముగ్గులు పెడుతున్న మా బృందాన్ని రోలు మీద కూర్చుని తిలకిస్తున్న అమ్మను చూసి హరిదాసుగారు అన్నారు-

'ఆడవాళ్ళు రోటిమీద కూర్చోకూడదు.'

అమ్మ : నేను ఆడదాన్నా ? నేను ఆడదాన్ని కాదు ఈడదాన్నే.

1287. "కృష్ణుడు కాదు గృష్ణుడు" అన్నారు అమ్మ.

'గృష్ణుడా ? అదెట్లాగమ్మా?'

"గృష్ణుడంటే గుణముల కాధారమైనవాడని."

1288. ఒక విషయంలో అమ్మ స్వగతంగా -"చలిమంట కాదు. చితుకులమంట వేసుకున్నాను" అని అంటే కేశవ గోపాల్‌ను అడిగాడు 'విన్నావా ఆ మాట?'

గోపాల్ : మనకా సబ్జక్ట్ వద్దు.

అమ్మ : బడ్జట్టేగా వాడి సబ్జక్ట్ ! అంతా బడ్జట్టేగా.

1289. "అత్రి- అనగా త్రికాలములూ త్రి విధావస్థలూ లేనివాడు."

1290. అన్నపూర్ణక్కయ్య అమ్మకి వెన్నతో మందు కలిపిస్తే అమ్మ - వెన్న నాకిష్టం లేదు- అన్నారు.

'నీ కిష్టం లేకపోవటమేమిటి? - కృష్ణుడివైతేను.'

"కృష్ణుడిగా ఉన్నప్పుడిష్టం - కాని ఇప్పుడిష్టం లేదు."

1291. 'ఆయన సామాన్యులు కాదు. పీఠాధిపతులతో సమానం.'

"భోజనం చేసేటప్పుడు అందరూ పీటాధిపతులమే."

1292. 'నాలో లోపాలుచాలా ఉన్నాయమ్మా' అని కోనా సుబ్బారావుగారు-

"నాలో (భాగము) పాలు ఇచ్చానా?

నాలోని పాలు ఇచ్చానా?

నాలోపాలిచ్చానా.

నీ లోపాల్లేకుండా ఎట్లా ఉంటాయి?"

1293. 'నాన్నగారు అంటున్నారమ్మా-'

"నన్ను గురించా?"

' ఊఁ. ఆ శరీరంలో ఏముందీ? భావబలం తప్ప బలం లేదంటున్నారు.'

"బావబలం తప్ప ఏ బలమూ లేదు."

(నాన్నగారూ అమ్మా మేనత్త మేనమామ బిడ్డలు)

1294. 'ఇక్కడ నింపుకుంటున్నాము. అక్కడికి పోగానే ఏముంది? డన్‌లప్'-అని ఆ కంపెనీ ఉద్యోగి.

"డన్‌లప్ డెవలప్" - అని అమ్మ.

1295. "ఈ నాడు డెమోక్రసీ ఎక్కడున్నదీ మాటలో తప్ప? ప్రతివాడూ మనస్సులో కోరేది డిక్టేటర్‌షిప్."

1296. "దారిలో ఉన్నవాడు దారి తప్పినవాడి కాళ్ళు పట్టుకుంటే తప్పినవాడు దారిలోకి వస్తాడు."

1297. యేర్లగడ్డ రాఘవయ్యగారు - 'ఏమి స్వప్నాలు. ఏమి స్వప్నాలు-'

అమ్మ : నేనిదంతా నిత్య మను[illegible]ంటున్నాను కదా! నువ్వు అదృష్టవంతుడివి - అంతా స్వప్నమనుకుంటు[illegible].

1298. ఒకరు: నా ఉత్తరం చేరిందా అమ్మా?

అమ్మ : ఊఁ.

అతను: దానికి సమాధానం వ్రాయలేదే మమ్మా?

అమ్మ : వ్రాసేదేమున్నది? నా దగ్గర ఉంటుంది ఉత్తరం. ఉండటమే సమాధానం.

1299. నాలుగు రోజుల క్రిందట వచ్చి వెళ్ళిన ఒక అన్నయ్య మళ్ళీ ఈ రోజు వచ్చి అమ్మను చూశారు. వారు వెళ్ళాక అమ్మ అన్నారు. - "ఈ రెండు రోజులలోనే బాగా చిక్కిపోయాడే" అని. అంటే సన్నబడ్డాడని.

వెంటనే హైమ నవ్వుతూ అన్నది - 'అవునమ్మా నిజంగానే చిక్కిపోయారూ' అంటే తన అభిప్రాయం అమ్మకు చిక్కారని.

అమ్మ కూడా నవ్వుతూ - "అంతేగా. మళ్ళీ చూడాలని అనిపించటం చిక్కిపోవటమేగా" - అన్నారు.

1300. తనను అన్నం తినిపిస్తున్న అమ్మతో అన్నారు కృష్ణమూర్తిగారు -

'నేను పసివాడిని అయితే ఎంత బాగుండునమ్మా! ఎప్పుడూ ఇట్లాగే తినవచ్చును.'

"ఇప్పుడు పసివాడివి కాక పెద్దవాడివా?"

1301. "నాకు ఉత్తరం వ్రాయాలంటే ఆకాశవీధి నడి సముద్రం, అమ్మ, అనండి - వస్తుంది."

1302. జిల్లెళ్ళమూడిలో అన్నపూర్ణాలయం వెనుక ఏరు వరకు రాబోయే ఇళ్ళను గురించి చెపుతున్న అమ్మతో ఒకరు 'టౌను ప్లానింగు చేస్తున్నావా అమ్మా;'

"టౌను ప్లానింగ్ నాకేమి తెలుసు? నేను చేస్తున్నది విలేజ్ ప్లానింగ్."

1303. సాంబయ్యతో అన్నారు అమ్మ --

"ఉదయం నువ్వు చేసిన ఇంజక్షన్ నొప్పి ఇంకా తగ్గలేదు. రోజల్లా గుర్తుకు వచ్చావు."

సాంబయ్య : అయితే అదృష్టమే.

అమ్మ : అవును అదృష్టమే మరి. ఈ జబ్బులు రావటం,నీ మందులు నేను వాడటం.

1304. ఇటీవల వాళ్ళబ్బాయి పెళ్ళిచేసిన ఒక అన్నయ్య కొడుకూ కోడలితో వచ్చారు. ఆ అన్నయ్య అడిగారు. -'కోడలు బాగుందా అమ్మా?'

అమ్మ : నాకంతా బాగుంటారు నాయనా. కోడలు ఎట్లా ఉన్నదని అడిగావు కానీ మా అబ్బాయి ఎట్లా ఉన్నాడని అడగలేదే? బాగుండటం అంటే రూపం కాదు. అబ్బాయికి భార్యగా నీకు కోడలిగా ఉన్న రోజే బాగుండటం.

1305. కేశవ్ అన్నయ్యగారి అబ్బాయి ప్రేమ్‌కుమార్‌ని అమ్మ ఎంత పిలిచినా రాకపోయేచిప్పటికి అమ్మ వాడి దగ్గరికి అరటిపండు విసిరేశారు. అది చూసి కేశవ అన్నయ్య అన్నాడు - 'వాడెందుకు వస్తాడు; పండు తీసుకున్నాడుగా?'

'అమ్మ (నవ్వుతూ) వాడు ఒక పండే తీసుకున్నాడు. నువ్వు నా దగ్గరు న్నప్పుడు అన్ని పండ్లూ తినేవాడివి.

1306. 'ఎంత మంచిదానవో కదమ్మా నువ్వు! నీ బిడ్డలను ఇట్లా ఏడిపించటం న్యాయం కాదమ్మా-'

అమ్మ : మంచేగా నాయనా ఏడిపించేది?

1307. గజేంద్రమ్మ నీళ్ళు తోడింది అమ్మ స్నానానికి. అమ్మ లేవబోతు మళ్ళీ పడుకున్నారు. అది చూసి అక్కయ్య అన్నది 'మళ్ళీ నిద్రపోతున్నావా అమ్మా,నీళ్ళు పోసుకుని వచ్చి బబ్బో-'

అమ్మ : రావాలే కానీ, నిద్రపోవటం తప్ప రావటంలేదు.

1308. "నా అల్లరి శృంగారలహరి."

1309. డి.యి. గారు ఈ మధ్య జపాను వెళ్ళారు. వెళ్లేటప్పుడు భార్యనూ పిల్లలను ఇక్కడ ఉంచమన్నారట అమ్మ. కానీ వెంట తీసుకు వెళ్ళారు. ఒక్క నెల

గడవక ముందే పిల్లవాడు సముద్రంలో పడి చనిపోయాడట.

'అమ్మ ఉంచమన్నప్పుడు ఉంచివా బాగుండేది' అన్నారు డి.యి.గారు.

అమ్మ : ఇక్కడ మాత్రం ఉండేవాడవి ఏముందీ? డ్రెమ కాలవలో పడకూడదూ?

1310. శేషగిరిరావు అన్నయ్యగారి కూతురు కమల అడిగింది - 'ఏ పెళ్ళికి ఏ కెన్నేళ్ళు?'

అమ్మ : సామాన్యమయిన వయస్సా? పదిమూ పైన వాలుగూ.

1311. డాక్టరు శ్రీధరరావుగారిని భద్రాద్రి రామశాస్త్రిగారు అడిగారు-

'మీరు వ్రాసిన రచనలు తెచ్చారా?'

శ్రీధరరావుగారు : తేలేదు.

రామశాస్త్రిగారు : దాచిపెట్టకు, పాసిపోతుంది.

శ్రీధరరావుగారు : చూడమ్మా ఎట్లా అంటున్నాడో.

అమ్మ : పాసిపోదు. రాసివడుతుంది.

1312. "ఇక్కడ ప్రస్థాన కవులే కాని ఆస్థాన కవులు లేరు."

1313. "నవరసాలు ఒప్పే నవల ఒకటుంటే బాగుండునని అనిపిస్తున్నది వెనుకటిది కాదు ఇప్పుడు వ్రాయాలి. ఏమి చెప్పేదిలే ...న్నా"

భరద్వాజ: వర్ణనాతీతమా;

అమ్మ : కాదు. అవర్ణాతీతం.

1314. 'అవుపోసన వెయ్యాలా?'

"అవకాశం పట్టండి."

1315. "నాకు చింతపండు పచ్చడి మళ్ళీ వెయ్యాలా... వారున్నది ఏమి చెయ్యనూ?- హాయిగా విగ్రహమయితే నివేదన చేసి ఊరుకునేవారు."

1316. అమ్మ : నీ కథకు తోడు శృతి కూడా కావాలా?

యేర్లగడ్డరాఘవయ్యగారు: అమ్మ కథకు శృతికూడా కావాలా అంటా వేమిటమ్మా?

అమ్మ: స్మృతి ఉంటే చాలు అని.

1317. యేర్లగడ్డ రాఘవయ్యగారు : రాధ మొత్తానికి అవధూతే.

అమ్మ : వాడికి కోపం వస్తే మన పాలిట యమదూతలాగా ఉంటాడు.

1318. యేర్లగడ్డ రాఘవయ్యగారు -

'నీతో మాట్లాడటం అసాధ్యమమ్మా.'

అమ్మ: అయితే నీకు సాధ్యసాధ్యమవుతున్నదన్నమాట.

1319. 'నాకు బాగా పాట రాదమ్మా.'

"పోని రానట్లుగానే పాడు-."

1320. తెనాలి తాతగారూ, మంగా అమ్మకు పూజ చేసుకోబోతు కొబ్బరికాయల కోసం ఆగారు.

శాయమ్మగారు : కావాలంటే కొబ్బరి బొళ్ళాముంది.

అమ్మ : నేనున్నానుగా - కొబ్బరి బొళ్ళామును కానివ్వండి.

1321. సుబ్బయ్య ఊరికి వెళుతూ ప్రసాదానికి వచ్చాడు.

'డబ్బు ఇవ్వమ్మా-'

రామకృష్ణ : సుబ్బయ్యకు డబ్బు వచ్చేటట్లు ప్రసాదం ఇవ్వమ్మా -

అమ్మ పండ్లు అందుకుంటూ "నేనివ్వను. ఇది ప్రసాదం కాదు, అవసరం. అవసరానికి ప్రసాదం అడుగుతున్నాడు."

1322. బాబ్జి : ఇక్కడకు వచ్చేవాళ్ళంతా ఒక్కొక్కరు ఒక్కొక్క రకంగా ఉంటారు.

అమ్మ : ఇక్కడికి వచ్చేవాళ్ళేకాదు, భూమిమీదకు వచ్చేవాళ్ళంతా అంతే.

బాబ్జి : (అమ్మ నుద్దేశించి) ఇక్కడ ఉన్నదేగా?

అమ్మ : అట్లా అనుకుంటే భూమి ఎక్కడ లేదూ?

1323. ఒక అత్తగారితో అమ్మ-

'ఆ అమ్మాయినే చేయమనరాదూ?"

ఆ కోడలిని గురించి అత్తగారు : ఆ గుడ్డ కూడా ఆ తానులోదే కదమ్మా!

అమ్మ : ఆ గుడ్డ ఆ తానులోదే అయినా పత్తి అంతా భూమిలోదే.

1324. 'కడుపునిండా అన్నం పెట్టరు గదా?'

"పోనీ కడుపునిండా ఆకలి అయినా పెట్టి ఉంచుతున్నారు కదా?"

1325. 'ఇప్పుడు రాకుండానైనా ఉండగలనమ్మా, ఎప్పుడూ సాన్నిధ్యమే కనుక సాన్నిధ్యాన్ని సాధించాను. గనుక నిన్ను సాధించే పని లేదు.'

"నన్ను సాధించకుండానే నా సాన్నిధ్యం నీకు సాధ్యమైందా?"

1326. 'మీ తల్లి ఉంటే మీ మాటలు నోటారా విని ఎంత సంతోషించేవారో?'

"నోటారా వినటం ఏమిటీ? నోటారా వింటారా?"

'ఓ పరసందుల స్వామీ!'

1327. 'మీరసలు నిద్రపోరుగా?'

"పోతూనే ఉన్నాగా"

'ఎక్కడికి'

"అవసరమున్న చోటికి."

1328. ఎవరో అమ్మతో వసుంధర గురించి పెళ్ళి అయ్యాక వసుంధర బావుందమ్మా. చూడగానే గుర్తు పట్టలేదు అంటే అమ్మ అన్నారు -

"వసుంధర తత్వమే అంత కదా. ఒక చోట ఎర్రగా ఉంటే ,ఇంకోచోట నల్లగా ఉంటూ, మరొకచోట ఇసుకగా ఉంటుంది కదా? అందుకే మారుతూ ఉంటుంది."

1329. 'నక్క ఎక్కడ? నాగలోకం ఎక్కడ? నేను చెప్పటం ఏమిటి?'

"ఇక్కడే నాగలోకం"

1330. 'శ్రీపాద అక్కడకు వస్తున్నారంటే చాలా ఆశ్చర్యపోతారమ్మా - ఆయన సైన్సే! - ఎట్లా వస్తున్నారని?' అని కాత్యాయని అన్నది అమ్మతో.

అమ్మ : ఆయన సైన్సు కాబట్లే వచ్చాడు.

1331. 'మీ రహస్యం తెలిసింది చెప్పమన్నారా?'

"రహస్యమయితే ఎట్లా చెబుతావు?"

1332. జిల్లెళ్ళమూడికి విద్యుత్ సౌకర్యం కలిగిన తరువాత వచ్చిన ఒక అన్నయ్య అడిగారు-

'ఈ లైట్లు ఎప్పుడు వచ్చాయి?'

గోపాల్ : మార్చిలో.

అమ్మ : (నెమ్మదిగా) అవును. ఆ దీపాలు మార్చి ఈ దీపాలు వచ్చాయి మార్చిలో.

1333. "చెడు జబ్బుకాదు. జబ్బే చెడు."

1334. నాన్నగారు : ఆడదానికి కర్మాధికారం లేదు.

అమ్మ : (నవ్వుతూ) జ్ఞానాధికారం తప్ప కర్మాధికారం లేదేమో.

1335. అయినా దానికంత పట్టుదల దేనికమ్మా? నా బజారు వెళ్ళడం గురించి?'

"నీకు కూడా పట్టుదల ఉన్నట్లేగా? నీవు వదిలి పెట్టింది ఏముందీ?"

1336. 'ఏమిటమ్మా - క్రొత్త సమాధానం!'

"ఏ క్షణానికా క్షణం క్రొత్తేగదా?"

1337. "భాగవతం అంటే- ఆట. తాను నటించి చూపటం."

1338. 'ఇదివరకు చాలామందితో అన్నావట కదా?'

"ఇప్పుడు నీతో ఎంత అన్నానో ఇదివరకు చాలామందితో అంతే అన్నాను నాన్నా."

1339. 'మాటిగా వేస్తావమ్మా. నీకోసం మాటలు ఎదురుగుండా వచ్చి నిలుచుంటాయా?'

"ఊc. లేకపోతే మనం పరిగెత్తితే దొరుకుతాయా?"

1340. 'భూకంపం ఎలాగున్నదమ్మా?'

"భూమి అంతా కదిలి కదిలి వచ్చి గుండెల్లో కూర్చున్నట్లుంది కదూ?"

1341. "అమ్మా - రేపు వెళతావమ్మా."

"ఎక్కడికి?"

'స్కూలుకమ్మా.'

"ఇప్పుడు సెలవులుగా."

'అయినా వెళ్ళాలి, కాస్త ముందుగా. పనులు ఉంటాయి.'

"అయితే సరే, రేపు వెళ్ళి హెడ్‌మాస్టరుగారికి పరిస్థితి చెప్పి రా."

'ఆయన అంత తేలికైన మనిషి కాదమ్మా.'

"బరువుమాత్రం ఏమున్నాడులే?"

1342. "మీరందరూ అన్నాలకు వెళ్ళండి."

'అయితే ఇక్కడ ఎవరుంటారు'

"నేనున్నానుగా?"

1343. 'నాకు మనసు సరిగా ఉండదండీ.'

అమ్మ : ఏమి చేస్తూ ఉంటావు?

అతను : గోల చేస్తూ ఉంటాను.

అమ్మ : గోల అంటే ఏం చేస్తుంటావు?

అతను : ఇంట్లో వాళ్ళను కొడుతుంటాను.

అమ్మ : ఇంట్లో వాళ్ళనేనా, ఇతరులను కూడానా? ఆ తేడా తెలుస్తుందా?

అతను : తెలుస్తుంది.

అమ్మ : నువ్వే నయం. నాకంటే - ఆ తేడా అయినా తెలుసు.

1344. "మనం ఎక్కడకు వెళ్ళితే అక్కడ వెచ్చగా ఉండవచ్చు."

'నీది ఇనుపపాదమా ఏమి?'

"కాదు అగ్నిపాదం."

1345. 'మేము ఏ క్లాసు అమ్మా?'- దశాబ్దం పైగా అమ్మ సన్నిధికి వస్తున్న వారి ప్రశ్న.

"క్రమంగా బడికిరావటం నేర్చుకోండి. తరువాత బడిలో వేయటం అనే ప్రశ్న."

1346. 'ఇంతమందికి మీలోనే ప్రత్యేకత ఏమి గోచరించిందంటారు?'

"నీకు తెలియనిది వాళ్ళకు తెలిసినదీ."

1347. రాఘవయ్యగారు : అంత తేలికగా తీసేస్తావేమిటమ్మా?

అమ్మ : నాకు బరువనిపించటంలేదు.

# ఆనాటి అమ్మ

1348. "చిన్నప్పుడు ఎక్కడున్నా కిటికీయే నాకు."

1349. 'ఆ అమ్మాయి పిలుపు చూడు. నీవు బుచ్చాం అంటావు. ఆ అమ్మాయి "అమ్మా" అంటుంది లేకపోతే "బుచ్చమ్మా" అంటుంది. చాకలిగా చూడదు.'

1350. 'ఏమి చదువుతున్నావు?'

"ఫలానిది చదవమని మా పెద్దవాళ్ళు చెప్పలేదు. ఏమి చదవాలో నాకు తెలీదు."

1351. 'కుంకుమ బొట్టు కనుబొమ్మల మధ్య ఎందుకు పెడతారమ్మా?'

"చిన్నప్పటినుంచి ఇలాగే పెట్టుకుంటున్నా నాన్నా."

1352. మరిడమ్మగారు : అమ్మా - నీవు రోజూ యింట్లో ఉండటం లేదు ఎందుకని?

అమ్మ : యింట్లో ఉంటే ఒక పిన్నికీ నాన్నకూ తోడు. బయటకు వెళితే చెట్లకూ, చామలకూ, పిట్టలకూ అనేకానికి తోడుగా వుండవచ్చు.

1353. 'చింతచెట్టులో విశేషమేమిటమ్మా?'

"చింతే నీడనిచ్చింది. చింత అండన యెండ తీర్చుకున్నాను. చింతరసమే దాహం తీర్చింది. ఆ చింత నా చెంతనుండి నా మనసుకు ఏ చింతా లేకుండా చేస్తుంది."

1354. 'నువ్వు చూస్తే మూడడుగులు ల్లేవు. ఎట్లా బ్రతుకుతున్నావమ్మా' అని ఒకరు.

"మూడడుగుల మనిషినే - సముద్రమంత ఆశతో బ్రతుకుతూ ఉన్నాను. ఆ ఆశలోనుండి అసంతృప్తి అనే అలలు లేచి పడేస్తున్నాయి."

'అది మాకు వర్తిస్తుందమ్మా. మూడడుగుల ఆకారమూ, సముద్రమంత

మనస్సూ- నీకేమిటమ్మా? ఆశా అసంతృప్తీ మాకు.'

1355. 'అంతదూరం నడవగలిగావా?'

"నడిచాను"

1356. "కాపురానికి వచ్చేరోజున పుట్టింట ఎవరూ లేరు. నేనే బొట్టు మండిగానికి రాచి అద్దుకున్నాను. అమ్మలేని వెలితి ఎప్పుడూ అనిపించలేదు గానీ అప్పుడు అనిపించింది."

1357. ముఖం కడిగిస్తూన్న అమ్మాయి 'అమ్మా - చిన్నప్పుడు కూడా ఇలాగ ఈ పాదాల (మంగళసూత్రాల)కు అభిషేకం చేసిన నీరు త్రాగేవారా?'

"నీరు ఏమిటమ్మా - పాదతీర్థం. పరమాన్నమయినా ఈ (పాద) తీర్థం చేర్చే త్రాగేదాన్ని."

1358. 'నిద్రపోకుండా పని చేస్తున్నావా అమ్మా?'

"నిద్రపోయింది కనుకనే పనిచేస్తున్నా."

1359. 'ఏమమ్మా - తెల్లవార్లూ ఇలాగే చేస్తున్నారా?'

"చెయ్యటం అయిపోయింది."

1360. 'చెప్పనని చెప్పు-'

"చెప్పనని చెప్పను. తెలియదని చెబుతా."

1361. నల్లగా నిగనిగలాడుతూ ఒత్తుగా ఉండే అమ్మ తలకట్టును చూసి బామ్మ అంటుండేదట -

'ఆ గంగ విప్పుతాను రా అమ్మా' అని.

'ఎన్ని రోజులకు ఒకసారి వేసేది అమ్మా - జడ?'

"ఆమెకు తీరినప్పుడూ, బుద్ధిపుట్టినప్పుడూ, ఆ జుట్టుకు తైలసంస్కార మున్నప్పుడూ."

1362. "సమాధి - అనుభవం పొందటానికి నేను ఏ సాధనలూ చేయలేదు."

1363. "నా మనస్సులో హెచ్చవేతలూ, కూడికలూ, తీసివేతలూ వేసుకునే దానిని

కానీ ఇంకొకళ్ళను అడిగే గుణం లేదు."

1364. చిన్నప్పుడు హైమ 'ఓం' అని వ్రాసి మాష్టరుగారు దిద్దమంటే హైమ (బ్రహ్మాండం) 'అక్కడే ఉన్నదిగా' అనేదట. అమ్మ 'ఓం' అనటమంటే 'నీ దగ్గర ఉన్నదిగా' అనేదట. ఆ మూడేళ్ళ వయస్సులోనే జపం చేస్తున్నట్లుగా ఎప్పుడూ వ్రేళ్ళు లెక్క పెట్టుకుంటుండేదట. ఈ విషయాలు అమ్మ చెబుతూ అన్నారు -

"అదేమిటో ముగ్గురు పిల్లల్లో అదీ, దాని ప్రవర్తనా మొదటినుండీ ప్రత్యేకంగానే ఉండేది."

1365. "తెల్లవారిన తరువాత చెబుతాను అనే దానికి పలకటం రాక - తెల్లవాలిన తలువాత చెబుతాను - అనేదాన్ని."

# అమ్మ యెరుక

1366. 'నీకు యిక్కడికి వినిపించిందా? నీవు అక్కడికి పోయి విన్నావా?'

"ఎట్లాగయినా ఒకటేనమ్మా."

1367. "మీకు రహస్యం నాకు హాస్యం."

1368. పాప అత్తయ్య కొడుకు, శాయి హైమ గొలుసుతో ఆడుకుంటుంటే అమ్మ చూసి అన్నారు అత్తయ్యతో -

"గొలుసు పోతుందెమో వాడి చేతిలో తియ్యి -"

ఆ మాటకు అత్తయ్యకు కోపం వచ్చి శాయిని కొట్టింది. అది చూసి అమ్మ ఇంకేమి మాట్లాడలేదు. ఆ తరువాత అమ్మ అన్నట్లే ఆ గొలుసు పోయింది.

1369. 'మేము మాట్లాడుకున్నదీ నీ కెలాగ వినపడిందమ్మా?'

"మీరు మాట్లాడుకున్నది మీకు వినపట్టంలేదూ? అట్లాగే అంతా వినపడు తుంటుంది. అన్నీ కనపడుతుంటాయి."

1370. 'అన్నయ్యా - దాళువా - పంటంతా పాడయింది' అని రుక్మిణక్కయ్య చెప్పింది.

రామకృష్ణ అన్నయ్య : ఎందుకమ్మా అట్లా చేశావు?

అమ్మ : నువ్వు డబ్బు వెదజల్లుతున్నప్పుడే చెప్పాను. ఈ సంవత్సరం దాళువా పంటకు అంతగా ఖర్చు పెట్టవద్దు అని - విన్నావా?

రామకృష్ణ అన్నయ్య అమ్మకు నమస్కరించాడు.

1371. "వర్షం వచ్చి ఉంటుంది. నా కృపావృష్టిలో తడిసి ఉంటాడు" అని స్వగతంగా అనుకున్నట్టు అన్నారు అమ్మ. ఆనాటి సాయంత్రమే అప్పికట్ల నుంచి రామకృష్ణ వ్రాసిన ఉత్తరం అందింది. దానిలో ......... "నీ కృపావృష్టిలో తడిసి" అని వ్రాశాడు.

1372. "సుబ్రహ్మణ్యం వచ్చాడురా. చూడూ---"

రాధన్నయ్య చూసి 'ఎవరూ లేరమ్మా' అన్నాడు.

"కాదురా వచ్చాడురా."

కాసేపటికల్లా ఆ అన్నయ్య రానే వచ్చాడు.

1373. వేదాంతం దుర్గాంబగారికి ఎఱుపుచీర, ఆమె కోడలు రాజ్యలక్ష్మికి నలుపుచీరె పెట్టారు ఒకసారి అమ్మ. సరిగ్గా ఆ రకం చీరెల కోసం నాలుగు రోజుల క్రిందట వారు చీరాల, రేపల్లె బాపట్లలలో షాపులన్నీ చూశారట. అమ్మ ఆ చీరలను ఇవ్వటం సరే, వాళ్ళ మనస్సునుబట్టి ఇచ్చినందుకు ఆశ్చర్యపోయారు వాళ్ళు.

1374. 'మావన్నీ నీకెట్లా తెలుస్తాయమ్మా?'

"నా ప్రవర్తన నాకు తెలియదూ?"

1375. "సీతారామమ్మగారు నాలుగు సంవత్సరాలు (అమ్మ స్నానం) నీళ్ళ క్రింద మంటపెట్టీ పెట్టీ చివరకు వాళ్ళ బంధువులెవరో పోయారని తెలిసి వెళతానన్నది. ఇప్పుడెందుకులే పెద్దదానివి అన్నా వినలేదు. చివరకు ఆమె అక్కడే పోయింది."

1376. హైదరాబాదునుంచి వచ్చిన ఒక కుఱ్ఱవాడిని -

అమ్మ : నా ముఖం చూసి చెప్పు - నువ్వు పెదనాన్నావాళ్ళ జేబులలో డబ్బులు తీయ్యలేదూ?

అబ్బాయి : తీశానమ్మా.

అమ్మ : మాంసం తిన్నావా? లేదా.

అబ్బాయి : ఎప్పుడైనా తిన్నానమ్మా.

అమ్మ : సారాయి?

అబ్బాయి : త్రాగానమ్మా. నెలా పదిహేనురోజులు రోజూ త్రాగిన తరువాత మానేశాను. ఒళ్ళు నొప్పులు చేసినయ్.

1377. 'ఎక్కడో హాల్లో వారు మాట్లాడుకున్న మాటలు వంట యింట్లో ఉన్న నీకెట్లా వినపడ్డాయి?'

"వారు పెద్దగా చెప్పుకున్నారు. నా మనస్సు పందిరివైపు పరిగెత్తింది. ఆ-

మాటలు వినపడ్డాయి."

'శరీరం ఇక్కడ ఉంచి మనస్సును ఎంత దూరం పరుగెత్తించవచ్చునో చెప్పు-'

"ఎంత దూరమైనా పరిగెత్తగలిగేది మనస్సే."

1378. '68 జనవరి మొదటి తేదీన 'న్యూయియర్' పూజ జరిగాక అమ్మను కొప్పు రావూరి సత్యనారాయణగారు అడిగారు-

'ఈ సంవత్సరం సంగతి ఏమిటంటారు?'

అమ్మ : కనపడుతున్నాయిగా అవకతవకలూ.

సత్యనారాయణ : ఇంకా వృద్ధి చెందుతాయా?

అమ్మ : ఇంకా చాల్లేదు, పరాకాష్ఠ పొందాలి.

1379. ఇక్కడకు వచ్చాకే గొలుసు పోయిందని అనుకున్న ఒక అన్నయ్య ఆవరనలోని చిన్న పిల్లలను - మీరేమైనా తీశారా - అని నిలవేస్తుంటే అమ్మ అన్నారు-

"పసిపిల్లలను నిర్బంధించకండి- దారిలో ఎక్కడైనా పోయిందేమో?"

అమ్మ అన్నట్టే అది ఆవరణలోకాక దారిలోనే పోయిందని తెలిసింది తర్వాత.

1380. 'మీ నామస్మరణ చేస్తూ మద్రాస్ మవుంటురోడ్డులో నడిచిపోతున్న నా మీద మీ ప్రభావం ఎలా ఉంటుంది?'

"ఏముంది నాన్నా - నాముందు రోడ్డుమీద వెళుతున్నట్టు కనుపిస్తుంటావు."

1381. "ఈ భూకంపం అనుకోకుండా వచ్చిందేమి కాదుగా, అనిపిస్తూనే ఉన్నది."

1382. వెంకాయమ్మగారి అంత్యక్రియలకు అమ్మ ఏర్పాట్లు చెబుతుంటే రామకృష్ణ అన్నయ్య అన్నాడు -

'ఆవిడ బ్రతికే ఉంది కదమ్మా'

"ఇంకెంతసేపూ? తేది మారడమేగా?" అన్నారు అమ్మ.

1383. 'మీకు ఇంగ్లీషుమాటలు బాగా తెలుసే?'

. "నాకు తెలియటమేముంది? మీరు మాట్లాడటం విని నేనూ అన్నాను."

1384. "నాకిప్పుడు పులిహోర కావాలి. నిన్నటి పులిహోర ఉందెమో కనుక్కోండి" అన్నారు అమ్మ.

కొంతసేపటికి శ్రీరామమూర్తి అన్నయ్య పులిహోర తెచ్చాడు.

"ఇట్లాంటివి పట్టుకోవాలంటే చాలా ఉన్నయ్" అంటూ నవ్వుతూ అందుకుని -

"ఎక్కడుందీ?" అన్నారు అమ్మ.

'మూడుసార్లు అడిగానమ్మా. నిన్న మధ్యాహ్నపు పులిహోర ఎక్కడుంటుందీ? - అన్నారు. అమ్మ అడిగారు అంటే - అంటే - దొంగను పట్టుకోవాలనా? నిజంగానే అమ్మ అడిగారా? - అన్నది లక్ష్మీనరసమ్మ అక్కయ్య. అమ్మే అడిగారని చెప్పాను. ప్రొద్దుననీటికి వెళ్ళిన పిల్లలకు పెట్టాలని దాచి ఉంచిందట. మర్చేపోయిందట.- దొంగను పట్టుకోవాలనా ?- అంటుంది' అని చెప్పాడు.

1385. ఫోనుకాలు వచ్చింది. అమ్మ "భృగుబండ నారాయణరావులే - యిటివ్వు" అన్నారు.

నిజంగా నారాయణరావుగారే.

# అమ్మ తన మాటలలో

1386. మొదటిసారిగా వైకుంఠపాళి ఆడుతున్న అమ్మనుచూసి నాన్నగారు పరిహాసంగా-

'ఇదేమి ఆట - ఇందులో రుచి ఏముందీ? ఇది ఒక ఆటేనా? ఇంతకంటే ఏ క్యారం బోర్డో ఆడుకుంటే బాగుంటుంది.'

అమ్మ : ఆట అన్నాక ఏ ఆటైనా ఒకటే. రుచి ఎందుకు ఉండదు?

1387. వైకుంఠపాళి ఆటకు సిద్ధమై అంతలోనే ఆడనన్న అమ్మను చూసి లక్ష్మీనారాయణ అన్నాడు -

'అయితే నువ్వు లేకపోయాక ఈ ఆట ఎందుకూ, మేమూ ఆడము.'

అమ్మ : ఎటూ నా ఆట నాకున్నదనిరా. నాకీ ఆటలతో పనిలేదు. ఆట లేని మీకు ఈ ఆటలు కావాలి. నేను చూస్తూ కూర్చుంటాగా - మీరు ఆడుకోండోయ్,

1388. "నేను ఏ పడవలో కాలు పెడితే ఆ పడవ మునుగుతుంది."

1389. ఒక సందర్భంలో హైమ మరణాన్ని గూర్చిన ప్రస్తావనలో అమ్మ అన్నారు--

"నాకేమీ సుఖదుఃఖాలు లేకుండా లేవు. నేను లేనప్పుడు అవీ లేవు. నేను వాటికి దూరంగా ఉండాలనుకోవటం లేదు. బాధా - బరువూ అనుకోవటం లేదు. అవసరమనే అనుకుంటున్నాను. కనుకనే అవి వస్తున్నాయి. ఇవాళ హైమ పోయినంత మాత్రాన పెద్దకష్టం వచ్చిందని ఏమీ లేదు. అవి నాకు ఎప్పుడూ ఉన్నాయి. నేను వాటితో ఉన్నాను. మీ మధ్య ఉండాలనుకున్నానూ, ఉంటున్నాను. హెచ్చు తగ్గులు లేనిది సృష్టి ఏమున్నదీ?"

1390. సంవత్సరాది నాడు గోపాలన్నయ్య - 'అమ్మా రేపు నీకు కుర్చీ వస్తుంది.'

అమ్మ : నాకు వద్దు. నాకు చెప్పవద్దు.

గోపాలన్నయ్య : ఏమండీ .... మీకు హాయి కలిగించాలని చేస్తుంటే.....

అమ్మ : పుట్టిన వాడెవరూ నాకింతవరకూ హాయి కలిగించలేదు.

1391. శ్రీపాద : మేము టెంపరేచర్ మనుష్యులం కానీ - అమ్మకు టెంపరేచర్ ఏమిటీ అని!

అమ్మ : టెంపరేచర్ నాకు లేకపోతే మీకూ లేదు.

1392. రుక్మిణక్కయ్య అమ్మ పక్క మీద చీమలు దులుపుతూ - 'నువ్వున్న చోట ఈగలూ, దోమలూ, చీమలూ ఎక్కువే'.

అమ్మ : నేనున్న చోటికి రాకపోతే నువ్వున్న చోటికి వస్తాయా?

1393. అమ్మ పుల్ల దానిమ్మ తింటున్నారు.

రుక్మిణక్కయ్య : అమ్మా - అవి తింటే నోరు కొట్టుకుపోదూ ......?

అమ్మ : కొట్టుకుపోతుంది. అయినా ఇష్టమే.

1394. "నాకు గ్రాముల లెక్క తెలియదు - గ్రామాల లెక్క తప్ప."

1395. "అన్నపూర్ణమ్మ తల్లీ : నువ్వు నా గదిలో ప్రవేశించింది మొదలూ నాకు అనారోగ్యం మొదలయింది. నిన్ను తొలగించాలి."

అన్నపూర్ణ : అనారోగ్యాన్ని తొలిగించుకోరాదు?

అమ్మ : దాన్నెందుకూ ? తగినవాడు వస్తే నిన్నే తొలిగిస్తాను.

1396. పోట్లూరి సుబాంబరావుగారు : కాళ్ళ నొప్పులు గూడా ఉన్నాయా అమ్మా?

అమ్మ : ఆఁ. అన్నీ ఉన్నాయి. శాస్త్రాలలో ఎన్ని రోగాలున్నాయో అన్నీ ఇప్పటికున్నాయి. 'సర్వరోగ సమన్వితాయై నమోనమః'

1397. "(నాకు) ప్రారబ్ధమంటూ ఉంటే మీరే. మిమ్మల్ని కావాలనుకోవటమే ప్రారబ్ధం."

1398. "క్రైస్తవ మతం నా మతం కాకపోతేగా?"

1399. "నా కెందుకో అన్ని బాధల కంటే ఆకలి బాధ ఎక్కువ అనిపిస్తున్నది."

1400. "నేను మీ అందరినీ కనటానికి వచ్చాను."

1401. "నేను పుట్టడం, బ్రహ్మాండం వారి కోడలు కావటం, ఈ ఊళ్ళో ఉండటం,

పిల్లలను కనటం - అన్నీ అవసరమే. కొన్ని అవసరాలకు ఇది అవసర మయింది."

1402. "నేను మాట్లాడుతూ పోట్లాడుతాను - మీరు పోట్లాడుతూ మాట్లాడుతారు."

1403. "బాపట్లలో కేశవుడి యిల్లంటే జిల్లెళ్ళమూడే. కలో గంజో తన కున్నంతలో ఆదరణగా పెడతాడు. అటువంటి ఇల్లు ఏదయినా జిలెళ్ళమూడే."

1404. "మన్నవలో చంద్రుడి (చంద్రశేఖరరావు) ఇంటికి వెళ్ళాను. 'అమ్మా - నేనేమీ పెట్టలేనుగా' అన్నాడు. నువ్వేమీ పెట్టవద్దురా - దణ్ణం పెట్టావుగా, చాలు - అన్నాను."

1405. "మనం అందరం ఆడుకుంటున్నాము. తెరయెత్తి నిష్క్రమిద్దాము."

1406. "నాకు ఇక్కడుంటే అక్కడకు వెళ్ళాలనిపిస్తుంది. అక్కడుంటే ఇక్కడకు రావాలనిపిస్తుంది."

1407. "ఈ మేలుకున్నది మేలుకోవటమూ కాదు. ఈ నిద్ర నిద్రా కాదు."

1408. "నా మతం మమతలేని మతం. అందరికీ సమ్మతం."

1409. 'నీ కీ నలుపు ఎందుకు వచ్చిందమ్మా?'

"మిమ్మల్ని గురించి ఆలోచిస్తుంటే."

1410. "నాకెందుకో పిల్లల ఏడుపులోనూ వేదం వినబడుతుంది."

1411. "నాకేదయినా వస్తే నాకు బాధ ఉండదు. మీకు వస్తే ఉంటుంది."

1412. "నేను చీరాల హాస్పిటల్‌లో ఉన్నాను. చిదంబరరావుగారు 'నీవు బ్రతకవట. నీకేమీ కోరికమ్మా?' అని అడిగించారు. "బ్రతకాలని కోరిక" అన్నాను. ఏడిచేవాడల్లా నవ్వి 'యిప్పుడుకూడా ఇటుంటి మాటలేనా' అన్నారు. "

1413. "మా నాన్నగారు నేను నీళ్ళు తెచ్చుకుంటుంటే చూసి 'నీ జాతకం గొప్పదే ......... కానీ యిట్లా ఉందేమిటి?' అన్నారు."

"నిజంగా నేను జాతకురాలినే. ఎందుకంటే - నాకివి లేవు అనే బాధ లేదు. ఇంట్లో నీళ్ళపంపుల దగ్గరనుండీ, అన్నీ ఉన్నా లక్షల డబ్బు ఉన్నా - మనశ్శాంతి ఉంటుందా? అన్నాను."

1414. "జబ్బులో ఉండగా మీ అందరి కంటే ఆదుర్దాగా ఉంటుంది నాకు. పోయిన తరువాత పెండ్లిలో ఎంత నిండుగా ఉంటుందో అంత నిండుగా ఉంటుంది."

1415. "నేను ఎవరు ఏది పెట్టినా తింటాను."

1416. "నా ఉద్దేశంలో మీరు కూడా భగవంతుడే."

1417. "మీరంతా నా అవయవాలనుకుంటున్నాను. చెయ్యి నొప్పి కాలికి తెలియదు. కాలినొప్పి కంటికి తెలియదు. కానీ అన్నిటి నొప్పీ నాకు తెలుస్తుంది."

1418. "మీరు మర్చిపోయినా నేను మర్చిపోను."

1419. అమ్మ : నాకు మధుమేహం పుట్టింది.

శాయమ్మగారు : నిన్ను తలుచుకుంటూ ఏ మధుమేహం వాళ్ళు బాధపడుతున్నారో ?

అమ్మ : బాధ ఎవరిదయినా అనుభవం నాదే.

1420. శశిరేఖమ్మ గారు : అమ్మా - కాస్త దోసకాయ పచ్చడి వేయ్యనా?

అమ్మ : ఏమోనమ్మా - ఏమి కావాలో నాకు తెలియటం లేదు.

1421. "నా శరీరం వాసనాసహితమే."

1422. "నేనూ ఏడుస్తాను. నేనూ నవ్వుతాను. మీకు గొంతులో కళ్ళే, చెవులో గుబిలీ, శరీరంలో నెత్తురూ ఉన్నట్లే నాకు అన్నీ ఉన్నాయి. అవన్నీ లేకపోతే నేను మీ మధ్య ఉండాల్సిన అవసరం లేదు. నేను అన్నిటితోనూ వచ్చాను."

1423. రాధన్నయ్య : అమ్మా! నీవు వంట బాగా చేసేదానివట. నేను తినలేదమ్మా.

అమ్మ : నీ తిండి తగ్గిపోయినదిగా నాన్నా.

రాధాన్నయ్య : నువ్వు చేసి పెడితే ఇప్పుడేనా నాలుగువేల ఇడ్లీ తింటా.

అమ్మ : అవి అరగకపోతే తరువాత బాధపడేది నేనేగా.

1424. 'లోగడ నేను వచ్చినప్పుడు మీరు నన్ను తపన్ను చెయ్యమన్నారు. ఇంట్లో

ఆడపిల్లలకు పెండ్లిండ్లు కాలేదు. వదిలి ఎట్లా వెళ్ళటమా అని - ఆర్థిక బాధ ఎక్కువగా ఉంది.'

అమ్మ : నేను ఎప్పుడూ తపస్సు చెయ్యమని కానీ జపం చెయ్యమని కానీ చెప్పను. చెప్పలేదు.

1425. 'మీరు ఎవరిని ధ్యానిస్తారు? ఏమనిపిస్తూ ఉంటుంది - కళ్ళు మూస్తే?'

అమ్మ : ఎవరిని ధ్యానించాలో తెలియటం లేదు. మీరు వద్దనిపించటమూ లేదు.

1426. ఒక అక్కయ్య అమ్మకు సహస్రనామార్చన చేసుకుని -

'అమ్మా - నాకు కాలు నొప్పి అమ్మా. ఎన్ని మందులు తీసుకున్నా తగ్గటం లేదు. ఏమి చెయ్యమంటారు?' అని అడిగింది.

అమ్మ : నా కేమీ తెలియదమ్మా. నేను అమ్మను. మీరు బిడ్డలు - అంత వరకే తెలుసు.

1427. "నాకు దేనికయినా దాహ మెక్కువ"

1428. 'భూకంపం వచ్చినప్పుడు అమ్మ మంచం కూడా కదిలిందా?'

అమ్మ : "ముందు నా మనస్సే కదిలింది."

1429. 'ఎందుకమ్మా నీకీ మంగళసూత్రం?'

"అన్ని సూత్రాలను తెలుసుకోటానికి."

1430. పొట్లూరి సుబ్బారావుగారు : మీ రెందుకు వచ్చారమ్మా?

అమ్మ : నేను ఫొటోలు తీయించుకోటానికి వచ్చాను. నువ్వు తియ్యటానికి వచ్చావు. వీళ్ళంతా చూడటానికి వచ్చారు.

1431. "మీ రనేకం ఆలోచిస్తుంటారు. కానీ నా కొకటే ఆలోచన .... మీ గురించే."

1432. "నేను దగ్గరకు తియ్యటం తప్ప వాళ్ళు దగ్గరకు రావటం కాదు. ఎవరి విషయమయినా అంతే."

1433. "నేను లోకంతో ఆడుకుంటున్నాను కానీ లోకం నాతో ఆడుకోవటంలేదు."

1434. "ధర్మం కోసం తల్లికాదు, తల్లి ధర్మం చూపించటానికే."

1435. 'అమ్మా - మీ దగ్గర హరికథ చెబుదామని అనుకుంటున్నాను. ఎప్పుడు సెలవైతే అప్పుడు చెబుతాను.'

"ఎప్పుడయినా వింటా నాన్నా - రాత్రయినా సరే, పగలయినా సరే."

1436. భూషణ ప్రక్కన దూషణ ఎప్పుడూ ఉన్నది నాయనా. ఒక రకంగా అదీ పూజే. ఒకడు భూషిస్తూ అనుక్షణం స్మరిస్తే మరొకడు దూషిస్తూ క్షణక్షణం తల్చుకుంటాడు. ఎట్లా అయితేనేమీ? 'వాడిని' గుర్తు పెట్టుకుంటే చాలు. దేవుడినే కాదూ నిన్ను కూడా తిడుతున్నాను అమ్మా అని బాధపడుతున్నావు. ఎందుకు బాధ ? నన్ను తిట్టకపోతే ఎవరిని తిడతావు ? నీ ఇష్టం వచ్చినట్టు తిట్టు. నా కేమీ బాధ లేదు. తీపి పదార్థం బాగా తింటుంటే వెగటు పుడుతుంది. మధ్యలో కారం తింటే ఎంతో బాగుంటుంది. నీ తిట్లూ అంతే."

1437. "ఈ అండనే దండన కూడా. దండన లేకేమీ? దండన అంటే కొట్టడం తిట్టడం కాదు."

1438. "మీ మచ్చలు వెదకటం అంటే అదే నాకు పెద్దమచ్చ."

1439. ఒక సందర్భంలో అమ్మతో అన్నపూర్ణ అన్నది -

'మరి ఇంతసేపు చెప్పకుండా దాచుకున్నావే మమ్మా?'

అమ్మ : (నవ్వి) అనేకం దాచుకునే భూదేవే నాలుగు చినుకులు పడితే దాచుకోలేదు. ఉత్పత్తి అయ్యే ప్రతివస్తువునూ బయటకు తెస్తుంది. భూమి గట్టి పదార్థాన్ని బయటికి తీస్తే, జలం తేలిక పదార్థాన్ని బయటికి తీస్తుంది.

1440. నూతన వ్యాపార మొకటి అరంభించపోతూ అ అంగడికి అమ్మచే పేరు పెట్టిస్తే మంచి లాభాలు వస్తాయన్న నమ్మకంతో వచ్చిన ఒక అన్నయ్య ఆ విషయం చెప్పగానే అమ్మ అన్నారు -

"మీ ఇష్టం నాన్నా - మీరు పెట్టమంటే పెడతాను. నా నోటి మీదగా చెప్పనంత మాత్రాన నష్టాలు రావని అనుకోవద్దు. నేను ప్రత్యేకించి ఏ

ఒకటే కాను. కష్టసుఖాలు అమ్మవే అనుకుంటారా, అమ్మ ఇచ్చినవే అనుకుంటారా, లాభనష్టాలు రెండూ అమ్మవే. ఏ పేరైనా సరే మీకు తోచింది పెట్టండి. నాకు ఏ పేరు పెట్టినా ఇష్టమే."

1441. హైదరాబాదు నుండి చెరుకుమిల్లి హనుమంతరావుగారు ఉత్తరం వ్రాశారు. వాళ్ళబ్బాయి తిరుపతి మొక్కు ఎక్కడ తీయాలి? అనీ, తమకేమో ఇక్కడ తీయించి తిరుపతి వెళ్ళాలని ఉన్నదనీ, అందుకు అమ్మ ఏమంటారూ - అనీ. దానికి సమాధానం గోపాల్‌ను వ్రాయమన్నారు అమ్మ ఈ విధంగా-

"నాకు ఎక్కడైనా ఒకటే. నా ఇంట్లో తీస్తే ఒకటీ, నా కొడుకు ఇంట్లో తీస్తే ఒకటీ అనుకోవటం లేదు. అది వాళ్ళ ఇష్టం. వాళ్ళ నమ్మకం పైన ఆధార పడి ఉన్నది. ఎక్కడ తీసినా నాకు ఒకటే."

1442. అమ్మ : ఈ కట్టే డాబాలన్నీ నా కోసమే అంటావు?

సుబ్బయ్య : తప్పకుండా అంతే నమ్మా.

అమ్మ : అయితే మానేయండి. నాకు ఇవన్నీ ఉన్నా ఒకటే లేకపోయినా ఒకటే. ఈ వచ్చే జనం ఇందుకోసంగా ఆగరు. నే నే చెట్టు క్రింద ఉన్నా వస్తారు.

1443. "పాపం చక్కని పిల్లట. తెలివిగలదట. కట్నం యివ్వలేక పోవటాన ఎవరూ చేసుకోవటం లేదట. పాపం! అటువంటి పిల్లలను ఎవరు చేసుకుంటారు? మన సుబ్బారావుకి చేసుకుంటే బాగుండును-"

1444. పార్వతికి గలిగిన మొగబిడ్డకు అమ్మ ప్రేమకుమార్ అని పేరు పెట్టారు. అది విని సుబ్బయ్య అన్నాడు- 'ఎప్పుడూ ప్రేమకుమారనేనా అమ్మా?'

అమ్మ : వాడెవడు మరి? ఇంకోపేరు నా నోటి వెంట రాదు..

1445. "ఇక్కడి వాళ్ళే కాదు. దూరంగా ఉన్నవాళ్ళు కూడా నాకు బిడ్డలే. నేను అందరినీ చూసుకోవలసిందే కదా! పొలం వెళ్ళినవాడికి సమయానికి అన్నం అందించాలా? వాడికి పంపకపోతే ఎలా?"

1446. "మీరు బిడ్డలని ఒకటే తెలుసు. ఆ భావమూ అదీ ఎప్పుడూ ఉంటుంది."

1447. ఆట పూర్తి అయ్యాక, వాళ్ళకని చేసిన చపాతీలను వాళ్ళకూ, ఆట చూసిన వాళ్ళకూ అమ్మ పెట్టారు. ఒకరన్నారు --

'మా కెందుకమ్మా? ఆడి ఆడి ఉన్నారు, వాళ్ళకే పెట్టు--'

"నేను అట్లా పెట్టలేనురా."

1448. తెనాలినుండి మోహన్ (అమ్మ మేనమామ అల్లుడు) అమ్మకు ఫాన్ పంపుతూ దానితో ఒక చీటీ పంపాడు. గోపాలన్నయ్య దానిని అమ్మకు అందించాడు. అమ్మ ఆ చీటీ చూస్తూ "ఇది ఇంగ్లీషులో ఉన్నది. నాకు ఇంగ్లీషు రాదుగా .... అయినా యిది నాకు కాదు" అన్నారు. శ్రీపాద అన్నయ్య ఆ చీటీని చదివి ఆశ్చర్యపోయినారు. అది తాతగారికి మోహన్ వ్రాసిన ఉత్తరం. అమ్మను ఎత్తిపొడిచారు 'నాకు ఇంగ్లీషు రాదుగా' అని.

1449. "హరిదాసుగారికీ, కృష్ణవేణమ్మగారికీ చాలా నియమాలు ఉండేవి. జపం చెయ్యటమూ, ధ్యానంలో కూర్చోవటమూ, కలిగిన అనుభవాలు పుస్తకాల మీద వ్రాసుకోవటమూ ఉండేది. ఎక్కడికి పోయినా ఎవరిని చూసినా తృప్తి కలగటం లేదని అన్నీ మానుకున్నారట. నేను లోకనాధరావు గారింటికి వెళ్ళినప్పుడు లోకనాధరావు గారి మీద గౌరవం కొద్దీ అక్కడికి వచ్చారు. ఇక్కడ నన్ను చూసి కృష్ణవేణమ్మ గారితో 'ఓసి నీ దుంపతెగా. నువ్వు కలలో చూసిన అమ్మే ఈ అమ్మే అన్నాడట."

1450. "తినగలిగిన వాడు దొరకటం అదృష్టం. నువ్వు పెడతానంటే మాత్రం తినేవాడు దొరకవద్దూ? ఎంత పెట్టినా తింటుంటే బాగుంటింది."

1451. "పుట్టింటికి వెళుతూ ఎందుకూ బాధ?"

1452. "మీరందరూ లేకుండా నేను వెళుతుంటే నా ఒళ్ళో నుండి పిల్లలను లాగి అవతల పారేసి నన్ను తీసుకు వెళుతున్నట్లుంది."

1453. 'వాళ్ళకూ తెస్తున్నారమ్మా.'

"అయినా అందరికీ ఇచ్చిన తర్వాత నేను త్రాగుతాను. నాది ఫ్లాస్క్ కనుక వేడి చల్లారదు. ముందు వాళ్ళకు వేడి వేడి కాఫీ తెచ్చి ఇవ్వండి."

1454. "పంచటంలో హెచ్చు తగ్గులుండవచ్చును కానీ పెట్టడం సమానమే."

1455. "మీరు తీసుకువెళ్ళితే కార్లు అవసరం కానీ నేను రావాలనుకున్నప్పుడు ఇవన్నీ అక్కర్లేదు. వీటితో పనిలేదు."

1456. రామకృష్ణ అన్నయ్య : కుచేలుడు మూడు గుప్పెళ్ళ అటుకులు ఇస్తే సిరిసంపదలు యిచ్చాడట కృష్ణుడు. మరి నువ్వేమిచ్చావమ్మా వాళ్ళకు?

అమ్మ : విధించటమే.

1457. "నీ పొరపాటు చాలా ఉన్నదన్నాడు. అవును ఏ పొరపాటయినా నాదే నాన్నా."

1458. "నేను రఘువరదాసుకు నమస్కారం చేశాను. అమృతానందకు కాళ్ళు కడిగాను, వద్దన్నాడు. నీ వేషానికి కడగటము లేదు. పిల్లవాడు దుమ్ము కొట్టుకు వస్తే కడిగాను - అన్నాను."

1459. సుబ్రహ్మణ్యంగారు (నెల్లూరువారు) అమ్మతో -

'కాళ్ళకు ఆ విగ్రహాలు ఎందుకు పెట్టుకున్నారు?'

అమ్మ : పిల్లలను దగ్గర పెట్టుకున్నాను.

కుమారి : అట్లా పెట్టుకోకపోతే దగ్గర లేనట్టా?

అమ్మ : వీళ్ళుకూడా మీ సోదరులే అనని చెప్పటం కోసం.

1460. "అందరూ నా ఒడిలోనే తిరుగుతున్నారు. ఒడివిడిచి ఎవరూ లేరు."

1461. "నా దగ్గరకు ఎంతమంది వచ్చినా ఎవరిస్థానం వారికుంటుంది. అది తరిగేది పెరిగేది కాదు. ఎవరూ వచ్చి ఇంకొకరిది తియ్యలేరు."

1462. పోలంరాజు వెంకటేశ్వర్లు (మంగమ్మ భర్త)తో-

"నిన్ను గురించి నాకు తెలిసినంత నీకు తెలియదు."

1463. "చేయించమని చెప్పవచ్చుకాని చెయ్యమని చెప్పను."

1464. "ఇక్కడ కమిట్ కావటమే కాని కమిటీ లేదు."

1465. "శాస్త్రం చదివినవాడి ప్రశ్న, కోరికలు ఉన్నవాడి ప్రశ్న, అమ్మ అంటే తెలుసు

కుందామనుకునే వాడి ప్రశ్న - ఎంతమంది వచ్చినా ఈ మూడు రకాల వాళ్ళే."

1466. 'వసుంధర పెండ్లిని గురించి చాలామంది చాలా రకాలుగా అనుకుంటున్నారమ్మా'-

"ఎవరికి తోచిన అభిప్రాయాలు వాళ్ళవి. ఎవరి మనస్సుకు అందినంత వాళ్ళకు. దాన్ని మించలేరు కదా!"

1467. "నా కడుపున పుట్టినా, వాళ్ళకి ఇచ్చిన కర్మ వాళ్ళదే. వాళ్ళు ఏమి చెయ్యటానికి ఈ భూమి మీదకు వస్తే అదే చేస్తారు."

1468. అమ్మమ్మ (కామేశ్వరమ్మగారు) బిలాస్‌పూర్ నుంచి వచ్చారు. బుట్టల్లో ఏవేవో తెచ్చారు. అమ్మ బుట్టలన్నీ చూసి-

"నా కివేవీ వద్దు నువ్వు ఏడో మైలులో వదిలి పెట్టినవి కావాలి."

'ఏవి వదిలి పెట్టానమ్మా?'

"విసుగూ, కోపమూ - అవే కావాలి. నా కవే అవసరంగా ఉన్నాయి."

1469. "అందరూ వాసన అంటారు. నాకు వాసన రాదేమిటి?-అని నేనంటే బామ్మ 'అన్ని వాసనలు పోయినదానివి, నీకు వాసన ఏమిటమ్మా'అన్నది."

1470. "నన్నేదన్నా చెయ్యాలని వచ్చినవాళ్ళను ముందు దగ్గరకు తీసుకుంటాను."

1471. తన రవికను కుట్టటానికి హరిదాసుగారికి ఆదికి ఇస్తూ-

"ఇవ్వాళ రవిక బిగుతయింది. నిన్న వదులుగా ఉన్నది' మరి ఎట్లా కుడతావో ఏమో? నా రవిక కుట్టటంలోనే నేర్పంతా బయట పడుతుంది" అన్నారమ్మ.

'నీ ఆది తెలియదు' అన్నారు హరిదాసుగారు.

"నాది అనాది కనుక నా ఆది అందదు"

1472. "నాకు ఏది చెప్పినా సరిపోతుంది. ఎందుకంటే ఉన్నదొకటే కనుక."

1473. "నేను కొట్టవలసి వస్తే శివలింగంతో కుంకుడుకాయలు కొడతాను."

1474. రామకృష్ణ అన్నయ్యతో -

"నా కబురు సరాసరి చేరుతుంది. మీ కబుర్లు పోస్టాఫీసులో ముద్రలు పడితేగాని ఎక్కడికయినా చేరవు."

1475. "నాకు పని అంటూ ఉంటే మీకు కనపడటమే."

1476. "నాకు నిద్రంటూ సామాన్యంగా ఉండదు. అట్లా అలవాటయింది."

1477. "గుణభేదమే నాకుంటే మీలో ఏ ఒక్కరూ నా దగ్గరకి రాగలిగేవారు కాదు."

1478. 'అమ్మా నీ కాళ్ళమీద పడ్డప్పుడు ఏవేవో కనిపించినై. చెప్పలేనంత మంచి అమ్మవనిపించింది. చూట్టానికి పిచ్చి అమ్మవలె ఉంటావు.'

"నేను పిచ్చమ్మనే నాన్నా. మొదట నీ పేరు పిచ్చయ్య అని పెట్టలేదూ?- పిల్లలు బ్రతక్కపోతే."

1479. "నేను మిమ్మల్ని ఎప్పుడూ చూస్తాను. కానీ నేను చూస్తున్నానేది మీకు ఎప్పుడు అర్థమౌతుందంటే, మీరు చూస్తున్నప్పుడు నేను చూసినట్టు కనుపించినప్పుడే."

1480. 'మీరు నన్ను తాకడము-'

"ఎప్పుడూ తాకే ఉన్నానుగా"

'ఎప్పుడూ తాకటమంటేనమ్మా?'

"నేను అనేది అందరిలో ఉన్నది కదా! అందుకే ఎప్పుడూ తాకే ఉన్నాను -అన్నాను."

1481. అమ్మ దగ్గర సెలవు తీసుకుంటూ రామశేషు అమ్మవంకే చూస్తూ స్రవిస్తున్న అశ్రువుల మధ్య గాద్గదిక స్వరంతో అడిగింది-

'నీలో లేనిది మాలో ఉన్నదీ ఏమిటమ్మా?'

అమ్మ కాసేపాగి చిరునవ్వుతో అన్నారు-

"నాకోసం తపించటం"

1482. "నేను ప్రతీదానిలో ఉన్నాను పతనమనే భాగంలో ఉండకుండా లేను. అన్నిట్లోను నేను ఉన్నాను."

1483. "నన్ను భూషించినా, దూషించినా ఒకటే. వాడు ఆ రకంగా స్మరిస్తే వీడు ఈ రకంగా స్మరిస్తాడు."

1484. "నేను ప్రత్యేకించి ఏ ఒకటీ కాను."

1485. 'చదువుకోని దానివి ఎలా వ్రాశావమ్మా?'

"చదువుకోని చదువుతో వ్రాశాను."

1486. "మరుగే నా విధానం"

1487. "నా హాస్యంలో రహస్యం ఉన్నది."

1488. 'తాపత్రయాలు పూర్తిగా వదిలి పెట్టేట్టు చెయ్యమ్మా-'

"నేను ఉన్నదే అందులో. ఇక నీకేమి తీసేస్తాను?"

1489. 'మీరెవరమ్మా?'

"నీ కెట్లా కనపడితే అట్లా చూడునాయనా-"

1490. 'నా యిష్టదైవం మాదిరిగా కనిపించారమ్మా మీరు.'

"నీ యిష్టదైవం నా మాదిరిగా కనిపించాడేమో."

1491. 'మమ్మల్ని అనటమా? నిన్ను అనుకోవటమా?'

"ఏదయినా ఒకటే. నేను మీరు కాదూ?"

1492. 'మాలో ఒకరివై మాట్లాడుతావేమిటీ?'

"మీరు కాకుండా నేను లేను."

1493. 'నాకు కొడుకులూ లేరు, మనుమలూ లేరు. అన్నీ నీవేనమ్మా. నువ్వే నన్ను రక్షించాలి. నీలో కలుపుకోమ్మా-'అన్నది హనుమాయమ్మ ప్రార్థనా పూర్వకంగా.

అమ్మ : నీకేమీ ఫరవాలేదు,నేను ఉన్నాను. నీకు చేసేవాళ్ళు లేరు అనుకోకు. నేను చేస్తాను. నాలోనే కలుపుకుంటాను. ఇంక ఎక్కడికీ పోవు. పంపించను. ముందు నీకు ఎవరూలేరన్న దిగులు పోగొట్టుకో- నీకు నేను చేస్తాను, అన్నానుగా.

1494. 'ఈ ఊళ్ళో ఎన్నాళ్ళు ఉంటావమ్మా?'

"ఉన్నన్నాళ్ళు ఉంటాను. ఉన్నన్నాళ్ళు కనపడతాను. నేనూ, నీవూ- అని ఉన్నన్నాళ్ళు కనబడతాను..... ఈ ఊళ్ళో అనే కాదు."

1495. "గీతలో చెప్పనిది నేను చెబుతున్నది లేదు - చెప్పే తీరు వేరు కావచ్చు గానీ."

1496. "ఇప్పుడు పసివాడివి కాక పెద్దవాడివా? నువ్వు నాకు ఎప్పుడూ పసివాడివే. నీ గడ్డాలు నా అడ్డాలకు ఏమీ అడ్డురావు."

1497. "నా వంటి మీద వస్తువు వాడు తీసుకు వెళ్ళినా అది మరొకరికి అన్నం పెట్టటానికే ఉపయోగపడింది."

1498. "నాకు ఎవరిమీద దురభిమానం లేదు."

1499. 'దగ్గరలేని మనిషిని గూర్చి మాట్లాడే అలవాటు నాకు లేదు."

1500. "మీకు చెప్పకుంటే తీరుతుందని మీరు చెప్పకుంటారు. నేను చెప్పకుంటే మీరు బాధపడతారని నేనే పడతాను."

1501. 'నీకు ఆశా అసంతృప్తి ఏమిటీ?'

"పిల్లలకోసం ఆశా, చాలక అసంతృప్తీ."

1502. "నీవు నాకు పెట్టుకుంటే యెంత తృప్తో ఎవరికన్నా పెట్టుకుంటే నాకు అంత తృప్తి."

1503. "ఈ పొట్ట మాతృత్వానికి చిహ్నం."

1504. "వీళ్ళందరూ పిల్లలే కాదు నా అవయవాలు."

1505. 'మీ దృష్టిలో మనుషులూ ఇతర జంతువులూ ఒకటిగానే ఉన్నాయి.'

"అవి యితరమని అనిపించటంలేదు. అన్నీ నేననే అనిపిస్తుంది."

1506. "నా సంసారానికి మొదలు చివరా అక్కర్లేదు. నా సంసారం మీ సంసారాల్లాంటివి కాదు. నాది విశ్వ సంసారం."

1507. "అదేమిటో నాకు ఎవరూ చూడనట్టు ఉండరు. అంతా చూసినట్టే ఉంటారు."

1508. 'ఇది పందేరమేనా?'

"పందేరమే నా పెంపకము."

1509. రామరాజు కృష్ణమూర్తి : బీరువాలు నీకు ఉపయోగ పడవుగా? పుస్తకాల కోసం అయితే నేనివ్వను.

అమ్మ : అట్లాగయితే ఏదీ నాకోసంకాదు. నేను చీర కట్టుకోవటం, స్నానం చెయ్యటం కూడా మీ కోసమే.

1510. "అవతారమా? మీరంతా అవతారాలే - ఈ అవతారం చుట్టూ మీరు మీ కోసం ఈ అవతారం."

1511. "రమ్మని మీరు పిలవక్కర్లేదు. మీ బాధే నన్ను రప్పిస్తుంది. అదీ పిలుపే."

1512. మొన్నీ మధ్య ఈ ఆవరణలో వాళ్ళే అన్నారు. 'ఇదీవరకటికి ఇప్పటికీ అమ్మలో తేడా ఏముంది - అమ్మకు పూజలూ అవీ చేయటానికీ? నాకు చెయ్యబుద్ధి వెయ్యటం లే'దని. అవును, నిజమే - నాలో మార్పేమీ లేదు. వాళ్ళకు చెయ్యాలని అనిపిస్తున్నది చేస్తున్నారు. వీళ్ళకు అనిపించదూ, మానెయ్యమను - కాదని ఎవరన్నారు? 'వాళ్ళు చేస్తున్నారు నేను చెయ్యక పోతే బాగుండ'దని చెయ్యటం దేనికి? నాలో మార్పేముంది? ఆనాడు పేడ త్రొక్కటం అవసరమయింది, త్రొక్కాను. పిడకలు చేశాను. నేలమీద పడుకున్నాను, చాపమీద పడుకున్నాను. కుక్కి మంచంమీద పడుకున్నాను, నవారు మంచం తెచ్చారు. నవారు మంచంమీద పడుకున్నాను. డన్‌లప్ మంచం మీద పడుకుంటున్నాను. రేపు ఎయిర్‌కండీషన్ పెట్టవచ్చును. ఎన్ని కండిషన్స్ మారినా మన కండిషన్ ఒకటే ....... ఇది మారేదీ కాదు." అన్నారు తనను తాను చూపుకుంటూ.

1513. వైకుంఠపాళి ఆడుతున్న అమ్మను చూసి ఫణి అడిగాడు-'ఆటలు ఆడుతున్నావా అమ్మమ్మా?'

అమ్మ : (నవ్వుతూ) అవును నాయనా - నేను వచ్చింది అందుకే. నేను చేస్తున్నదీ అదే.

1514. వెంకాయమ్మగారు : అల్లుతున్నావా అమ్మా.

అమ్మ : అల్లుకుంటున్నాను.

1515. "నాన్ రొట్టే తెమ్మంటే తేలేదు. ఎవరిని అడిగినా తెచ్చిపెట్టలేదు. బాలింతను, నెమ్ము చేరింది గర్భంలో "

'పిల్లా? పిలవ్వాడా?'

"ఏద్దైతేనేమీ, చచ్చిపోయారుగా?"

1516. అడవులదీవి అన్నయ్యలు పూజ చేసుకుంటున్నారు. మధ్యలో నేను మాత్రం ఎందుకు పూజచేసుకోకుండా ఉండాలి అంటూ బీజాక్షరాలు చదువుతూ అమ్మ తన పాదాలమీద తానే పూలు వేసుకున్నారు.

1517. ఒక వృద్ధురాలు: (నిష్ఠూరంగా) ఈ బొమ్మను (అని తన నుద్దేశించి) నీ ఇష్టం వచ్చినట్లు ఆడిస్తున్నావు.

అమ్మ : (నవ్వి) ఆ బొమ్మలను ఆడించటానికి (తనను చూపుకుంటే) ఈ బొమ్మ ఎన్ని ఆటలు ఆడాలో ఆలోచిస్తున్నావా?

1518. "మీకు ఎప్పుడో చూచినట్లు అనుమానం. నాకు ఆ అనుమానం లేదు. ఎప్పుడూ చూస్తున్నట్లే ఉంది."

1519. "మీరు ఇక్కడికి వచ్చి నన్ను చూస్తారు. నేను మిమ్మల్ని ఎప్పుడూ చూస్తూనే ఉన్నాను."

1520. 'నీకు ఎలా తోస్తాయమ్మా ఇలాటి మాటలు?'

"అవతలివారు అడిగే మాటలనుబట్టి నాకు యిటువంటివివస్తూంటాయి."

1521. "పాతవారు ఏడుస్తూ నా వెంట బడతారు. క్రొత్తవాళ్ళను నేను వెతుక్కుంటాను. నా కవసరమైన వారిని లాక్కుంటాను."

1522. "కరణం - అనిపించుకోను కానీ కరణీకం చేస్తాను."

1523. అన్నం కలిపి ముద్దలుపెడుతూ కబుర్లు చెబుతూ నవ్విస్తున్న అమ్మను చూసి అమ్మ అంటే మరో విధంగా ఊహించుకున్న ఒక సోదరుడు

ఆశ్చర్యపడుతూ అడిగాడు-

'పీఠాధిపతులు కానీ మరే స్వాములవారు కానీ ఇట్లా ఇంత దగ్గరగా రానివ్వరమ్మా - మీరేమిటి ఇట్లా ఉన్నారు?' అని.

అమ్మ నవ్వి అన్నారు-

"వాళ్ళు అట్లా ఉండటం ధర్మం, నేను ఇట్లా ఉండటం ధర్మం. శుచి చెయ్యాల్సిన బాధ్యత నాది. శుచిగా ఉన్నట్లు కనపడిన వాళ్ళనే దగ్గరకు తీసుకునే బాధ్యత వాళ్ళది (పీఠాధిపతులు)."

1524. 'దురదృష్టంలో అదృష్టం అంటే ఇదేనేమో?'

"దూరదృష్టి కలగటమే అదృష్టం. సామాన్యం కంటే ఏదో విశేషం కనిపించటమే దూరదృష్టి."

1525. 'నీవు బ్రహ్మ పదార్థానివా? బ్రహ్మ తత్త్వానివా? బ్రహ్మవా?'

"నేను మూటికీ మూలమై మూడూ అయినాను."

'ఆ మూడూ ఏమిటమ్మా?'

"ఏ మూడూ అయినా సరే. నేను బ్రహ్మనై నీవు అనే వస్తువును ఏర్పరచుకొన్నాను. నీవు - నేను మధ్యలో ఉండే సంధి బ్రహ్మ పదార్థం."

1526. కమల అమ్మను అడిగింది-

'స్వచ్ఛంగా ఉన్నవాళ్ళు ఎట్లా ఉంటారమ్మా?'

"నేను స్వచ్ఛంగా ఉంటేగా?-మీరు ఉండటానికి. గంతకు తగ్గ బొంతలు."

1527. 'ఇప్పుడు ఎటూకాని వేళ భోజనం ఏమిటి?'

"ఇక్కడ వేళంటూ లేదు. ఎప్పుడైనా వేళే."

1528. 'నేను చేసే ప్రతిపనీ చూస్తూనే ఉంటావా అమ్మా?'

"నువ్వొక్కడివేనా?"

1529. 'మీరు భవిష్యత్తు చెబితేనే ఉంటాము. లేకపోతే వెళతాము.'

"మీ అందరి సందేహాలు తీరుస్తూ కూర్చోవాలని నాకేమీ లేదు. నేను

భవిష్యత్తులూ చెప్పనూ ఏమీ చెప్పను. ఉంటే ఉండండీ, లేకపోతే భోజనం చేసి వెళ్ళండి."

1530. 'నీ కది చేతనవుననా, చేతకాదనా?'

"చేస్తేనేకానీ చేతనయింది చేతగానిదీ తెలియదు."

1531. శేషగిరిరావు అన్నయ్యగారు : నీ ముద్దులో మమ్మల్నందరినీ ముద్దగా చెయ్యరాదటమ్మా!

అమ్మ : నా ముద్దులో మీరంతా ముద్దగానే ఉన్నారు. ఉండే వస్తున్నారు.

1532. అమ్మ కాలి వ్రేళ్ళకు బంగారు మట్టెలు చూసి ఎవరో - 'కాళ్ళకు బంగారం పెట్టుకోవటమేమిటి' అని ఆక్షేపణ చేసినప్పుడు అమ్మ అన్నారు - "బంగారం ఎక్కడనుండి వచ్చింది? భూమిలోనుండేగా? ఆ భూదేవే మనకు సమస్తమూ ఇస్తున్నది. ఆమెనే త్రొక్కగా లేనిది ఇవన్నీ ఏమిటీ? అన్ని లోహాలనూ తానే ఇస్తుంది గదా. బంగారమూ ఒక లోహమే."

1533. అమ్మ ముఖానికి గంధం పూసుకుని కూర్చున్నారు లలితాంబగారు దగ్గరున్నారు -

అమ్మ : భయంగా ఉందా?

లలితాంబగారు : లేదు. అసలు రూపం చూపిస్తే భయంకానీ -

అమ్మ : అసలు రూపం ఏమి చూడగలరు? దుర్గాష్టమి రోజు మామూలుగా వస్తేనే భయపడతారు.

లలితాంబగారు : నవమినాడు కిరీటం పెట్టుకుని, నల్లచీర కట్టుకుని జుట్టు విరబోసుకుని వస్తుంటే ఒళ్ళు ఝల్లుమంది.

అమ్మ : అవన్నీ అక్కరలేదు. గట్టిగా చూస్తే చాలు.

1534. 'పెద్దవాళ్ళు కాళ్ళు ఊపుతుంటే విశేషమంటారు. ఎందుకమ్మా?'

"సహజం."

'మీరు సహజమంటే ఎట్లా?'

"నాకు సహజం మీకు విశేషం"

1535. 'మీ కాహారం ఏమిటి?'

"ఈ వ్యవహారమే నాకాహారం"

'మరి ఏమీ తినటం లేదుగా?'

"చెట్లు లేవూ నాన్నా?"

1536. 'అమ్మా - మీరు భోజనం చెయ్యరూ?'

"నేను భోజనం చేశాను నాన్నా."

'ఎక్కడ చేశారూ? మీ గదిలోనా?'

"ఆకలి కావటం లేదు. అదే చేయటం."

1537. నవరాత్రులలో అమ్మకు ఇష్టమైన పదార్థములను తొమ్మిది రోజులూ చెయ్యాలని నిశ్చయించుకున్నారు శేషయ్యగారు. అయితే అమ్మకు ఇష్టమైన పదార్థం ఏదీ అన్నది ప్రశ్న అయింది. ఆ మాట అమ్మని అడిగారు. అమ్మ నవ్వి - "నాకు ఇష్టమైన పదార్థమా? చేసింది అందరికి అందటమే."

1538. 'అమ్మా నీకేమి ఇష్టం?'

"నాకు అన్నీ ఇష్టమే. పులుపూ ఇష్టమే, కారమూ ఇష్టమే, తీపి ఇష్టమే, చేదూ ఇష్టమే."

1539. "నాకు ఎప్పుడూ ఏమీ తినవలెననిపించదూ, ఏమి తినవలసి వచ్చినా, వద్దు - అనిపించదూ"

1540. 'నీ సొమ్ము ఏమి పోయిందీ?'

"నాకు ప్రత్యేకమైన సొమ్ములేదు, పోదు."

1541. "నన్నడిగితే నాలో చిన్నప్పటికీ ఇప్పటికీ మార్పు ఏమీ లేదు. ఎవరికి తోచింది వారు వ్రాస్తారు."

1542. "మరుపంటూ ఉంటే జ్ఞాపక ముంటుంది."

1543. "నీకు చెయ్యే నొప్పి - నాకు ఒళ్ళంతా నొప్పి- అందుకే నొప్పి ఉండదు." (ఏకదేశంగా ఉండదనటం)

1544. "మీ అందరిలోని మంచియే నాకు కనబడుతూ ఉంటుంది."

1545. "ఎదుట ఉన్నదాన్నే గుర్తించలేని స్థితి నాయనా నాది."

1546. కళ్ళేపల్లి నుంచి ఒక సోదరుడు వచ్చి ఆస్థిని గురించి అడిగితే -

"నా కట్లాంటిదేమీ తెలియవు నాన్నా. మీరు వచ్చినప్పుడు బిడ్డలుగా చూడడం తప్ప నా కేమీ తెలియదు." అన్నారు అమ్మ.

'ఏదో పెద్దలని అడుగుదామనీ ....." అన్నారు ఆయన.

"నేను మామూలు అమ్మను, పెద్దను కాను నాయనా."

1547. అమ్మ వేసుకున్న పాదుకల్లో ఒకటి కనుపించలేదు. రామకృష్ణ అన్నారు.

'ఎక్కడకు పోయిందీ? అమ్మా - నీ వస్తువు కూడా పోతుందీ?'

అమ్మ కొద్దిగా ఆగారు. రామకృష్ణ 'ఏమిటమ్మా?' అని అడిగారు.

అమ్మ : నా వస్తువు ఏదా? - అని ఆలోచిస్తున్నా. శరీరం కూడా పోతుంది కదా?

1548. "ఈ పొట్ట ఒట్టి గాస్. ఏది తాగితే అది వెళ్ళిపోతుంది.

పాదాలు - అగ్నితత్వము

పొట్ట - వాయుతత్వము

తల - పృధ్వితత్వము

చక్షువులు - జలతత్వము.

శరీరమంతా - ఆకాశతత్వము."

1549. "నేను ఏ బాటను నడిచినా చింతలు కనపడుతూనే ఉంటాయి."

1550. మాతృశ్రీ జీవిత మహోదధిలో తరంగాలనుండి ఉధృతమైన, భయానకమైన కొన్ని తరంగాలను చూచి ఆశ్చర్యపడిన ఒక అన్నయ్యతో అమ్మ అన్నారు-

"అందులో విశేషం ఏమి ఉన్నది? నేను అందుకోసమే పుట్టినప్పుడు."

1551. 'మట్టి ప్రసాదం ఇచ్చారా?'

"నాకున్నది మట్టే." (భూమే అనటం)

1552. "అన్ని రకాల అనుభవాలు నాకున్నాయి."

1553. "నా వేడి వాళ్ళకెందుకు? నా వేడి ఎవళ్ళకీ వద్దు."

1554. 'నువ్వు ఎప్పుడూ ఇక్కడే ఉండమ్మా-'

"మీరు ఎప్పుడూ ఇక్కడే ఉంటారా?"

'గవర్నమెంట్ నన్ను ఎప్పుడూ ఇక్కడ ఉంచరుగా అమ్మా?

"నాకు తగిన గవర్నమెంటు నాకూ ఉంది."

1555. 'నిన్ను చూస్తే బిళ్ళ గన్నేరు పువ్వు జ్ఞప్తికి వస్తుంది.'

"ఏం? అవి పెద్ద అందంగా ఉండవు గానీ, ఈ కాలమంటూ లేకుండా ఎప్పుడూ పూస్తూ ఉంటాయనా?"

1556. అమ్మ : బియ్యపు పిండితో అట్టు పోసి అరిటాకులో వేసి భగవంతుడికి పెడితే?

అమ్మమ్మ : భగవంతుడనేవాడు ఎక్కడున్నాడు? వాడు కనిపించడు. ఏడీ?

అమ్మ : వాడి కనిపిస్తూనే ఉన్నాడు. నువ్వు గుర్తించటం లేదు.

1557. 'శరీరమంటే మట్టి కుండవంటిదే కదా? ఈ నమస్కారములతో చిల్లి పడదా?'

"నా కుండ నిలిచే కుండ. చిల్లి పడదు. పగిలితే ఒకేసారి పగలవలసిందే."

1558. ఒక విషయంలో చికాకు పడుతున్న అమ్మను చూచి శేషగిరిరావు అన్నయ్యగారు నవ్వుతూ అన్నారు -

'జగమేలే పరమాత్మ ! ఎవరితో మొరలిడుదువు?'

అమ్మ వెంటనే అన్నారు - "నాతో నేనే."

1559. అమ్మని చిన్నప్పుడు ఎరిగిన ఆమె 'ఇన్ని మాటలు ఎక్కడ నేర్చావు?'

"నేను భూమిమీదకు రావటానికి కారణం ఎక్కడో అక్కడే నేర్చా."

1560. 'మేము ఇల్లు కట్టుకున్నాము. గృహప్రవేశం కావాలనుకుంటున్నాము. చేరటానికి మంచిరోజు చెప్పండి.'

"నాకు తెలియదమ్మా. ఎవరినయినా అడగండి."

1561. 'ఈ ఇళ్ళు కట్టడానికి రూరల్ హౌసింగ్ స్కీము క్రింద గవర్నమెంట్ డబ్బు ఇస్తుంది.'

"నేను గవర్నమెంటు కాదంటావు?"

1562. అమ్మ : ఎందుకూ ఆదివారమనా? (అని నవ్వి) ఈ వారాలు నన్నేమి చేస్తాయి?- నేను అనాది వారాన్ని అయితే.

1563. "నేను మీ గుణగణాలు చూసి ప్రేమించటం లేదు. నా కోసం నేను ప్రేమిస్తున్నాను."

1564. "నాలుగు గోడల లోపల మంచంమీద కనపడుతున్న రూపం పరిమితమూ, బయట అనంతమూ."

1565. "అందరూ ఎప్పుడూ చూడరు నన్ను. నేను అందరినీ ఎప్పుడూ చూస్తాను."

1566. 'నేను నే నైన నేను అంటే ?'

"నీవులేని నేను."

1567. "నేను సర్వ సిద్ధాంత సార్వభౌమను. అన్నీ నేనే."

1568. శ్రీపాద : అంతా ఒకటేననే ఈ విధానం ఇదివరకు లేదమ్మా.

అమ్మ : ఎప్పుడూ ఉన్నదే నాన్నా. తెలియనిది తెలియటానికే నా యీ రాక.

569. కీర్తిశేషులైన చిదంబరరావు తాతగారిని గురించి అమ్మ కబుర్లు చెబుతుంటే లక్ష్మీనారాయణ అడిగాడు-

'ఇప్పుడు తాతగారు ఎక్కడ ఉన్నారమ్మా?'

అమ్మ: మా అమ్మ చేతిలో నన్ను పెడుతుంటారు.

మాకెవరికీ అర్థంకాలేదు.

అమ్మ : (నవ్వి) మహోదధిలో తరంగాల విషయం చెప్పాను.

భవాని నవ్వి 'బాగుంది నీ చమత్కారం! అన్నయ్య అడిగింది ఎక్కడ ఉన్నారని.'

అమ్మ: నాలోనే ఉంటాడు. ఇంకెక్కడ ఉంటాడు?

1570. 'అమ్మా - మీరు జీవితంలో జపించిన మంత్రం ఏమిటమ్మా?'

" 'సరే' మంత్రం."

'దేనికి సరే?'

"అన్నిటికీ సరే."

1571. 'నీ రాశి ఏమిటమ్మా?'

"బియ్యపురాశి"

'అదేనా నీ రాశి'

"అదే నా మిరాశి."

1572. 'నాకున్న అన్నిపాళ్ళు ఏ కాస్తో ఇస్తేనే కానీ నన్ను కనుక్కోలేరు."

1573. వసుంధరక్కయ్య పెళ్ళి సందర్భంలో రుక్మిణి అక్కయ్య అమ్మను అడిగింది.-

'మా అమ్మాయికి పిల్లలు పుడతారంటావా?'

అమ్మ : ఏం నేను పురుషుడు కానని అనుమానంగా ఉన్నదా?

అక్కయ్య : ఉంటే మా అమ్మాయినెందుకు ఇస్తాము?

1574. 'ఛీ పోమ్మా-'

"ఎక్కడికిపోనూ? నాకెక్కడా స్థానంలేదు ఎవ్వరూ చోటివ్వరూ."

'అదేమిటమ్మా అట్లా అంటావు.'

"అంతేగా మరి."

1575. "నువ్వు వాళ్ళతో చెప్పలేదూ?- ఇందాకనే అమ్మ అన్నదనీ."

'ఈ సంగతి నీకెవరు చెప్పారమ్మా?'

"నాకు యోగయ్య చెప్పాడు."

'మేము ముగ్గురము కలిసే వచ్చాము కదమ్మా, నీ కెప్పుడు చెప్పాడు?'

"ముగ్గురితోపాటు నాలుగోదాన్ని నేను లేనా?"

1576. బామ్మకు జబ్బుగా ఉంటే అమ్మ బామ్మ దగ్గర కూర్చుని నడుం రాస్తున్నది. అక్కడున్న చీరాల డాక్టరుగారు -

'కోడలనే భావం మీరు పోగొట్టుకొనండి బామ్మగారూ' అన్నారు.

అమ్మ : మీరట్లా ఎందుకనుకోవాలి? అమ్మనయ్యే రాస్తున్నాను అనుకోవచ్చుగా?

శేషగిరిరావన్నయ్య : అనుకోకపోవచ్చు.

అమ్మ : అనుకోకపోవటమేమిటి?

శేషగిరిరావన్నయ్య : ఎంతైనా నా భార్య ఎంతైనా నా కోడలు మీకు అమ్మ గారు - అని అంటుంటే....

అమ్మ : అది లేకపోతే నాటక పరిసమాప్తి.

1577. 'మా వాదనలో - పుట్టుకతోనే అద్వైత సిద్ధిగల ఆమె- అని నేనంటే, అవతారమని ఆవిడ అన్నదమ్మా. ఎవరిది రైటు?'

"సహజంగానే అద్వైతమంటే అవతారమనే,"

1578. "అంతటా ఉన్న అమ్మ తెలియడానికే ఈ అమ్మ."

1579. కనకాంబరాలను దారం లేకుండా మాలకడుతున్న అమ్మను చూసి బ్రహ్మాండం అనసూయమ్మగారు (అమ్మ పిన్నత్తగారు)అడిగారు-

'అమ్మా సృష్టిని గూడా ఇట్లాగే అల్లారా?'

అమ్మ అన్నది నవ్వి "అల్లుకుంటున్నాను. పువ్వులు ఉన్నాయిగా ఎదురుగా - ఊరుకోవటం ఎందుకులే అని."

1580. ఒకరు : మీ బోటి తల్లులకు ఆహారంతో పని ఏమిటమ్మా?

అమ్మ : పొరపాటు పడుతున్నారు. ఏది అందుబాటులో ఉంటే, ఏది ఎదురుగా ఉంటే, ఏది అవసరమైతే అదల్లా తింటున్నాను. కొన్నాళ్ళు తినకపోవటం శరీరాన్నిబట్టి. ఇప్పుడు అన్నీ తింటున్నాను.

1581. 'అమ్మా - నీవు పరాంబిక వనిపిస్తుంది. కానీ ఆ భావం పూర్తిగా నిలవటం లేదు కదా?'

"ఆ భావం పూర్తిగా నిలిస్తే అనటం ఎక్కడుంటుంది ఇంకా? - అనుభవించటమే."

1582. 'అమ్మా - చాలా లోతుగా మాట్లాడుతున్నారు.'

"మీరు అడిగినవాటికి సమాధానమేగా, మీరు ఎంత లోతుకు తీసుకువెళితే అంతలోతుకు వచ్చి ఉంటాను."

'ఉంటానంటే?

"అక్కడినుంచి పైకి పోనూ, క్రిందకి జారనూ."

'మీరు మా చేతుల్లో ఉన్నారా?'

"భక్త పరాధీనుడన్నారుగా?"

1583. అమ్మ హైమ మరణాన్ని గురించి మాట్లాడుతుండగా పురోహితుడు వచ్చి-

'అమ్మా వటువుకు బ్రహ్మోపదేశం చెయ్యాలమ్మా.'

"అటుమంత్రోపదేశం, ఇటు మరణోదంతం" అంటూ - అమ్మలేచి వెళ్ళి వటువుకు బ్రహ్మోపదేశం చేశారు.

1584. "పోతుకూచి రవి దహనం చేసి వచ్చి బువ్వపుబంతి జరిపించాను."

# హైమ

1585. ఉన్నట్లుండి ఉలిక్కిపడ్డట్టు-

'అమ్మా - నన్ను ముందు పంపించి తరువాత నువ్వు' అని, 'ఇంత జబ్బుచేస్తే నన్ను తీసుకెళ్ళలేదేమీ? అమ్మకు దయలేదు' అన్నదట.

1586. జబ్బుచేసిన హైమ -

'అమ్మా - వీళ్ళెవ్వరూ లేకుండా నువ్వూ, నేనూ ఉండేచోట ఉండాలని ఉంది.'

"అట్లాగే."

1587. 1968 మార్చి 2వ తారీఖు - హైమ జబ్బులో ఉన్నది. హైమ ప్రక్కన అమ్మ పడుకున్నారు. భద్రాద్రి రామశాస్త్రిగారు అమ్మ పాదాలకు నమస్కరించబోయి హైమ కాళ్ళు వెనక్కి తీసుకున్నది. అమ్మ- ఫరవాలేదమ్మా. నా పాదాలు అని నీ పాదాలకు నమస్కరించుకున్నా ఫరవాలేదు ఎటూ జరిగేది అదే."

1588. మృత్యుముఖంలో ఉన్న హైమను గుంటూరు హాస్పిటల్‌కు తీసుకు వెళ్ళారు.

హైమ : అమ్మా ! నాకేమి కనిపించటంలేదమ్మా ఎవరూ కనిపించటంలేదు.

అమ్మ బులాకీ తీసి ఎడమచేతిలో పట్టుకుని హైమ ముఖంలో ముఖం పెట్టి "ఇప్పుడూ?" అని అడిగారు.

హైమ : ఇప్పుడు కనుపిస్తున్నావమ్మా. నువ్వొక్కదానివే కనిపిస్తున్నావు.

1589. 6-4-68నాడు రాత్రి 12 గంటలవరకూ హైమకు అంత్యక్రియలు 'స్వయంగా జరిపిన అమ్మ 7-4-68 ఉదయం 7.30కు లోగడ అనుకున్న కార్యక్రమం ప్రకారం తన పాద సన్నిధానంలో కేశవశర్మచే సంకలితమైన 'పదార్చన' అనే పుస్తకానికి అవిష్కరణను జరుపుకోవటానికి అంగీకరించి వేదిక నలంకరించారు.

1590. నరసింహమూర్తిగారు హైమ పోయిన తరువాత ఇంతవరకూ అమ్మ దగ్గరకు వచ్చి కూర్చోలేదు. ఇవ్వాళకూడా దూరానే ఉండి అమ్మను చూస్తూ దగ్గరకు రావటానికి సంశయిస్తున్నారు -

అమ్మ : రా నాన్నా యిటురా. నేను బాగానే ఉన్నాను. నాకేమీ ఫరవాలేదు. పుట్టినరోజు పండుగ చేయించుకున్నాను. నా కేమిటీ? ..... దర్జా. ఛీ.....ఏమిటా ఏడుపూ? అంటూ కళ్ళనీళ్ళతో తన దగ్గరకు వచ్చిన నరసింహ మూర్తిగారిని మరీ దగ్గరకు తీసుకున్నారు.

1591. "హైమ ఇప్పుడు మీతో ఎట్లా ఉండేదో, ఎంతగా మిమ్మల్ని అభిమానించేదో, అట్లాగే చిన్నప్పుడు దానికి స్నేహితులు - పిల్లులు, ఎలుకలు, కుక్కలు... అవేగా? అవీ ఈ ఇంటిలో కలిసిమెలిసి తిరుగుతుండేవి, వాటితోనే హైమ ఆడుకునేది. అందుకే దానికి అసహ్యం తక్కువ."

1592. భద్రాద్రి తాతగారు హైమాలయంలో అభిషేకం చేసిన తీర్థాన్ని అక్కడ ఉన్న అందరికీ వేస్తున్నారు. వాళ్ళతో పాటు అమ్మ కూడా "నాకు ఇవ్వరేమి అంటూ" చెయ్యిజాపారు.

'అమ్మ తీర్థం తీసుకోవడమేమిటి?' అన్నారు ఆశ్చర్యంగా ఒక సోదరుడు. "ఇదొక వేడుక" అని నవ్వి "ఇదంతా వేడుక కదూ? అందులో ఇదీ ఒకటి" అన్నారు అమ్మ.

1593. "హైమను గురించి బాధపడుతున్నాను అంటే అది పోయినదానికంటే - దాని మంచితనము, దాని మాటలు గుర్తుకు వచ్చి.

అన్నంలోకి ఏమీలేదు నాన్నా - అంటే 'నీళ్ళు పొయ్యమ్మా' అన్నాడు రవి, వయస్సు చిన్నదైనా పరిస్థితి గ్రహించి. నన్ను తృప్తి పరచాలన్న ఆ మంచితనం నేను ఎట్లా మరచిపోతాను? ఝాన్సీకి తగిలిన దెబ్బకంటే, ఝాన్సీ ఓర్పు మనని ఏడిపించింది. అట్లాగే వెంకన్నలోని నిజాయితీ - మూగవాడైనా తనకు తెలిసిన దానిని చెప్పటానికి వాడు పడిన అవస్థ, చేసిన జాతర - ఇవి గుర్తుకు వస్తే బాధగా ఉండదూ? ఇదీ అంతే.హైమ మంచితనమూ ఆ చర్యలూ ఆ మాటలూ ఎందుకు ఏడిపించకుండా

ఉంటాయి?"

1594. హైమ ప్రతిష్ఠను గురించి ప్రస్తావన వచ్చి అమ్మ అన్నారు- "ఏముందీ అందులో? దానికి పాలు ఎట్లా ఇచ్చానో అన్నం ఎట్లా పెట్టానో ఇదీ అట్లాగే చేశాను."

1595. సుందరరామిరెడ్డిగారితో వచ్చిన వారి బంధువులు అమ్మ వద్దకు వచ్చి నమస్కరించుకున్నారు. వారిలో ఒకామె తన చేతిలోని శుభలేఖను అమ్మకు ఇవ్వటానికి సందేహిస్తూ శుభలేఖను చేతిలోనే ఉంచుకుని ఇట్లా అన్నది-

'అమ్మా ఇక్కడ ఇట్లా జరిగిందని తెలియదమ్మా-'

అమ్మ నవ్వుతూ ఆమె చేతిలోని శుభలేఖనందుకుంటూ -"ఏమీ ఫరవా లేదమ్మా -"

అంటూనే కవరులోని శుభలేఖ తీసి చదివారు.

1596. "మీ అందరికీ హైమలోని మంచితనమే గుర్తుకు వస్తుంటే నాకు దాని ప్రళయబాధే గుర్తుకు వస్తున్నది. అది అమ్మా! అమ్మా! - అనటం చెవులలో ప్రతిధ్వనిస్తున్నది."

1597. అమ్మ అందరితోపాటు హైమ ప్రసాదం తీసుకుని కళ్ళకద్దుకుని తింటూ ఉంటారు.

1598. "నేను హైమదగ్గరే ఉన్నాను."

# శాస్త్రం

1599. "పురాణం అంటే జరిగినదాన్ని చెప్పటం."

1600. "మతాలూ సిద్ధాంతాలూ సంఘానికి సంబంధించినవా లేక ఆధ్యాత్మిక స్థితికి సంబంధించినవా?"

1601. "సర్వభక్షకుడై నప్పుడే భిక్షకుడౌతాడు. సర్వాన్నీ భక్షించేవాడికి, వాడికి వాడే రక్షణ. వాడికి మరొకరి రక్షణ ఎందుకు? ఉపనయన కాలంలో చెప్పే 'భవతి భిక్షాం దేహి' అలాంటి వాడిలోనే ప్రత్యక్షము. తక్కినవారికి మాటలు మాత్రమే మిగుల్తాయి."

1602. "ఆచారం, ఆరోగ్యం, అద్వైతం కలిసి ముడివేసుకుని ఉన్నాయి."

1603. "ప్రతిమాటా వేదమే. వేదమంటే శబ్దం."

1604. "మాట ప్రధానమనుకున్నవాళ్ళకు మాటేచాలు. మాట సామాన్యమైనది కాదు. వేదాలలో చెప్పే మహామంత్రాలన్నీ మాటలేగా?"

1605. "ఎన్నిసార్లు గీత విన్నా మన గీతను బట్టే జరుగుతుంది."

1606. "మిథ్య అంటే లేనిదనీ, నశించేదనీ కాదు. మారేదాన్ని మిథ్య అంటాను."

1607. 'బ్రహ్మచర్యానికి గొప్ప స్థితి ఇస్తారుగా అమ్మా-'

"ఏ స్థితి అయినా ఇచ్చేదికాదు వచ్చేది."

'ఎక్కడనుండి వస్తుందంటారు?'

"మనం ఎక్కడినుండి వచ్చామో అక్కడ నుండే."

1608. "ఒక వస్తువు దగ్గరపెట్టుకుని మర్చిపోయి వెతికినట్టు మానవుడికీ మాధవుడికీ తేడా. అటువంటి చరిత్ర ఎన్నిసార్లు చదివావు?"

1609. "ఏ గ్రంథాలూ, ఏ శాస్త్రాలూ నిత్యజీవితం కంటే ఎక్కువ బోధించేదేమీ లేదు."

1610. "నిత్యకృత్యంలోనే జీవిత సత్యం తెలుస్తుంది. నిత్యకృత్యంలోని జీవిత

సత్యాన్ని తెలుసుకోలేక ఏవో గ్రంథాల కోసం ప్రాకులాడుతారు.''

1611. ''భగవంతుడు లేడు అనేవాడికి, ఉన్నాడనేవాడికీ, ఎవరూ అనేవాడికీ సరిపోయేటట్టు చెప్పగలిగిందే శాస్త్రం.''

1612. ''విన్నవాడు విమర్శిస్తాడు, కన్నవాడు వివరిస్తాడు. వినటం శాస్త్రం, కనటం అనుభవం.''

1613. ''శాస్త్రం మన అనుభవానికి కొలతబద్దేమీ కాదు, మన మాటలకి కొలతబద్ధ. మనకు తోచింది చెప్పుకుంటాం. అంతే.''

1614. ''శాస్త్రం చెప్పింది ఒకటే; అర్థం చేసుకోవటం వేరు.''

1615. అమ్మదగ్గర వడుగు చేసుకుందామని వచ్చారు. ఆ పిల్లవాడు అమ్మకు పూజచేసుకున్న తరువాత అమ్మ కర్పూరం వెలిగించమన్నారు. కర్పూరం వెలుగుతుండగా అమ్మ ఆ పిల్లవాడిని ముందుకు వంగమని కుడిచెవిలో బ్రహ్మోపదేశం చేసి-

''నీకు యికనుండి ప్రతిశబ్దంలోనూ యిదే వినపడాలి. నడుస్తున్నా. ఏ పని చేస్తున్నా యిదే ఎప్పుడూ గుర్తుండాలి'' అన్నారు.

1616 ''అర్థంకావటమంటే అనుభవమే.''

1617. ''అనటం వేరు. అనుకోవటం వేరు.''

1618. ''ఆ 'గమ్యం' అగమ్యం. అనుభవానికి వచ్చేటప్పటికి తెలుస్తుంది.''

1619. 'అనుభవంతో విశ్వాసం కలుగుతుందా? లేక విశ్వాసంతో అనుభవం కలుగుతుందా?'

''నీకు అనుభవంతోనే విశ్వాసం కలుగుతుందని రూఢి అయిందిగా?'

1620. 'పరమాన్నం గిన్నెలో చెంచాలాగ ......'

''పరమానందమయిన పరమాన్నాన్ని అనుభవించడానికి పరికరాలు అవసరమైనా ఆ పరికరాలు ఆ ఆనందాన్ని అనుభవించలేవు అనటం-''

1621. ''దైవంతో చూస్తే భక్తి అన్నారు. శ్వాసలో చూస్తే యోగమన్నారు.''

1622. ''సంహారం అంటే ఉపసంహారమే కాదు కూర్చటం కూడా.''

1623. "నరకమంటే ఎక్కడో ఉందనుకోను. ఆ రెండూ(స్వర్గమూ నరకమూ) ఇక్కడే ఉన్నాయి."

1624. "చేసేదంతా దైవసేవ అనుకుంటే నిష్కామము."

1625. "సర్వం తెలుసుకున్నవాడు స్థితప్రజ్ఞుడు."

1626. "నిర్వికల్పంలో నీ 'గమనం' ఉంది."

1627. "శివపంచాక్షరిలోని అర్థమే ఉపనయనంలో చెప్పారు."

1628. "ప్రాణనియమమే కాని ప్రాణాయామం కాదు."

1629. "శ్వాస ఎట్లా నడుస్తున్నదీ గుర్తించటమే ప్రాణాయామం."

1630. "ఇతర ధ్యాసలన్నీ లేకుండ ఇతర శబ్దంలేకుండ వినాలనటానికి బదులు ఎవరూ వినకుండా'అంటున్నారు."

1631. "నలుగురూ నాలుగు రకాలుగా చెప్పిన దానినిబట్టి ఏర్పరచుకున్న ఆకృతి 'అభాస'."

1632. "త్రిపురసుందరి అంటే బాల్య, యౌవన కౌమార స్థితులు కలిసినటు వంటిది త్రికాలాలూ ఆమె రూపమే. ఆమె అంటే చేతులు, కాళ్ళు, చీరె, రవిక, కలిగిన 'ఆమె'కాదు, శక్తి - ప్రతిదానిలో గర్భితమైన శక్తి."

1633. "కనపడుతున్న దానిని విచారించటమే సాంఖ్యవిచారణ. తారకం అంటే భావంతో కొన్ని అక్షరాలు కూర్చి ఒక వాక్యం చేసి మననం చేసేది భావం. తానయ్యేది అమనస్కం."

1634. 'అజపమంటే ఏమిటమ్మా?'

"నోటితో ఉచ్చరించనిది."

'అటువంటి దాన్ని ఎలా చెపుతారు?'

"చెప్పేటప్పుడు మాటలతో చెప్పినా చేసేటప్పుడు మాటలు లేకుండా చేసేది."

1635. "సర్వకాల సర్వావస్థల యందు నడిచే ఉచ్ఛ్వాస నిశ్వాసాలైనప్పటికీ అది

మంత్రం రూపంగా నడవటం, గుర్తించటం- జరిగే విధానాలనుబట్టి కుంభిస్తే ప్రాణాయామం. శ్వాస పైకిపోయినప్పుడు, క్రిందికి వచ్చినప్పుడు నోటితో అక్షరాలు ఉచ్ఛరిస్తే మంత్రధారణ. ఊరికే జరుగుతున్న శ్వాసను మనస్సుతో గుర్తిస్తే అజపగాయత్రి. అంటే నడిచే శ్వాసగాయత్రి అని. నోటితో ఉచ్ఛరించకుండా మనస్సు వాయువులో లీనమైతే అజపం. జపం అంటే నోటితో ఉచ్ఛరించేది. మనస్సును లీనం చేసేది తపస్సు."

1636. "కుండలీ అంటే కూడలి స్థానం."

1637. "శ్రీవిద్యను స్త్రీ విద్యగా అర్థం చేసుకుంటున్నారు నాయనా. గొప్పవిద్య, బ్రహ్మవిద్య, భగవంతుణ్ణి తెలుసుకునే విద్య అని అర్థం."

1638. "సమాధి కలిగే ఆనందం ఎప్పుడూ ఉంటే మళ్ళీ రావటంపోవటం ఎందుకు కనపడతాయి?"

# ఆచారము - మడి

1639. సుశీల అక్కయ్య స్నానం చేసి అమ్మ పెట్టిన చీర కట్టుకుని అమ్మకు పాదాలు కడిగి పూలతో, కుంకుమతో, గాజులతో పూజచేసుకున్నది. తాను సుమంగళి కాదు కనుక అమ్మకు బొట్టు పెట్టవచ్చునా అని అక్కయ్య సంశయించింది.

అది గమనించి అమ్మ - అక్కయ్య చేత తన నుదుట బొట్టు పెట్టించుకుని అన్నది -

"నువ్వేమీ సంశయించవద్దు, నీకెట్లా తోస్తే అట్లా చెయ్యి."

1640. ముఖద్వారానికి అవతల ఒక అన్నయ్య నిలబడి ఉన్నాడు.

అమ్మ : రా నాయనా లోపలికి.

అన్నయ్య : మైల అమ్మా, అందుకని రాలేదు.

అమ్మ : ఇక్కడ ఆ పట్టింపులేవీ లేవు నాన్నా, రా.

1641. "కడగా ఉన్న (ఆడ)వాళ్ళకే దేవుణ్ణి మైలపడేసే శక్తి ఉన్నప్పుడు ఆ దేవుడికి పూజలెందుకూ?"

1642. "హద్దులే మడి."

1643. రామకృష్ణ అన్నయ్యగారి బామ్మకి కుడిచెయ్యి మణికట్టుదగ్గర ఎముక విరిగినందున ఆమె ఎడం చెయ్యితో పుష్పాలు అమ్మపాదాలమీద పెట్టటానికి సందేహిస్తుంటే అమ్మ అన్నారు-

"ఫర్వాలేదు పనికివస్తుంది. ఆ చేత్తోనే చెయ్యి"-

1644. సరస్వతి అడిగింది అమ్మను -

"లలితా పారాయణ నిష్ఠ లేకుండా స్నానంచేసి చేసుకోవచ్చునా?'

అమ్మ : చేసుకోవచ్చమ్మా.

సరస్వతి : నిష్ఠలేకపోతే నెత్తి అణుస్తుందంటారూ?

అమ్మ : అవన్నీ ఏమీ లేవమ్మా.

1645. పొన్నూరునుండి వచ్చిన ఒక సోదరుడు అమ్మని అడిగారు -

'గాయత్రిని ఉపాసిస్తున్నప్పుడు ఆచారంగా ఉండాలంటారు. నేను చేసేది ఉపాధ్యాయ వృత్తి. అందువలన నాకు అది నిష్ఠగా సాగటంలేదు. ఉతికిన బట్టలు పనికి వస్తాయా అందుకు?'

"ఏమీ పర్వాలేదు నాన్నా. చేసుకోవచ్చు. ఇరవైనాలుగు గంటలూ గుర్తు ఉండాలే కానీ అంతకంటే కావాల్సింది ఏముంది? నిష్ఠలూ - ఆచారాలూ పెట్టారు అంటే ఒక నియమం కోసమే. నీకిది గుర్తు ఉండాలి కానీ ఏ స్థితిలో అయినా చేసుకోవచ్చు."

1646. 'మా ఆయన పూజచేసేవాడు. చచ్చిపోయాడు. ఇప్పుడెట్లాజరుగుతుందీ?'

"ఏం. నువ్వు చెయ్యవచ్చా లేదా అనా?"

'ఊఁ.......'

"చెయ్యవచ్చు."

1647. "శుచిని ఆచరించేదాన్ని ఆచారం అంటారు."

1648. "తులసికోటలోని మట్టి తెమ్మని దానిమీద నీళ్ళు జల్లి తీసుకుంటారు. అంటిందేమైనా ఉంటే నీటితో కొట్టుకు పోయిందంటారా? ఆ నీళ్ళు చల్లినప్పుడు కొంతమట్టి బావిలో పడ్డది. ఆ నీరే మళ్ళీ స్నానం చేస్తారేమీ?"

1649. "విధి నిషేధాలతో కూడినదే మడి."

1650. తండ్రి అబ్దికంపెడుతున్న నరసింహమూర్తిగారితో ప్రసంగవశాన అమ్మ అన్నారు-

"ఇది చచ్చిపోయిన వాళ్ళ కర్మకాదు. బ్రతికున్నవాళ్ళ కర్మే. ఆ పేరుతో ఈ రూపంగా సర్వభూతాలను తృప్తి పరుస్తారు కదా? అదే విడిగా ఈ పని చెయ్యమంటే చెయ్యలేరు. ఇదీ ఒక విధమైన ఆరాధన."

1651. 'మా అన్నయ్య చేతబడి అట్లాంటిదేది కాదండీ - అన్నాడు.'

"కాదండీ అని చెబితే అక్కడ అసలు ఏదో ఉన్నట్లూ యిది అది కాదని అన్నట్లూ ఉంటుంది. 'అటువంటిది అసలు లేదండీ' అని చెప్పాలి."

1652. "ప్రపంచంలో చేతబడులూ, చెట్లు త్రొక్కటాలూ, పాదులు త్రొక్కటాలూ, ఇవన్నీ ఏవీ లేవు. చేతబడి అని చెప్పినవాడు ఎవరు చేశారో చెప్పగలిగి ఉండాలి."

# సందేహమూ - సమాధానమూ

1653. నెహ్రూగారి మరణవార్త వినగానే రుక్మిణక్కయ్య తీవ్రమైన ఆవేశంతో అమ్మదగ్గరకు రివ్వున పరుగెత్తుకు వచ్చి పరిసరాలన్నీ మర్చిపోయి ఏడుస్తూ-

'చంపటానికి నీకు ఆయన తప్ప ఎవరూ దొరకలేదా?' అంటూ నిష్ఠూరంగా మాట్లాడసాగింది. అక్కయ్య మాట్లాడటం అయ్యాక అమ్మ అన్నారు నెమ్మదిగా ఊరడిస్తూ-

"ఆయన ఇప్పుడు పోవటం మంచిదే రుక్మిణీ. ఎవరి చేతిలోనూ మరణించకుండా హాయిగా పోయారు. ఉండి ఈ బాధలు పడేకంటే పోవటమే హాయి. ఆయన విలువ తగ్గకుండా పదవిదిగకముందే పోవటం ఎంత మంచిదో చూడు. నువ్వేకాదుగా ఎనర్నికోట్లమంది ఆయనకోసం ఏడుస్తున్నారో. మన దేశమేనా? ప్రపంచమంతా ఆయన కోసం ఏడుస్తున్నది. చనిపోయినందుకు విచారం కంటే ఆయనలోని త్యాగం, దేశంకోసం ఆయన చేసిన సేవ మనని కదిలిస్తుంది. చావు ఇవ్వాళ కాకపోయినా రేపు ఉన్నదిగా? ఎప్పటికయినా మనిషిలోని మంచితనమే మనల్ని ఏడిపించేది."

1654. నెల్లూరు నుండి వచ్చినవాళ్ళు అమ్మకు చీరా రవికా పెట్టి పూజ చేసుకుంటున్నారు. ఆ కుటుంబ యజమానురాలు పూజ పూర్తి అయ్యాక అన్నది-

'చిన్న చీర తెచ్చామమ్మా.'

"చీరకు చిన్నా పెద్దా ఏముందీ? అక్కడ మిగిలేది ప్రేమే. ప్రేమకు చిన్నా పెద్దా ఏముందీ?"

1655. "నీ వీలునుబట్టి నాన్నా. మంచిరోజు అంటే నాదృష్టిలో అన్నీ మంచిరోజులే. ఇక్కడికి రావటానికి ఎప్పుడు తటస్థపడుతుందో అప్పుడే మంచిరోజు."

1656. 'కొద్దిపాటి ఉపన్యాసమిచ్చారే?'

"ఎక్కడికక్కడ అంతా న్యాసమే."

1657. ఒక సోదరి అన్నది - మీరు నన్ను పరీక్ష చేస్తున్నారు.

అమ్మ : ఎవరినీ పరీక్ష చేయనమ్మా. తల్లిని కాబట్టి ఎవరినీ చెయ్యను. అది నన్ను పరీక్ష చేసుకోవటమే.

1658. మోహన్ : అమ్మ దగ్గర నుండి ప్రసాదం తీసుకు రమ్మని అడపా రామకృష్ణారావుగారి అబ్బాయి చెప్పాడమ్మా-

అమ్మ : ఒక యాపిల్ కొనుక్కు వెళ్ళు.

మోహన్ : నువ్వు కొనుక్కు వెళ్ళమంటే అది ప్రసాదం అవుతుందా?

అమ్మ : ఆఁ...... అవుతుంది మొన్న హైమకు ప్రసాదం పంపాలనుకుంటే కొబ్బరికాయలు కొడితే కుళ్ళిపోయాయి. యాపిల్ కుళ్ళింది. ఇంక పండ్లేమీలేవు. దారిలో పటికబెల్లం కొనుక్కు వెళ్ళమన్నా.

1659. 'అమ్మా ! నిన్ను విమర్శిస్తుంటే వినలేమమ్మా.'

"నిజంగా తప్పు ఉండి అంటే మనం మార్చుకుందాము. ఊరికే అంటారా? మనకు బాధేలేదు."

1660. "ప్రతివాడూ నడవాలని అనుకుంటాడు, కానీ నడవలేడు. కాబట్టి ఏది జరిగినా వాడు చేయిస్తాడనుకోవటమే ధర్మం కానీ మరొకటి కాదు."

1661. రాధాకృష్ణారెడ్డి : సాంప్రదాయమైన సంగీతం వినాలని ఉంది.

అమ్మ : సాంప్రదాయమంటే?

రాధాకృష్ణారెడ్డి : నీరూపంలో ఉన్న సంగీతం.

1662. వాళ్ళ ఊరికి రమ్మని ఎన్నోసార్లు అభ్యర్థించిన ఒక అన్నయ్య ఈ సారీ ఆ మాటే అడిగి నిష్ఠూరంగా అన్నాడు-

'ఎప్పుడూ అమ్మ దగ్గరకి బిడ్డలు రావటమే కానీ బిడ్డల దగ్గరకి అమ్మ రాకూడదా ఒక్కసారైనా?'

అమ్మ నవ్వి "నేను ఒకప్పుడు మీ దగ్గర లేకపోతేగా నాయనా? ప్రత్యేకించి మీ ఇంటికి రావటం అంటూ ఏముందీ? రాననీ వస్తాననీ లేదు. ఆ సమయం వస్తే నేను ఎవరినీ తప్పించుకోవటానికి?"

1663. 'నేను ఒడ్డున ఉన్నట్టు మీకు కనపడుతున్నాను కానీ నా మనస్సు మునిగే ఉన్నదమ్మా.'

"శరీరమైతే ఎవరయినా వెయ్యాలి కానీ మనస్సును ఎవరూ వెయ్యక్కర లేదు నాయనా, మునిగాననుకుంటే మునుగుతావు. తేలాననుకుంటే తేల్తావు. అది నీ మనస్సులోనే ఉంది."

1664. 'ఈనాడు ఎక్కడ చూసినా చాలామందిలో స్వార్థం పెరిగి పోవటానికీ, ఏ రంగంలో చూసినా దౌర్జన్యాలు అధర్మం పెరిగిపోవటానికి కారణ మేమిటండీ?' అని అడిగారు ఒకరు.

"అది ఈ యుగధర్మం."

1665. వసుంధరతో అమ్మ - "ఏ చీరైనానే కట్టుకునేకంటే మీరు కట్టుకుంటే బావుంటుందమ్మా -" అన్నారు.

అన్నపూర్ణ : అవునవును ఈ విధంగా తిడుతున్నావన్నమాట.

వసుంధర : తిట్టుట మేముంది? అమ్మకి అది సహజం.

1666. 'మానవుడి వికార గుణాలు ఎప్పుడు పోతాయి?' అని అచ్యుతుని గోపాలరావుగారు-

"వికారంతోనే ఆకారం ఏర్పడ్డది" అని అమ్మ.

1667. రాజమండ్రి నుండి వచ్చిన ఒక అన్నయ్య అన్నారు -'మీరు సూక్ష్మరూపంగా వచ్చి నా భార్యతో మాట్లాడుతున్నారట. ఆమె చెప్పింది - ఇక్కడికి వెళ్ళమని. నాకాభాగ్యం ఎప్పుడు?'

"నాకేమీ తెలియదు నాయనా, నాకవసరం లేదు కూడా. నీ భార్యతో మాట్లాడటానికి నేను సూక్ష్మరూపంగా రావటం ఎందుకూ - నేను ఉన్నచోటే మీరంతా ఉన్నారనుకున్నప్పుడు? నా కవసరం లేదు? నాకివన్నీ ఏమీ

తెలియవు నాయనా. మీరు బిడ్డలని ఒకటే తెలుసు. ఆ భావమే, అదే ఎప్పుడూ ఉంటుంది."

1668. "ఇష్ట దైవమటమ్మా? ఎన్ని కష్టాలు పెట్టినా ఎవరియందైతే అయిష్టత కలుగదో వారే యిష్ట దైవం."

1669. 'నీకింత తలనొప్పి ఏమిటమ్మా?' అన్నది అన్నపూర్ణ.

అమ్మ : (పాపం) అదెక్కడికి పోతుందీ?- మనమట్లా అంటే.

1670. తాను తెచ్చిన బత్తాయిపళ్ళు అమ్మ చేతిలో పెడుతున్నాడు బుద్ధిమంతు డన్నయ్య. అమ్మ చేతినిండా నిండిన ఆ పళ్ళు జారిపోతాయేమోనని జాగ్రత్తగా తాను పట్టుకోబోయాడు రామకృష్ణ అన్నయ్య. కానీ అవి జారి పోయాయి. ఆ తర్వాత యిచ్చిన పళ్ళు జాగ్రత్తగా అమ్మే అన్నయ్య చేతిలో పెడుతూ నవ్వుతూ-

"ఋజువయిందా?" అని అడిగారు.

అన్నయ్య : ఏం ఋజువయింది?

అమ్మ : ప్రతిదీ - అడుగడుగుకూ ఋజువవుతుంది. ఇదంతా చూచిన వసుంధర భవానీతో -'చూశావా ఎలా - ఋజువు చేస్తున్నదో అమ్మ? అన్నయ్య తాను జాగ్రత్తగా పట్టుకోవాలనుకుంటే జారిపోయాయి అదే అమ్మ ఇస్తే ఎలా ఉన్నాయో చూడు. అనుకున్నది జరగదు, తను అనుకున్నది తప్పదు - అన్న సూక్తికి ఇది ఒక నిదర్శనం' అని అన్నది.

1671 దీపావళీపండుగ విశిష్ఠత గురించి అడిగిన ఒక సోదరునికి "నరకాసుర సంహారానికి చిహ్నంగా ఈ పండుగ చేసుకుంటామని చెప్పే కథలో నరకాసురుడంటే నరులలో 'అసుర' అంటే రాక్షస గుణాలు ఉన్న వాడనేగా? అటు వంటివాడిని సత్యభామ సంహరించింది.సత్యభామ అంటే సత్యం. ఆ అసుర గుణాలని సత్యం సంహరించింది. ఇట్లా సూటిగా చెబితే ఎవరు అర్థం చేసుకోగలరు? అందుకని కథల రూపంగా చెప్పుకుంటారు. ఆ కాలంలో ఇవి జరగలేదా అంటే జరిగి ఉండవచ్చు. కానీ నాకు ఆ భావనకంటే ఈ భావనే బాగుంటుంది.

1672. ఒక అక్కయ్య - 'అమ్మా! మేము బాకీలలో ఉన్నాము. రేపు 15వ తారీకున మా స్థలం వేలం వేస్తారట. మాకు ఈ లోపలే అమ్ముకుందామని ఉంది. అమ్ముడు పోతుందా?' అని అమ్మను అడిగింది.

"నాకేమీ తెలియదమ్మా. నేను దళారినయినా కాదు. నాకు నువ్వెంతో వాడూ అంతే"(పొలం వేలం వెయ్యబోయే వాడూ, అప్పు ఇచ్చినవాడూ).

1673. అర్కపురిలో అన్నపూర్ణాలయానికి ప్రారంభోత్సవం జరిగిన తరువాత ఒక సోదరుడు అడిగాడు. -

'ఈ విధానం బాగుంది. కానీ ఇట్లా ఎన్నాళ్ళు ఎంతమందికి పెడతారు?'

"మనం పెట్టటం కాదు నాన్నా. ఇక్కడ ఎవరి అన్నం వారు తిని వెళతారు."

1674. 'ఈ అమ్మాయి మా మరదలండీ. పెండ్లి ఎప్పుడు అవుతుందో,చెప్పండి-'

"ఊఁ.... అవుతుంది - అయినప్పుడు.-"

1675. 'నాకు దేనిమీద ప్రేమలేదు. ద్వేషమే ఉందమ్మా.'

"నువ్వు ద్వేషాన్ని ప్రేమిస్తున్నావు నాన్నా."

1676. 'నాకు ధర్మాలు పనికిరావు. నాది ప్రేమతత్త్వం' అన్నది ఒక అక్కయ్య.

"నీది ప్రేమత్వమయితే ధర్మాన్ని ప్రేమించు."

1677. 'అమ్మా కష్టకాలం ఎప్పుడు తొలుగుతుంది?'

"చెప్పి రాలేదు కదమ్మా."

1678. "నీకేమీ లేదు ప్రపంచంలో చేతబడులూ,పాదులూ చెట్లు త్రొక్కటాలూ లేవు. పోయి తొందరగా ఉద్యోగానికి ఛార్జ్ తీసుకో."

1679. 'ఈశ్వరుడికి నివేదన చేయటంలో ఉద్దేశమేమిటి?'

"నువ్విచ్చిన పదార్థం నీకే అర్పిస్తున్నాననా?"

1680. 'నన్ను ఏమి చేయమంటారు?'

" ఏది తోస్తే అది చెయ్యి-"

1681. 'కాదమ్మా- ఆయన చాలా అహంకారి -' అన్నాడు గోపాలన్నయ్య.

"నువ్వు విద్యాయనమః అంటే అతను అవిద్యాయనమః అంటాడు. అంతేగా?"

1682. 'క్షమించాలమ్మా-' అని యాచించాడు ఒక అన్నయ్య.

"ఎందుకూ?" అని ప్రశ్నించారు అమ్మ.

'తల్లిని నిరాకరించినందుకు-' అని కారణం వివరించాడు.

"తల్లిని నిరాకరించినా తల్లి నిరాకరించదుగా."

1683. 'నేను ఉండి ఏమి ఉపయోగం?'

"ఉండటమే ఉపయోగం నాన్నా-" అన్నారు అమ్మ.

1684. "ప్రయత్నం, ప్రయత్నంలేకపోవటం, మార్గం ఏమిటీ? ఈ రెండూ అడగటమే ఎవర్తు మాట్లాడినా, ఎంతమాట్లాడినా."

1685. "అంతా అమ్మే చేయిస్తుంది. అంతా అమ్మ దయే అని మాటగా కాదు నాయనా నీలో ఉండాల్సింది. అంత విశ్వాసమే నీలో ఉన్నప్పుడు ఈ మాటలకు తావు ఉండదు."

1686. ఒక అన్నయ్య : పరమాత్మని తెలుసుకోవాలంటే ఏమి చెయ్యాలి?

అమ్మ : ఏమీ చెయ్యనక్కరలేదు. వాడంతట వాడే తెలుస్తాడు.

అన్నయ్య : మన ప్రయత్నమేమీ లేదా?

అమ్మ : ఉంటే చెయ్యండి.

అన్నయ్య : ఏమి చెయ్యాలి?

అమ్మ : నాకు తెలియదు నాన్నా, ఆసమయం వస్తే వాడంతట వాడే తెలియబడుతాడు అనుకుంటున్నాను.

1687. 'భగవంతుడుకేమి బెడద ఉంది- ఇదంతా మనకే కానీ?'

"పెండ్లాడటమూ పిల్లలతోనే నీకు ఇంత బెడదగా ఉంటే వాడికి ఎంత ఉండాలి?"

'అయితే నేనూ వాడూ ఒకటేనన్నమాట'

"అంతే."

1688. లక్ష్మీనారాయణ అన్నయ్య : ఒక కథలో ఒకడు తపస్సు చేయటం - దేవుడు ప్రత్యక్షమై వరమివ్వటం చదివాను. మరి నిర్ణయింపబడని దాన్ని ఇచ్చినట్లుంది- అట్లా యివ్వవచ్చా? (ఇవ్వటానికి వీలున్నదా?)

అమ్మ : ఇవ్వటం నిర్ణయంలోదే.

1689. ఒకాయన అమ్మతో -

'కోరికా, సంకల్పం ఒకటేనా?'

అమ్మ : ఒకటే.

ఒకరు : కోరికా, సంకల్పాలలో కోరిక రెండవస్థాయి అనుకుంటాను.

అమ్మ : ఇన్ని స్థాయిలు లేవు.

ఒకరు : అయితే సంకల్పం ఏ స్థితిలోది?

అమ్మ : ముందు మీరే స్థితిలో ఉండి మాట్లాడుతున్నారు?

ఒకరు : ఆధ్యాత్మిక స్థితిలో -

అమ్మ : ఏ స్థితికైనా సంకల్పం ఒకటే. ఎవరికయినా ఒకటే.

1690. 'నమ్మకం దేని వల్ల కుదురుతుంది?'

"నమ్మకం కలగకపోవటానికి కారణమేదో కలగటానికీ కారణమదే."

'నమ్మకం గ్రేస్ కాదా?'

"నమ్మకమే కాదు. లేకపోవటం కూడా."

1691. భద్రాద్రి రామశాస్త్రిగారు నంబులన్నయ్యతో -

'మనకు కొంత చేతిలో ఉండి మనది మనం తినాలికానీ- అమ్మ పెడుతుంది, మనం తిందాం, ఉందాం, అనుకుంటే - మంచి పద్ధతి కాదు-" అని అన్నారు.

అమ్మ అటు గదిలో నుండి హాలులోకి పోతూ -

"అదే మంచి పద్ధతేమో." అన్నారు స్వగతంగా అన్నట్లు.

1692. అమ్మ ఎప్పుడూ ఉండాలని ఆశయంతో ఒకరు -

'అమ్మకు కాలం ఉంధా అమ్మా ?'

"నువ్వు చూసే అమ్మకు ఉంది."

1693. రెప్పవేయకుండా అమ్మవంకే కాసేపు చూసి కాంతిమతి అన్నారు-

'నీ రహస్యం తెలిసింది, చెప్పమంటారా?'

"రహస్యమయితే ఎట్లా చెబుతావు?" అని "చెప్పమ్మా" అన్నారు.

'మీరు ఓంకార స్వరూపం నుండి వచ్చారని -'

"నీకు తెలిసిన రహస్యమది."

'అవును' అన్నారామె.

1694. రామకృష్ణ : మనం యమదూతలం కాదు. అమ్మ దూతలం.

అమ్మ : యమదూతలు అమ్మ దూతలు కాకపోతేగా?

1695. రమణరావుగారు తమ సందేహాన్ని వెలువర్చారు- అవకాశం చూసి -

'ఏదైనా ఒక పని జరగాలంటే మా కోరిక బలవత్తరంగా ఉండాలా లేక మీ సంకల్పం ఉండాలా?'

అమ్మ అన్నారు సమాధానంగా -

"నా సంకల్పమే. ఏదయినా నేనేగా మీకు ఇచ్చేది."

1696. 'నాకు ఏమీ తెలియదమ్మా. ఆ ఒక్క పోతురాజు తండ్రిని కొలుచుకోవడమే తప్ప ఇతరమేమీ తెలియదు.'

"ఏదీ తెలియకుండా వాడొక్కడినే తెలుసుకోవటం కంటే కావలసిన దేమున్నది నాన్నా? అందరూ చేసే ప్రయత్నం అదే."

1697. ఒకరు : మనవాళ్ళు సామాన్యంగా శిశువుకు ఆరో నెలలో ప్రాణం వస్తుందంటారు. అదేమిటమ్మా?

అమ్మ : అదేమీ కాదు బీజం అంటే అండము ఏర్పడిన దగ్గరనుండి

అది అనుక్షణం రక్తాన్ని గూడు కట్టుకుంటూనే ఉంటుంది. ప్రాణం ఎప్పుడో రావటమేముంది? బీజంలో ప్రాణశక్తి లేకపోతే పెరుగుదల ఎక్కడినుండి వస్తుంది?

1698. ఒక అన్నయ్య : ఈ బిడ్డ అవివేకాన్ని మన్నించమ్మా.

అమ్మ:నేను అనుకుంటేగా నాన్న మిమ్మల్ని మన్నించట మంటూఉండేది? అమ్మ ఏది ఇచ్చిందో అదే ఉన్నది. వివేకం లేదు, అవివేకం లేదు. రెండూ ఒకే స్వరూప మయినపుడు భేదం ఏముంది? వాడికేరకమయిన సంస్కారం పెట్టి పంపించిందో అదే చేస్తాడు. పెట్టనిది ఎలా చేస్తాడు.

1699. "శిక్షణ రక్షణేగా?"

1700. "దుష్ట శిక్షణ సుగతి కాకపోతే నరకాసురుడు పోతే పండుగ ఎందుకు చేసుకుంటున్నారు?"

1701. "సందేశం వేరు, సమాధానం వేరు. సందేశమంటే సందేహానికి తావు ఉండకూడదు. అందరికీ సందేహ నివారణ చేసేదే సందేశం."

1702. ఒకసారి మాటల సందర్భంలో శ్రీపాదవారన్నారు-

యోగయ్య - సుబ్బారావు వడుగు శుభలేఖ అమ్మ నా చేతికిస్తున్నప్పుడు -'ఇది అమ్మ పిలుపు' - అన్నారు. అప్పుడు అమ్మ -

"ఆఁ...? అమ్మ పిలుపా, కాదు. అది పుట్టినప్పుడే ఉన్నదన్నారు" అని మళ్ళీ అన్నారు-

"పుట్టినప్పుడు అంటే, పుట్టినప్పుడే కాదు. అది ఎప్పుడూ ఉన్నది. కానీ మనం గుర్తించినప్పుడు ఉన్నదనుకుంటున్నాము. ఇప్పుడు ఈ అబ్బాయి ఉన్నాడు, బాపట్ల వచ్చి సంవత్సరమయింది. ముందు వాళ్ళమ్మ వచ్చారు. ఇవ్వాళ తాను వచ్చాడు. కనుక అమ్మ పిలుపు ఇప్పుడు అందినది-అనుకుంటాడు. కానీ ఇది 'ఎప్పుడో'లో ఉన్న భాగమే.".

1703. "ప్రాణం పోతున్నా సరే తన నియమం లక్ష్యం వదలనప్పుడే అది నియమం అవుతుంది."

1704. 'కొబ్బరికాయ ఎందుకు కొడతారు చెప్పమ్మా?'

"నాకు తెలియదు. తలకాయ కొట్టలేక దానికి ప్రత్యామ్నాయమా?"

1705. "ఉన్నది ప్రేమే. భగవంతునియందు చూపిస్తే భక్తి అంటున్నాము. పిల్లల యందు చూపిస్తే మమత అంటున్నాము. ఇతరులయందు చూపిస్తే భూతదయ అంటున్నాము."

1706. 'నేను రిక్త హస్తాలతో వచ్చానమ్మా.'

"రక్త హస్తాలతో వచ్చావు నాన్నా."

1707. ఒకరు : నీదగ్గరకి ఒట్టి చేతులతో వచ్చానమ్మా. అందరూ పండ్లూ, పూవులూ ఇస్తున్నారు.

అమ్మ :.బాగుంది - నువ్వేమీ ఇవ్వాలని?

వారు :అందరూ అదీ-ఇదీ అని ఇస్తున్నారు. నేను హృదయమే ఇచ్చాను.

అమ్మ : అంతకంటే కావలసింది ఏముంది నాన్నా? అందరూ ఇవ్వటానికి ప్రయత్నించేది నువ్వు ఇచ్చావు-అంతే.

1708. 'గీత సారం ఎవరు చెబుతారు?'

"గీత సారం చెప్పేదేముందీ? అనుభవించటమే."

1709. అన్నయ్య : మీరు ఇచ్చే సందేశం ఏమిటి?

అమ్మ : ఏది జరిగినా ఎవరు ఏది చేసినా మనం కాదు చేసేది- మనను నడిపించే శక్తి మరొకటి ఉన్నదనుకోవటమే.

1710. 'నాకు వ్యక్తి పూజ మీద నమ్మకం లేదండీ.'

"మంచిదే నాయనా, నీకు దేనిమీద నమ్మకం ఉంటే అదే పూర్తిగా చెయ్యి."

1711. "ఇందు (సృష్టి)లో దేనికీ మనం కర్తలం కాము. మరి అనుభవానికి కర్తలమై

అనుభవిస్తున్న బాధ ఎప్పుడు తీరుతుందయ్యా- అంటే- ఇది (మనం దేనికీ కర్తలము కామని) నిజమని మాటలతో కాకుండా మనసా ఆ భావం కలిగినపుడు హాయిగా ఉంటుంది."

1712. 'త్యాగి అన్నా సర్వసంగపరిత్యాగి అన్నా ఒకటేనా అమ్మా?'

"ఏదో ఒకొక్క విషయంలో ఉండి తతిమ్మా వాటిలో లేకపోతే 'ఆ విషయంలో మంచి త్యాగిలెండి' అంటారు. ఆ త్యాగమే అన్నింటిలో ఉన్నప్పుడు అంటే త్యాగం యొక్క చరమదశ - సర్వసంగపరిత్యాగం."

1713. 'తెలిసే సమయం ఎప్పుడు వస్తుందమ్మా?'

"తెలిసి వచ్చేదీ కాదు. వస్తే తెలిసేదీ కాదు."

1714. 'ఇదెక్కడో క్రొత్త మాట!'

"ఉన్నమాట."

'ఏమి ఉన్నమాట?'

"నేను అన్నమాట, ఉన్నమాట, ఎల్లప్పుడూ ఉండే మాట."

1715. 'ప్రాణం పోతుందంటారే, ఎక్కడికి పోతుందమ్మా?'

"ఎక్కడికి పోతుందీ? అక్కడే ఉంటుంది. ఎక్కడికీ పోదు. టైరు ఉన్నదనుకో అమ్మా - దానిలో గాలిపోతే ఎందులో కలుస్తుంది? గాలిలోనే కలుస్తుంది. ప్రాణమూ అంతే. ఉన్నదంతా అదే కనుక అందులోనే కలిసిపోతుంది."

1716. 'లోకాలున్నాయని అంటారు గదా? యమలోకమనీ-'

"బాధ యమలోకం కాదూ?"

1717. "చీపురు, రోలు, రోకలి, పొయ్యి, కత్తిపీట- నాలుగు వేదాలు."

'అయితే మగవారి వేదాలు?'

"వాటి ఫలితాన్ని అనుభవించటమే వారి వేదాలు."

1718. 'నన్నాశీర్వదించు అమ్మా-'

"ఆశీస్సుకు మాటలతో పని లేదు."

1719. 'మా పాపకి విరేచనం కాలేదమ్మా. కాస్త కుంకుమ ఇవ్వండి.'.

"ఇందాక ఇచ్చినది కుంకుమేనమ్మా."

1720. 'చాలామందికి చావంటే భయం-' అని భరద్వాజ.

"అదేదో తెలియని వాళ్ళకు-" అని అమ్మ.

1721. ఒకరు : ఏ నామం చేస్తే మంచిందంటారు?

అమ్మ : మీకు ఏ నామం చెయ్యాలని ఉంటే అది చెయ్యండి ఇది చేస్తే మంచిదీ, అది చేస్తే చెడ్డదీ అని ఏమీ లేదు. నామం అంటూ చేస్తే ఏ నామం అయినా ఒకటే. నాకు అన్ని నామాలూ ఒకటే. రామనామం కృష్ణనామం అమ్మనామం చేసనా ఏది చేసినా నామం కాకుండా పోదుగా?

1722. లలితాంబగారు : చిన్నతనంలోనే ఆ ధ్యాస ఉండటం విశేషమే.

అమ్మ : ఎవరికి చిన్నతనం? ఆ ధ్యాస లేకపోవటమే చిన్నతనం.

1723. సరోజిని : నన్ను ఈ ప్రపంచంలో లేకుండా చెయ్యరాదా?

అమ్మ : నీవు లేకుండా పోతే 'నేనే' ఉంటాలే.

1724. "నీకు పనికి రాని వస్తువు లేదా అంటే లేదన్నాను."

1725. తన డైరీ పుస్తకాన్ని అమ్మ చేతికి ఇచ్చి ఏమన్నా వ్రాయమన్నది ఒక సోదరి.

"అంఅ - అంఆ - అంమ - అమ్మ" అని వ్రాసారు అమ్మ.

'వాటి అంతరార్థమేమిటని' ప్రశ్నించారు ఆవిడ.

"అక్షరాలను బట్టి ఉచ్చారణలో తేడా వస్తుంది కానీ వాటి భావం ఒకటే. వాటి అన్నింటి అర్థం అంతులేనిదీ - అడ్డులేనిదీ - ఆధారమైనదీ" - అన్నారు అమ్మ.

# అమ్మ సూక్తులూ - లౌకికాలూ

1726. "చద్ది అన్నం తిని పొలంలో పనిచేసే వాళ్ళెవరిప్పుడు? కాఫీ త్రాగి వెళితే అట్లాగే ఉంటున్నది పని."

1727. "క్యాషియర్ అంటే ఎట్లా ఉండాలంటే ఉన్నది ఖర్చుపెట్టేవాడూ, లేకపోతే తెచ్చిపెట్టేవాడూ అయి ఉండాలి."

1728. "ప్రహ్లాద చరిత్ర ఆనందమే కానీ తన బిడ్డ ప్రహ్లాదుడు అయితే ఏ తండ్రీ సహించడు."

1729. "ఎప్పుడూ రెండు రకాల మనస్తత్వాలు కలవవు. ఎంత ఒకటి అనుకున్నా నీకు పులుపు ఇష్టమవుతుంది- ఆమెకు కారం ఇష్టమవుతుంది. రెండింటి గుణాలూ రెండు రకాలుగా ఉండటమే అందం. ఉప్పూ మిరపకాయలు రెండూ వేరుగా ఉండాలి, అవి కలవాలి - అప్పుడే రుచి. దేనిగుణం దానికుండి అన్నీ కలిస్తేనే రుచి."

1730. "మనకు నచ్చినది ఇంకొకరికి నచ్చలేదంటే ద్వేషంగా ఉంటుంది. అది లేకపోతే మానవుడే కాదు."

1731. "ఎవరినయినా చంపాలనుకున్నప్పుడు ఆ కత్తిని ప్రేమిస్తున్నావు. విషాన్ని ప్రేమిస్తావు. అంతేగానీ ప్రేమ ఎక్కడికీ పోలేదు."

1732. "మంచితో బాధించినంతగా చెడుతో బాధించలేరు."

1733. "కర్తలు వీళ్ళయితే అది వీళ్ళ దోషం."

1734. "మందు మనకు పనిచేయనంత మాత్రాన వైద్యశాస్త్రం తప్పుకాదు."

1735. "వస్తుందనుకున్నది ఆస్తికాదు. వచ్చినదే ఆస్తి."

1736. "ఒకరు చేసేది ఒకరికి ఉపయోగపడాలని ఏముంది? ఎవరికోసం వాళ్ళు చేసుకోవటమే."

1737. "నా దృష్టిలో ఆకలి ఉండి తినటానికి ఉండకపోతే అది దరిద్రం. అట్లా అయితే మనకన్నా దరిద్రులున్నారు."

1738 "మనిషన్న తరువాత జబ్బు వస్తుంది. అది సహజం."

1739. "చావనేది వేరుగా కనపడుతున్నంత వరకూ రక్షణ పొందాలనిపిస్తుంది. దానికి దూరంగా పోవా్లనిపిస్తుంది."

1740. "వ్రతం చేసినా తరువాత భక్తి తప్పినా ఫలం తప్పదనటం చాలా బాగుంటుంది."

1741. "సుఖమంటే డబ్బే కాదు- డబ్బు వచ్చి ఇల్లు చిమ్మి పెట్టదుగా! మిరప కాయ ఉన్నవాడు ఉప్పు కొనుక్కోవాల్సిందే. ఉప్పు కలవాడు మిరప కాయలవాడిని అడగాల్సిందే."

1742. "నీ బిడ్డ మనస్సే నీకర్థం కానప్పుడు పశువుల మనస్సు ఎట్లా అర్థమవు తుంది."

1743. "పిల్లవాడు తెలియక కొడితే బాధ అనిపించదు. అదే ద్వేషంతోచిన్న దెబ్బ కొట్టినా బాధ పుడుతుంది."

1744. "బిడ్డపుట్టింది మొదలూ తల్లి చేసే పథ్యాన్ని చూస్తే - పిల్లవాడికోసం తాను పథ్యం చేస్తుంది. అది ఎవరికోసం తన ఆనందం కోసమే. అందుకే 'తన మూల మిదం జగత్' అన్నాను."

1745. "ప్రేమే తల్లి కాని తల్లి ప్రేమకాదు."

1746. "తల్లి తరింప చేస్తుంది."

1747. "మానసికదార్ఢ్య మంటే ధైర్యం. శరీరదార్ఢ్యమంటే బలం."

1748. "హృదయము అంటే గుర్తు అనుకుంటాను."

1749. "అనుకున్నది చేతలలో కనుపడుతుంది. అన్నది కనుపడదు."

1750. "కోరిక అంటే ఏదైనా కోరికే,కావాలనేదీ కోరికే. వద్దనేదీ కోరికే."

1751. "శక్తి శరీరమంతటా ఉన్నది."

1752. "జరిగే పనంతా కర్మే. చేయిస్తున్న శక్తి వేరు."

1753. "కాలం జరుగుతుంది కానీ కాలం కనుపడదు."

1754. "మరుపే మరణం. శరీరధారియై ఉండీ కూడా అనుక్షణం చస్తున్నాడు."

1755. 'ఆరోగ్యం ఎట్లా వస్తుంది?'

"అనారోగ్యం ఎందులోనుండి వచ్చిందో ఆరోగ్యము అందులోనుండే వస్తుంది."

1756. "శక్తి అంటే నిప్పేకాదు."

1757. "గుర్తే గురువు."

1758. "పొటాషియం సైనైడ్‌లో జీవం లేకపోతే జీవాన్ని తీసెయ్యలేదు."

1759. "గ్రహించటానికి వీలైనదంతా రూపమే."

1760. "...కానీ శరీరాన్నీ పెట్టబోతూ (భూస్థాపితం చెయ్యబోతూ) బంగారం లాక్కుంటే బాధ కలుగుతుంది."

1761. "చిక్కులేకపోతే సంసారమేముందీ? చిక్కులతో ఉన్నదే సంసారం."

1762. "మధురమంటే తీపి అని కాదు. ఎవరికి ఏది ఇష్టమయితే వాడికది మధురం."

1763. "శరీరంలో చైతన్యం పోయిన తరువాత పరిణామం వేరు. అప్పుడా శరీరానికి నేల అవసరం కావచ్చు."

1764. "ప్రాణం పోయిన తరువాత కూడా ఆ శరీరంలో చైతన్యముంటుంది. కానీ అది మనకు ఉపయోగపడకపోవచ్చు."

1765. అందరికంటే అమాయకురాలూ, తెలివి తక్కువదీ కోపం. దానికి దక్షత లేదు. అదేమి చేస్తుందో, దానికే తెలియదు. కోపం ఆవరించిన వ్యక్తికి తన చేతిలో ఏమి ఉందో ఏమి చేస్తున్నాడో తరువాత ఏమి అవుతుందో తెలియదు."

1766. "నిద్రంటే మరుపేగా."

1767. రజని అంటే చీకటి కాదు - రాత్రి."

1768. "తెలిసినట్లుండేవి మాటలే. తెలియనట్లుండేవీ మాటలే. తెలివిని వ్యక్త పరచేవీ మాటలే."

1769. "శబ్దం బ్రహ్మయితే సైలెన్సూ బ్రహ్మే."

1770. "ఒరిపిడి వస్తేగాని మెరుగు రాదు."

1771. "కాలిన ఇనుపకడ్డీకంటే కడుపుమంట ఎక్కువ."

1772. ఒక వృద్ధురాలు : క్రింద కూర్చుంటాను.

అమ్మ : (మంచం మీద నుంచి) ఇదీ క్రిందేగా?

1773. "శత్రువుగా పుట్టి వేధించేకంటే పుత్రుడిగా పుట్టి వేధించవచ్చుట. శత్రువయితే జాగ్రత్త పడుతుంటాము. పుత్రుడయితే మన ప్రేమే మనల్ని బాధిస్తుంది."

1774. "నిజం చెప్పమని గర్జించే వారికి వారి నిజం మీదే నమ్మకం ఉండదు."

1775. "జోలపాటా? జోల అంటే పాటకాదు. నిద్ర పుచ్చిందే జోల."

1776. "సుఖపడటమే తప్ప ఎవరినీ ఎవరూ సుఖపెట్టలేరు."

1777. "ఏ ఆసనం గొప్పదీ అంటే సుఖాసనం గొప్పది. ఎవరు ఎట్లా కూర్చుంటే హాయిగా ఉంటే అదే సుఖాసనం."

1778. "నమస్కారం చేస్తున్నారు. నేనెవరో వాళ్ళకు అనవసరం. భగవంతుడనే భావంతో చేసుకుంటున్నారు. వాళ్ళకోసం వాళ్ళు చేసుకుంటున్నారు. ఆ భావం వాళ్ళకు రావటమే వాళ్ళల్లో భగవంతుడున్నట్లు."

1779. 'జనాన్ని మోసం చేస్తున్నదమ్మా. ఎందరో పోయి కాళ్ళ మీద పడుతున్నారు.'

"నమ్మినవాడికేమీ కష్టం లేదు. నమ్మించినవారికే నష్టం."

# ఆధ్యాత్మికాలు

1780. "గుణభేదమే లేనప్పుడు కులభేదం లేకపోవటం గొప్పేముంది?"

1781. "పవరే డివైన్-డివైన్ పవరేమిటి?"

1782. "మదర్ అంటే మూలమనే - మూలానికి వెళితే అన్నీ ఒకటే."

1783. "చింతకు కారణం నా స్వంతం అనుకోవడమే."

1784. "విశ్వాసం కంటే అంధవిశ్వాసమే దొడ్డది. దానికి రెండులేవు."

1785. "చెయ్యలేనిదే హింస. ధర్మం అనేది ఎవరో చెప్పిందే కదా?"

1786. "గీత అంటే ఒకప్పుడు ఉండి ఒకప్పుడు జరిగేది కాదు."

1787. "నువ్వు అనుకున్న రూపంలో కనుపిస్తేనే భగవంతుడిని గుర్తిస్తావు. లేనప్పుడు నీ ముందు నిలబడ్డా భగవంతుడని అనుకోలేవు."

1788. "ప్రపంచంలో ఏదయినా పాపం అనేది ఉందీ, దానీ ప్రతిఫలం దేవుడు అనుభవింపచేస్తాడు - అనుకుంటే ...ఎవరూ ఆయన (భగవంతుడి)కంటే ఎక్కువ పాపం చేసి ఉండరు."

1789. "సుఖపడేవాడే కానీ సుఖపెట్టేవాడు పుట్టలేదు.

1790. "ఒకటి ఉంటే మరొకటి తోచేది 'మాయ' ఎవరయినా చేసింది మోసం. తనకే అట్లా తెలిస్తే 'మాయ' అంటారు."

1791. "సాహిత్యంలో రాహిత్యం కాదు. ఏ శాస్త్రం చదువూ, ఏ ఉపన్యాసం వినూ - ఒకటే విషయం మళ్ళీ మళ్ళీ వస్తుంది. దృశ్యము, ద్రష్ట, లక్ష్యార్థము, వాక్యార్థము, పరోక్షము, అపరోక్షము .... నెల రోజులు విన్నా అదే భాష, అదే భావం."

1792. రుక్మిణక్కయ్య : భూకంపం ఎందుకమ్మా?

అమ్మ : భూకంపం ఎందుకని బాధపడతారే కానీ భూమి ఎందుకు అనుకోవటం లేదు.

1793. "భూమికి కంపం లేకపోతే కొన్ని బయటపడవు."

1794. "కాపు వేరే ఉండాలి గానీ వేడినీళ్ళ కాపు ఏమి కాపు?"

1795. "శరీరం ఆ వ్యాధికి ఆశ్రయమిచ్చింది- అవీ జీవులే కదా! వాటికీ పుట్టుక చావూ వుంది కదా! అవి కూడా ఏ శరీరం నివాస యోగ్యమో అక్కడ చేరుతయ్."

1796. "శరీరం పోతుందనేమీ లేదు. రూపాంతరం పొందుతున్నది."

1797. "శరీరం ఆత్మ కాకపోలేదు."

1798. "ఆత్మ అంటే అర్థమైనవాడికి - ప్రతిబింబం లేదు."

1799. "భగవంతుడున్నాడనుకున్నవాడూ, లేడనుకున్నవాడూ చేసేవి ఒకటే - అనుభవించటమే."

1800. "ఎవరయినా ఎవరు చేసే పనులకు వాళ్ళు కర్తలు కారు - అనే ఆలోచన వస్తే వాళ్ళకు ఇతరులనేమీ అనబుద్ధి కాదు. నాకు అడుగడుగునా అట్లాగే తోస్తుంది."

1801. "వాత్సల్యా, అనసూయా - ఇద్దరూ ఒకటే."

1802. "ప్రేమను ప్రేమించే ప్రేమ కరువు."

1803. "ప్రేమ అనే మాట వచ్చు. ఎట్లా వ్రాయలో తెలుసు. కానీ ప్రేమ అంటే ఏమిటంటే చెప్పలేరు."

1804. "అశుద్ధంలో కూడా జీవం ఉంది."

1805. "రాయి మీద రాయి వేసి కొట్టినా నాదబ్రహ్మ."

1806. "కోరికను కోరికతోనే నిగ్రహించాలి."

1807. "సంకల్పం ఎప్పుడూ మారదు. దాన్ని గురించిన ఆలోచనలు మారుతాయి."

1808. "ఒక పదార్థంలో మరొక పదార్థం ఉన్నదని గుర్తించటానికి వేరొక పదార్థం ఆధారమవుతుంది."

1809. "ఒకటి అనుకున్నప్పుడు మరొకటి జరిగితే మనల్ని మించినదేదో ఉన్నదని పిస్తుంది."

1810. "నవ్వుతూ అనుభవించేవాడి దగ్గరకు ఏడుస్తూ అనుభవించావాడు వస్తాడు. ఇక్కడ నవ్వుతూ అనుభవిస్తున్నాము. అక్కడ ఏడుస్తూ అనుభవిస్తున్నారు."

1811. "తనకేది జరుగుతుందో తనకు తెలియకుండానే జరుగుతున్నది."

1812. "ఒక్కొక్కళ్ళు ఒక్కొక్క పాత్ర. రచయిత ఒక్కడయినా ఎవరి పాత్ర వారిది."

1813. "అనంతం అన్న నాటకంలో పంచభూతాలతో ఆడుకుంటున్నాము."

1814. 'అసలు నిద్ర లేకపోతే జనమంతా ఏమయ్యేవారో?'

"ఏమవుతారూ? నాకు మల్లేనే ఉంటారు."

1815. "నాకు నిన్నా, ఇవ్వాళా, రేపూ - అంటే నవ్వు వస్తుంది."

1816. "సర్వార్థంలోదేగా పరమార్థం."

1817. "భావాన్ని విసర్జించాలనే భావం కూడా భావమే."

1818. "ఆశీర్వచనం అంటే మాటలకందని స్థితి."

1819. "ఒకదానియందుంటే మమత - సర్వత్రా ఉంటే సమత."

1820. "భగవంతుడు అన్ని రూపాలలోనూ ఉన్నాడు."

1821. "అంతా నేనే అనుకున్నప్పుడు తానే భగవత్స్వరూపం. అంతా ఎవరో అనుకున్నప్పుడు తనను తాను మరచిపోవటం."

1822. "రెండు అనుకుని మాట్లాడుతావు. కానీ రెండూ అయి మాట్లాడలేవు."

1823. "ఏదయినా బాధలో మనస్సు లగ్నమయితే దానికి ఏకాగ్రత అని పేరు పెట్టలేరు."

1824. "నేను 'అదే' అనుకోవటం లేదు. 'ఇదే' అనుకుంటున్నాను."

1825. "భ్రాంతి అంటే మమకారం - భ్రమ అంటే ఊహించటం."

1826. "నైజం అంటే మారని స్వభావం."

1827. "అమ్మ దయ బాధలోనూ ఉంది."

1828. "మాయ అంటే చీకటి అని కాదు. తెలియనిది మాయ."

1829. "అర్థం కానిది మాయ."

1830. "ఇన్ని బ్రహ్మలు లేవు. మారుతూ కూడా ఉన్న బ్రహ్మ ఒక్కటే."

1831. "సర్వభక్షకుడే భిక్షువు."

1832. "అందరికీ సరిపోయేదే సూక్తి."

1833. 'చెట్టు ముందా? విత్తు ముందా?'

"ఉన్నదే మొల్చింది."

'ఇదంతా ఎట్లా వచ్చింది?'

"ఉన్నదే వచ్చింది."

'Space అంటే?'

"ఉన్నదే Space."

# జన్మలు

1834. 'పోయినవాళ్ళు ఎన్నాళ్ళకు పుడతారమ్మా?'

"పుడతారనేముంది?"

1835. "తేలు ఉంది. దాన్ని నేను చంపాను. అది ఎక్కడికి పోయింది? శక్తిలోనే కలిసిపోయింది. శక్తి శక్తిలో కలవక ఎక్కడకు పోతుంది? ఇక్కడిదిక్కడే తేలకపోతే జన్మలను గురించి ఏమాలోచిస్తాము?"

1836. "ప్రారబ్దం అన్నది అనుభవించేవాడికే గదా? దగ్గరుండి చేసేవాడికీ, చూసేవాడికీ ఒకటే రకమయిన కర్మ ఉంటుందా? జబ్బు వచ్చినవాడు ఏ రకమయిన పాపం చేశాడో, దగ్గరుండి చేసేవాడికీ ఈ బాధకు కారకులైన వారికీ ఒకే రకమయిన కర్మ ఉంటుందా? వీళ్ళవి వేర్వేరుగా ఉంటాయా? బాధ అనుభవించేవాడికీ, బాధ చూసి బాధపడేవాడికీ ఒకే రకమయిన ప్రారబ్దమా లేక వేరుగా ఉంటుందా?"

1837. "నువ్వు ఇన్ని వ్రతాలు పట్టటానికి క్రిందటి జన్మలో ఏ వ్రతం పడితే ఈ జన్మలో ఇన్ని వ్రతాలు పట్టటానికి యోగ్యత కలిగిందో ఆ వ్రతాల్లో వ్రాసి ఉందా?"

1838. "సంచితం, ఆగామి, ప్రారబ్దం - దేనికి ఏది ముందు?"

1839. "జన్మల గురించి తెలియటమంటూ జరిగితే రెండు జన్మల సంగతి చెప్పినప్పుడు మూడవజన్మా నాలుగవదీ తరువాతవి మట్టుకు ఎందుకు తెలియవూ? తెలియటమంటూ వస్తే అంతా తెలియాల్సిందే."

1840. "పోనీ జన్మలు ఉన్నాయనుకుందాము. ఉన్నాయనుకుంటే పాపం చేయకుండా ఉంటాడా? మంచిపనులే చేస్తాడా? జన్మలు లేవు అనుకో-నిశ్చయంగా పాపం చేయగలడా?"

1841. "గొప్ప సంస్కారం కాకపోతే ఇంతమంది చేత పూజింపబడే స్థితి రాదు గదా. ఇందులో మళ్ళీ ఈ నీచ దశ ఎందుకో? పూర్వజన్మ సంస్కారం

చేతనే నడుస్తున్న జన్మ జరుగుతున్నది అని అంటారు గదా-పైకి పూజ్యులుగా పూజింపబడుతూ లోపల కృత్రిమాలు ఇట్లా జరుగుతుంటే ఇది ఎట్లాంటి సంస్కారం అనుకోవాలి? రెండూ ఒకేసారి జరిగేటప్పుడు పూర్వజన్మలో ఒక మంచీ, ఒక చెడూ కలిపి ఒకేసారి చేసి ఉంటాడా?"

1842. "ఒక వ్యక్తిని ఒక చేత్తో పూజిస్తూ ఒక చేత్తో కొట్టి చంపేస్తారనుకోండి-వచ్చే జన్మలో ఈ సంస్కారం ఏ రూపంలో అనుభవానికి వస్తుంది? బహుశా మీరనుకునే జ్ఞానులనిపించుకుంటూ అజ్ఞానపు పనులు చేసేవారిలాగ పుడతారంటారా?"

1843. 'తొలి జన్మలో పాపంగానీ పుణ్యంగానీ చెయ్యడానికి కారణం ఎవరు?'

"శక్తి, భగవంతుడు, మూలం, దైవం, ప్రేరణ, స్వభావం, సహజం-ఏదయినా అనూ. (అదే కదా? మరి నీ కర్మ అంటూ ఏమున్నదీ?)"

1844. "ఏదీ నువ్వు చెయ్యలేనప్పుడు ఏదో ఒక శక్తి నిన్ను నడుపుతున్నప్పుడు ఇంకా నీకు జన్మల గురించి ఆలోచన దేనికీ?"

1845. "జన్మ ఇచ్చినవాడు రాహిత్యం చెయ్యడూ? జన్మ ఎవరూ ఇవ్వలేదు. జన్మకు కారణం మనమే అనుకున్నా మన చేతిలో ఉన్నట్లే లేక ఎవరో భగవంతుడున్నాడు, వాడి వల్లనే మనం భూమిమీదకు వచ్చాము - అనుకుంటే ఆ భగవంతుడే కారకుడవుతాడు- జన్మ రాహిత్యానికి కూడా."

1846. "ఆత్మ ఎప్పుడూ అంతటా ఉన్నది అనుకున్నప్పుడు ఆత్మకు లేని జన్మలు 'జీవాత్మా'నికి ఎక్కడనుండి వస్తాయి?"

1847. "జన్మలు ఉన్నాయనుకున్నవాడు చావులోంచి పుట్టుకచూస్తాడు. లేవనుకునే వాడు పుట్టుకలోంచి చావు చూస్తాడు."

1848. "సముద్రంలో అలలేచి మళ్ళీ కలిసిపోయినట్లే మీ జన్మలూనూ, నా సంకల్పంలో మీరు జన్మ ఎత్తి నాలోనే లయమవుతారు."

# గురువు

1849. "అవివేకులను గురించి మాట్లాడేవాడు కూడా అవివేకే."

1850. 'మా గురువుగారి కట్టుదిట్టాలకూ, యమనియమాలకూ తట్టుకోలేము'- అని ఒకావిడ.

"ఆ నియమాలన్నీ ఇతర్లకే - తనకు కాదు."

1851. "వినే స్వభావం ఉంటే ఎవరు చెప్పినా వినవచ్చుగా? వినటం వేరు - నమ్మటం వేరు - ఆచరించటం వేరు."

1852. "ప్రపంచంలో సులభమయింది - అదే నాయనా - ఇతర్లకు చెప్పటం."

1853. "తెలియనిది తెలియజెప్పేది గురువు."

1854. "గురుఃబ్రహ్మ - అన్న తరువాత ఇంతమంది గురువులూ, ఇన్ని మంత్రాలూ అనవసరం. మీ గురువుగారి దగ్గరకు పోయి నమస్కారం చేసి, ఆయన చెప్పినట్లు చెయ్యి -"

1855. "గురువునకూ - ఇష్టదైవానికీ తేడా లేదని నా ఉద్దేశం."

1856. "నీకు లక్ష్యం ఎక్కడ ఉంటుందో అదే గురువు."

1857. "నా దృష్టిలో గురువు అంటే - వాడు తప్ప మరో దైవం లేడనే."

# సృష్టి

1858. తనను కూడా రానివ్వని కారు ప్రయాణం వింతలు చెపుతూంటే గోపాలకృష్ణ అమ్మతో -

'పిల్లికి చెర్లాటం, ఎలుకకు ప్రాణ సంకటం.'

"సృష్టంతా అదే."

1859. సుబ్బారావు అన్నయ్య తెచ్చిన వైకుంఠపాళిపటాన్ని చూస్తూ అమ్మ అన్నారు-

"మంచీ - చెడూ ఈ ద్వంద్వాలు లేకపోతే ఏముంది? చెడు లేకపోతే మంచీ లేదు. మంచి లేకపోతే చెడూ లేదు. ఈ మంచీ చెడూ నా దృష్టిలో లేవు. నా దృష్టిలో హెచ్చూ తగ్గూ మాత్రమే. ఒకటే అయితే ద్వంద్వాలలోని ఆనందం ఏమి తెలుస్తుంది? ఈ పటంలో ఈ నిచ్చెనలకు ఇంత విలువ ఎందుకంటే ప్రక్కనే పాములు ఉన్నాయి కనుక."

1860. "కాయ ఉంటే కోసేది ఉంటుంది."

1861. "జనన మరణాలు అనుక్షణమూ జరుగుతూనే ఉన్నాయి."

1862. "అసలు వ్యష్టిత్వం లేకపోతే సృష్టి ఏముంది? అంతా సమంగా ఉంటే వాడు అట్లా పడి ఉండవలసిందే. భిన్నత్వం లేనిదే సృష్టే లేదు. గారెలు చేయవలసి వచ్చినప్పుడు మినప్పప్పులో పప్పు అంత ఉప్పు పోస్తే రుచి ఏమున్నది? దానికి తగినంత పాళ్ళు వేస్తేనే రుచి."

1863. "అన్నీ అవసరమయినవే సృష్టిలో. అందుకే ఏర్పడ్డాయి. ఏ వస్తువూ చెడ్డది కాదు."

1864. "సృష్టిలో పనికిరాని వస్తువు ఏదీ లేదు. అన్నీ మనకోసమే ఏర్పడ్డాయి. 'ఇది చెత్త - పనికి రాదు' అనుకున్నది కూడా ఒకప్పుడు అవసరమవుతుంది. ఒకప్పుడు ఒకరికి ఒకటి అవసరమయితే అది ఇంకొక సమయంలో మరొకరికి అవసరమవుతంది. అన్నీ పనికి వచ్చేవే."

1865. 'ఇంతకీ వాడి ఆరోగ్యం చెడిపోవటానికి కారణం ఆ పాడు త్రాగుడేనేమ్మా-' అని ఒక అక్కయ్య అన్నది.

"వాడి ఆరోగ్యం చెడటానికి కేవలం త్రాగుడే కారణం అని నేను అనను. ప్రపంచంలో ఏ వస్తువూ చెడ్డది కాదు. అన్నీ అవసరమయ్యే ఏర్పడ్డాయి. అయితే ఆ వస్తువులూ సమయాన్ని బట్టి పరిమితంగా ఉపయోగించే వేళలున్నాయి. విషం ఉన్నదనుకో అమ్మా - ప్రాణం పోయే ఒకానొక పరిస్థితిలో ఒక చుక్క అది విషమయినా అమృతంలా పని చేస్తుంది. అదే ఎక్కువయితే విషమే అవుతుంది. ఉప్పు రుచి కోసం ఉపయోగించే దని మోతాదుకు మించి వేసుకోము కదా. ఏదైనా అంతే. అన్నీ అవసరమైనవే. సృష్టిలో అక్కరలేనివి ఏం లేదు.

1866. "అంతా మనదే అనే భావం ఉంటుంది. కానీ మనదేదీ లేదు."

1867. "స్వార్థం లేకుండా ఏది ఉన్నది? అంతా స్వార్థంతోనే ఉన్నది."

1868. "భిన్నత్వం లేనిది సృష్టేలేదు."

1869. "మంచి చెడ్డల వివరణ ఎట్లా? అది కూడా ఇష్టాయిష్టాల మీద ఆధార పడి ఉన్నది. ఒకడికి ఇష్టమైనది, ఇంకొకడికి అయిష్టంగా, వాడి మంచి వీడికి చెడుగా కనిపించవచ్చు. అంతేగాదు. ఒకడికే ఆ మంచి చెడ్డలు కూడా పరిస్థితులను బట్టి, కాలాలని బట్టి మారుతూ ఉంటాయి."

1870. "వ్యష్టిత్వం లేకపోతే సృష్టి ఏముందీ?"

1871. "రెండూ ఆ దైవమే అయినా రెండయితే గానీ సృష్టి నడవదు."

1872. "నడక అంటే ఒక పాదం ముందూ, ఒక పాదం వెనుకా కదూ?"

1873. "ద్వంద్వాలే సృష్టి కాధారం."

1874. "ద్వంద్వార్థ డిండిమమే ప్రపంచం."

1875. ఆ రోజు ఆ ఆటలోనే అమ్మ ఒక నిచ్చెన ఎక్కకుండా, ఒక పామయినా కరువకుండా తాపీగా 'పరమపదసోపానం' అన్న అక్షరమాలలోకి అడుగుపెట్టారు. కానీ ఆ స్థితి అంత తృప్తికరంగా లేదు కాబోలు. ఆ

భావం ధ్వనింపచేస్తూ అన్నారు -

"పండిన తర్వాత ఏముందీ? పండితే గవ్వలు చేతికివ్వరుగా? నా ఆట ఆగిపోతుంది. పండక పోయిన బావుండేదీ. నిచ్చెన ఎక్కడం, పాము కరవటం, ఒక సుఖం, ఒక దుఃఖం . . . ఈ ద్వంద్వం ఉండేటప్పటికి ఎంత బాగుంది. ఎప్పుడైనా అంతేగా? ఒక సుఖం ప్రక్కన ఒక బాధ దాగి ఉన్నది.

ఈ పటం ఎవరు చిత్రించారో కానీ జీవితమంతా ఇందులోనే చూపించారు. ఎంత తమాషా ఉన్నదో చూడు - నిచ్చెన ప్రక్కనే పాములు. కష్టసుఖాల కలయికలా -"

1876. "విరామం లేనది రామం."

'దేనికి విరామం లేదు?'

"సృష్టికి లేదు. కదలికకు లేదు. విరామం లేకుండా జరుగుతున్న పనెల్లా రాముడే. మనలోని ఉచ్ఛ్వాస నిశ్వాసాలు విరామం లేకుండా ఉన్నాయి. వ్యష్టిలో గానీ సమిష్టిలో గానీ విరామం లేకుండా ఉండే ప్రతి ఒక్కటీ రామమే."

1877. ఒకరి ప్రశ్న : సృష్టి ఏమిటంటారు?

అమ్మ : సృష్టి ఏమిటనేది ఏముంది? సృష్టి సృష్టే. అనుక్షణం జరుగుతూనే ఉన్నది.

1878. "సృష్టి అనాది-నాది. ఎవరిదో కాదు నాదే."

1879. "రూపం లేనిది రూపం ధరించటమే సృష్టి."

1880. ఒకరు : భగవంతుడు సృష్టి ఎందుకు చేసాడు?

అమ్మ: సృష్టే భగవంతుడు కనుక.

ఒకరు : సృష్టికి నాశనం లేదా?

అమ్మ : నా దృష్టిలో లేదు. సృష్టికి రూపాంతరం తప్ప నాశనం లేదు.

1881. "రాగద్వేషాలకు ఆధారమయినా వాడివల్లే సృష్టి జరిగింది--"

1882. "సృష్టికి పూర్వం లేదు."

1883. "సృష్టితోనే సృష్టి అయింది."

1884. "సృష్టికి ఆద్యాంతాలు లేవు."

1885. "ఉన్న స్థితి యేదో అందరికీ ఒకటిగానే ఉంది."

'అది యెట్లా అమ్మా- ఎవరి సంస్కారం కొద్దీ వారికి కదా?'

"అప్పుడు కరుణ, అనుగ్రహం అంటే ఏముంది యింక?"

'అనుగ్రహమయితే అందరికీ ఒకటిగా అనుగ్రహించకూడదూ?'

"భగవంతుడు రచయతా, నాటకప్రదర్శకుడూ వంటివాడు. నాటకానికి పాత్రలంటూ ఉంటేనే కదా నాటకం యొక్క అందం? ఏ పాత్రకు ఆ పాత్రే అవసరం. అన్నీ పాత్రలమీదా అనుగ్రహం ఒకటే."

'ఈ పాత్ర మాత్రం నీకెందుకమ్మా?'

"ప్రపంచానికి ఈ పాత్ర అవసరం. ఈ పాత్ర యెవరు తీసుకున్నా అనుభవించవలసినదే కదా?"

1886. "ఇక్కడి మహిమలేమున్నాయి నాన్నా? ప్రపంచమే మహిమ గదా! అంతకంటే మహిమ ఏముంది? అందులోని భాగాలే కదా ఇవన్నీ? ఇందులో ఒకడి గొప్పతనం లేదు. సృష్టే మహిమ. అది అనుక్షణం జరుగుతూనే ఉన్నది. అందులోవేగా అన్ని భాగాలు?"

1887. "సూదీ దారం ఉన్నది. దారం ఒక్కటే. ఆ రంధ్రంలో గుచ్చినప్పుడు అది రెండు పోగులుగా కనిపిస్తుంది. చూడటానికి రెండు కానీ పోగు ఒకటే. ఈ అడ్డం ఉంచింది నేనే. రెండుగా కనబడటానికి కారణం నేనే అయినప్పుడు నేను మిమ్మల్ని ఎట్లా అంటాను? మీరు మంచికీ చెడుకీ దేనికీ కర్తలు కారు."

1888. 'మీరు కారణ జన్ములు.'

"నాతో పాటు వచ్చిన మీరందరూ కారణజన్ములే. కొలిచేవాడి కోసం కొలవాల్సినవాళ్ళను పుట్టించుకున్నాడు."

1889. "సృష్టికంటే మహిమ ఏముంది?"

1890. "సృష్టి అవసరమా? సహజమా? లీలా? ఎవరికి అవసరం? ఎందుకు అవసరం? లీల అంటావా? అదంతా తానే అయినప్పుడు లీల ఏమిటి? సహజం అంటాను."

1891. ఒకరు : సృష్టి ప్రమాదం.

అమ్మ : తెలియకపోవటమే ప్రమాదం.

1892. "జగత్తు ఎప్పుడూ ఉంటుంది. వచ్చేవాడు వస్తుంటాడు. పోయేవాడు పోతుంటాడు."

1893. "సృష్టికంటే విశేషము లేదు."

1894. "అంతా సమష్టే. వ్యష్టిగా మనకు తట్టుతుంది."

1895. "సృష్టే ప్రేమమయం."

1896. "సృష్టంటేనే మాతృత్వం."

'సృష్టా మాతృత్వం? - సృష్టికాధారమా?'

"నా దృష్టిలో యెలాగయినా ఒకటే."

1897. "అంతా మనకోసం మనం చేసుకుంటున్నాం. మనకోసం కాదు అనుకున్నప్పుడు అడుగు తీసి అడుగు పెట్టలేము. ఏది చేసినా మన కోసమే."

అమ్మ చెప్పటం ఆపగానే వెంటనే అన్నాడు గోపాల్ 'అవును, దానితో కంకర్ అయ్యాం.'

అమ్మ : ఇప్పటికి పుట్టలేదు నాతో కంకర్ అయ్యేవాళ్ళు. అంతా పేచే.

1898. "భగవంతుని చేత కల్పించబడిన సృష్టి భగవంతుడే."

1899. "సృష్టి అంటే ఏర్పడటం."

2000. "ద్వంద్వం లేకపోతే ప్రపంచమే లేదు."

2001. "జగత్తే తల్లి స్వరూపం."

2002. భరద్వాజ : అమ్మా - రాత్రి డబ్బాలోకి పంచదార రావటం లాంటివి ఎందుకు జరుగుతుంటాయమ్మా?

అమ్మ : (తన పాదాల మీది మందార పువ్వు తీసుకొని) దీని నిర్మాణం కంటే అది గొప్పదా? మరీ ఆ పుప్పొడీ, ఆ చివర ఎఱుపూ ఎంత బాగున్నాయో చూడు -

2003. ఒకరు : సృష్టి ఎందుకు ఏర్పడింది?

అమ్మ : నిప్పు ఎందుకు కాలుతుంది నాన్నా?

ఒకరు : దాని స్వభావం అది.

అమ్మ : ఇదీ అంతే నాన్నా.

2004. "హెచ్చు తగ్గులు లేనిది సృష్టి ఏముంది?"

2005. ఒకరు : చివరకు ఇదంతా ఏమౌతుందమ్మా?

అమ్మ : దేనికి చివర? ఎక్కడికి చివర? సృష్టికి ఆద్యంతాలు లేవు.

2006. "కల్లోలం కాకపోతే అసలు సముద్రమే కాదు."

# భగవంతుడు

2007. 'మా తల్లీ, సిరిగిరి సుబ్బారావు - వాయింపుమా మురళి - అంటే మురళి వినిపించిందట. ఎలాగ 'వినిపడిందమ్మా?'

"ఏ శక్తి అయితే మీ చేత మొదటిమాట అనిపించిందో ఆ శక్తే వినిపించి ఉంటుంది"

2008. 'అన్నదాన్ని గురించి ఆలోచన ఎందుకు? - అన్నవాక్యం వినపడిందమ్మా. ఎవరిమాట అన్నదీ? - అని వెతికినా ఎవరూ కనపడలేదు.'

"ఏ శక్తి అయితే మీ చేత అనిపించిందో ఆ శక్తే మీకు వినిపించిందిలెండి."

2009. " 'నాకు అంటూ ఉన్నదే వాడు ఇచ్చింది' అని ఒకడు. 'వాడు ఇచ్చిందే నాకు అంటూ ఉన్నది' అని వేరొకడు."

2010. "మంచికేదో చెడుకూ అదే కారణం."

2011. "కాలువనిండా నీరు ఉన్నా త్రాగటానికి రేవు ఎట్లా అవసరమో.... అట్లాగే సర్వత్రా ఉన్న దేవుడిని తెలుసుకోవటానికి దేవాలయం అవసరమయింది."

2012. "రేకలన్నీ పువ్వులో భాగాలయినట్లే మనమందరమూ వాడిలో వాళ్ళమే."

2013. "ఆత్మ ఎక్కడ ఉందంటే అంతటా నిండి ఉండి శక్తి రూపమై అన్ని రూపాలలోనూ ఉంది. ఎవడికి ఎక్కడ కనపడితే అక్కడ చూస్తాడు."

2014. 'అక్కడ దేవుడెట్లా ఉంటాడమ్మా?'

"ఎట్లా చూచేవాళ్ళకు అట్లా ఉంటాడు. ఆ చూపు ఇవ్వలసింది కూడా వాడే."

2015. "మహత్యాల వల్ల దైవం అనుకోవటం వేరు. ఏమీ లేనిచోటా సామాన్యంగా ఉన్నచోటా గుర్తించాలి."

2016. "అందరినీ రక్షించేదీ ఒకడే."

2017. వైకుంఠపాళి ఆట ఆడుతున్నారు అమ్మ, శేషు, శాస్త్రి, భవాని. అమ్మ

మొదటిసారి వేసిన పందేనికే శాస్త్రి అమ్మ పావు కదిలించబోతుంటే భవాని అన్నది 'అమ్మ దేముడి పందెం వెయ్యాలి.'

వెంటనే అమ్మ: "దేముడి పందెం ఏముందీ? దేముడే పందేం వేస్తుంటే."

2018. "జగత్తే తానైనప్పుడు జగత్తులో భాగాలు తనవికాకుండా యెట్లా ఉంటాయ్."

2019. రుక్మిణక్కయ్య : దేవుడికి కూడా కోపం వస్తుందా?

అమ్మ : వాడికి లేకపోతే నీకు ఎక్కడనుండి వచ్చింది?

2020. "గుణాలకు ఆధారం భగవంతుడయినప్పుడు (భగవంతుడు) గుణము ఎందుకు కాడు?"

2021. "చిక్కులు భగవంతుడు తప్ప ఎవరూ పెట్టరు."

2022. "మలచటం చేతయినవాడే మరపిస్తాడు."

2023. "లౌకిక విషయాలకు ఏశక్తి సహాయపడుతుందో పరమార్థ స్థితిని కూడా అదే ఇస్తుంది."

2024. "నొప్పి యిచ్చింది కూడా వాడేననే భావం కలగటమూ నివారణే."

2025. "ప్రసాదం అన్నాక ఏదైనా ప్రసాదమే. చివాట్లు పెట్టినా సరే."

2026. "సత్యమంతా భగవంతుడి స్వరూపం అనుకున్నా అసత్యమూ వాడిది కాకుండా పోలేదు."

2027. "స్వభావమనూ, ఒప్పుకుంటారు. స్వభావమట. ఎవరి స్వభావమూ? సృష్టి స్వభావం అనూ-"

2028. "మిరపకాయకు కారం స్వభావం అంటాడు నాస్తికుడు. మిరపకాయలో కారం పెట్టేదు అంటాడు ఆస్తికుడు."

2029. "భగవంతుడు అన్నది నువ్వు పెట్టిన పేరు కానీ ఆ శక్తికి స్త్రీ పురుష భేదం లేదు నాన్నా - దాన్ని భగవంతుడనే కాదు, ఇంకా ఏ పేరైనా పెట్టు, ఉన్నది ఒక్కటే. దాన్నే సైన్సు స్వభావం అంటే అధ్యాత్మికం దైవం అంటుంది."

2030. "భగవంతుడి సృష్టిలో భగవంతుడికి ఇష్టం కానిది యేముంటై? ఆ సందేహ నివారణకే వినాయకచవితినాడు వినాయకుని అన్నిరకాల పత్రితో పూజించమంటారు. ఆ సందేహం పోవటానికే ఆవుపేడ గౌరీదేవి అయింది."

2031. "రక్షణకూ శిక్షణకూ, చీకటి వెలుగులకూ, మంచి చెడులకూ అన్నిటికీ అమ్మే కారణం."

2032. "ప్రేమా భక్తీ రెండూ ఒకటే. అమ్మ బిడ్డలను ప్రేమిస్తే మమకారం అన్నారు. పెద్దలను ప్రేమిస్తే గౌరవమన్నారు. అదే భగవంతుడిని ప్రేమిస్తే భక్తి అన్నారు."

2033. "మీరంతా నా అవయవాలని అనుకుంటున్నాను. చెయ్యి నొప్పి కాలికి తెలియదు. కాలినొప్పి కన్నుకు తెలియదు. కానీ అన్నిటి నొప్పీ నాకు తెలుస్తుంది."

2034. 'దేవుడు ఎవరికీ టచ్ కాకుండా ఎక్కడో దూరంగా ఉంటాడని అంటారుగా?'

"దేవుడికి టచ్ ఉన్నదీ లేనిదీ వీడికి తెలిస్తే కదా? దేవుడితో టచ్ ఉన్నవాడు దేవుడికి టచ్ లేదని చెప్పడు కదా?"

'.........................'

"దేవుడికి మనతో టచ్ ఉంది కానీ దేవుడితో మనకి టచ్ లేదు."

2035. "పక్షులలో గరుత్మంతుడినీ, పాములలో సుబ్రహ్మణ్యేశ్వరస్వామినీ నేనే అని చెప్పుకోవటంలో వాడి ఉద్దేశ్యం అన్నింట్లో నేను ఉన్నానని చెప్పుకోవటం కోసమే. సాటి మానవుడినే సమానంగా చూడలేని మనం ఒక దుష్ట జంతువును చూడగలమా? అందుకని అందులో సుబ్రహ్మణ్యేశ్వరస్వామిని అన్నాడు. అంటే తతిమావి కాదని కాదు. నిగ్రహం కోసం విగ్రహారాధన ఎట్లాంటిదో అలాగ. అన్నింటిలో, సర్వత్రా వాడు ఉన్నాడని తెలుసుకోవటం కోసం."

2036. "స్నేహితుడంటే ఒక్కమాటలో మారిపోయేవాడు కాదు.ఒక మాటతో దగ్గర అయ్యేవాడూ,ఇంకోమాటతో దూరం అయ్యేవాడూ కాదు; ఏ పరిస్థితుల్లో నైనా నిన్ను వదలకుండా ఉండేవాడు."

2037. "పవిత్రులూ, అపవిత్రులూ అంటూ లేరు నాయనా -అమ్మకు అంతా పవిత్రులే."

2038. "దైవసన్నిధికి ఒక సమయమంటూ యేమున్నది? అమ్మ అడ్డులేనిది."

2039. "ఏం చేసినా మారనిదీ చెదరనిదీ ఎక్కడుంటే - అదే తల్లి స్వరూపం."

2040. "నిర్వికారం మారనిదీ; ఆకారం మారేదీను."

2041 "బ్రహ్మ చైతన్యం, సరస్వతి తెలివి."

2042. "ఎప్పుడూ కావాలనిపించేదే చల్లదనం. ఎప్పుడు ఏది కావాలో అదిచ్చేదే."

2043. "ఎంతెంత లైనా అనంతమ్మలోనివారే."

2044. "ఏ పాదానికి నమస్కరించినా ఈ పాదాలకే అందుతాయి."

2045. "సర్వత్రా అమ్మ ఉన్నదనుకుంటే తలుపులెందుకోయ్?"

2046. "తన ఇష్టప్రకారమే ఇతరులను నడిపిస్తూ ఇతరుల ఇష్ట ప్రకారమే తాను నడుస్తున్నట్లు అనిపింపజేసేది అమ్మ."

2047. 'అందరమూ అన్నిచోట్ల పుట్టి అందరం ఆ ఒక్కమ్మనే అందరమ్మగా గుర్తించటం విశేషం.'

"విశేషం కాదు పరమపదమంటే అదే."

2048. "దుర్మార్గానగాని, భయానగాని ఏవిధంగానైనా ఒకసారి చూచాక వద్దను కున్నా మరపు ఎక్కడైతే రాదో అదే భగవంతుడు."

2049. "తెలివితో తెలుసుకుండేది తెలివి."

2050. "చూచేది కన్నులయినా, గుర్తించేది గుర్తుగా?"

2051. "రెండులేనివాడూ రెండుఅయినవాడూ భగవంతుడు."

2052. బాల్జీ అన్నాడు -

'దేవుడితో వ్యవహారం కత్తిమీద సాములాంటిది.'

అమ్మ : అంటే దేవుడితో కొంత వ్యవహారం లేకుండా కూడా ఉంటున్న దన్నమాటా?

2053. "సృష్టిని ఆధ్యాత్మికం 'దైవం' అంటే సైన్సు 'స్వభావం' అంటుంది."

2054. "ఉన్న ఆ ఒక్కటి అర్థం కానంతవరకు రెండుగానే కనపడుతుంది."

2055. "బ్రహ్మ అంటే చైతన్యం. విష్ణు అంటే పోషణం. మహేశ్వరుడు అంటే లయం."

2056. "మీరు భూమి మీదకు రావటానికి ఏది కారణమో అదే అన్నీ చేయిస్తుంది. అదే అన్నింటికీ కారణం."

2057. "సర్వత్రా సమమైన మమకారం ఉంటే వికారానికి తావు లేదు నాయనా."

2058. "సర్వత్రా ఏ శక్తి ఉన్నదో అదే భగవంతుడు."

2059. "అంతా అయినవాడూ అర్థంకానివాడూ భగవంతుడు."

2060. "భూత భవిష్యత్తులో తెలిసినవాడికి అంతా వర్తమానమే."

2061. "కర్త ద్వారానే కర్మ ఏర్పడ్డది."

2062. "భగవంతుడంటే చైతన్యం."

2063. "సర్వం తానైనవాడే స్వార్థరహితుడు."

2064. 'నీవు మహాతల్లివి. నా కష్టసుఖాలు చెప్పుకోవాలనిపిస్తున్నది.'

"ఎవరికైనా తీర్చవలసినవారొకరే. వారితో చెప్పుకో."

# ఆనందం

2065. "ప్రశాంతంగా ఉండటమా? అది వస్తే ఇంకా ఏముంది?(నవ్వి) అది ఏ బజార్లో అమ్ముతున్నారో తెలిస్తే బాగుండును నాన్నా, అందరం వెళ్ళి కొనుక్కునేవాళ్ళం. అసలు ప్రపంచానికే లేదు ప్రశాంతత. ఒకరి కొకరకంగా ప్రశాంతత లేకపోతే, మరొకరికి ఇంకొకరకంగా లేకపోతుంది."

2066. 'ఈ తత్త్వంతో ఎక్కడున్నా నీవు సుఖపడేదేమున్నదమ్మా?'

"పడేదంతా సుఖమే నాయనా."

2067. "ఎవరికి ఎక్కడ ఇష్టమైతే అక్కడ శాంతంగా ఉంటారు. అయిష్టత అయినచోట కోపంగా ఉంటారు. నిజంగా కోపం లేనివాడు ఎక్కడా కోపం లేకుండానే ఉంటాడు."

2068. "తృప్తే ముక్తి."

2069. "ఇది కావాలని లేకపోవటమే ఆనందం."

2070. 'బ్రహ్మానందం - అంటున్నారు ప్రతీదానికీ; మీరేమంటారమ్మా?'

"తనకు నచ్చింది ఆనందం. ఆ ఆనందాన్నే బ్రహ్మానందం అని ప్రతిదానికీ వాడుతున్నాము. అయినా అన్నీ బ్రహ్మానందంలోనుండి వచ్చినవే. కనుక ప్రతీదానికి బ్రహ్మానందం అనే ముక్క తెలియకుండానే పడుతుంది. ఒకడు దొంగతనం చేసి తాను అనుకున్నట్టుగా జరిగితే బ్రహ్మానందంగా ఉందంటాడు. తనకు కష్టమైనవాడిని కొట్టికూడా బ్రహ్మానందాన్ని అనుభవించానంటాడు. తన నోటికి కొంచెం రుచిగల కూర తగిలినా 'బ్రహ్మానందంగా ఉంది కూర' అంటాడు ... సర్వం బ్రహ్మానందమేగా? సర్వకాలం కూడా బ్రహ్మానందం కావద్దూ? సర్వకాలం బ్రహ్మానందమైనదే బ్రహ్మానందం తాత్కాలికంగా కలిగే ఆనందం దాని ఛాయ."

2071. "అదే మరి. తృప్తి ఆనందంలో భాగం, అసంతృప్తి దుఃఖంలో భాగం. ఈ రెంటికీ మూలం ఒకటేననీ, ఈ రెండూ ఒకటేననీ గుర్తించటం

బ్రహ్మానందం."

2072. 'ఆనందమంటే ఒక్క బ్రహ్మానందమేనని పెద్దలు చెబుతారు అమ్మా.'

"ఈ ద్వంద్వాలన్నీ ఆ బ్రహ్మలో భాగాలే గదా? ఈ ద్వంద్వాలు ఆ బ్రహ్మగా గుర్తించినది బ్రహ్మానందం."

2073. "బావినిండా ఉన్న నీళ్ళు బ్రహ్మానందమనుకోండి. మీరు చేద వేసి లాగుతున్నారే ఆ నీరు బ్రహ్మానందంలో భాగాలేగా? భాగాలుగా తీస్తున్నారు గనుక ఒడ్డునుండి మళ్ళీ మళ్ళీ తోడాల్సి వస్తున్నది. బావిలోనే దిగగల వాడికీ బావిలోనే ఉండే వాడికీ ఆ బావిలో నీరే తానైన వాడికీ తేడా ఎంతో బ్రహ్మానందానికి ఆనందానికి తేడా అంతే."

2074. "ఎట్లా ఉన్నా బాగున్నదే బాగుండటం అంటే.

తనకు బాగుంటే బాగుండటం కాదు."

2075. "సత్తూ చిత్తూ ఒకటే అయినప్పుడు ఆనందం."

2076. "ఎన్ని వచ్చినా చెదరనిదీ, శాశ్వతమయినదీ, ఒడుదుడుకులు లేనిదీ ఆనందం."

2077. "శరీరం ఉండగా సుగతి గుర్తిస్తేనే సుగతి ."

2078. "అనిపించినదే హాయి, కలిగించినదే సుగతి."

2079. ఒకరు : నాకు సందేశం ఏమైనా ఇవ్వమ్మా-

అమ్మ: నా చేత దైవం ఏది చేయిస్తే అది చేస్తున్నాను - అనుకో నాయనా. అంతకంటే సందేశం ఏముంది. - నీకే కాదు ఎవరికైనా.

2080. "సుఖానికి మార్గం ఒకటే - ఏది చేసినా దైవం చేశాడనుకోవటమే."

2081. "ఏ మార్గాన నడిచినా వాడే నడిపిస్తున్నాడనుకోవటమే సన్మార్గం."

# విషయసూచిక - మూడవభాగము

# అమ్మను గురించి

2082. 'అమ్మా - నువ్వు ఎక్కువ పట్టుచీరెలే కడతావు కదూ?'

"ఏం లేదురా. పెట్టినవి ఉంటే కట్టుకున్నా. గోనె పట్టా అయినా కట్టుకోవచ్చు. ఏదీ లేకుండానూ ఉండొచ్చు."

2083. ఒకసారి ఎవరో 30 గజాల చీర పెట్టారు. పమిట మామూలుగానే వచ్చింది.

2084. "భోజనం మానేసినవారు ఉండవచ్చు గాని, ఆహారం మానేయలేరు. ఆకులో, గాలో, ద్రవపదార్థమో ఏదో ఒకటి."

2085. అమ్మకు కాళ్ళమీద, చేతుల మీద దురదగుండాకుతో పూజ చేసారు ఒకాయన.

2086. 'నువ్వేం తింటున్నావమ్మా?'

"ఆ మాట రానివ్వద్దు. సర్వం తింటున్నా. ఈ శరీరానికి పడేవి, అవసరమైనవి తీసుకుంటున్నా."

2087. నిన్న శ్రీధరరావుగారు అన్నారు 'యింత పర్సెంటు షుగర్ ఉండి ఆమె ఎట్లా కూర్చుంటోంది?' అని.

2088. "జబ్బు వల్లే ప్రాణం పోయేటట్టయితే నేనీ మంచం మీద. ఉండటానికి వీలు లేదు."

2089. 'నువ్వు ఎపుడైనా బడికి వెళ్ళావా అమ్మా?'

"చచ్చిపోతానని బడికి పంపలా మా నాన్న."

2090. 'పుస్తకం మొత్తం చదివేవా?'

"మొదలు, మధ్య, చివర. పుస్తకం మొత్తం చదవను ఓపిక లేదు."

2091. "నీళ్ళా? కావలసిన నీళ్ళు వాగునుండే తెచ్చుకొనేదాన్ని."

2092. "ఎవరేనా బిచ్చగాళ్ళు వస్తే వాళ్ళ పుట్టు పూర్వోత్తరాలు కనుక్కు వచ్చేదాన్ని."

2093. "నేను కేవలం నా అవసరం మనిషిని."

2094. "నేనేం జపాలు, తపాలు, ఏ సాధనలూ చెయ్యలేదు."

2095. "నేను ఈ తపస్సూ, అదేం చెయ్యలా."

2096. "నాకు శాస్త్రపరిచయం లేదు నాన్నా. నేను ఏది చెప్పినా నా అనుభవంలోదే చెబుతా."

2097. "ఆ శాస్త్రాల్లాగే చెప్పాల్సిన అవసరం లేదు."

2098. "నా దృష్టిలో అంతా మంచివాళ్ళే."

2099. 'నువ్వు పాడటం మానేశావుగా?' అని రామకృష్ణ.
"నువ్వు వచ్చిన తర్వాత కూడా పాడేను. రాజు విన్నాడు. భాస్కరావు విన్నాడు. 56లో ఆపేశా పాడటం."

2100. "ఆఁ? మంచమ్మనా? మంచి అంటేనే మాయ."

2101. "అన్నిటికీ సరేనంటే సరిపోతుంది. సరే అస్త్రం."

2102. "అమ్మ మాటలు అమ్మ భావాలే."

2103. "అనగా అనగా ఒక రాజు, వినగా వినగా ఒక రాణి అనే కంటే చూడగా చూడగా ఒక రాజు అంటే బావుంటుంది."

2104. "ఎదురుగా వున్నవాడిని 'అన్నం తిన్నావా?' అని అడగవచ్చు, చాటుగా వున్నవాడికి భార్యచేత పెట్టించవచ్చు. కానీ క్రియలో ఇది కనిపిస్తుంది. అది కనిపించటం లేదు."

2105. "రవి కొకసారి మలేరియా వచ్చింది. 105° దాటింది. గంధం చెక్క, తుమ్మ చెక్క, వేపచెక్క మూడూ కలిపి కషాయం కాచి తాగించా. ఇంకేం లేదు. నార్మల్ కొచ్చింది."

2106. "చర్చేం లేదు. సరే ననటమే. అనుకున్నవి చెప్పుకోగలం. చెప్పేది చేయలేం. జరిగేదాన్ని మార్చలేం."

2107. "నా దగ్గరే ఉండాలనుందా?
నీ పిల్లల్ని వదిలి ఉండగలిగితే ఉందువుగానిలే. ఎప్పుడూ నా దగ్గరుండ లేవు. నన్ను నీ దగ్గరుంచుకో."

2108. "కొద్దిరోజులు పోయిన తర్వాత ఎవరికి వారికి సమాధానాలు వస్తాయి."

2109. "గుడ్డియెద్దుని 157 రూపాయలకమ్మారు. ఆ డబ్బు నాచేతి కిచ్చారు. ఎప్పుడూ మాట్లాడనిదాన్ని, మనిషైనా మన కుపయోగించనివాడు-యింతే కదా, అన్నాను."

2110. "పిడకల వాసన రాకుండా కాఫీ చెయ్యాలా? ఎఱ్ర నిప్పు అయాక పెడితేసరి."

2111. "నాకు ఆటలంటే చాలా ఇష్టం. ఎక్కడన్నా ఆటల పోటీలు, జరుగుతుంటే గోడలెక్కి, చెట్లెక్కి చూసేదాన్ని."

2112. 'నీకు అరవం వచ్చా?'

"ఏదీ రాదు. అన్నీ వచ్చు."

2113. "వాళ్ళలా ఎందుకన్నారూ? వీళ్ళిలా ఎలాగున్నారూ? - అంటే, అట్లాంటివి నాకు తెలియదు. నన్నడగవద్దు. ఒక విషయం తీసుకొని మాట్లాడుతా గానీ వ్యక్తుల్ని గురించి మాట్లాడను."

2114. "ఒకసారి యెల్లమందా నేనూ జొన్నల్లో పోటేస్తున్నాం. పాటలు కాదూ పాడూ కాదూ; వాడు నామం చేస్తూంటే ఇద్దరం కల్సి నామం చేశాం.

ఇంతలో సుబ్బయ్య వచ్చి ఏదో తప్పు చేసినట్టు 'అమ్మా - ఊరంతా విన్పిస్తోంది. పాడబోకు' అన్నాడు."

2115. "అడగండి. భయం లేదు. నాకు తెలియకపోతే చెప్పి పోతారు. తెల్సిందేదో నేను చెబుతా."

2116. 'అప్పుడు మీరింత స్థాయిలో లేరు.'

"అప్పటి స్థాయికీ ఇప్పటి స్థాయికీ తేడా లేదు. మీ రెంతో నేనంతే. కాకపోతే మెట్లు వేశారు. మెట్లు ఎక్కటానికే కాదు, దిగడానికి కూడా. దిగటం ఎంతో ఎక్కటమూ అంతే నా దృష్టిలో."

2117. 'కనబడుతుందా? నీకు అట్లా అనిపిస్తుందా?'

"కనబడుతున్నది ఉన్నదేగదా అని అనుకుంటాను."

2118. 'అన్నీ తెలిసీ ఏమీ తెలియదంటావు!'

"ఏం తెలుసో తెలియక తెలియదంటున్నా."

2119. 'అమ్మకు రాందేముందీ?'

"ఆడేదంతా ఆటే అయినపుడు రానిదేముంటుందీ?"

2120. "నేనెప్పుడూ ఎవ్వరితో రాజరాజేశ్వరినని గానీ, అవతారాన్ని అని గానీ చెప్పలేదు."

2121. 'మా అమ్మాయికి ఉబ్బసమమ్మా. ఏం చెయ్యమంటారు?'

"అమ్మాయికి ఒక్క ఉబ్బసమే. నాకు ఎన్నో. నేనేం తగ్గిస్తాను?"

2122. 'నీవెందులో ప్రవీణవూ?'

"సర్వ వ్యాధులకు - "

2123. 'అమ్మా ఆపద్బాంధవీ -'

"ఆపదలకు బాంధవిని."

2124. 'అమ్మా - ఎవరో నలుగురు ఆడవాళ్ళు - నెల్లూరుట వస్తున్నారు, బోలెడు సామానుతో.'

"మీరు దిగిన బస్సులోనే దిగేరా?"

'ఆఁ వెనక వస్తున్నారు.'

"చాలా దూరం నుండి వస్తున్నారన్నమాట. పాపం అన్నం తిన్నారో లేదో."

2125. వాళ్ళు ఏకాహం చేస్తుంటే మైకులో విని గొంతులు ఎండినట్లనిపించి బత్తాయి రసం పంపేరు అమ్మ.

2126. అన్నపూర్ణ వచ్చి ఆవుపాలు తెచ్చిస్తే తాగుతూ, "కోటేశ్వర్రావుకు కూడా ఇవ్వు ఆవుపాలు." (కోటేశ్వర రావుకు క్షయ)

2127. 'మీరు దేన్ని గురించి ఆలోచిస్తారూ?'

"భోజనాన్ని గురించి."

2128. టేప్ రికార్డర్ కరెంటు ఆగిపోవడం వల్ల ఆగింది. "ఈలోగా అందరూ వెళ్లి కాఫీలు తాగిరండి" అన్నారు అమ్మ.

2129. 'స్వభావం అంటే ఒప్పుకుంటారు. నీకేమని అనిపిస్తోందమ్మా?'

"నాకు - నువ్వు అన్నం తినలేదు. తినాలనిపిస్తోంది."

2130. "ఎన్ని వేలయితే మనకేం? ఎంత దొరికితే అంతే. లక్షకాయ దొరికిందంటే రెండు లక్షల జనం తినేవాళ్ళుంటారు."

2131. 'స్టడీ సర్కిల్సువల్ల అందరికీ తెలియజేస్తే బాగుంటుంది?'
"తెలపటమేముంది, పొట్టనిండా అన్నం పెట్టడమే, వీడూ వాడూ అనే విచక్షణ లేకుండా."

2132. "పులిహోర పెట్టుకుంటూ వస్తే ఎంత సంతోషంగా వుంటుందీ? పదిలక్షలు పెట్టి భవనం కట్టించినా అంత తృప్తి రాదు."

2133. 'కొందరు అన్నాలు తినకుండా వెళ్ళారమ్మా.'
"లక్షమంది తిన్నదీ, ఒక్కడు తినకుండా వెళ్ళినదీ నాకు సమానం - ఒక్కడు చాలదూ తినకుండా వెళ్ళితే."

2134. భోజనం చేసారా అని అమ్మ అడిగితే, ఆయన లేదన్నాడు.
"చేసిరా, నాన్నా" అంటూ, "చెయ్యనివాడే నా కంటపడతాడు" అన్నారు.

2135. "భోంచేసి వెళ్ళమంటే చెయ్యకుండా వెళ్ళేవా? అపరాధమేముంది? నీ అన్నం అక్కడ లేదు. ఆకలి లేదు. తినలేదు. పోనీ ఇప్పుడు చెయ్యి."

2136. 'అమ్మగారి సిద్ధవాక్కు వినాలండీ. అడిగేవేమీ లేవు.'
"భోజనం చేశావా?"

2137. "ఇంత సొమ్ము ఈ నగలకు పెట్టేకంటే దీనితో ఎంత మంది తింటారు అనిపిస్తుంది."

2138. "మహోదయం నాడు ఇద్దరి స్థలంలో ముగ్గురు కూర్చున్నారు. ఆ రోజు భోజనం పందిరి బాగుంది."

2139. "అందరికీ అందేటట్టు పెట్టండమ్మా."

2140. "పంచిపెట్టని కాడికి ఉండడము దేనికీ?"

2141. 'మనస్సుకు శాంతి కావాలమ్మా - అన్ని విషయాల్లోకి పోకుండా.'

"నాకట్లా ఉండదే. అన్ని విషయాల మీదకి పోతుంది. (పోకపోతే మిమ్మల్నందర్నీ చూడనుగా?)"

2142. "మునిస్వామికి 106 జ్వరం వచ్చింది. తెల్లవారేసరికి స్ఫోటకం పోసింది. నాన్నగారు భయపడి పిల్లల్నటు పోనివ్వలేదు. అప్పుడే అన్నా - మన పిల్లల కొస్తే ఏం చేస్తామని."

2143. 'నా కొడుకు సరిగ్గా చూడడు. మనశ్శాంతి లేదు.'

"ఇక్కడుందటావా నాన్నా? కొడుకులు చూడకపోతే నే చూస్తా."

2144. "చలివేంద్ర పెట్టండర్రా ఏడోమైలు దగ్గర. చెట్లు కూడా లేకపోయె. ఆ ఎండలో పడి వస్తున్నారు. ఎవరు చూస్తారు వాళ్ళని?"

2145. 'అమ్మా. ఆ బాబా రేపల్లె వచ్చారటమ్మా. ఇక్కడికి వస్తారుట.'

"రానీ. అతను వస్తే వాళ్ళమ్మని చూడటానికి వస్తాడు. నేను వెళ్ళితే మా అబ్బాయిని చూడటానికి వెళ్తాను."

2146. "మీకు నా కోసం తహతహ, నాకు మీ కోసం తహతహ. అట్లా ఉండాల్సిందే."

2147. "మనం ఇంకొకళ్ళననవద్దు. అమ్మని గురించి చెప్పుకోవటానికి ఇంకొకళ్ళ ననవలసిన పనిలేదు."

2148. "మీరంతా వైరాగ్యం కోసం వెతుకుతుంటే - నేనింకా కూతుళ్ళూ కొడుకుల్నీ వెతుక్కుంటున్నా."

2149. అమ్మ నల్లక్కయ్యా వాళ్ళకు బట్టలు ఇస్తూ శాయమ్మగారితో -

"నీ బదులు నేనిస్తున్నాను బట్టలు. నీవేం పెట్టలేదే అని బాధపడకు. కాస్సేపు నన్ను శ్రీనివాస్ (శాయమ్మ గారి కొడుకు) అనుకొందూ."

2150. "ఇవ్వాళ్ళ మధుతండ్రి ఆబ్దికం. అన్ని కుటుంబాల వాళ్ళనీ పిలిచిరా. రాఘవయ్యగారిని, తాతగారిని, ఇందిరను, అన్నపూర్ణవాళ్ళను, నాన్నగారిని, మాస్టరుగారు వాళ్ళను, గజేంద్రమ్మను అందరినీ పిలు."

2151. "గొడ్లు ఊరికే ఎప్పుడూ తెంచుకోవు - వాటికి దాహం వేస్తే తప్ప. ముట్టె నేల మీద పెడితే సుస్తీ చేసినట్లు."

2152. "పది ఏళ్ళు పనిచేసింది నాన్నా. పెద్దదైంది. తోలుకుపోతావా అంటే 60 రూపాయలిచ్చి 'అరకేనా దున్నుతుంది' అన్నాడు. ఆ 60రూ. విసిరికొట్టా. దున్నించుకునే మాటయితే మనమే దున్నించుకోలేమూ?"

2153. "కుష్కించి పోయి, వేసిన మేత తినే స్థితిలో కూడా లేదు పిచ్చిముండ . . . నలుపు రంగేసి పోయింది. నాలుగు రోజులుండు. మీ అబ్బాయికో అమ్మాయికో జబ్బు చేస్తే ఉండవూ?"

2154. "ఇంటికి వచ్చిన గొడ్డును పంపించలా. ఇంట్లో పుట్టిన బిడ్డకు నాలుగేళ్ళు ఉద్యోగం లేకపోతే ఎక్కడికన్నా పంపిస్తున్నామా?"

2155. కృష్ణవేణమ్మ : పందిపిల్లలతో అమ్మ ఆడుకునేది. ఇంటి చుట్టూ వుండేవి.

అమ్మ : వాటన్నిటినీ వెళ్ళగొట్టి మీరొచ్చారుగా?

2156. 'మీకు వచ్చే ఆలోచనలు ఎలాంటివి?'

"మీకు పెట్టుకోవాలనిపించేటివి."

2157. 'మీకు కోరికలు లేవా?'

"ఎందుకు లేవూ? మీకు పెట్టుకోవాలనుకోవటం కోరికే గదా?"

2158. 'మీకు అందరూ సమానమా?'

"పెట్టులో లోటు ఉన్నా, ప్రేమలో లోటు లేదు. నాకు బిడ్డగా గాక మరో రకంగా కనబడరు."

2159. 'ముందు భోజనం చేసి రమ్మంటారు. దాని ఉద్దేశ్యమేమిటి?'

"తల్లికి బిడ్డ ఆకలి ముఖ్యం గదా!"

2160. 'మీరింతమందికి అన్నదానం చేస్తున్నారు!'

"తల్లి ధర్మం నెరవేరుతున్నది. దానం చేయటం లేదు - దానం వల్ల, ధర్మం వల్ల పుణ్యం సంపాదించుకొందామని గాదు. నాకు పాప పుణ్యాల మీద నమ్మకం లేదు. మీరు మీ పిల్లలకు ఎట్లా పెట్టుకుంటున్నారో ఇదీ అంతే . . . . . భోజనమని కాదుగా . . . . . కడుపు నిండటానికే-"

2161. "నాస్తికుడైనా బిడ్డేగా?"

2162. "అమ్మను చూడాలని వస్తే రావచ్చు గానీ; తగ్గుతుందని రావద్దు."

2163. ఒక స్త్రీ : వారి బావగారి అబ్బాయి పోయాడట. వారిని రమ్మంటావా అమ్మా?

"వారికిష్టమైతే నాలుగురోజులు ఉండి వెళ్ళమను."

2164. 'నేను నిన్ను కొల్చుకుంటున్నాను.'

"నేను దేవుణ్ణా? - నేను అమ్మను."

2165. "రాముడు ఏకపత్నీవ్రతం, రాజధర్మం కోసం పుడితే, కృష్ణుడు యుద్ధం ఎట్లా చెయ్యవలసిందీ నేర్పటానికొస్తే, ఇక్కడ తల్లి ధర్మం . . . . ."

2166. 'నీకూ కోపం వస్తుందా?'

"మీకంటే చాలా వస్తుంది. ఎక్కడనుండి రావాలీ? మనలోదే. మన అభిప్రాయాలకు భిన్నంగా వుంటే వస్తుంది. కోపం లేనివారు లేరు. స్థాయిని బట్టి ఉంటుంది. తప్పులు చేయటం మానవ స్వభావం. ఒకడు తొందరగా, మరొకడు ఆలస్యంగా బయట పడతారు. ఇక్కడా తప్పుచేయబోయి అమ్మ సన్నిధానం అని తట్టుకుంటావు . . . . "

2167. 'ఏదేదో మాట్లాడేనమ్మా - '

"అమ్మను కనుగ ఇదే మాట్లాడాలీ అనే హద్దు లేదు."

2168. "నా యందు సత్యం లేదు. సత్యమనే వస్తున్నారని అనుకోవద్దు. అమ్మ అని వస్తున్నారు."

2169. 'నీ దగ్గర భయంగా ఉందమ్మా.'

"రూపాన్ని చూచా? మనస్సును చూచా? పోనీలే; నన్ను చూచి భయపడేవారు ఒక్కరున్నా చాలు! (చిరునవ్వుతో) ప్రేమ పెరిగి భయంగా మారిందేమో! భయం పెరిగి భక్తిగా మారిందేమో! అదే అభయం."

2170. 'అమ్మ సన్నిధిలో జరిగే పెళ్ళి. ఆమె ఎట్లా చెబితే అలాగ ఒప్పుకోడమే.'

"నాకు ఏది జరిగినా ఇష్టమే. ఎట్లా జరిగినా యిష్టమే."

2171. 'సెలవిస్తే వెళ్తానమ్మా!'

"వెళ్తానంటే కుంకం పొట్లా లిస్తా."

2172. క్రోసూరు కరణంగారు వారి కుమారుడి వివాహానికి అమ్మనే లగ్నం నిశ్చయించమన్నారు.

"నేను అన్ని రోజులూ మంచివంటా. నేనైతే వర్జ్యంలో చేస్తా. మనుషులు చేరటానికే వివాహాల్లో టైము పెట్టుకోవటం."

2173. "అందరికీ స్థానం వుంది ఇక్కడ. 'తప్పు' చేయని వాడే ఇక్కడకు రావాలని ఉంటే ఎవ్వడూ రాలేడు. అందుకే ఎవరు ఎవరిని విమర్శించినా నేనూరుకోను."

2174. 'ఏదేనా ఉపదేశం చేస్తారేమోననీ' అని 'ముగురమ్మల మూలపుటమ్మ' అన్న పద్యం చదివేడు.

"ఈ పద్యం చదువుతున్నారుగా? ఇది చాలు" అన్నారు.

2175. రామకృష్ణ : ఏదన్నా ఒక వాక్యం రాయమ్మా.

అమ్మ "ఏదన్నా ఒక వాక్యం" అని రాశారు. (అవును మరి, అమ్మ ఏది అన్నా ఒక వాక్యం కదూ?)

2176. 'మీ బంధుత్వం లేదమ్మా వారికీ?'

"బంధనే గాని బంధుత్వ మెందుకూ?"

2177. "దానికి జ్వరం వచ్చినప్పటి కంటే వీళ్ళకి జ్వరం వస్తేనే ఎక్కువ తహతహ. అయితే అది ప్రేమ కాదు, బాధ్యత."

2178. "నాతోనా? చర్చ లేదు. ఛెప్పడమే.

(నేను) జరిగేది చూస్తుండటం, సరే ననటం."

2179. "నాకు చెప్పటం చేత కాదు. మాటలు నడిపంచవుగా మనుష్యుల్నీ?"

2180. "నాకేమిటో (19)70 వస్తున్న దానికంటె (19)69 పోతున్నదే అనిపిస్తుంది. (సంవత్సరం)"

2181. "అసలు నేనెవ్వర్నీ పెళ్ళి చేసుకోవద్దని చెప్పలేదు నాన్నా."

2182. "నాకున్న లౌక్యం మీ కెవ్వరికీ లేదు. మీ చేత అన్పించి నే చెబుతా సమాధానం."

2183. 'నీవు అనేది ఏదో సరాసరి అను - '

"నాకు అడ్డదారి లేదు."

2184. "నేను ఆధ్యాత్మికం వేరూ ఇదంతా వేరూ అనుకోను. రెండూ ఒకటే."

2185. "ఇక్కడ పరమార్థం లేదు. పరమ లౌకికమే."

2186. "మీరు అంతా దేవుడే అనిపిస్తుంది. వేరు అనుకోవటం లేదు. మీరు కాదనుకోవటం లేదు."

2187. "నాకు నేనే ఉపమానం."

2188. 'అదా? అది అమ్మ స్టేజిలో.'

"అమ్మే స్టేజి కానీ అమ్మకో స్టేజి లేదు."

2189. 'అసలాయన ప్రశ్నకు సమాధానం ఏమిటి?'

"చెపితేనే తెలియనక్కర లేదుగా?"

2190. 'అమ్మా, నువ్వు ఎవరినైనా చూస్తున్నప్పుడు వాళ్ళకు జరగబోయేది అంతా తెలుస్తుంది కదా? వాళ్ళకు కలిగే కష్టాలన్నీ తెలుస్తాయి కదా? అప్పుడు వాడి మీద జాలి కలగదా?'

"ఇంత నిర్ణయించిన వాడివి ఆ కాస్త నిర్ణయించలేవూ?"

2191. 'నిన్ను తలుచుకుంటే, నిన్ను చూస్తే ఏడుపు ఎందుకొస్తుంది?'

"మేఘాలు చల్లగాలికి వర్షిస్తాయి."

2192. "అమ్మను అనేక రూపాలుగా అనుకుంటున్నారు - మృత్యుదేవత, భాగ్య దేవత, దరిద్ర దేవత - అన్నీ ఆ రూపమే."

2193. "అమ్మంటే యేం? బ్రహ్మ అంటే యేం?"

2194. "(ఏడవకు. నా దగ్గర) ఉండగలిగే వాళ్ళు ఉంటారు. లేకపోతే నేనే ఉంటా."

2195. "ఆడింది మీరూ; చెమటలు నాకు."

2196. "ఎప్పుడూ నాకు నేనే అడ్డు; నాకు ఎవరూ అడ్డు రాలేదు, రాలేరు."

2197. 'నీవేం చిత్రగుప్తుడివా?'

"నాకంటే చిత్రగుప్తుడెవరు! అంతా రికార్డు అయి ఉంటుంది."

2198. "కోపం రాదు గాని, కోప్పడతా."

2199. 'మీ దయ తల్లీ - శరణు వేడుతున్నా నమ్మా.'

"తల్లీ బిడ్డా మధ్య శరణు లేదు."

2200. "పంచటంలో హెచ్చు తగ్గులుండవచ్చును కాని పెట్టటం మాత్రం అందరికి సమానంగానే పెట్టటం జరుగుతుంది."

2201. "(అమ్మ దగ్గర) 'ట' అనే ప్రయోగం ఇక్కడ లేదు."

2202. "దసరాలకి రా నాన్నా."

'పిలుపు శిరసా వహిస్తానమ్మా.'

"రమ్మంటే వచ్చే పిలుపు కాదు. నీవై నీకు రావాలని అనిపిస్తే రా."

2203. "జపం చేద్దామంటే కాసేపు కూడా మనస్సు నిలవదు స్వామీ! నాకు మీ మీద ఉన్నంత ధ్యాస వాటి మీద ఉండదు."

2204. "మీరు ఇక్కడకు రాకపోయినా నేను ఎప్పుడూ మరచిపోను."

2205. "నా నాడి చూడు. నీకు ధైర్యమొస్తుంది."

ఆయన చూసి 'నాడి అందడం లేదమ్మా.'

2206. "నాకు ఉండేవన్నీ వీలుగానే ఉంటాయి."

# అందరిల్లు

2207. "ఏ అక్కయ్య ఇంటికిగాని, ఏ అన్నయ్య ఇంటికిగాని వెళ్లినా ఉండలేరు. అక్కయ్య దగ్గరుంటే బావ ఏమనుకుంటాడోనని, అన్నయ్య దగ్గరుంటే వదిన ఏమనుకుంటుందోనని అనుకుంటారు. ఇక్కడ అట్లా అనుకోరు. అందరిల్లు కాబట్టి ఉండగలుగుతున్నారు. ఆడపిల్లలు పుట్టింటికి వస్తే నాన్నకి బరువేమో అనుకుంటారు."

2208. 'ఇక్కడికొచ్చి (జారి)పడితే?'

"అనుభవించక తప్పదు."

2209. 'అమ్మ సాన్నిధ్యంలో ఉన్నవారు తరిస్తారు.'

"ఇక్కడ ఉంటేనే తరించడం కాదు. ఎక్కడున్నా తరిస్తారు. ఇక్కడుంటేనే తరిస్తాం - అనుకోవడం - మీ విశ్వాసం."

2210. "కోటీశ్వరుడైనా ఒక్కడు చేయగలిగిన ఆవరణ కాదిది. ఎవరిచ్చినా చాలదు, ఎంతిచ్చినా చాలదు."

2211. 'అమ్మా, వంటశాలలో బొగ్గులు కాకుండా కట్టెలైతే?'

"చెయ్యవోయ్, సలహా వద్దు. ఏదైనా అంతే. చెయ్యండి."

2212. '(ఇక్కడ వాళ్ళకి) అమ్మని మనం ఎట్లా చూస్తున్నాం - అని అనుకోవటం పోయి, అమ్మ మనని ఎట్లా చూస్తున్నదీ అని ఆలోచన-' రామకృష్ణ అన్నయ్య

2213. "చూడటం కోసం ఉంచుకోను. ఉన్నారు కాబట్టి (మీకు కావలసినవి) చూస్తున్నాను."

2214. "శ్రీశైలం దాకా తిరిగొచ్చారు మనవాళ్ళు. చింతకాయలు, ఉసిరికాయలు, వెలక్కాయలు దొరకలా. మణుగు సరిపోయే ఇల్లయితే అనుకోవచ్చు. నలభై మళ్ళు రెండు నెలలొచ్చింది మనకు. మహోదయం నాడు 2 బస్తాల దోసకాయలు తరిగేరు పచ్చడికి."

2215. మూడు రోజుల్నాడు ఒకాయన వచ్చారు. 'ఎన్ని కోట్లు లేకపోతే ఇంతమందికి

బట్టలు పెట్టి, అన్నం పెడుతున్నారు? ఎలా భరిస్తున్నారు? - అని అడిగేరు.

"ఇక్కడ భరించటల్లా. వాడి అన్నం వాడు తిని పోతున్నాడు."

2216. "ఇక్కడ పవిత్రతే కాదు. మీరనుకునే అపవిత్రత కూడా ఉంది."

2217. 'ఆ ఆశ్రమంలో కూడా నెమళ్ళనూ, కుక్కలనూ, పిల్లులనూ ఆదర్శంగా పెంచుతారట.'

"మనం పెంచడం కాదు. అవే పెరుగుతున్నయి."

2218. "ఒకళ్ళు ఉంటేనే జరుగుతుందనేదేం లేదు. వాళ్ళు పోయేసరికి దాని వాళ్ళు వస్తారు."

2219. ఒకరు అన్నారు : 'ఇక్కడ జనానికి ఇక్కణ్నించి పోతేగానీ దీని విలువ తెలియదు.'

2220. 'ఇన్ని పుణ్యక్షేత్రాలకు వెళ్ళుతున్నాం. ఎక్కడకు పోయినా ఈ మాట అనరు. ఇక్కడ అందరూ భోజనం చెయ్యమనేవాళ్ళే.'

2221. 'ఇక్కడ మహిమలు లేవు. కానీ ఏదో ఆకర్షణ ఉంది.'

2222. "ఒకడు పూజతో తృప్తిపడ్డాడు. ఒకడు మాటతో, ఇంకొకడు ప్రసాదంతో."

2223. 'ఇక్కణ్ణించి వెళ్ళాలంటే ఎవరైనా బాధ పడ్తారు. ఏడుపెందుకొస్తుందమ్మా అసలు?'

"ఏడ్చేదానివి నువ్వు చెప్పు"

2224. "అప్పుడప్పుడు వచ్చి కొత్త విషయాలు అడిగి తెలుసుకుందాం అనిపిస్తుంది. ఈ వాతావరణంలో అన్నీ పోతాయి. మనస్సు చల్లబడిపోతుంది."

2225. "విసుక్కోకుండా ఆదరణగా అందరికీ అన్నం పెట్టే వాళ్ళు కావాలి నాకు."

2226. "ఒకణ్ణి ఉండమనను. ఉంటాననే వాణ్ణి వద్దనను."

"ఇక్కడ అట్లా ఉండాలి, ఇట్లా ఉండాలి అనేదేం లేదు."

# శాస్త్రం

2227. "నిగ్రహ శక్తి కావాలి అని మనం ఉపన్యాసం చెప్పినంత మాత్రాన వాళ్ళకి రాదు. అందుకే నేను అలాగ చెప్పను."

2228. "శబ్దం అంటే ఓంకారమే కాదు. వినపడే ప్రతీ శబ్దమూ ఓంకారమే. కత్తిపీటను పెట్టి కోసేటప్పుడు వచ్చే శబ్దం కూడా ఓంకారమే."

2229. "శబ్దమే ఆత్మ శబ్దం. కుక్క అరుపు కూడా అదే. ఆ భావం కలిగితే అదే నిశ్శబ్దం."

2230. 'పరం కోసం ఇహాన్ని వదలాలా?'

"రెండులేవు - అనుకుంటున్నా. ఇహం లోనే ఉన్నాను. మీరూ ఇహంలోనే ఉన్నారు - ఇహమే మీరు అనే పరం అనుకుంటున్నాను. పరాన్ని గూర్చి ఆలోచన నాకు లేదు."

2231. "అహం, ఆకారం దాల్చి అహంకారం అయ్యింది."

2232. "దరి చేర్చేదే ఉపదేశం. ఆ సన్నిధిని చేర్చేదే. గురువు కంటె భిన్నంగా లేదు."

2233. 'ఉపదేశమంటూ లేకుండా బుద్ధి పుట్టిన నామాన్ని చేయవచ్చా?'

"బుద్ధి పుట్టడమూ ఉపదేశమే."

2234. "సన్యాసం ఇవ్వడమంటే, కాషాయవస్త్రాలు ఇచ్చి ఊరుకోడం కాదు - సన్యాసిని చేయడమే."

2235. "అనుభవం అర్థం కాలేదూ? అర్థమైనదే అనుభవం."

2236. 'ప్రణవమే దైవస్వరూపమా?'

"ప్రణవమే కాదు, అన్నీ అక్షరాలూ దైవస్వరూపమే."

2237. "పెద్దగా జేస్తూ తాళాలుంటే భజన."

2238. "ఆ నామమే లోపల చేస్తూ ఉంటే జపం."

2239. "ఏదీ అనకుండా అక్షరాలను మనస్సులో పెట్టుకుంటే ధ్యానం."

2240. "ధ్యానం అంటే ధ్యాస. కళ్ళు మూసుకుని కూర్చోవటమే కాదు. ఒకళ్ళు నామంలో, ఒకళ్ళు జపంలో, ఒకళ్ళు సంభాషణలో, ఒకళ్ళు తత్వంలో ఆనందం పొందేవాళ్ళు ఉన్నారు. అన్నీ ధ్యాసలే, అన్నీ ధ్యానాలే."

2241. "అజపం అంటే - జపం చేయకుండా జరిగేది. మనం చేయకుండా జరిగేవి శ్వాస వల్లనే."

2242. "కనపడుతున్నదంతా అదే అయినప్పుడు కళ్ళు మూతలెందుకు?"

2243. 'ఏకాగ్రత అంటే?'

"ఈ కనబడే సర్వం అదేనని అనుభవంతో అనుకోవటం."

2244. "ఒక రూపాన్ని చూస్తూ ఆ రూపం తప్ప వేరే లేకుండా ఉండడం ఏకాగ్రత."

2245. "ఏవి చూస్తున్నప్పుడు అది - అన్నీ ఒకటే - అనే భావం నిలిస్తే - ఏకాగ్రత."

2246. "సర్వమూ సత్యస్వరూపంగా తోచటమే నిత్యా నిత్య వస్తు వివేకం."

2247. "సాకారాన్ని గుర్తించటానికి నిరాకారం, నిరాకారాన్ని గుర్తించటానికి సాకారం ఆధారం."

2248. "నిరంతర స్మృతే ఆరాధన."

2249. "సర్వమూ వాడికి వదిలివేయడమే - అర్పణ."

2250. 'బ్రహ్మ రంధ్రం, కుండలిని, సహస్రారం, అన్నీ ఒకటేనా?'

"సహస్రారం తలపైన ఉన్నది; కుండలిని శరీరమంతా ఉన్నది."

'వెన్నుకిందా ఉన్నదా?'

"శరీరమంతా ఉన్నప్పుడు, ఏదో ఒకచోట అనడం గుర్తు కోసమే."

2251. "సుషుమ్న అంటే సూక్ష్మమైనదని. రెండింటి మధ్య ఉన్నది."

2252. "మనోలయం, మనోనాశనం అంటారు. లయం ఎప్పుడు చేస్తాడు? మనస్సు నాశనం అయిన తర్వాత చేసేదేమిటి? వాళ్ళు ఒకదానికొకటి చెప్పడంలో వస్తున్నది ఇట్లా. ఆ భావం మార్పునే నాశనం అంటారు."

2253. "ఉన్నది ఉన్నట్టు తెలుసుకోవటమే జాగ్రతలో జాగ్రత -"

2254. "భూత, భవిష్యత్, వర్తమానాలు అన్నీ ఏకకాలంలో చూడటం తురీయం."

2255. "జాగ్రతలో తురీయం - ఏ ఆలోచనా లేని స్థితి. తాననుకున్న వస్తువేదో దానిలో లగ్నమవటం."

2256. 'పాపం - పుణ్యం వేరుగా ఉన్నాయా?'

"ఇష్టం - అయిష్టం తప్ప; పాపం, పుణ్యం లేవు."

2257. 'తపస్వి అంటే?'

"దేనికైనా సరే నిరంతరం తపించేవాడు."

2258. 'ఆసనాలు, ప్రాణాయామమో?'

"ఆరోగ్యం కోసం."

2259. "సన్యాసి అయితే మంచిదే. పుచ్చుకొంటే ప్రమాదం."

2260. "వద్దా అనటంలో మననముంది."

2261. "కామినీ (కాంచనాలు) అంటే కోరిక అనిగానీ; ఆడది అని కాదుగా!"

2262. "సాధనలు సిద్ధాంతాలుగా ఉంటాయి చెప్పేవాడికి; ఆచరించే వాడికొకటే!"

2263. 'జీవుడంటూ చిన్న రూపం ఉందా?'

"శరీరాన్ని విడిచిన ఆత్మ ఎట్లా ఉంటుంది? దానికి రూపం ఎక్కడుంది?"

2264. 'ప్రళయం అనేది ఉందా?'

"పరిణామమే గానీ, ప్రళయం వేరుగా లేదు."

# పురుష ప్రయత్నం

2265. "తను చేసే పనులలో ఏదో ఉన్నదనుకోకపోతే బ్రతకలేడు. మానవుడికి మిగిలింది అదొకటే - తాను చెయ్యకపోయినా చేశానని అనుకోవటం."

2266. "ఇదంతా చేస్తున్నది తాను కాదనుకున్నప్పుడు తాను నిమిత్త మాత్రుడేగా?"

2267. "మానవులలో ఉండే ఆ ప్రయత్నం కూడా దైవమే. అంతా నీ ప్రయత్నం అంటాడు - ఆ దొరికిన గురువేనా?"

'ప్రయత్నం చెయ్యటమెట్లా?' అంటే మళ్ళీ దైవానుగ్రహం నాయనా - అంటాడు.

"పూర్తిగా దైవానుగ్రహం అనడూ; పూర్తిగా ప్రయత్నమనీ అనడు."

2268. "కర్మలన్నీ చెయ్యటానికి తాను స్వతంత్రుడై ఆ అధికారం తన చేతిలో ఉన్నప్పుడు తాను ఎందుకు చెయ్యలేడూ!"

2269. "మానవ ప్రయత్నమంటూ లేదు. ప్రయత్నం వెనక ప్రేరణ ఉన్నది. ఆ ప్రేరణ నేనే."

2270. "మన మనుకున్నట్టు జరిగితే పురుష ప్రయత్నం."

2271. "వాడి ఆటలో ఉన్న మనం మనదేదో ఉందని బాధపడుతూ వుంటాము."

2272. 'మానవుడు తరించ గలగాలంటే మార్గము ఏమిటి?'

"మానవుడి దేముందీ?"

2273. 'ఆ దేవతను కొలిస్తే మా మేనమామ మనస్సు మారి పిల్లను నాకే యిస్తాడని చెప్పేరమ్మా.'

"ప్రతి మానవుడికీ జరగవలసిన పనులు పుట్టుకతోనే వస్తయి నాన్నా. మధ్యలో మారతయ్యా?"

'కొంత మనం చేసుకునే పనుల్లో వుంది - అంటారు గదమ్మా.'

"వీళ్ళ పనుల్లోనే ఉండేటట్టయితే సుఖపడే పనులే చేసుకోను ఎందుకు బుద్ధి పుట్టదు?"

# తరుణం

2274. 'తరుణమంటే ఏమిటమ్మా?'

"తప్పించుకుందామన్నా తప్పనిది. చేద్దామన్నా చేయనీయనిది. వీటి నన్నింటిని నడిపించేది."

2275. "ఆ గీతలో ఏమన్నాడో మన గీత అర్థం కానివ్వటం లేదుగా."

2276. "నేను చెప్పేది ఒకటే. కాలం అన్నీ చేయిస్తుందని."

2277. "అనుభవించే యోగ్యత ఉన్నప్పుడు అది బాధగాని సుఖంగాని తెలుసు కోకుండా తన చేతులతో తాను చేసుకోవటం జరుగుతుంది."

"తెలిసినవాడికీ తన యిష్ట ప్రకారం జరగదు. తెలియనివాడికీ తన యిష్ట ప్రకారం జరగదు."

2278. 'అవి పడితే తగిలే దెబ్బలు కాదమ్మా, ఎవరో కొట్టిన దెబ్బల్లా వున్నై.'

"పోన్లే నాన్నా. కిందపడితే భూదేవి కొట్టినట్టు కాదూ? ఎట్లా అయితేం? ఎవరయితేం? తగలవలసి వున్నవి తప్పవు."

2279. 'ఏం చెయ్యమంటావమ్మా వాళ్ళందరూ పోయి వీడెందుకో బ్రతికాడు.'

"అట్లా అనకు నాన్నా. వాళ్ళు పోవటానికి పుట్టారు. వీడు ఇట్లా చేయటానికి పుట్టాడు."

2280. 'నా ఒక్కణ్ణేనా? అందరినీ యిలాగే గుర్తిస్తూ వుంటారా మీరు?'

"అవసరమైనప్పుడు ఎవరేనా అంతేగా నాన్నా, గుర్తింపబడతారు."

2281. "నేను అనుకున్నవే చేయగలను గాని మీరు అన్నవన్నీ చేయలేను."

2282. "కావాలని వుంటే అవుతుంది. అంటే కాదు."

2283. "కోరికలు పొయ్యేరోజు వస్తే వాటంతట అవే పోతయ్. కోర్కెలు పోవాలనే కోర్కె పెరిగిన కొలదీ కోర్కెలూ పెరుగుతై."

2284. "నమస్కారం నువ్వు చెయ్యటం కాదు, చేయించుకోవటమే."

2285. "దీన్ని గురించి (అమ్మ తెలియటం) యింట్లో వాళ్ళు అయితే తెలుస్తుందనా? యింట్లో లేదూ - ప్రక్కనా లేదూ - దూరమూ లేదూ. సమయం వచ్చినప్పుడు దానంతటే అదే తెలుస్తుంది ఎవరికైనా. సమయం రాకపోతే ఇక్కడికి వచ్చినా గుర్తించలేరు."

2286. "మానుకోవాలంటే మానుకోనివ్వండీ, చెయ్యాలంటే చెయ్యనివ్వందే నిర్ణయం."

2287. "అనుకున్నది జరగదు; తనకున్నది తప్పదని తెలిసినా మనం చేస్తున్నాము - అన్నది అనుకోక తప్పదు."

2288. తాను ఎంత ప్రయత్నించినా ప్రతిష్ఠ జరగటం లేదని బాధపడుతున్న వృద్ధురాలితో అమ్మ -

"భగవంతుని ప్రతిష్ఠ మనం కాదుగా చెయ్యాల్సింది. మనకేం సాధ్యమౌతుంది? అక్కడ ఆయనకు ఉండాలని ఉంటే అదే జరుగుతుంది. అంతటా ఉన్న భగవంతుడిని ఒకచోట 'ఇక్కడ ఉన్నాడని' ప్రతిష్ఠిస్తున్నా మంటే మన గుర్తు కోసం, మన లక్ష్యం కోసం. దాన్ని రాయి అనుకోవటం లేదుగా, అందులో ఉన్నాడనుకుంటున్నాము. అక్కడ ఆయనకు ఉండాలనిపిస్తే - అదే జరుగుతుంది."

2289. "ఇక్కడ వుండే యోగ్యత లేనప్పుడు ఏవో కారణాలు కనిపిస్తాయి. ఆ యోగ్యత ఉన్నప్పుడు ఈ కారణాలూ కనిపించవు, ఏదీ ఎవరూ అడ్డం అనిపించరు."

2290. అమ్మ భద్రాద్రి రామశాస్త్రిగారితో -

"సంధానం కావటమే గానీ చెయ్యటం కాదు."

2291. "కాలమే కాళి అయింది."

2292. "కాలమే కర్త."

2293. "చండిక అంటే అన్నిటినీ ఛేదించేది."

2294. "కాలం అంటే అర్థం కానిది. అంతా ఇంతా అని తెలియనిది."

# పూజ

2295. 'వ్యక్తి పూజ తప్పుగదా!'

"పూజ అంటే పాదాల మీద పూలు వేయటమే కాదు. వేసేవాడూ, వేయించుకొనేవాడూ వ్యక్తే గదా! బిడ్డకు తల్లి వ్యక్తిగాక మరేమౌతుంది?"

2296. "ఒకడు మాటతో, ఇంకొకడు ప్రసాదంతో తృప్తి పడతాడు."

2297. "నా ప్రసాదం అంటే హయగ్రీవమేనా! ఏది పెడితే అది ప్రసాదం."

2298. "అసలు నివేదన అంటే ఏమిటీ? నువ్విచ్చిన తిండి, నువ్విచ్చిన మనస్సు, నువ్విచ్చింది - అని గుర్తిస్తున్నాము అని. అంతే కానీ నివేదన అంటే పదార్థం కాదు."

2299. 'నివేదన ఎందుకు చేయాలి?'

"వాడు ఇచ్చాడనే గుర్తింపు - నివేదన అంటే; లంకణాలు ఉన్నాడని పెట్టడం కాదుగా."

2300. 'అంగన్యాస కరన్యాసాలంటే ఏమిటి?'

"స్థలానికి ఆవరణ పెట్టుకోవడం."

2301. "వాక్ శక్తి ప్రసారమైనదను కొన్నప్పుడు ప్రసాదమైంది."

# దైవం

2302. 'అందరిలో దేవుడు గొప్పవాడు?'

"ఎవరిమీద మనసు లగ్నమైతే ఆ దేవుడు గొప్పవాడు-"

2303. 'దైవాన్ని తెలుసుకొనడమెలా?

"దైవాన్ని తెలుసుకొనడం కాదు - తెలియబడుతున్నాడు."

2304. "దైవాన్ని నమ్మటం కాదు, నమ్మినదే దైవం."

2305. "ఒకడు నన్ను నా సొమ్మును రక్షించమని దణ్ణంపెట్టుకుని పడుకుంటాడు. ఇంకొకడు ఈ రాత్రి నాకు కావలసింది దొరికేటట్టు అనుగ్రహించమంటాడు. దైవం ఎవరికి దొరికేటట్టు? ఎవరిని వదిలేటట్టు?"

2306. "తెలియంది, అర్థంకానిది మరొకటి ఉంది. స్వభావమన్నా, శక్తి అన్నా, దైవం అన్నా - మనకు అతీతమైనది, నడిపించేది."

2307. "వీడు కారణం కాదు అనుకున్నప్పుడు - తప్పు కనిపించదు, అనిపించదు."

2308. "ఎంతటి వాళ్ళయినా అది నడిపిస్తున్నది, నడుస్తున్నామని అనుకోక తప్పదు."

2309. 'నేను ఇదివరకు శివపూజ చేసేవాణ్ణి. ఏ ఆలయంలో దణ్ణం పెట్టినా శంకరుడనే పెడతాను. నాతో వచ్చిన నలుగురికి నేను దణ్ణం పెట్టగలుగుతానా? లేదా? అది నా జన్మకున్నదా?'

"ఆ శంకరుడు నీ చేత పెట్టిస్తే పెడుదువుగాని. ఏదైనా వాడు చేయించాలిసిందే కదా."

2310. "సఫలమే కాదు - విఫలం కావటమూ ప్రేరణదే."

2311. "సంకల్పమే తనదైనప్పుడు ఈ అవసరం ఎవరిది? ఈ శరీరం ద్వారా జరుగుతోంది గాబట్టి మన అవసరం అనుకుంటున్నాం. కొన్ని తన అవసరాల్ని దైవం మన ద్వారా తీర్చుకుంటున్నాడు."

'దేన్నీ అంటనివాడంటున్నారు కదమ్మా?'

"సంకల్పమే తనదైనప్పుడు అంటక పోవడమేమిటి? తన అవసరమేగా?"

2312. "గమనించే శక్తికి మనసు, చిత్తం, గుర్తు, అహంకారం . . . అని రకరకాల పేర్లు పెట్టారు."

2313. "గుర్తు వస్తేనే గుర్తు చేసుకోవటం. గుర్తు కూడా ఇస్తే వచ్చేదేగా? గుర్తే దైవం. గుర్తును గుర్తించాలంటే ప్రేరణ కావాలి కాబట్టి రెండూ ఒకటే. మీరు రావాలి అనుకోవడం ప్రేరణ. వచ్చినప్పుడు చప్పుడు గుర్తు."

2314. "భూమి మీదికి రావటానికి కారణమేదో - పోవటానికీ అదే."

2315. "కావాలనుకుండే వాళ్ళం మనం.
అవసరాలు గుర్తించేవాడు భగవంతుడు."

2316. "అనుగ్రహం ఎప్పుడూ ఉన్నది."

2317. "అన్నీ అదే అనే స్థితి మనకు లేదు. గుణాలు చచ్చిన తరువాత దైవం కనపడతాడంటారు. గుణాలు పోగొట్టాల్సిందీ వాడే."

2318. "బాధలు తీసేసేదే అమ్మ కాదు. పెట్టేదీ అమ్మే."

2319. 'దిక్కులేనివాడికి దేవుడే దిక్కు.'
"దిక్కులేని వాడికే కాదు. అసలెవరికైనా వాడే దిక్కు."

2320. "వాడికి లేని గుణాలు ఎవరికున్నాయి?
(వాడికి) అన్నీ ఉన్నాయి."

2321. "ప్రతి ఒక్కరికీ నమస్కారం చెయ్యకలిగితే, తానే దైవం."

2322. "మంచితనం కంటే దైవత్వం ఎక్కడుంది?"

2323. "పరిణామమే దైవం."

2324. 'కర్తవ్యం తోచకుండా ఉంది.'
"కాలమే కర్తవ్యాన్ని బోధిస్తుంది."

2325. "మీ ప్రయత్నం మీరు చెయ్యండి.
సమయం వస్తే అదే జరుగుతుంది."

2326. "భావమే దైవం."

2327. "రాముని చిత్రం నిర్మించిన వాడికి దణ్ణం పెట్టం. ఆ పవిత్ర చరిత్రకు నమస్కారం చేస్తాం. దైవం అక్కడ భావమే అయింది కనుక ఫోటో దైవం అనుకొన్నది వీడే. వాడికి కలిగిన ఆ భావమే దైవం."

2328. "నామరూపాలు లేనివాడిని చూడడానికి, నామాన్ని చేస్తున్నాము."

2329. 'అహం బ్రహ్మాస్మి అంటే ఏమిటీ?'

"అహం కూడా వాడేనని."

2330. "రాయిలో చైతన్యం చూడగల మనం, మనిషిలో చైతన్యం చూడలేక పోతున్నాం."

2331. "పరిణామం పొందే ప్రతి వస్తువూ జడం కాదు."

2332. "చెట్టు పరమేశ్వరుడే కానీ పరమేశ్వరుడు చెట్టు మాత్రమే కాదుగా?"

2333. "క్షేత్రంలో ఉన్నాడు. క్షేత్రాన్ని నడిపిస్తున్నాడు. క్షేత్రమై ఉన్నాడు."

2334. "జగత్తు వేరంటారు. నేను జగత్తే దైవమంటాను. మలయమారుతాలు, కోయిల కూతలు, పూల సరోవరాలే గాదు - పెంట,పేడ, చీము, నెత్తురు - అన్నీ కలిపితేనే ప్రకృతి. నేను ఈ ప్రకృతే పరమేశ్వరుడంటాను."

2335. "కనపడుతున్న ప్రకృతిని, దానిలోని శక్తిని - ఏ కుర్రవాడు కాదనగలడు? ఎదురుగా కనపడేదానిని కాదని, ఇది నశించేదని, ఇదిగాక మరొకటి ఉందని అన్నప్పుడు - ఒప్పుకోలేం. ఈ పువ్వుగా, దానిలో వాసనగా (దేవుడు) ఉన్నాడంటాను. కాదనగలరా?"

2336. "నేను నేనైన నేనుకు దుఃఖం లేదు; ఆనందం లేదు. రెండూ సహజమే."

2337. 'మా దుష్కృతాలను తొలగించి, నీ నిజ స్వరూపం చూపండి.'

"చూస్తున్నదంతా నిజ స్వరూపమే నాన్నా."

2338. "ఈ గుడ్డలన్నింటికి మూలం ప్రత్తి గదా? ఈ ప్రత్తికి మూలం భూమి. ఆ భూమికి మూలం ఎవరు? అనుకుంటే దేవుడు అని వస్తుంది. ఇలాగ అన్నిటికి మూలం ఎవరు అని ఆలోచిస్తే ఆ దేవుడే వస్తాడు."

2339. "కృష్ణుడు కూడా విశ్వరూపం అంటూ ఈ సృష్టినేగా చూపించాడూ?"

2340. "ఏదైతే సర్వత్రా ఉన్నదో అదే అనేక రూపాలు."

2341. "నాలుగు చేతులు కాళ్ళతో వేరుగా ఎక్కడో లేడు. అన్నీ అయి ఉన్నాడు. గులాబి పువ్వుగా, తమలపాకుగా, మంచంగా, కిటికీగా . . . అన్నీ తానే అయి వున్నాడు."

2342. "అంతటా ఉన్నదానిలో ఎవరెవరి ఇష్ట దైవాన్ని వాళ్ళు చూస్తున్నారు. గజంలో అంగుళాలు ఉన్నై. గాని అంగుళంలో గజాలు లేవు."

2343. "ఒక నిజమే నలుగురికి నాలుగు రకాలుగా కనపడుతోంది."

2344. "మీరూ ఈ కనపడేదీ - ఈ సృష్టే భగవంతుడు అనుకుంటాను. మీకంటే భిన్నంగా చూడటం లేదు. చూడాలని అనిపించటం లేదు."

2345. "దేవుణ్ణి చూడాలనే ఆసక్తి నాకు లేదు. ఈ కనబడుతున్న దానికన్నా భిన్నంగా ఏదీ నాకు కనపట్టం లేదు.

2346. "తెలివి సరస్వతి. వస్తురూపం లక్ష్మి. లోని శక్తి పార్వతి. ముగ్గురూ వస్తువుగానే ఉన్నారు. వేరే ఎక్కడనూ లేరు."

2347. "(ఒకచోటికి) వెళ్ళాలనిపించడం కోరిక. వెళ్లకుండా ఉండడం అవసరం. ఏదీ అవసరమో అది భగవంతుడు మనకు అనుభవ రూపంలో ఇస్తాడు."

2348. 'కోర్కెలు తీర్చడానికి దేముణ్ణి ప్రార్థిస్తారు కదా, ఇస్తాడా?'

"ఇస్తాడో లేదో అనుభవించిన వాడికి తెలుస్తుంది. నేనేమో దొంగ రాకుండా కాపాడమని దణ్ణం పెట్టుకుని పడుకుంటున్నా. దొంగ బయల్దేరబోతూ నాకు ఇవాళ ఏమన్నా బాగా దొరకాలి, అని దణ్ణం పెట్టుకుంటాడు. రెండింటికీ ప్రేరణ ఒకటే. సృష్టిలో ఎక్కడ ఎప్పుడు ఏది అవసరమో - అది ఇవ్వటమే అనుగ్రహం అని అనిపిస్తుంది నాకు."

2349. "వాడొక మూల ఉండి మన చేత చేయిస్తున్నాడని నేననుకోటల్లేదు మీలాగే. వాడో, అదో, మనస్సో-సర్వత్రా వుందనుకుంటున్నాను."

2350. "అన్ని సమయాల్లో దగ్గరుండేది ఒక్క భగవంతుడే."

2351. "నేను మాత్రం మీకంటే భిన్నంగా దేవుణ్ణి చూడలేదు."

2352. "రూపం తేడా. అన్నీ దైవమే."

2353. "ఇష్టదైవమే అన్ని రూపాలూ."

2354. "రాముడంటే మగవాడనీ, అనసూయ అంటే ఆడదనీ కాదు - అనేక పేర్లతో అన్నీ వాడే."

2355. "దేనిని గూర్చి చెప్పినా ఉన్న దానిని గురించి చెప్పడమే."

2356. "అన్నీ వాడు పెట్టే చింతలే కనుక మనకు ఏది వచ్చినా చింత అనవసరం."

2357. "అంతటా ఉన్నదానిని వెతుక్కోవటమేముంది? దృఢం అవడమే."

2358. "(కనపడే) ఇవన్నీ అణువణువూ అదే.
వేరే ఎక్కడో ఉండేది కాదు."

2359. "ఇదంతా అదేనన్న భావం ఏర్పట్టానికే ప్రత్యేక ఆరాధన."

2360. ""పెరుగు,మీగడ, వెన్న, నెయ్యి . . . అన్నీ పాలలో ఉన్నాయి. విడదీస్తే దేని గుణం దానిదే అయింది. శక్తి మనమ్మూ గుర్తూ అవ్వానందుకే."

2361. "'దైవం సాక్షిమాత్రుడంటారే?'
"అన్నింటిలో తానే, అన్నీ తానే గనుక."

2362. "జగన్నాధుడిలో జగత్తునీ చూడలేరు.
జగత్తులో జగన్నాధుణ్ణీ చూడలేరు."

2363. "వాడెక్కడో ఉన్నాడనీ, యిక్కడ లేడనీ, మీరు కాదనీ, చూడాలనే ప్రయత్నమూ లేదు. మీకంటే భిన్నంగా (దైవం) ఉన్నాడనుకోవటం లేదు.

2364. "ఒకే శక్తి అన్ని గుణాలతో , అన్ని రూపాలతో వుంది. ఈ సర్వమూ దైవం ప్రత్యేకించి ఒక రూపంతో లేదు, చూడటానికి ఏ రూపంగా చూస్తాము గంగానదీ అదే. మురికి కాలువా అదే."

2365. 'భౌతిక ప్రపంచంలో ఆధ్యాత్మికతకు సమన్వయం ఎట్లా?'
"కనపడుతున్నది కాదనుకొని, ఎందులోనో ఏదో ఉందనుకోను. ధర్మం

అర్థం,కామం - యీ మూడూ కాదనుకొని చేస్తున్నది లేదు. ఇంతకంటే వేరే ఏముంది?"

2366. 'ఏ దైవశక్తిని ధ్యానించి పూజిస్తున్నామో, ఈ ప్రపంచమూ అదే అయితే దీనిని చూచి ఎందుకు భయపడుతున్నామూ?'

"భయంకూడా అదే."

'నివారణోపాయం'

"భయంతో మనసు లగ్నం అయింది. భయం అభయంగా మారవచ్చు."

2367. 'బురద పూసుకొన్న మాకు సంస్కారం ఎట్లా? బురద నీవే కడిగేయాలమ్మా-'

"నేను కడుగలేను. బురదతోనే వడిలోకి తీస్తుంటే - నీదేముందీ?"

2368. "ఏ దైనా వున్నది అదే, వస్తువు అదే. స్థానాన్నిబట్టి పేర్లు అవసరమైనాయి."

# గురువు

2369. "ఎవరు లక్ష్యసిద్ధి కలిగిస్తే - వాడు గురువు."

2370. "గురువు ఒద్దని నేనెప్పుడు అనలేదు. గురువే అక్కర్లేదంటాను."

2371. 'ఆత్మ సాక్షాత్కారానికి గురూపదేశం అవసరమా?'

"మనస్సు గురువే కదా !"

2372. "పరిస్థితులే గురువూ, బంధువు."

# బాధ

2373. "జబ్బే బాధ, జబ్బు బాధ అవి ఏముంది? ఏది వచ్చినప్పుడు అది. ఏది అనుభవంలోనికి వస్తుందో అది బాధ."

2374. "బాధలా? పుట్టి భూమి మీదికి వచ్చిన తర్వాత అవి లేని క్షణం ఏది?"

2375. 'ఈ బాధ ఈ యుగంలో తీరుతుందా?'

"ప్రతిక్షణమూ ప్రతి సెకండూ యుగమే. యుగాలు ఎక్కడో లేవు."

2376. 'ఈ బాధ బరువుగా ఉందమ్మా.'

"ఏది వచ్చినప్పుడు అది బరువుగా, బాధగా వుంటుంది."

2377. "ఒకరి బాధ ఒకరికి సుఖం. అయినా కలిసే ఉన్నాయి సుఖం - బాధ!"

2378. 'చిక్కులు ఎప్పుడు తీరతాయమ్మా?

"చిక్కులు అందరికీ వుంటాయి. తలోరకం.

చిక్కులు లేనిదెవరికీ? చెప్పి రాలేదు. చెప్పి పోవు."

2379. "బాధపడొద్దనటం లేదు. వదిలెయ్యమనను. సమత్వంగా ఉండమనను. ఏది వచ్చినప్పుడు అది అనుభవించడమే. బాధ కూడా అదే."

2380. "మనం ఉన్నంతవరకూ మనతోపాటు వుంటాయి బాధలు."

2381. "కష్టాలంటే అందరికీ తలోరకం. కష్టాల్లేనివాడు ఒక్కడు కూడా ఈ మేడ ఎక్కడు."

2382. రోజులో 23 గంటలు సుఖమనుభవించి ఒక గంట బాధ అనుభవిస్తే - నిన్న అంతా బాధ పడ్డానంటాడు."

2383. 'అమ్మా మానవుడు అనుభవించలేని బాధలు ఉంటయ్యా?

"అనుభవించలేక పోవటమేగా బాధ!"

2384. "ఏది చేసినా హాయిగా చేయగలిగితే బాధ ఏముంది? అది ఏదన్నా గాని."

2385. "ఒకటి సుఖమనిపిస్తే మరొకటి కష్టమనిపిస్తుంది."

2386. 'అన్ని బాధలలోకి ఏ బాధ ఎక్కువ?'

"తాను కావాలనుకున్నది అందకపోతే అది ఎక్కువ బాధ."

2387. "బాధలు లేనిది జీవితం కాదు. అలలు లేనిది సముద్రమూ కాదు."

2388. "అసలు బ్రతకడమంటేనే బాధ. బాధ లేకపోతే బ్రతకటం అనవసరం. అది ఏం బ్రతుకు? బాధ అంటే చైతన్యం."

2389. 'నాకీ పెళ్లిలేకపోతేనేమమ్మా? ఇన్ని గోలలెందుకు? ఏ అడవులలోకన్నా వెళ్ళి ఉందామనిపిస్తాందమ్మా!'

"ఇప్పుడున్నది అడవి కాకపోతేగా?"

'అక్కడయితే యిదంతా ఉండదుగా? ఈ జనం ఈ బాధలు వుండవు.'

"అక్కడయితే ఇంకొకరకమైన బాధ వుంటుంది. ఎక్కడికి పోయినా తప్పదు. అక్కడ చెట్లున్నాయి, పక్షులున్నాయి, తేళ్లున్నాయి, పాములున్నాయి మృగాలున్నాయి. అన్నింటికి మనస్సు ఉన్నది. ఒకళ్ళను ఒకళ్ళు స్వజాతి కూడా అర్థం చేసుకోలేకుండా ఉంది. ఇట్లా అర్థం చేసుకోని బాధ యెంత దూరం పోయినా తప్పదు. తప్పించుకోలేని పరిస్థితిలో నుండీ తప్పించుకోవాలనుకోవటమే బాధ."

2390 "అక్కరలేనిది అనుభవిస్తున్నా బాధే. అవసరమైంది అనుభవించకపోయినా బాధే.

2391. "నీ బాధ నువ్వు గుర్తించావు కనుకనే బాధ."

2392. "బాధకు కారణం భేదమే."

2393. "మనసుకు తగిలితే బాధ అంటారు. శరీరానికి తగిలితే నొప్పి అంటారు."

2394. "కోపమే బాధ. మనిషిని తింటుంది. అన్ని వ్యాధులలోకీ కోపమే బాధ."

2395. "నేను చెప్పింది నీకు సరిపోదు. నీవు చెప్పింది ఇంకొకరికి సరిపోదు. అదే బాధ."

2396. "బాధ్యతే బాధ. బాధలేని బాధ్యతలు అందరికీ లభ్యపడవు."

దానికీ దీనికీ తేడా ఏమిటమ్మా?'

"నేను చేస్తున్నాను, నాది, నాకు - అనేది బాధ గల బాధ్యత. అంతకంటే రెట్టింపు పని చేసినా నేనే చేస్తున్నాను' అనేది లేకుండా 'మనం నిమిత్తం' అనుకుండేది బాధలేని బాధ్యత."

2397. "ఇతరులను గురించి మనకున్న ద్వేషం మనల్ని దహిస్తుంది."

2398. 'కష్టం కష్టమే సుఖం సుఖమే కదమ్మా?'

"అది ఏదయినా సరే - లేనిదాని కొరకు ఆశించేది దుఃఖం. ఉన్నది చాలనుకునేది సుఖం."

2399. "బాధలు రావటానికి మార్గం ఉన్నప్పుడు పోవటానికి ఉంటుంది. నీకీ బాధలు ఎవరిచ్చారో వాళ్ళే విముక్తి కల్పిస్తారు."

2400. "బాధలన్నీ తనకే వచ్చినా- నాకేం? అని అనుభవించే స్థితి వుంటే- ఆ బాధలు బాధలనిపించవేమో!"

2401. 'బాధలూ సుఖాలూ సమంగా ఎలాగ కనబడతాయమ్మా?'

"ఏదో ధ్యాస మీద తింటూ వుంటావనుకో. అప్పుడు నీవు ఏమి తిన్నది, ఎంత తిన్నది కూడా తెలుసుకోలేవుగా?"

2402. "సుఖంగా బాధననుభవిస్తే బాధ బాధ కాదుగా?"

2403. "ఎవరు ఎన్ని అంటున్నా అన్నారనే బాధ నాకు లేనప్పుడు సుఖమేగా?"

2404. "మనస్సుకు బాధ వుంది అనుకుంటే వుంది. లేదనుకుంటే లేదు."

2405. "ఎందుకిచ్చాడూ బాధలూ? అంటే - అవి మనకు అవసరమని."

2406. "బాధలు అనుభవిస్తున్నా - అది బాధ అనిపించనప్పుడు సహజ సహన మవుతుంది."

2407. "బాధలు ఉండవలసిందే లేకపోతే స్థాణువైపోతాడు. చైతన్యం ఉండదు."

2408. "జీవితం వికసించటం అంటే బాధపడటమేనేమో!"

2409. "బాధలో ఉన్నంత ఏకాగ్రత సుఖంలో లేదేమో - అనిపిస్తుంది."

2410. "నిర్వేదం అంటే తెలియకుండా పడే బాధ."

2411. 'బాధలు తొలగించమని భగవంతుని అడుగవచ్చా?'

"నీవు ఇచ్చావు కాబట్టి నీవే తొలగించమని అడుగవచ్చు."

2412. 'ఈ సృష్టిలో బాధలు లేనివాళ్ళు లేరా?'

"నాకు కనబడలేదు. నా దృష్టిలో లేరు. ఇష్టం - అయిష్టం ఎప్పుడైతే ఉన్నాయో - అప్పుడే అదీ ఉన్నది."

2413. "ఎప్పుడు కష్టపడే వాడి బాధ వేరు."

2414. "బాధ తప్పదు అనేవారికి సుఖం అనవసరం - సుఖం తెలిసినవాడికి బాధను గురించిన ఆందోళన సహజం."

2415. "బంతి లాంటి బ్రతుకులు ఎన్ని ఉన్నయ్యో? అటు వాడు విసిరికొట్టి, యిటు వీళ్ళు విసరికొట్టీ - అది అందుకే గదా పుట్టింది! కొట్టేవాడికి బాధే కానీ, కొట్టించుకునే వాడికి బాధ లేదు."

# పాతివ్రత్యం

2416. "భర్త భావాన్ని గుర్తించి మెలిగేదే భార్య."

2417. 'నువ్వు ఏది చెబితే అది చేస్తా.'

"ఏ తల్లి అయినా భర్త దగ్గరకు వెళ్ళ వద్దమ్మా అని చెబుతుందా?"

'అక్కడి అన్నమే ఇక్కడ తింటాననుకుంటానమ్మా.'

"ఇక్కడి అన్నమే అక్కడ తింటున్నానుకో."

2418. "పెళ్ళి అయిన దగ్గర్నుంచి తల్లి తండ్రి గురువూ దైవమూ వారేనమ్మా-"

2419. 'అడ్డమయినవాళ్ళతో తిరిగివచ్చిన కాళ్ళు పట్టుకోవటం నాకు ఇష్టం లేదమ్మా.'

"తిరిగే కాళ్ళు గనకనే తిరగకుండా నువ్వు పట్టుకో."

2420. "వెళ్లారంటే ఎక్కడికి వెళ్లారూ? పాదాలు అక్కడ కుదవబెట్టి వెళ్లారు." అంటూ - అమ్మ ఆ అమ్మాయి మంగళసూత్రాలు చూపించింది.

2421. రుక్మిణక్కయ్యకు ఒక కల వచ్చింది-

నాన్నగారు అమ్మ పాదాలకు పూజ చేస్తున్నట్లు ఆ విషయం అమ్మతో చెబితే అమ్మ ఇట్లా అన్నారు -

"పెండ్లిలో గంధం ఒకళ్ళ చేత ఒకళ్ళకు రాయిస్తున్నారు గదా! భర్తకు పూజ చేయమని భార్యకు చెపుతున్నారు - భర్త భార్యకు చెయ్యటంలో మాత్రం విశేషమేముంది? ఒకరినొకరు గుర్తించుకోవటమే."

2422. నంబులన్నయ్య సోడాలు పట్టి ముందుగా అమ్మకు ఇవ్వాలని తీసుకుని వచ్చాడు. కొట్టిన సోడా త్రాగబోతూ ఆపి - నాన్నగారికి యిచ్చావా? అని అమ్మ అడిగింది - నంబులన్నయ్య 'ఇవ్వలేదమ్మా' అంటూ తన తప్పును తెలుసుకున్న వాడికిమల్లే నాలుక కరుచుకుని సోడా కేసులోని సోడా తీసుకుంటున్నాడు. అమ్మ "ముందు నాన్నగారికి యిచ్చిరా. తెలియదూ?" అన్నది మందలిస్తూన్నట్లు.

2423. అనారోగ్య కారణంగా మళ్ళీ అమ్మను చూడగలుగుతానో లేదో, తిరుగుతున్నప్పుడే ఒకసారి అమ్మను దర్శించుకుందామన్నా భర్త కోరిక ననుసరించి అమ్మ దర్శనార్థమై వచ్చిన ఆ సోదరి తన సుమంగళీత్వాన్ని గూర్చి కన్నీళ్ళు పెట్టుకుంటుంటే అమ్మ అన్నది ఆమె శిరస్సు లాలనగా నిమురుతూ, "ఈ సమయంలో నువ్వు ఏడ్వకూడదు. నీ ధర్మం ఆయన కూడా ఉండి సక్రమంగా నెరవేర్చు" అని ఆమె భర్తతో "నువ్వు ఎప్పుడూ నామం చేసుకుంటూ ఉండు నాన్నా. ఈ స్థానం (తన దగ్గర) నీకెప్పుడూ ఉన్నది. నా దగ్గరే ఉంటావు నువ్వు ఎప్పుడూ" అని చెప్పి తిరిగి ఆమెతో 'ప్రక్కన ఉండి సవరణ చెయ్యి నువ్వు - ఇంతకంటే మిగిలేది ఏమున్నది? కంటనీరు పెట్టకుండా ధైర్యంగా ఉండు" అన్నది.

2424. 'ఆ అబ్బాయికి జీవకళ లేదమ్మా అంటే అమ్మాయి వినడం లేదమ్మా?' అని ఒక తల్లి.

"జీవం లేదనుకుంటున్న శిలలకు జీవం కలవారందరూ మ్రొక్కుతారు. జీవం కలవారందరినీ ఆ శిలారూపం రక్షిస్తుంది గదమ్మా!"

2425. 'సెంటు భూమి లేదు. ఉండటానికి ఇల్లు లేదమ్మా.'

"అమ్మాయి వీటినన్నింటినీ చేసుకోవటం లేదు. అబ్బాయినేగా చేసుకున్నది? అవి అబ్బాయి కోసం ఏర్పడ్డయి కానీ వాటి కోసం అబ్బాయి ఏర్పడ లేదు. అబ్బాయి అమ్మాయి కోసం ఏర్పడ్డాడు."

2426. "భర్త దైవమని అనుకోవల్సింది ఏముందమ్మా? కాకపోతేగా? అనుకోవటం అంటే ఏదో తెచ్చిపెట్టుకున్నట్టే ఉంటుంది."

2427. 'అమ్మా, అంత భాగ్యమా? ఆయన కంచంలో తింటారు. నేను కంచంలో తింటే ఆయనకు మళ్ళీ తినడానికి సయించదట.'

"పోనీ, అమ్మా. నీ కంత వ్రతభంగం లేకుండా ఉండాలంటే ఆయన భోజనం చేశాక తుడుచుకుని విస్తట్లో వేసుకుని తినచ్చుగా."

2428. 'కర్త అంటే నమ్మా?'

"నీ యిష్టానికీ, అయిష్టానికీ కర్త."

'నాకు అయిష్టమంటే ఏమిటి? ఇష్టమంటే ఏమిటి?'

"అయిష్టమంటే కష్టం. యిష్టమంటే సుఖం. కష్ట సుఖాలు రెండూ భర్త మీద ఆధారపడినాయి."

2429. "పెళ్ళి అంటే ఆత్మార్పణే. ఆయనా, ఆయన వేసిన ముడీ వేరుగా వుంటేగా? ద్వంద్వంతో ద్వంద్వాన్ని జయించాలి."

2430. "అసలైన పతివ్రతకు భర్త సన్నిధిలో సంతోషం లేకుండా ఉండదు. సన్నిధిలేని సమయమూ లేదు."

2431. 'పాతివ్రత్యమంటే ఏమిటమ్మా?'

"భర్త ఎట్లా నడచినా ఏం చేసినా ఎట్లా చూచినా - ఆయన తప్ప ప్రపంచమే లేకపోవటం."

2432. "భగవంతుడు భర్త కాదు, భర్తే భగవంతుడు."

2433. "ఆమెకేం? విలక్షణమైన మనిషి. చాల తృప్తిగల మనస్సు. ఏమి వున్నా, లేకపోయినా - ఎంత తృప్తిగా వుంటుందో? రెండే చీరలు వుంటయ్. అవే శుభ్రంగా కట్టుకుంటుంది. ముఖాన ఎప్పుడూ బొట్టూ, కాళ్ళకు పసుపూ, తల్లో ఏదో ఒక పువ్వు పెట్టుకుంటుంది. ఆయన ఇంటికి వచ్చేటప్పటికీ మంచి నీళ్ళు ఇస్తుంది. ఎన్నాళ్ళకయినా ఇంటికిరానియి, వచ్చిన రోజు నవ్వుతూ పలకరిస్తుంది. ఏదన్నా తెచ్చిపెడితే తృప్తిగా తింటుంది. ఫలానా కావాలని అడగదు."

2434. "చక్కని మొగుడు కావాలంటారు. చక్కని భర్త కాదు. భర్తే చక్కదనం."

2435. "వివాహం చక్కదనంపై ఆధారపడి లేదు,మనస్తత్వం మీద ... కష్ట సుఖాలు పంచుకునే ఉండాలి.

# విధి

2436. "కార్యకారణాలకు కర్తలం మనం కాదు."

2437. "పుట్టటమే కర్మ. నువ్వు చెయ్యటం కాదు - వాడు చేయించటమే.

'మీరు సెలవీయండమ్మా - మీ అడుగు జాడలలో నడుస్తాను'

"ఇప్పుడు నడవకపోతేగా రేపు నడవటానికి."

2438. 'అంతా ఒకటేననే భావం ఎప్పుడు వస్తుంది?'

"అంతకు ముందు దీనిని గురించిన ఆలోచన లేదు గదా! ఇప్పుడు ఈ విషయం తెలుసుకుందామని కలిగింది. అట్లాగే మనకొచ్చే పరిణామాలు మనకు తెలియకుండానే వస్తుంటాయి."

2439. 'నా తప్పుంటే దిద్దుకుంటానమ్మా -'

"ఎవరిదీ తప్పులేదు. ఎట్లా జరగాలని వుంటే అట్లా జరుగుతుంది."

2440. 'ఒకటనుకుని రెండు కాయలు కొట్టాను.'

"ఏదయినా అంతే. రాననుకుని వస్తావు."

2441. 'మ్రొక్కు గూడా నిర్ణయం లోదేనా?

"అంతా నిర్ణయమే."

'అప్పుడు వాడి దయేముందీ?'

"దాహం అయింది. వాడిద్వారా ఇప్పించాడు - అనుకొంటాము."

2442. 'మా కుటుంబానికి కావలసినవి లేవు.'

"మనం అనుకొన్నట్టుగా - కోరినవీ, కావలసినవీ లభించవు. దైవం ఇచ్చినట్టు జరుగుతుంది."

2443. "దేని కట్టుబాటు వల్ల ఇదంతా జరుగుతున్నది? అదే దైవం. దానికే పేరు పెట్టినా సరే."

2444. "నడిపించేవాడు విధి,నడిచేది విధానము."

2445 "పతన మేముందీ? ఎవరికి ఎంత అవసరమో అంత వరకూ చేయిస్తాడు."

# ప్రేరణ

2446. "మన చేతిలో ఉందని ప్రారంభిస్తే ఏమీ లేదని తెలుస్తుంది."

2447. 'సర్వమూ వాడి ప్రమేయం వల్ల జరిగినప్పుడు, - కర్మ సిద్ధాంతం? - మానవుడికి ఎంతవరకు స్థానం?'

"కర్మ మనం చేయడమంటే వాడు చేయించటమే."

2448. "జరగాల్సిందేదో జరుగుతున్నది. వచ్చినది ప్రసాదమనుకో. ఎవరు దైవమని నీకు తోస్తే వారి మీద పడెయ్యి."

2449. "రోగాలు ఇచ్చిన దెవరూ? భగవంతుడేగా! ఇచ్చిన వాడే తీసుకొంటాడు."

2450. "ఎవరిచేత ఏ పని చేయించినా, రెండూ వాడే."

2451. 'దేవుడే పెడతాడని కూర్చుంటే వస్తుందా?'

"కూర్చోలేం - కూర్చుంటే పెడతాడు."

2452. "నేనే చేస్తున్నా నంతా - అనుకొన్నా బాధ లేదు. పూర్తిగా వాడు చేయిస్తున్నా - డనుకున్నా బాధ లేదు."

2453. 'దైవకార్యం చేయాలని వుంది. ఎప్పుడు నెరవేరుతుంది?'

"దైవం చేయించుకొన్నప్పుడు."

2454. "నీ తెలియనితనానికి కారణం నేను. నీ చేత తెలియబర్చు కోవలసింది నేను. నువ్వు చెయ్యి - అనేది లేదు."

# తృప్తి

2455. "అసంతృప్తికి తావు లేని భావన. సాధనలన్నింటికీ చరమదశ తృప్తే నాన్నా!"

2456. "సుఖం ఎక్కువ ఉందీ అంటే - తృప్తిలో ఉంది."

2457. 'ఏం చెయ్యాడ మమ్మా?'

"ఏది వస్తే దానికంతకూ ఒడిపట్టడమే."

2458. "శాంతి హృదయంలో ఉండాలిగానీ, ఎక్కడికెళ్ళినా దొరకదు."

2459. "ఎప్పుడూ తొణకని వాడి పని హాయి."

2460. "మహాయోగే మహాభోగి. ఇది లేదని బాధ లేనివాడు యోగి. ఎంతున్నా తృప్తి పడేవాడు భోగి."

2461. "బాధ తానై అనుభవిస్తూ తనకేది వచ్చినా తొణకని స్థితి సహనం."

2462. 'నాకు చాలా అశాంతిగా ఉందమ్మా -'

"నేను శాంతిగా ఉన్నానని ఎవరినైనా చెప్పమను. శాంతిగా ఉన్న వాడెవడూ యీ ప్రపంచంలో?"

# సందేశం

2463. 'సందేశం కావాలమ్మా.'

"అమ్మగా చెప్పే దేముందీ? అమ్మగా వ్యక్తం కావటమే."

2464. 'మేం బాధపడుతున్నాం - అని తెలుసు గదా? మాకు మంచిదారి చూపించరాదూ?'

'రెండు ఉంటేనేగా అలోచన? అంతా మంచి, అంతా చెడు - అయితే ఆలోచన ఏముంది?"

385. ఆప్తే : మాకేదేనా ఆదేశం . . .

అమ్మ : మీ కిచ్చింది తృప్తిగా తిని, ఇతరుల కాదరణగా పెట్టడం, సర్వమూ దైవం చేస్తున్నా డనుకోవటమే.

386. 'మనసుకు స్తిమితం కలగటానికి మార్గం జెప్పమ్మా?'

"జరిగే ప్రతిదీ దైవం చేయిస్తున్నా డనుకోవటమే."

# మానవత్వం - మాధవత్వం

387. డాక్టరు కమలతో అమ్మ అన్నారు ఒకానొక సంభాషణలో . . .

"అక్కడే ఉన్నదమ్మా సృష్టి గొప్పతనం! మీరు డాక్టర్లే. శరీరం గురించి, ఆ వ్యాధుల గురించి నిరంతరం చదువుతుంటారు. ఆ శరీరాలు కోస్తుంటారు. అంతా చూస్తూ ఆ క్షణంలో ఇంతే కదా! మన శరీరాలు - ఇందులో ఏముంది? అనుకుంటారు. కాని ఆ గది దాటి వచ్చాక ఈ విషయాన్ని మరచిపోయి మళ్లీ వ్యామోహంలో పడుతూనే ఉంటారు."

388. 'నా జీవితం సందిగ్ధంగా ఉన్నదమ్మా.'

"సందాగ్ధావస్థ అంటేనే మానవత్వం."

389. 'ఏమి మానుకున్నారు తల్లీ? అన్నం తినటం లేదా? నిద్రపోవటం లేదా?'

"అవి తప్పవు కదమ్మా! ఒక రోజు కారణాలతో కట్టుపడ్డా, మరొకరోజు మేమున్నా మంటే పరుగెత్తుకొస్తాయి. మనతో కూడానే వచ్చినయ్యి గదా, మనను విడిచి యెక్కడుంటాయి? మనలను వదిలిననాడు మనం మానవులం కాము; మాధవులమే."

390. "ఎప్పుడూ మానవుడు అందనివాటిని గురించి ఆలోచిస్తూ వుంటాడు."

2471. "జరిగిన కాలమంతా గుర్తు ఉంటే మానవులం కాము."

2472. "కొన్నింటిలో అస్వతంత్రులం అంటున్నారే, అది దైవప్రేరణ అయింది. అంతా దానిలో వున్నదే."

2473. "అవునూ - కాదూ, అని రెండింటి మధ్య నలగటమే మానవత్వం. నీ కీ విషయంలో కావొచ్చు. ఇంకొకరికి ఇంకో విషయంలో కావచ్చు."

2474. "మీ రనుకునే దోషం లేని మనిషి ఉండడు."

2475. "నా గర్భ తీపి సర్వత్రా ఉంటుంది.
మీ గర్భ తీపి పరిమితంగా ఉంటుంది."

2476. 'కర్మ ఆర్జించుకున్నది కాదన్న మాట.'

"కాదు. అది కూడా వాడిచ్చినదే."

2477. "అతనికి ఎవరి పాటా నచ్చదు.... అందరికీ అంతేలే. ఒకడికి సంగీతంలో ఉండొచ్చు. ఇంకోడికి ఇంకో దాంట్లో కావచ్చు. ద్వేషం లేకుండా లేదు. అది లేకపోతే మానవుడు కాదు."

2478. 'అయితే ఏ పాపమూ లేకుండానే పుట్టామా అమ్మా?'

"భూమి మీదికి పంపించేటప్పుడు మీ వంతు ఇచ్చిన పాలే పాపాలు."

2479. 'దుంపతెగ అనేశారే; అంటే ఏమిటమ్మా?'

"దుంపతెగ అంటే - నీ గుణాలన్నీ తెగిపోవాలని."

2480. 'ఒకటి రెండు అనుకున్నవి జరగటం వల్ల నమ్మకాన్ని కల్గిస్తాయి-'

"అవే నమ్మకాన్ని తీసేస్తాయి."

2481. "జ్ఞానులకు అన్ని మాటలు మహావాక్యాలల్లేనే ఉంటాయి. కొన్ని బాగుండటం, కొన్ని బాగుండకపోవటమే అజ్ఞానం."

2482. 'చెబితే తెలుసుకుండేది ఏమిటి?'

'చెపితే తెలిసేది కాదు; తెలియజేస్తేనే తెలుసుకుండేది."

2483. "జ్ఞాని పశువులో దైవాన్ని చూస్తాడు.
అజ్ఞాని మానవుడిలో పశువుని చూస్తాడు."

2484. "జ్ఞాని మానవుడిలో దైవాన్ని చూస్తాడు.
అజ్ఞాని దైవంలో మానవుణ్ణి చూస్తాడు."

2485. 'తరించడ మెట్లా?'

"తరింపజేస్తే తరిద్దాం."

2486. 'మానవుడే మాధవుడా అమ్మా?'

"భగవంతుడున్నాడని గుర్తించింది మానవులు. పుస్తకాల్ని రాసింది మానవులేగా? మానవుడు లేకపోతే దేవుడే లేడు. మానవత్వం మానవ తత్వాన్ని గుర్తిస్తే మాధవుడే. గుర్తు తేడా తప్ప మాధవత్వం మానవత్వంలో వున్నట్లేగా? ఒక వస్తువు దగ్గర పెట్టుకుని మర్చిపోయి వెతికినట్లు - మానవుడికీ మాధవుడికీ తేడా."

2487. 'ఏమిటో ఈ మమకారం?' అని మూల్పూరి వారు.

"మమకారం అందరికీ ఉంటుంది. భగవంతుడు యందుంటే భక్తుడు అంటారు. తన పిల్లల వరకే పరిమితిగా ఉంటే పామరత్వం. అందరి యందూ ఉంటే భగవంతుడు."

2488. "మాధవుణ్ణి గుర్తించి అన్ని వస్తువుల్లోను మాధవుని చూచిన మానవుడే మాధవుడు."

2489. "కారణాలలో కూడింది ప్రేమ కాదు - అవసరం."

2490. "వాడిష్ట మొచ్చినట్టు నడుపుకోడమే గాని వీడిదేం లేదు."

"మన మెంత - అనుకోవాలి గానీ మనం ఎంతటి వాళ్ళమో - అనుకుంటే ఎట్లా?"

# శక్తి

2491. "శక్తి అంటే అన్నింటికీ మూలమైనది."

2492. "శక్తి కనపడదు, కనిపెడుతుంది."

2493. "అంతటా వున్న శక్తే భగవంతుడు."

2494. "శక్తిని గుర్తించటానికి రూపమే అధారం. చెప్పుకోవటానికే అకృతి. అంతటా ఉన్న దైవం శరీరంతో రావటానికి కారణం అదే. తాను రాకుండా చెయ్య లేడా? అంటే - చెయ్యగలడు కాని వాడిని గుర్తించే దెట్లా?"

2495. "సబ్బుకు ఇమిడే శక్తి ఉన్నది. సబ్బు పెట్టెకు ఇమిడ్చే శక్తి ఉన్నది. శక్తి అంతా ఒకటే."

2496. 'మాలిన్యం వాడికి లేదూ?'

"తనకు లేకపోయినా మనకు మలినం పెట్టాలంటే వాడికి కావలసి వచ్చిందేగా? ఈ కావలసి రావటం అంతా వాడి రూపమే. ఆ శక్తి రూపమే. ఒకే శక్తి అదీ వాడూ అయింది."

2497. "శక్తి ప్రతీ దాన్లోనూ వున్నది. కట్టెకు కాలే శక్తి వున్నప్పుడూ, గిన్నెకు కాల్చుకునే శక్తి వున్నప్పుడే - అన్నం ఉడక గలుగుతుంది."

2498. "ఒకే శక్తి. ఇన్ని రకాలేం? అంటే - దారం మొత్తం ఒకటే, మెలికలు తేడా."

2499. "నడిచే కాళ్ళు కనిపిస్తున్నా నడిపించే శక్తి కనబడదు. అక్కడ చెప్ప ననిపించిన శక్తి ఇక్కడ చెప్పించింది."

2500. "రూపాంతర మయ్యే దంతా, ఆత్మ శక్తే."

2501. "పరాశక్తి అంటే, మనకు అందుబాటులో లేని శక్తి."

2502. "సైన్సు పదార్థంలోని శక్తిని చూస్తున్నది. కాని ఆ శక్తికి దైవం అని పేరు పెట్టలేక పోతున్నది."

2503. 'అతీతశక్తిని తెలుసుకోవటం ఎట్లా?'

"అతీతశక్తి ఉన్నదని ఆలోచిస్తున్నది ఇదే. ఇక్కడ ఉన్నదే అంతటా ఉన్నది. అనుభవం పొందేదీ ఇదే."

# సందేహమూ - సమాధానము

2504. 'ఏం చెయ్యమంటారు?'

"నీకు తోచినది చెయ్యి-"

2505. 'మీరు ఏం చెపితే అది చేస్తా-'

"ఏమీ చెప్పాలనిపించటం లేదు."

2506. 'పరాయి వాళ్ళన్నమాట?'

"పరాయివాళ్ళూ లేరు, అయినవాళ్ళూ లేరు."

2507. 'అమ్మ ఏది కట్టుకుంటే బాగుండదూ?'

"అమ్మ అంటే ఇష్టం. కనుక ఏది కట్టుకున్నా బాగుంటుంది."

2508. 'సందేహాలు ఉంచుకోవటమే మంచిది. ఇంకోసారి రావచ్చు.'

"అడగటానికి రాలేదు. వచ్చారు కనుక అడుగుతున్నారు."

2509. "నాకు సందేహాలూ తెలియవు. సందేశాలూ తెలియవు. తిండే ప్రధానం."

2510. 'నీకు కూడా కల వస్తుందా?'

"మీ అందరి మధ్య ఉండి - తల ఇక్కడ లేకపోతే కల. అందరికీ కనిపించేది కాదు, తనకు కనిపించేదే కల."

2511. 'పిల్లి దిండు మీద పడుకుందే మమ్మా?'

"అదేనా అంత పనికిరానిదీ?"

2512. 'నువ్వు వెళ్ళాక - ఈ సంస్థ ఏమవుతుంది?'

"అన్నీ ఏమవుతాయో - ఇదీ అంతే."

2513. 'అమ్మా! బ్రహ్మ రాక్షసులున్నారు - అంటారు. అదేమిటి?'

"మన భ్రమే బ్రహ్మరాక్షసి."

2514. "కుంకుం కిందపడిందా? ఆ భూదేవిచ్చిందే. ఆ తల్లి ఇచ్చింది ఆ తల్లికే పెట్టావు. ఏం దోషం లేదు. కాళ్ళ మీద పడాల్సింది కళ్ళముందు పడ్డదిలే."

2515. 'పంచామృతంలో ఒక శ్లోకం చదువుకుంటాను. అది చేసుకునేటప్పుడు నిలిచి - మిగతా అప్పుడు మనస్సు చంచలం అవుతుంది. అట్లా కాకుండా ఉండాలన్నది నా పట్టుదల.'

"మధ్యలో నిలిచి ఎప్పుడో పోతోందంటున్నావు. నీకు తృప్తిగా వుంది కనక అదే చేసుకో. భోం చేసి వెళ్లు -"

2516. 'అనసూయావ్రతం చేసుకోవాలి. ఎప్పుడు?'

"మీ యిష్టం."

'అట్లా కాదు, మీరు చెప్పాలి.'

"మీరు చేద్దామనుకున్నప్పుడు చెయ్యడమే నేను చెప్పడం."

2517. "నువ్వు చేసుకున్న పాపమా? నీకు చేసుకోటానికి స్వతంత్ర మున్నప్పుడు బాధలు తీసేసుకోటానికీ స్వతంత్రమున్నట్టే గదా? (తీసేసుకో.)"

2518. 'ఈ లోకంలో ఇన్ని రకాల వైవిధ్యాలు ఏర్పడ్డయి కదా? వాటిని తొలిగించ డానికి మార్గం లేదా?'

"సృష్టే అది కదా? వైవిధ్యం సృష్టి స్వభావం."

2519. 'గుడ్డీ, కుంటీ - ఇట్లా తారతమ్యం ఎందుకూ?'

"శక్తి యొక్క స్వభావమే."

2520. "నాకు డయాబిటీ సమ్మా?'

"నాకూ ఉంది నాన్నా."

2521. 'మా అబ్బాయికి లెక్కలు రావు.'

"మా అబ్బాయికి లెక్కలు రాక 3 సార్లు తప్పేడు."

2522. 'ఈ సంసార గొడవలు బాధగా ఉన్నాయమ్మా. మోక్షం కావాలి-'

"ఈ సంసారం బాధ అనిపించకపోవడమే మోక్షం."

2523. "కన్నతల్లిని బిడ్డ చంపటం, కన్నబిడ్డని తల్లి చంపటం, తండ్రిని బిడ్డ చంపటం - ఉన్నాయిగా?"

'దేనికమ్మా అలాటివీ?'

"ధర్మం కోసం కావచ్చు, స్వార్థం కోసం కావచ్చు."

2524. 'నా కోరిక తీర్చండమ్మ-'

"వచ్చినవాళ్ళ కోరికల్లా తీర్చాలనే కోరిక నాకూ వుంది. కాని - మనం అనుకున్నది జరగదు. వాడిచ్చింది తప్పదు గదా?"

2525. 'కోరిక తీరకుండా పోతే ఏమౌతుంది?'

"అది వరకు ఎన్నో కోరికలున్నా ఆ టైముకు అన్నీ పోతాయి. తన శరీరంతోనే తనకు సంబంధం లేదనిపిస్తుంది కదా?"

2526. 'సంక్రాంతికి బొమ్మలు పెట్టడమెందుకూ?'

"ఇవన్నీ కూడ అదేనని."

2527. 'సహజ ప్రేమ అంటే?'

"దారిని పోయేవాడికీ, సంబంధం లేనివాడికీ సహాయం చేస్తే - ఆ ప్రేమ అవ్యాజం. ఆ ప్రేమ సహజం."

2528. 'అదీ కరుణే. ఇదీ కరుణే - అని మనస్సులో కుదరటం లేదమ్మా.'

"కుదరక చేసేదేం లేదు."

2529. 'మాకు సాధన చెప్పమ్మా -'

"వచ్చిన వాడికి ఆదరణగా పెట్టడం, ఉన్నదానితో తృప్తిగా ఉండటం."

2530. 'అదైనా మేం పెట్టటం లేదు గదమ్మా?'

"ఆ పెట్టటంలో మీరు ఎంతవరకు భాగస్థులై ఉన్నారో - అంతవరకూ తృప్తిగా పెట్టటం."

2531. 'జగత్తు మిథ్య అని రాశారీవిడ. దిద్దమంటావా?'

"అది ఆవిడ అభిప్రాయం అయితే దిద్దకు. నా అభిప్రాయంగా రాస్తే సరి చెయ్యాలి."

2532. 'సృష్టికి బీజం ఏమిటమ్మా?'

"శక్తే."

2533. 'దేవుడికి ముడుపు లివ్వాలంటా రేమిటీ?'

"ముడుపు లివ్వడ మంటే - మనస్సును యివ్వడమే. ఆ మనస్సును యివ్వలేక, వస్తురూపంగా యిచ్చి తృప్తి పడదామని కావచ్చును."

2534. 'మనం చేసుకున్న కర్మకొద్దీ మనకి వస్తుందంటారు ఏమిటమ్మా?'

"నాకు కర్మ తెలియదు. జన్మ రావటాని కేది కారణమో అనుభవానికీ అదే కారణం అనిపిస్తుంది. పేర్లు మాత్రం తెలియవు."

2535. 'ఆవిడ పోయిందిగదా! ఆమె ఆత్మ ఎక్కడికి పోతుంది?'

"ఎక్కడ్నించి వచ్చిందీ?"

'భగవంతుడి దగ్గర్నుంచి.'

"అయితే అక్కడికే పోతుంది."

2536. "మరణానంతరమా?

అంతటా ఉన్న ఆత్మలో కలుస్తుంది."

2537. 'ఆధ్యాత్మిక జీవితంలో సాధన ఏం చెయ్యాలి?'

"సాధనా? చేసేది (ఏదైనా) చాలు. (జరిగినదే సాధన) చెప్పేదేమున్నదీ?"

2538. 'ప్రారబ్ధం ఎట్లా పోతుందమ్మా?'

"ప్రారబ్ధం వీడిదైతే గదా?"

2539. 'మేము ఏం చేస్తే సరి అయిన పని?'

"మీరు చేస్తున్నది దైవసేవ అనీ, సక్రమంగా చేస్తున్నామనీ - అనుకుంటే సరి."

2540. 'ఇంకేం అక్కర్లే దనేది ఎప్పుడొస్తుందీ? ఏం చేస్తే వస్తుందీ?'

"ఏం చేసినా రాదు - వాడిస్తే వస్తుంది."

2541. "ప్రేరణ అర్థం కాదు. గుర్తు అర్థమవుతుంది. ఇక్కడి కొస్తావు నువ్వు. అటు తిరగి పడుకుంటా నేను. నీ గురించే ఆలోచిస్తుంటా. అది ప్రేరణ. నువ్వు వచ్చిన తర్వాత అది నీకు గుర్తు."

2542. 'నమస్కారం ఏమిటమ్మా?'

"నీ విచ్చిన శరీరం నీ కర్పణ అని తలవంచటం."

2543. 'భక్తి రావడానికి మార్గం?'

"భక్తితోనే."

2544. 'భక్తిని జ్ఞానంగా చేసుకోవటం ఎట్లా?'

"జ్ఞానంలో భక్తి ఉంది. భక్తిలో జ్ఞానం ఉంది. రెండూ విడిగా లేవు. భక్తి పూర్తిగా ఉన్నప్పుడు జ్ఞానం అంటున్నాం. సర్వం నేనే అన్నప్పుడు జ్ఞానం. భక్తిలో నీవు తప్ప ఇంకొకటి లేదనిపిస్తుంది."

2545. 'భక్తి కంటె జ్ఞానం గొప్పదంటారు?'

"ఉపన్యాసాలు వింటారు నాన్నా. తన మనసులో ఒకటుంటుంది. అవి విన్న తర్వాత 'అదేనేమో! అయ్యో నే చెయ్యలేక పోతున్నానే' అనుకుంటాడు."

2546. 'ధ్యాసే ధ్యానం అన్నావు కదా? అదే సరిపోతుందా? లేక వేరే ఏదైనా సాధన అవసరమా?'

"అది తప్ప రెండోది లేనప్పుడు అదే ధ్యానం అవుతుంది. అప్పుడు పూజలు, కళ్ళు మూసుకోవటం, జపం చేసుకోవటం అవసరం లేదు."

2547. 'భక్తి ఉండటం వల్లనే అనుగ్రహం కలుగుతుందా?'

"ఒకరు చెప్పటం కంటె అది తనకు తెలిస్తే బాగుంటుంది."

2548. 'మంత్రం చెప్పకోటంలో ఉద్దేశం (ఏమిటీ)?'

"ఉద్దేశం - ఇంకొకటి మనసులోకి రాకుండానే."

2549. 'ఆధారం దొరికిందమ్మా. అది సహస్రారానికి లేవాలి.'

"ఆధారమాధారమైతే - అంతా సహస్రారమే."

2550. 'ఆధ్యాత్మికంలోకి వెళ్ళటానికి ఒక మార్గం చూపించండమ్మా-'

"ఏది చేసుకుంటున్నావో అదే చేసుకో. ఏ నామం నీకిష్టమైతే అది చేసుకో."

2551. 'శరీరం గొప్పదా? ఆత్మ గొప్పదా?'

"అన్నీ కలిసిందే ననిపిస్తుంది."

2552. 'ఆ శక్తి దేవుడో ఏదో ఇంతమందినీ చావకుండా చేయొచ్చుగా?'

"ఆ శక్తి పుట్టకుండానూ చెయ్యవచ్చు."

2553. 'బాబా (నాకు) కనపడతారా అమ్మా?'

"ఏమో. కనపడాలనుకుంటే కనపడతారు. నీ చేత నామమే చేయించు కోవాలనుకుంటే చేయించుకుంటారు."

2554. 'నాకు మెప్పించుకుండే భక్తీ, రప్పించుకుండే శక్తీ రెండూ లేవు.'

"తప్పించుకుండే యుక్తి -"

2555. 'తప్పని తెలిస్తే తప్పించుకుంటాడు గదమ్మా?'

"తప్పు చెయ్యక శిక్షింపబడేవాడూ ఉంటాడు. చేసి తప్పించుకునేవాడూ ఉంటాడు. ఒక శక్తి నడిపిస్తున్నది అనిపించటానికే ఇట్లా అర్థం కాకపోవటం అనిపిస్తుంది."

2556. 'నేను చెయ్యలేని ఊహ నా కెందుకూ కలిగించడం?'

"నీవు కాకుండా నీ కతీతమైన శక్తి ఒకటుందని తెలియజెప్పడానికి."

2557. 'జరగదని కేటగారికల్‌గా తెలిసినప్పుడు అనుకోవటం దేనికి జరుగుతుందీ?'

"మనం కాకుండా ఏదో అతీతమైన శక్తి ఉన్నదని తెలియటానికి."

2558. 'సంకల్పం దైవం అయినప్పుడు మాకు కావాలని లేస్తాం, మళ్ళా వద్దని పిస్తుంది. రెండు సంకల్పాలెందుకూ ఇంత మాత్రానికీ?'

"మనకు అర్థం కానిది మనకు తెలియనిది
ఏదో శక్తి చేయిస్తోంది - అనిపించడానికి."

2559. 'ఇంతకూ నా అనుమానం. 'నేను' అంటూ ఉన్నదా, లేదా? - ఈ మనస్సు, శరీరం కాక?'

"నేననేది - మనస్సే దైవం. శరీరం మొత్తం ఆవరంచి ఉంటుంది శక్తి."

2560. 'ఇదివరకు అలాగ వచ్చేవాణ్ణి. ఇప్పుడు రాలేకపోతున్నా నెందుకు?'

"ఇది వరకు ఎందుకు రాగలిగేవో ఇప్పుడందుకే రాలేకపోతున్నావు."

2561. 'నేను చెయ్యాల్సిన దైవకార్యాలు కొన్ని ఉన్నాయి. నా కోరిక నీకు తెలుసు. నా క్కావలసింది లేదు. అయినా పని ఆగి పోయిందమ్మా.'

"నువ్వు చేయటం కాదు. నీ చేత చేయుంచుకుంటేనేగా చేసేది? ఆగి పోవటం నీ వల్ల కాదుగా? ఎందుకు ఆపేడో! గట్టిగా అడుగు. చేసేదంతా దైవ కార్యమే."

2562. 'మనస్సు కొడి గట్టింది. ఎవరేనా కొడి తీసేస్తారేమోనని.'

"కొడిగట్టడానికీ పోవడానికీ కాల పరిమితి వుందిగా?"

2563. 'భగవంతుడు కల్పవృక్షం అంటారుగదా

ఇంతమంది కష్టాలు ఎందుకు అనుభివిస్తున్నారు?'

"కష్టాలు వాడివీ, సుఖాలు మనవీనా? రెండూ వాడివే. రెండూ వాడే."

2564. 'దేనికీ కర్తలం మనం కాదు. కనక ఏం చెయక్కర్లేదుగా?'

"ఊరుకో, ఊరుకోనివ్వదు. ఏవో సంకల్పాలు వస్తుంటాయి, పోతుం టాయి."

2565. 'పరమాత్మ ఏది ఇస్తాడో అది నడవటమేనా?'

"పరమాత్మ ఏది ఇస్తాడో అది నడవాలి - అనేది నమ్మటమే. ఆ నమ్మకమూ తానే ఇస్తాడు."

2566. 'రక్షణ రకరకాలుగా ఉంటుంది అన్నావట?'

"ఎప్పుడూ ఉంది నాన్నా. అందరూ చూస్తున్నారు, వేరుగా ఉంటుంది అనే వాళ్ళకి సమాధానం."

2567. 'శాంతి ఎప్పుడు వస్తుంది?'

"ఈ ద్వంద్వాలు రెండూ సహజమనిపించిప్పుడు."

# ఆరాధన

2568. "పెద్ద చీరలు పెట్టటమూ, పూలతో పూజ చెయ్యటమే పూజ కాదు. గడ్డిపోచతో చేసినా అది పూజే. పూజకు చిన్నా పెద్దా ఏం లేదు."

2569. "మందిరం పోతే పూజ ఎక్కడికి పోతుందీ?"

2570. "ఎవరి పూజ వాళ్ళది. మీరు పూలు పెట్టి పూజ చేస్తే డాక్టర్లు ఇన్‌జక్షన్‌లు, మందుల ద్వారా పూజ చేస్తున్నారు."

2571. "ఇక్కడ - మాకు తెలుసు అనుకున్న వాళ్ళు గుర్తించ లేకపోవచ్చు. ఏమీ తెలియదు - అనుకునేవాళ్ళు గుర్తించ వచ్చు."

2572. "ఎన్ని బాధలు వచ్చినా మరవకుండా వుండటమే పూజ అంటే."

2573. "అనుష్టించడమే నిష్ఠ. వాణ్ణి కొలవాలి - అనుకునేటప్పుడు ఏ గుడ్డా అడ్డం రాదు."

2574. 'ప్రార్థన అంటే?'

"ఎవరినో అడగటం."

2575. "నమ్మకం కల్గడానికే ప్రార్థన - నమ్మి గాదు."

2576. "దేముడ్ని ఎందుకు ప్రార్థించాలి? ప్రార్థించకుండా వుండవచ్చు. ప్రార్థించాలనిపిస్తే, ప్రార్థించవచ్చు. ప్రార్థించకుండా వుండగలిగితే వుండవచ్చు."

2577. "ప్రతీ వస్తువులో దైవత్వాన్ని చూడటానికే యీ వ్రతాలన్నీ ఏర్పడ్డాయి."

2578. పూజ పూర్తి అయి నివేదన సమయంలో అమ్మే స్వయంగా అడిగింది తన నోట్లో పెట్టమని. సీతమ్మగారు భయపడ్డారో, బిడియపడ్డారో కాని ఆ పెట్టే విధానాన్ని చూసి అమ్మ నవ్వి అన్నది "పెట్టేటప్పుడు నీవు పిల్లనని మర్చిపోయి అమ్మననుకుని పెట్టు, గుజ్జనగూళ్ళు చేసి. ఎవరికైనా సరే పెట్టేటప్పుడు అంతే."

2579. 'టెంకాయలన్నా కొట్టాలా?'

"ఆయనిస్తేగా కొట్టేది? నాకే మివ్వలేదు - అని చెప్పుకో."

2580. 'పూజ కానిదే భోజనం చెయ్యకూడదని నిశ్చయించుకున్న మా బృందానికి వేళకు భోజనం చెయ్యకపోతే వాళ్ళ ఆరోగ్యాలు ఎక్కడ దెబ్బతింటాయో అని - అమ్మ ఎన్ని విధాలుగా చెప్పినా, వాళ్ళు వినకపోవటంతో - మందలింపు స్వరంతో అన్నది -

"భోజనం లేకుండా ఉంటే అది భక్తా? భక్తి మనస్సులో ఉంటే చాలదా? మనస్సులో లేకపోయిన తర్వాత ఈ పైవన్నీ ఎందుకూ?"

2581. 'మీ దృష్టిలో మంచి ఆరాధన అంటే?'

"చేస్తేనే గదా చెప్పటానికి? మిమ్ములను దగ్గరకు తియ్యటం, మీరు కావాలనుకోవటం. మీరు కాని దైవం లేదు. ఇక్కడకు రావటమూ ఆరాధనే అహర్నిశం స్మరణా ఆరాధనే."

2582. "చూడకుండా ఉండలేనంత ఆవేదన నీలో వుంటే తప్పక చూస్తావు."

2583. 'అమ్మా, మీ చిత్రం ముందు కూర్చుని నా మొఱ ఆలకించమని వేడుకుంటాను. మళ్లీ ఏమిటో నా మనస్సు కలుషితమైనదనీ మీరు నా మొర వినటం లేదేమోననీ అనిపిస్తుంది.'

"నేను వింటున్నా వినకపోయినా నీ మొరే రక్షిస్తుంది."

2584. "ఇతరులలో లోపం చూడకపోవటమే పవిత్రత."

2585. "ఇష్టదైవం తప్ప నేను లేను - అనుకున్నది ఉపాసన. తాను లేకుండ పోవటమే ఆత్మార్పణ."

2586. "నాలుగు రోజులు ఆహారం పెట్టకుండా ఉంటే, అన్నంపైన నీ ధ్యా ఎట్లా ఉంటుందో - అదే ఉపాసన."

2587. "తపనేగా తపస్సంటే."

2588. "ముద్ర అంటే అధికారం."

'ముద్రలు వేయటం ఎందుకు?'

"వాటంతటవే వచ్చేస్తాయి."

2589. "స్వయం ప్రకాశం అంటే తానే సర్వత్రా ప్రకాశించటం. స్వయం ప్రకాశా

చూడటం అంటే తాను అంతటా ప్రకాశించలేడు గనుక తాను ఇష్టదైవ మనుకుండే దాంట్లో చూడటం."

2590. "పిల్లలయేది ఎవరైనా అయేది - వారికి ఏది చేసినా 'నా కోసం నేను చేసుకుంటున్నా' నన్నట్లుగా ఉండాలి. అంతేగాని ఎవరినో ఉద్ధరించటానికి కాదు."

2591. 'జపం చేయటమెందుకూ?'

"అలవాటు. తక్కినవి మరవటానికి కాదు. ఏదీ జపిస్తుంటామో ప్రతిదీ అదిగా వినగలందులకు. ప్రతీదానిలోనూ ఆ శబ్దం వినాలనీ."

# సాధన

2592. "భగవంతుణ్ణి గురించిన దిగులే జిజ్ఞాస."

2593. "ప్రజాసేవ చేయటమూ మోక్షమార్గమే."

2594. "నమ్మకమే దారి. నమ్మకాన్ని మించిన దేముందీ?"

2595. 'ఆధ్యాత్మికంగా ఏదైనా చేయటానికి కుదరటం లేదు.'

"చేయాలని మనస్సు ఉండటమే కుదరటం."

2596. "నిష్ఠలూ, ఆచారాలూ పెట్టారంటే - ఒక నియమం కోసం. గుర్తు ఉండాలి కానీ, ఏ స్థితిలో అయినా చేసుకోవచ్చు."

2597. "ఏది తటస్థ పడ్డప్పుడు అది తింటే - అదే జిహ్వను జయించటం."

2598. 'ఫొటోకు పూజ చేస్తూ, విగ్రహాలకు మానవచ్చా?'

"ఎవరికి చేసినా ఒకటే. విగ్రహాలకు చేసి ఫొటోకు మానుకున్నా ఫరవాలేదు. రెంటికీ చేసినా ఫరవాలేదు. ఫొటో వేరూ, విగ్రహాలు వేరూ కాదుగా!"

2599. "నా దృష్టిలో నమస్కారం చేయించుకునే వాడి కంటే చేసే వాడి పని హాయి. ఎవరికి చేస్తున్నాడు? ఆ కాసేపు పవిత్ర భావంతో తనకి తాను చేసుకుంటున్నాడు."

2600. "ముద్రలకు సంబంధించిన అభినయం యోగం లాంటిది. యోగాసనాలు, ప్రాణాయామం ఎటువంటివో, భరతనాట్యమూ అటువంటిదే."

2601. "చేయించేది అదే."

2602. "చేతులు ముడుచుకు కూర్చోటమేనా అంటే - అది వీడి చేతైనా అంతా వీడి చేతుల్లో ఉన్నట్టే."

2603. "నువ్వు దేనికీ కర్తవి కావంటూ నువ్వు చెయ్యాల్సిన ప్రయత్నం ఉందంటారు!"

2604. 'మన కర్మ పరిపక్వమై దివ్యదర్శనాలు కలుగుతై' అంటారు. మళ్ళీ 'అది

పూర్తిగా నిలవనివ్వకపోవటం కూడా మన ప్రారబ్ధమే' అంటారు. రెండూ ఒకటే అంటారు. ఇదెలాగమ్మా?'

"రెండూ నిజమే. రెంటికీ కారణం ఒకటే గనుక."

(కర్మ పరిపక్వానికీ, ప్రారబ్ధానికీ)

2605. "ప్రేరణ ఎక్కడిదో అయినప్పుడు వీళ్ళు సాధన చెయ్యడమేమిటీ?"

2606. 'ఈ సాధన చేస్తే అది, అది చేస్తే ఇది వస్తుంది - అని చెప్తారుగా మరి?'

"వాడిస్తేగా మరి?"

2607. పూజామందిరంలో అమ్మకు పూజచేసిన తర్వాత బాబాను పూజ చేసుకుంటాము. మీరేమంటారు?' అన్నాడు ఒకాయన.

"చెయ్యండి. మీకు చెయ్యాలి అనిపిస్తే చెయ్యటమే" అన్నది అమ్మ.

2608. 'మేము తరించటానికి ఏమి చెయ్యమంటారు.'

"ఏం చెయ్యాలని తోస్తే అది."

2609. "ఏ సాధన చేసినా రానిది దానంతట అదే రావచ్చు."

2610. "నాచే యీ పని చేయిస్తున్నాడనుకున్నప్పుడు అదే సాధన,తపస్సు,యోగం అవుతుంది."

2611. 'ప్రార్థన చేసినా జరుగదా?'

"ప్రార్థన చేయించేది అదే, నిర్ణయానుసారం."

2612. "జపం చేసుకోవడం ఎంతకష్టమో, మానుకోవడమూ అంతకష్టమే."

2613. "జపం, పూజ మానుకోమని గాదు - అవి చేయించేది వాడే అంటున్నా."

2614. "చేయవద్దని చెప్పలేదు. చెయ్యాలనిపిస్తే చేయటం - మానుకోవాలంటే మానుకోవటం."

2615. 'ఏం చెయ్యాలమ్మా దేవుణ్ణి గురించి? ఏం తోచదు, మనస్సు నిలవదు.'

"చేస్తున్నావుగా - శ్రవణం చేస్తున్నావు. మననం చేస్తున్నావు. ఏం చేయిస్తే అది చెయ్యి. అట్లా నిలవటమే - చెయ్యటం."

2616. "నమ్ముకుని ఆరాధిస్తున్నప్పుడు అదే వుంది. ఆరాధనను అదే విచ్ఛిన్నం చేస్తున్నదా? చేయనీ. నమ్ముకొన్నది ఎట్లా నడిపిస్తే అట్లా పోవటమే, నమస్కారం చేసుకొని-"

2617. "ఏది చెయ్యొద్దనను, మనసు చెప్పినట్లు చెయ్యమంటాగానీ, అసలు, ఎవరెన్ని చెప్పినా, చివరకు చేసేది, చేసేవాడి మనస్సు చెప్పినట్లే."

2618. 'ఇది చెయ్యాలి, అది చెయ్యాలంటుంటారే?'

"చేయించేవాడు వాడే."

2619. "మనసు నిలవాలన్నా ఆ శక్తి చేయవలసిందే. మనసు ద్వారా అడగ వలసిందే."

2620. అచ్యుతుని రామకృష్ణశర్మగారితో సాధన గురించి :

"శ్వాసతో మనసు నిలవదు. మనస్సుతో శ్వాస నిలపవచ్చు. కాని నువ్వు ఏది కావాలని ఈ ఇంద్రియాలను సాధనతో కట్టివేయాలనుకుంటున్నావో - అది సమయం వచ్చినప్పుడు ఏ సాధనలు లేకుండానే కట్టు బడుతుంది. అది పొందే యోగ్యత నీకుంటే ఇవేవీ అడ్డురావు."

2621. "నా ఉద్దేశం ఎందుకు పుడతారో - అదే చేస్తారు అంతే."

2622. "నీ జీవితంలో వచ్చే కష్టసుఖాలన్నీ ఎవరో ఒకరు ఇస్తున్నారనుకో. అది దేవుడనూ, అమ్మా అనూ, ఏదో అదృశ్య శక్తి అనూ, ఏదయినా అనూ. అన్నీ అదే చేయిస్తున్నదనుకో. దారినపోతూ ఎవరన్నా ఒక రాయివేసినా ఆ శక్తే చేయించింది అనుకొని పోతూ ఉండు. నువ్వు సాధన చెప్పమన్నావు - కనుక చెప్పడం ఇది."

2623. 'సాధన అంటే?'

"తాను చేస్తున్నాననుకోవటం."

2624. "సాధన చెయ్యొద్దు అనటం లేదు. చెయ్యాలనిపించింది చెయ్యండి."

2625. "సాధ్యమే సాధన."

2626. "ఏం చేస్తే నీకు సుఖం, శాంతి, హాయి లభిస్తయ్యో- అది చెయ్యి."

2627. 'ఏ సాధన గొప్పది?'

"ఎవరికి ఏది తోస్తే అది గొప్పది. ఏది సాధ్యమో అది గొప్పది."

2628. 'సాధనేదన్నా చెప్పండి.'

"చేస్తున్నావుగా ఏదో సాధన?"

2629. "స్నానం చేస్తున్నది మొదలూ ప్రతీదీ సాధనే అంటాను."

2630. "దణ్ణం పెట్టడం సాధన అని వాళ్ళంటున్నారు. దణ్ణం పెడితే సాధన అని నేనంటున్నా."

2631. "సాధన అనేది నీకు తెలియకుండానే జరుగుతుంది."

2632. 'ఆ ప్రదేశంలో నేను సహించి ఉండలేకపోతున్నాను.'

"సహించడంలోనే సాధన ఉంది."

2633. 'గయ్యాళి భార్యతోనా ఓర్పు పోయింది.'

'ఆ మాటలను వోర్చుకోవటం సాధనే."

2634. 'ఏమీ చెయ్యకుండా ఊరకే ఉంటే అది సాధనా?'

"ఏమీ చెయ్యకుండా ఉండాలనుకుని కూర్చుంటే - అది సాధనే."

2635. "అమ్మ సాధన చెప్పదు - అనేది ఒక మాట వచ్చింది కాదు. సాధన చెయ్య వద్దనను. నా మాటలు కాదుగా మీ చేత చేయించేది?'

2636. "కోరికలా? రానీ. భయమెందుకు? అది వచ్చిందే అనుకుంటే, మనసు ఎప్పుడూ దానిమీదే ఉంటుంది. ఆకలి యెట్లాగో నిద్ర యెట్లాగో అవిగూడా అట్లాగే."

2637. "సాధనకు నిత్యకృత్యం కంటే కావలసింది లేదు."

2638. "మనకొచ్చే పరిణామాలు మనకు తెలియకుండానే వస్తయ్."

2639. 'ఏది చెయ్యాలి?'

"ఏదేనా ఒకటే. ఒకదాని మీద పూర్తిగా ధ్యాస ఉంచితే చాలు."

2640. "నేను ఏం చేశానని 'ఇది చెయ్యండి నాయనా, ఈ మార్గం మంచిది'

అని చెబుతాను? ఎట్లా చేయిస్తే అట్లా నడిచేవాళ్లం కదా మనం? నేనేం సాధకురాలిని కాను, 'ఈ సాధనలు చేస్తే గొప్పవారౌ'తారని చెప్పడానికి. ప్రత్యేకించి ఒక దానితో అంటూ ఉంటేగా? నాకు ఏం తెలియదు. మీ ఇష్టం, మీ కెట్లా తోస్తే అట్లా చెయ్యండి."

2641. "నేను ఎవర్నీ కొలవమని చెప్పను. మిమ్మల్ని మాత్రం నాకు పూజలు చెయ్యండి - అని అంటున్నానా? ఎవరినైనా వాళ్ళు నమ్మిన వాళ్ళని కొలుచుకోమంటాను."

2642. "నీకు తోచేది నేను చెప్పా-ననుకొని చెయ్యి."

2643. "నేను ఎప్పుడన్నా ఈ పద్ధతిలో నడవండి - అనిగానీ, ఇది చెయ్యండి అని గానీ ఎవరితోనూ అనను."

2644. 'మీరు కలలోకి వచ్చి - గాయత్రిని కొలిస్తే మీరు తరించరు. నన్నే కొలవండి - అని చెప్పేరు.'

"నేనట్లా అనలేదు అనను.'

2645. 'మాణిక్యాంబగారు అబద్ధం చెప్పరు. ఆమె చెప్పారు మిమ్మల్నే కొలవమని. మీరు ఆమెతో అట్లా చెప్పారట.'

"మాణిక్యమ్మగారికి ఆ నమ్మకం వుండచ్చు. ఆమె మాటమీద మీకు నమ్మకం వుండచ్చు. కానీ నేను మాత్రం అట్లా ఎప్పుడూ చెప్పను."

2646. "మీకు ఏది సాధ్యమైతే అది చెయ్యండి."

2647. "మీకు సాధ్యమైనదే సులభమైనది. కష్టమైన మార్గమంటూ ఏం లేదు. సులభమైనదీ లేదు. మనకేది తేలిక అనిపిస్తే అదే సులభమార్గం."

2648. "ఇన్ని చేశాడు కనుక ఏది సుఖమో ఏది సాధ్యమో అదే చెయ్యమను."

2649. 'మీకన్నీ తెలుసు కాని చెప్పరు.'

"అన్నీ తెలుసును కనుకనే ఏది (నీకు) సాధ్యమయితే అది గొప్ప మార్గమమ్మా అని చెప్పాను."

2650. "ఎవరు ఏది చెయ్యగలిగితే వారికది గొప్పది-
నేను ఏమి చెయ్యలేదు కనుకనే నాకు అన్నీ గొప్పవే."

2651. "పద్ధతులన్నీ చెప్పారుగా నాన్నా. ఏదైనా చేసుకో. ఏది సాధ్యమైతే అది చేసుకో. కుటుంబంలో వుండీ చేసుకోవచ్చు."

2652. "ప్రాణాయామం చెయ్యాలన్నా చెయ్యలేక పోయావు కదా!"

2653. 'శ్రీ రాజరాజేశ్వరీ ..... పాడనా?'

"ఏది పాడినా ఒకటే. అన్నిటికంటే దాని ప్రత్యేకత ఏముంది?"

2654. "ఎవరు ఏ సాధన చేసినా - నేను వద్దనను.

ఒకడికి ధ్యానం బాగుంటుంది.

ఒకడికి నామం బాగుంటుంది.

ఎవరికి ఏది సాధ్యమయితే - అదే బాగుంటుంది."

2655. 'నేను మీ ధ్యానం చేస్తున్నాను. జపం చేస్తున్నాను ఇంకా ఏమి చెయ్యాలో చెప్పండి. నామం చెయ్యమంటారా?'

"మీకేది తోస్తే - అది చెయ్యండి."

2656. "బాధలు పడటానికి ఓర్పుకోసమే నామం చెయ్యటం, బాధలు పోతయ్యని కాదు. కూర్చుని చెయ్యటానికి మనసు నిలవటం లేదు గనుక ఏ పని చేస్తున్నా - అదే చేస్తూ ఉండండి."

2657. "మీరు ఏ నామంతో ఆరాధించినా ముట్టేది ఒకరికే."

2658. "నామం చెయ్యటానికి అలవాటు పడ్డవాడు ఇంకొకటి చెయ్యలేడు."

2659. 'ఓమనిషీ! అని పిలిస్తే పలకడు కనుక ఏదో ఒక పేరు. అట్లాగే అన్నీ చేయించే ఆ శక్తికి రాముడో, కృష్ణుడో - అని పేరు పెట్టారు."

2660. 'రామం చేస్తున్నాను. నా దృష్టిలో అమ్మ ఉంది.'

"రామం అమ్మ కాకపోతేగా! అమ్మ రాముడు కాకపోతే గదా! అన్ని రూపాలు చూడలేక, అన్ని నామాలపై లక్ష్యం పెట్టుకోలేక ఒక రూపం, ఒక నామం తీసుకొంటాం."

2661. "నిన్ను కడతేర్చవలసింది అమ్మ. ఆ బాధ్యత నీది కాదు."

2662. "అక్షరలక్షలు జపం చెయ్యమనటం దేనికంటే - ఆ తరువాత నువ్వు మర్చిపోదా మనుకున్నా,అది నీ వెంట పడుతుంది."

2663. 'అమ్మా నామంతో కూడా అద్వైత స్థితి పొందవచ్చునా?

"పూర్తిగా ఏమి చేసినా అద్వైతస్థితే."

2664. "చెయ్యటం నిష్ఠే."

2665. "స్నానం చెయ్యకుండా వెళితే దేవుణ్ణి మైలపడేస్తారని కాదు. మీ కోసమే."

2666. "రాధ గోల చేస్తుంటే నాకు కోపం రాదు. ఏడుపొస్తుంది - వాడికి - అవి కావాలి, యివి కావా-లని లేదు కదా! అమ్మ కావాలి. అంతే. ఇతరం ఏదీ వినలేడు."

2667. 'ఇట్లా - రోజూ నియమంగా కొంత డబ్బు వేస్తూ కూడబెట్టినది - ఇవ్వాలని ఎంతోమంది ప్రయత్నించారు. కాని ఇక్కడకు వచ్చింది ఇదే. ఎవరయినా ఒకసారి పది రూపాయలు ఇవ్వచ్చు. కాని ఇట్లా రోజూ వెయ్యటం గుర్తు కోసమేగా?"

2668. 'ప్రయాణాల్లో కూడానా?'

"ఎక్కడైనా ఆ భావం వస్తేనే గదా నువ్వు చేసేది? ఆ భావం రానిది నువ్వేం చేస్తావు?"

2669. "సర్వత్రా అమ్మ ఉన్నదనే భావం మాటలలో నిలిచినంతగా చేతలలో నిలవదు."

2670. "ఎవరు ఎవరి ఇష్టదైవాన్ని వాళ్ళు చూస్తున్నారు గదా? గజంలో అంగుళా లున్నాయి గాని అంగుళంలో గజం లేదు. నేను కొలతబద్ద అన్నది అదేగా? ఎవరిబద్ద ఎంతమట్టుకో అంతమటుకు."

2671. "అది నిప్పుల బాటేనమ్మా. నిప్పు అంటే గొప్ప అని కాదనుకో. ఒక మాట ఉన్నదనుకో - ఆ మాటను అందరిపట్లా తు.చ. తప్పకుండా నడవాలంటే ఆ నడక నిప్పులబాటలో నడచినట్టు.

ఆ మాట ఒకనాటి మాట కాదు కదా? కలకాలం మిగిలే మాట. ఆ మాట

ఒక మహా మంత్రం. అదే 'సరే' మంత్రం."

2672. "నాకంటే మరొకటి లేదని తోస్తే ఇంకా మరొకటి ఎందుకు?"

2673. 'తరించే మార్గం చెప్పమ్మా.'

"ఇవన్నీ బాధలు కావనుకుంటూ తృప్తిగా అనుభవిస్తే అదే తరించే మార్గం. ఇవన్నీ ఇచ్చిన వాడే బాధలు కలిగిస్తున్నా -డనుకుంటూ తృప్తిగా అనుభవిస్తే అదే తరించే మార్గం."

# మంత్రం

2674. "జబ్బెట్లా ఉన్నా బాధను బాధగా కాకుండా సుఖంగా అనుభవించటానికి మంత్రాల వల్ల జబ్బులు తగ్గుతయ్యంటారు."

2675. "మంత్రం - చేయించేది. తంత్రం - చేసేది."

2676. "రూపాన్ని ధ్యానిస్తే ఏది పొందుతాడో - అక్షరాలను ధ్యానించినా అదే పొందుతాడు."

2677. 'మంత్ర పుష్పమంటే ఏమిటమ్మా?'

"హృదయమనే పుష్పాన్ని నేరుగా అర్పించలేరు కనుక నీకీ హృదయ పుష్పాన్ని అర్పిస్తున్నాను - అని ఒక పువ్వును పాదాలపై వెయ్యటం."

2678. "చెప్పింది మంత్రం కాదు. మననంతో మంత్రమవుతుంది."

2679. 'జపం 23 ఏళ్ళవరకూ సాగింది. ఇప్పుడయినా ధ్యాస పోలేదు. క్రియ మాత్రం లేదు.'

"ధ్యాసకూడా క్రియేగా?"

2680. "తటపటాయించే మనస్సు స్థిమితపడి అన్ని వేళలా ఆ మంత్రాన్నే జపించి అన్ని రూపాల్లో ఆ రూపాన్నే చూచినప్పుడు - వాడే దైవం. వాడు దైవాన్ని చూడటం కాదు, ఆ స్థితి కలిగినప్పుడు - వాడే దైవమౌతాడు."

2681. 'మంత్రం చెయ్యటమంటే - గుర్తు రావటమే."

2682. "మరువనివ్వనిది మంత్రం."

2683. "మంత్రమనే టప్పటికి రూపం - భావం వున్నది. 'మంత్రం భక్షిస్తుంది, నెత్తి అణుస్తుంది' అని చెప్పి జనాన్ని భయపెడుతున్నారు.

మంత్రం రక్షిస్తుంది కానీ భక్షించదు."

2684. "నారాయణ అన్నది పేరూ అయింది, మంత్రమూ అయింది. మనస్సుతో మననం చెయ్యటంతో మంత్రం అయింది."

2685. "తారకమే తరింపజేస్తుందనేముంది? ఏదైనా దేనిని తలిస్తే - అదే తరింప చేస్తుంది."

2686. 'మంత్రోపదేశం చెయ్యమ్మా!'

"నీకు తోచిన మంత్రం చేసుకో -మనటం ఉపదేశమే."

2687. ఒక స్త్రీ : మంత్రం చెప్పమ్మా -

అమ్మ : (మౌనం)

ఆ స్త్రీ : నీ నోటి మీదుగా జెప్పమ్మా -

అమ్మ : అమ్మనుకో. నీ కేది ఇష్టమైతే అది.

2688. 'మంత్రం కేవలం విశ్వాసం వల్ల ఫలితాన్ని ఇస్తుందా ? అధికారి ద్వారా ఇస్తుందా?'

"విశ్వాసమన్నా, అధికారమన్నా ఒక్కటే. అధికారి విశ్వసించాలి గదా? గురువును కూడా విశ్వసించాల్సింది వీడేనా?"

2689. 'గురువే దైవమంటారా? మంత్రోపదేశం చేసినంత మాత్రాన దైవం అనుకోలేం.'

"మంత్రోపదేశం చేసిన వాడికంటే దైవం లేడు."

2690. "పంచాక్షరీ, అష్టాక్షరీ, ఏకాక్షరీ, ద్వాదశాక్షరీ - ఏదయినా చెయ్యండి. (సోహం అనే) ఆ రెండు అక్షరాలే శ్వాసతో పలకటం లేదు. ఏవయినా శ్వాసతోనే పలకటం."

2691. 'రాగూడని చోట గుర్తొస్తే ఎట్లామ్మా, ప్రమాదం కాదూ?'

"ఎల్లవేళలా గుర్తు రావటమనేది ప్రమాణమే కాని ప్రమాదం కాదు."

2692. 'చేస్తున్న పూర్వపు మంత్రం పూర్తిగా మరిచిపోవాలన్నాడమ్మా గురువుగారు. పూర్వపు మంత్రం పోలేదు, కొత్త మంత్రం పట్టుబడలేదు.'

"తరవాత చెప్పిన మంత్రం దాన్ని మరిపించ గలిగితే గదా? అలా మరుపు తెప్పించేదే మంత్రం?"

2693. 'మొదట మంత్రం చెప్పినాయనని అడిగితే-

నీ మంత్రం నీకున్నది కదా?

బాధపడాల్సిన అవసరం లేదన్నారమ్మా.'

"చక్కని సమాధానం చెప్పాడు. పెద్దగా పేరు ప్రఖ్యాతులు లేకపోవచ్చు - ధైర్యం చెప్పాడు."

2694. "మంత్రం ద్వారా కడతేరటం కాదు, మంత్రమే కడతేరుస్తుంది."

2695. "ప్రతిమాట మననంతో మంత్ర మవుతుంది."

2696. "అన్ని మంత్రాలకూ అర్థం ఒకటే.

అన్ని శబ్దాలూ మంత్రాలే. చెవిలో రహస్యంగా చెప్పిన మంత్రం అపాన వాయువులోనూ, కుక్కానక్కా అరుపులలో విన్పించాలి."

2697. "మాట ఒక చోటా, మంత్రం ఒక చోటా కాకుండా చేసినప్పుడు అంతటా అదే వినపడటం - దాని స్వభావం."

2698. "మంత్రమంటే ఏమిటీ, ఎందుకు చెయ్యాలి? అని తెలిస్తే - ఏ మంత్రం చేసినా ఒకటే."

2699. 'హైమకు చేతబడి - అని అనుకుంటున్నారు.'

"అనుకోనివ్వండి. మంత్రంతో చంపగలిగితే మంత్రంతో బ్రతికించవచ్చు."

2700. మంత్రమంటే దైవమేగా. దైవాన్ని చేతపట్టుకున్న తర్వాత కడతేరతామా లేదా - అనే ఆలోచనెందుకు?"

2701. "అనుభవం కానంత వరకూ తాను కాలేడు. ఏ వస్తువు కోసం మంత్రం చేస్తున్నావో, అదే తానయినప్పుడు అన్నీ తానే."

# జన్మలు

2702. 'జన్మలలో సాగిపోవాలసినదేనా?'

"ఎక్కడికి? సూది మోప సందు లేనిదని చెపుతున్నారు గదా! అటూ, పోటూ అందులోనే. ఒక అలతో లోపలికి తీసికొంటుంది. మరో అలతో బయటికి. అలలు ఎన్నో వస్తున్నాయి. ఆ అలే రాదు. అక్కడే రాదు. ఆ ప్రదేశంలో ఉన్న నీరే వచ్చినదనటం ఎట్లా?"

2703. 'పునర్జన్మను గురించి ఏమి చెబుతారు?'

"ఇది వరకు జన్మలు తెలియవు. రాబోయేది తెలియదు. ఆలోచన లేదు దానిని గురించి."

2704. 'దేహపతనం తర్వాత శాశ్వతంగా నిలచేది ఏది?'

"అనేక జన్మలు ఎత్తి ఉంటామని నీ నమ్మకం. నీకు క్రితం జన్మ గుర్తు ఉన్నదా? అనేక సార్లు ఎత్తి ఉన్నానన్న నమ్మకం మాత్రమే ఉంది. రాబోయేది గుర్తు ఉంటుందా? అది ఎంతో, ఇదీ అంతే-"

2705. "జన్మలు లేవనవద్దు. ఉండటానికి అవకాశం ఎట్లా?"

2706. "జన్మలున్నై అన్నవాళ్ళే పక్క పేజీలో లేవని రాశారు. సుఖదుఃఖాలు ఒకటిగా చూసుకుంటే జన్మ లేదని రాశారు."

2707. "జన్మలు ఉన్నాయని ఒప్పించు. నమ్మవలసిన అవసరం లేదు. ఒప్పుకో మంటే ఒప్పుకోను. చూపించు, ఒప్పుకుంటాను."

2708. "పూర్వజన్మకృతం అనుకుంటూ గూడా దణ్ణం పెట్టేటప్పుడు 'నేను పాపం చెయ్యొచ్చు గానీ ఫలితం పోవా'లంటాడు."

2709. "దోమ ఏ సంస్కారం చేస్తే నల్లి అవుతుందీ?

పిల్లి ఏ సంస్కారం చేస్తే కుక్క అవుతుందీ?"

2710. "జన్మలు ఇచ్చాడా, తెచ్చుకున్నావా? తెచ్చుకున్నప్పుడు తీసేసుకోవచ్చుగా, నీ ప్రయత్నం ఉంటే?"

2711. "మీరు అనుకునే దానిని బట్టీ అయినా ఈ జన్మకు గతజన్మకృతం కారణ మయినప్పుడు - ఇప్పుడు ప్రయత్నం లేదుగా!"

2712. "ఒకడు నాకు పూర్వజన్మ గుర్తుందండంటాడు. నిజంగా గుర్తంటూ ఉంటే ఆ జన్మలో తల్లి గుర్తుంటుందిగా? ఈ తల్లిని అమ్మా అనగలడా?"

2713. 'అయితే జన్మ లేదన్నారు గదా? తప్పులేమైనా చెయొచ్చు. చేసినవాడికేం శిక్ష లేదుగా?'

"చెయ్యలేడు."

2714. "జన్మలులేవనను కానీ రావటం పోవటం అనేది మీ చేతుల్లో లేదని మాత్రం అంటాను. ఉన్నాయనుకో నాన్నా అప్పుడేనా వాడిస్తేనే."

2715. "పాపాత్ముడని శాస్త్రాలు చెప్పిన వాడెవడూ వాడి మంచివల్ల వాడు సంస్కరింపబడలేదు."

'మరణానంతరం జీవి ఏమవుతుంది?'

"సర్వవ్యాప్తమైన ఆత్మలోనే - ఆ శక్తి ఎక్కడ ఉంచితే అక్కడ - సముద్రంలో నుండి వచ్చిన నీరు సముద్రంలోనికే వెళ్ళాలి గదా?"

# మనస్సు

2716. "మనిషిని వశం చేసుకోవాలనుకుంటే మనస్సుతోనే కానీ మందులతో కాదు."

2717. "మనస్సు గాలిపటం లాంటిది. ఎక్కడన్నా ముల్లు ఇరుక్కుంటే చినిగి పోతుంది."

2718. 'పశుపక్ష్యాదులకు మనస్సు లేదనేగా?'

"గూడు ఎందుకు కట్టుకుంటునట్టు?"

2719. "మనస్సుకు నిద్ర ఎక్కడ? మనస్సు నిద్రపోదు అనిపిస్తుంది నాకు. అది నిద్రాణమై ఉంటే ఇంకేముంది?"

2720. 'మనస్సును స్వాధీన పరచుకోవటం ఎట్లా?'

"మనస్సే మనం. అంతటా నిండివున్న మనస్సును ఎవరు వశపరచుకోవాలి? వచ్చే కష్టసుఖాలు మనస్సుకే. అరికాల్లో ముల్లు గుచ్చుకుంటే గుర్తించేది అది! మనసూ - మనిషీ వేరు కాదు."

2721. "మనసంటే చరాస్తి.

మనసు యొక్క పరిణామం స్థిరాస్తి."

2722. "శరీరమూ మనస్సూ విడదీసి లేవు."

2723. "మనసు కోరినది బ్రతుకు గడపదు."

2724. "శరీరాన్ని విడిచన మనస్సు లేదూ, మనస్సును విడిచిన శరీరమూ లేదు."

2725. "చూచేది కన్ను అయినా గ్రహించేది మనస్సే. కంట్లో పడుతూనే ఉన్నా మనస్సు దేనిమీదో ఉంటే గ్రహింపు ఉండదు."

2726. "మనస్సు కోసం శరీరం, శరీరం కోసం మనస్సూ. ఈ ఘర్షణ తప్పదు."

2727. "మనస్సుకు ఏకాగ్రత లేకపోవటం లోటు అనుకుంటున్నారు మీరు. స్వభావం అంటాను నేను."

2728. "ఆలోచన మనస్సు కాదుగా?
మనస్సుకు ఆలోచనలు వస్తున్నయి."

2729. "మనస్సుకు రూపం కనబడదు. ఆలోచనలు ఎక్కడ నుండి వస్తున్నాయో తెలియదు."

2730. "మనస్సుకు రూపమేది? అన్ని రూపాలు గుర్తిస్తుంది. కళ్ళు లేని వారు మనస్సు చేతనే గ్రహిస్తారు. అన్నీ గ్రహించేది అదే."

2731. "మనస్సుకు ఆలోచనలు వచ్చే స్వభావం. జపం చెయ్యాలన్నదీ ఆలోచనే. ఆలోచించకుండా ఉండాలనుకునేదీ ఆలోచనే. ఆలోచన వచ్చిన తర్వాత తెలుస్తుంది. ఏది వస్తే అది అనుభవిస్తూ సమయం వచ్చినప్పుడు చేస్తూ ఉండటమే."

2732. 'అంధవిశ్వాసం అంటే ఏమిటమ్మా?'
"అంధవిశ్వాసం అనిర్వచనీయం. మనస్సుకు సమాధానం ఉన్నది గానీ మాటలకే లేదు."

2733. "మానసిక బాధ అంటూ ఏముందీ? ఏ బాధయినా పడేది మనస్సేగా. శరీర బాధ అనుభవించేదీ మనస్సే."

2734. "ఎక్కడ లోపం కనపడ్డా, ఎక్కడ నుంచి కనబడ్డా - మన మనస్సే కారణం."

2735. "మన మనస్సును బట్టీ ప్రపంచం కనపడుతుంది."

2736. "పోనీ ఇప్పుడాలోచించండి కాసేపు."
'నేనేమి పెట్టి ఆలోచిస్తాను?'
"ఆలోచనలు దేనికి వస్తాయో దాన్ని పెట్టి ఆలోచించండి."

2737. 'మనస్సుతో మనస్సును గుర్తించటం - అన్నారే! అది ఎలాగ అమ్మా?'
"మనస్సూ భగవంతుడే. మనస్సు చేత ఏర్పడ్డ భక్తీ భగవంతుడే. మనస్సును గుర్తించడానికి భక్తి ఆధారమయింది. భక్తికి మనస్సు ఆధారమయింది. అదే మనస్సుతో మనస్సును గుర్తించటం."

2738. "మనస్సూ పదార్థమూ పరమార్థమూ ఒకటే."

2739. "మనస్సూ పదార్థమూ ఒకటే అని గుర్తించిందే పరమార్థం."

2740. "శరీరంతో ఉండి శరీరంతో సంబంధం లేకుండా శరీరాన్ని (ఇంద్రియాల్ని) పనిచేయించేది మనస్సు."

2741. "బాగు చెయ్యటానికైనా, నాశనం చెయ్యటానికైనా మనస్సును పవర్ ఎంతైనా ఉన్నది."

2742. 'మనసు నిలిపితే చాలమ్మా.'

"నాకూ నిలవదు - ఎప్పుడూ మీ మీదే ధ్యాస."

2743. మనస్సు నిలిచే మార్గం చెప్పమని ఒకరడిగితే -

"నీ వేదో చేస్తున్నావుగా, అదే చెయ్యి."

2744. 'ఒక దైవం మీద మనస్సు నిలవకుండా ఉంది.'

"అన్నింటి మీదా ఉండవచ్చు. ఒకదాని మీద నిలవాలని లేదు."

2745. 'మనస్సు ప్రేరేపించిందని త్రాగితే తప్పులేదా?'

"తప్పొప్పుల పట్టి నా దగ్గర లేదు. నేను అనుభవించినది, నా అనుభవం లోనిది చెబుతా. నా మనస్సుకు అతీతంగా నడవటం లేదు. అది ఏ దారిన నడిపిస్తే, ఏది అనిపిస్తే, ఏది బోధ చేస్తే అట్లా నడుస్తా. నీవు గాని, నేను గాని మనస్సు చెప్పినట్టు వినకుండా ఉండేవాడిని ఒక్కడిని చూపించూ?"

2746. 'వాడి మనస్సు చెప్పినట్టు చేస్తే చాలా?'

" 'వాడి మనస్సు చెప్పినట్టు' అంటే మనస్సు వీడి స్వాధీనంలో లేదుగా? - మనస్సుకే వీడు స్వాధీనమై ఉన్నాడు కాని?"

2747. "ఏం పర్వాలేదమ్మా, ఉన్నదానితోనే పూజ చేసుకొనండి. మనస్సు ఉంటే చాలు. . . అశుద్ధానికి పూజ చేసినా వాడికే చెందుతుంది."

2748. "అసలు మనస్సును బ్రతుకుతో సమన్వయించుకోవాలి. మనస్సూ బ్రతకూ వేరుగా ఉన్నయ్యంటే వీటికి అతీతంగా ఏదో శక్తి నడిపిస్తోందన్న మాట."

2749. 'భగవంతుని ధ్యానం చేసి మనోమాలిన్యాన్ని పోగొట్టుకుందామని ఉంది. కానీ మనస్సు ఎంత మాత్రం నిలవటం లేదు.'

"మాలిన్యాన్ని పెట్టినవాడే తీసేస్తాడు."

2750. 'దైవదృష్టి కలగడానికి ఆశీర్వచన మెట్లా?'

"మంచి మనస్సు ఇవ్వమని దైవాన్ని ప్రార్థించటమే. మంచి మనస్సు కలిగిన తర్వాత ఏమి వస్తుందనేది అక్కరలేదు. అటువంటి ఆలోచన రావటమే ఆశీర్వచనం ఉన్నట్లు గుర్తింపు."

2751. 'మనస్సు నిలవటం లేదమ్మా!'

"నిలపమనే ప్రార్థించాలి."

2752. 'అంతా అదే చేస్తునప్పుడు దైవధ్యానం మానసికంగా చెయ్యాలా? అక్కర లేదా? జపతపాదుల వల్ల ప్రయోజనం?'

"మనం చేస్తాం. మనస్సు నిలవదు. నీవే నిలపమని వేడుకోవటమనే మిగులుతుంది. మనస్సుకు ఏదో అతీతశక్తి ఉందనిపిస్తున్నది. అర్థం కాకుండా ఉన్న శక్తిని ధ్యానం ద్వారా, జపం ద్వారా ప్రార్థిస్తాం, మానసిక స్వస్థతకు."

2753. "మనస్సును అరికట్టే స్థితి ఇచ్చినవాడికి గాని పుచ్చుకున్న వాడికి లేదు."

2754. "థాట్ వచ్చిందంటారు. ఎక్కణ్ణించి వచ్చిందీ? వచ్చిన తర్వాత తెలుస్తోంది. దానినే ప్రేరణ అంటాను."

2755. "దయ లేని మనస్సే దయ్యమేమో!"

2756. "మనసే ద్వంద్వంగా అనుకుంటే మనసు, చిత్తం ... అవుతుంది."

2757. "మంత్రంగాని, దైవంగాని మనస్సుని మించింది లేదు."

2758. "భగవంతుడు అంటే మనస్సే. అది ఎక్కడో లేదు."

2759. "నేనూ మనస్సూ ఒక్కటే."

2760. "అన్నీ గ్రహించేదే మనసు - మనస్సే దైవం.
బాధ, సుఖం, కష్టం, నష్టం . . . . అన్నీ దేవుడే."

2761. "మనస్సే దైవం అయినప్పుడు మనస్సును దైవంగా గుర్తించలేం. కనుక ఒక రూపాన్ని ఆరాధిస్తున్నాం."

2762. "దేవుణ్ణి నమ్మినవాడు మనస్సును ఆడించేవాడు ఇంకోడు ఉన్నాడని అనుకుంటాడు. దైవం లేడని అనుకునేవాడు మనస్సులోనే ఉందను కుంటాడు. ఇంకొకడు మనస్సే అనుకుంటాడు."

2763. "దేవుడు ఉన్నాడనుకునే వాడికీ, లేడనుకునే వాడికీ చేయక తప్పదు. నీ మనస్సు చెప్పినట్లు చెయ్యి. నీ మనస్సుకు భిన్నంగా దైవం లేడు."

2764. "వైకుంఠమా?

ఎక్కడుంది వైకుంఠం?

మనస్సే వైకుంఠం."

# వాక్సమత్కృతి

2765. 'నీలోని ఏ శక్తి ఆకర్షిస్తోంది మమ్మల్ని?'

"నాలో ఉన్న ఆసక్తి."

2766. రాఘవయ్యగారు : అంధుడను కదా!

అమ్మ : నీకేం ప్రబంధుడవు, దేవీ పూజా దురంధరుడవు.

2767. రాఘవయ్యగారు : ఎవరమ్మా ప్రతి మనిషిలో దుర్గను చూడగలవారూ?

అమ్మ : చూసినవాడు దురంధరుడు - చూసానని చెప్పేవాడు దుర్గంధుడు.

2768. లండన్ నుంచి వచ్చారుట జ్యోతి అనే ఆవిడ.

'నా పర్సనల్ ప్రాబ్లెమ్స్ మాట్లాడాలి అన్నారు.'

"నాకు లాంగ్వేజి ప్రాబ్లెమ్."

2769. "అక్షరాలు ఎడిట్ చేసేవాడు ఎడిటరు.

అంకెలు ఎడిట్ చేసేవాడు ఆడిటరు."

2770. 'గోత్రం గుర్తులేదు.'

"మాతృశ్రీ గోత్రం."

2771. 'పుకారు సంగతి?'

"డబ్బు పెట్టి కారు కొనుక్కోకుండా పుకారు ఎక్కాను."

2772. "ఇవాళ పొద్దున పిచ్చిక గడ్డిపరక వేసింది నా మీద - పిచ్చిక మీద బ్రహ్మాస్త్రం కాదు, బ్రహ్మ మీద పిచ్చికాస్త్రం."

2773. "దేహం కూడా సందేహమే కనుక మనస్సుకు సందేహాలు వస్తూంటయ్."

2774. 'ఎట్లా ఉంది పన్నుపోటు?'

"జనం అభిప్రాయం ఎట్లా ఉందో అదీ అట్లాగే ఉంది. వదిలిపెట్టి వెళ్ళాలంటే ఏడుస్తోంది."

2775. 'అమ్మా! ప్రేమా, కరుణా, వాత్సల్యమూ అన్నీ అపరిమితంగా ఉన్నవాళ్ళని ఏమంటారూ?'

"అగోచరం అంటారు."

2776. "మనకు ఎస్టేటు లేదు గాని స్టేటు తెలుసు."

2777. రామకృష్ణ : అమ్మా నీవు రాయి.

అమ్మ : నేను రాయిని కాను, మనిషిని.

2778. రాఘవయ్యగారు : ఇంత పెద్ద శరీరం ఎందుకిచ్చావమ్మా?

అమ్మ : బుజ్జికు తగిన బొజ్జ.

2779. 'నీవు చాలా అబద్ధాలాడడం నేర్చేవమ్మా.'

"ప్రబుద్ధులు చేరబట్టి."

2780. అమర్ : అయినా నీకు General Knowledge ఎక్కువ.

అమ్మ : General Knowledge కాదు, Knowledge general.

2781. 'ఈ మూలిక పొడి నీకివ్వాలని భ్రాంతి కలిగిందమ్మా.'

"నాకు తినాలని భ్రాంతి లేదు."

2782. 'మీరు ఉండమంటే ఉంటాను.'

"మీకు ఉండాలని ఉంటే ఉండమంటాను."

2783. 'ఎట్లా అయినా అమ్మ Voice రికార్డు చేద్దామనీ.'

"అమ్మ Voice పత్రికల నిండా రికార్డు అవుతుంది."

2784. రామరాజుగారు : ఈ సారి పిల్లకి ఏం పేరు పెడ్తావ్?

అమ్మ : పుట్టేది ఆడపిల్లా, మొగపిల్లాడా?

2785. అమ్మ బొమ్మ వేసుకొచ్చింది ఉష. 'ఎలాగున్నదమ్మా?'

"అమ్మ బొమ్మల్లేనే ఉంది అమ్మలాగ లేదు."

2786. 'అమ్మ - మాటలకు దొరకదు.'

"చేతులూ, కాళ్ళు దొరుకుతుంటే మాటలెందుకూ?"

2787. 'జపం చేద్దామంటే కాసేపు కూడా మనస్సు నిలవదు.'

"నాకు మీ మీద ఉన్నంత ధ్యాస వాడి మీద ఉండదు."

2788. 'అమ్మా! పాపి చిరాయుః అంటారేమిటమ్మా?'

"ఇంతవరకూ (హనుమంతుడూ? మార్కేండేయుడూ? వంటి వారేగాని) పాపాం చేసినవాడు చిరాయువుగా వున్నాడని వినలేదు నాన్నా. అయినా నాకింత వరకూ పాపి కనుపించలేదు."

2789. "కాళ్ళు తాకితే వాడి పాపాలు అంటుతాయా వీడికీ? అయితే వీడికంటే వచ్చినవాడి పవరే ఎక్కువన్న మాట!"

2790. "కష్టాలిచ్చినా సుఖాలిచ్చినా వాడికి ఇంకొకడు పోటీ లేడుగా - వాడు కష్టాలిస్తే వీడు సుఖాలివ్వటానికీ, వాడు సుఖాలిస్తే వీడు కష్టాలివ్వటానికీ? భగవంతుడంటూ ఉంటే రెండు ఇచ్చేదీ వాడేనని నా అభిప్రాయం."

2791. "వాడు మనిషి 'ఇంతే' గాని, గుండె పెద్దది. హార్టు ఎన్‌లార్జిమెంటు."

'పుట్టుక ముందే నా హార్టు పెద్దదమ్మా.'

"నీ ఆర్టు పెద్దది మాటల్లో."

2792. "కాశీ వెళ్ళు. అక్కడ కావలసినన్ని కనపడతాయి శవాలు."

'కాశీ ఎక్కడ?'

"నీకు అవి ఎక్కడ కనబడితే అక్కడ.'

2793. 'ఋణ బంధమమ్మా!'

"ఋణానుబంధం కాదు నాన్నా, తరుణానుబంధం."

'మరి మీకో?'

"నాది కరుణానుబంధం."

2794. 'ఊరికే ఊహ. ఎంత లోతున పడతయ్ నీళ్ళు?'

"నాకు ఊహించాల్సిన పని లేదు."

2795. "నీవుంటే ఏం తరుగు? దేవుడి కంటె భక్తు పాదధూళి గొప్పదన్నారు."

2796. 'ఒకళ్ళు కూడా వరం అడగరేం?'

"ఇచ్చేదేదీ లేదని."

2797. "స్నానం ఎప్పుడు చేస్తే ఏముంది? స్థానం తప్పకుండా ఉంటే చాలు."

2798. 'మాతోపాటు మేం అన్నవన్నీ అంటూ అప్పడాల కర్రలాగు ఊగుతుంటావు.'

"అడుగున అప్పడం సాగుతుంటుంది, కర్ర ఊగుతుంటే."

2799. 'ఆముదం కలిపిన నూనేనమ్మా తూకం పెరుగుతుందని ఇస్తున్నారు.'

"ఆరోగ్యం ఇస్తున్నారన్న మాట."

2800. 'నాకు వినపడటల్లే దమ్మా సరిగ్గా.'

"వినపడకపోవటం, కనబడక పోవటం మంచిదే. ప్రతీదీ కనపడకపోవటమే సుఖం. ఎవరన్నా కష్టపడుతున్నా చూడక్కర్లేదు."

2801. 'ఇంతమంది పరమేశ్వరి పేరుతో నివేదనలు చేస్తున్నారు కదా?- మీరు కొంచెం పెద్దగా మాట్లాడాలి."

"ఇంతమంది పెట్టినవి తినితినీ బలహీనత వచ్చేసింది."

# గుర్తు

2802. 'మాది చీరాల. అమ్మవారికి గుర్తుండొచ్చు.'

"వంకమామిడి వారు కదూ?"

'అవునమ్మా.'

2803. 'అమ్మా! ఒకసారి నీవు మందిరంలో కాళీపూజ రోజున నల్లని పట్టుచీరె కట్టుకున్నావు, ఆ చీర మళ్ళీ కట్టుకోలేదేం?'

"అదా? '65 ఫిబ్రవరి 24న కమల పెట్టింది. రహి పుట్టకముందు రుక్మిణి నొప్పులు పడుతుంటే - అప్పుడు రాలేదూ కమల? - అప్పుడు పెట్టింది."

2804. "మొదటిసారి హరిదాసుగారు వచ్చినప్పుడు దోసకాయ కూర."

2805. "చలసాని నాగేశ్వరరావుగారు మొదటిసారి వచ్చినప్పుడు నర్సాపురం డాక్టరు, అమర్‌నాధ్ ఉన్నారు."

2806. 'నీకిట్లా గుర్తుంటాయమ్మా ప్రతిదీ?'

"నాది అనుకోవటమే గుర్తుకు కారణం. మీరు పిల్లలను మర్చిపోతున్నారా? ఇదీ అట్లాగే. ఇందులో విశేషమేమున్నదీ?"

2807. 'నాకు ఆరుగురు పిల్లలు.'

"ఇదివఱకు కుటుంబంతో వచ్చారా?"

'అవును.'

2808. 'నీకు ఇంత గట్టిగా ఎట్లా గుర్తు ఉంటాయీ?'

"నాకు గుర్తు ఉండటంలో, మీకు ఉండకపోవటంలో విశేషం లేదు."

# లౌకికాలు

2809. "జీవితంలో జరిగేదే, నేను ఏం చెప్పినా."

2810. "ఏ వైద్యం గొప్పదో చెప్పలేం. ఒక్కొక్కసారి ఒక్కొక్కటి అవసరం. అన్నీ గొప్పవే."

2811. "ఇతరులు చెప్పింది వినటంలో కూడా నీకు ఇష్టమైనదే వింటావు."

2812. "ఆచారాలు, కట్టుబాట్లు అన్నవి మనం ఏర్పరచుకున్నవే."

2813. "పిల్లలు పుట్టని వాడికి, పుట్టి ఒక రోజన్నా ఉంటే చాలనిపిస్తుంది. పుట్టిన తరువాత పోయిన వాడికి పుట్టకపోయినా బాగుండేదనిపిస్తుంది."

2814. "ఇటు రోహిణిలో వర్షాలు కురిసినై కదా అని ఆ తర్వాత కురుస్తాయనుకోవడానికి లేదు."

2815. "తన కోరిక వేరు, జీవితం వేరు. ఈ రెండింటికి ఎప్పుడూ ఘర్షణే."

2816. "తప్పులు, అప్పులు అందరికీ ఉంటాయి."

2817. "జబ్బు వాళ్ళు జబ్బు లేదనుకోవటం జబ్బు లక్షణమే."

2818. "తెలియక తెలుసుననేవాడూ టక్కరే.
తెలిసి తెలియదనేవాడూ టక్కరే."

2819. "ఏది తినకూడదో అదే రుచిగా ఉంటుంది."

2820. "ఎంత అందంగా చెక్కనీ - మన అమ్మాయి అనిపించదు."

2821. "సరిపెట్టుకోడం తప్ప సరిపడే ప్రదేశం దొరకదు."

2822. 'నేనింతవరకు సుఖమెరుగను.'
"సుఖమనేది తెలియకపోతే కష్టమెట్లా గుర్తిస్తావు?"

2823. "అనుకున్నది జరిగినా, అనుకోనిది జరిగినా ఆశ్చర్యమే."

2824. 'మాకు శాంతం ఎప్పుడు వస్తుంది?'
"శాంతం అంటే కోపం లేని స్థితి."

2825. "చీకట్లో పోతుంటే ఉఱుము ఎంత భయపెడుతుందో, మెఱుపు అంత సహాయ పడుతుంది."

2826. "బాధలో సుఖం, సుఖంలో బాధ. ఎవడికి వాడికే, దేనికదే."

2827. "ఎవరైనా బోధించే దాని కన్నా - పరిస్థితులు ఎక్కువ బోధిస్తాయి."

2828. 'దీర్ఘకాలిక వియోగం ప్రేమను చంపుతుంది. స్వల్పకాలం వియోగం ప్రేమను పెంచుతుంది అంటారేమిటమ్మా'

"నాకనుభవం లేదు."

2829. "అప్పులంటే ఒకరికి ఇవ్వవలసిన అవసరముండటం."

2830. 'సమాజంలో మార్పులు మనం పెట్టుకొన్నవా?'

"జరుగుతున్నవే."

2831. "పెద్దవాళ్ళు పెద్దటోపి పెడుతున్నారు. చిన్నవాళ్ళు చిన్నటోపి పెడుతున్నారు. సాగినవాడు సాగినట్టు పెడుతున్నాడు. ఆ కోరికలేని దెవరికీ?"

2832. 'కొంతమందికి జీవితం అమృతమయంగా అనిపిస్తుందిగా?'

"వీడికి అనిపిస్తుంది. వాడికి అనిపించదు."

2833. "మనసుల్ని గుర్తించే మనసుల్లేవు."

2834. "ఎవరి మనస్సే వారికి దుష్టగ్రహం."

2835. "గుణం మీద దెబ్బ కొట్టలేక కఱ్ఱ తీసుకుంటే దెబ్బ తగిలేది శరీరానికి."

2836. "చెడ్డతనం ఏది? దొంగతనమూ వ్యభిచారమూనా?

"ఒక వ్యక్తికి బాధ కలిగించేదంతా చెడ్డతనమే."

2837. "కష్టాల్లో ఉండే సుఖం అర్థంకాదు. చేతిలో దీపం ఆరిపోయినప్పుడు తప్ప దేవుడిచ్చే మెరుపు కాంతి అర్థం కానట్లు."

2838. "కారణం లేకుండా ఒకరినొకరు ప్రేమించుకునేది కరువైపోయింది."

2839. "నన్నడిగితే ఎప్పుడూ మంచి రోజులేనమ్మా."

2840. "క్రౌర్యం కొన్నాళ్ళు ఎదురులేకపోతే తగ్గిపోతుంది."

2841. "డిసిప్లిన్ అంటే అరవకుండా వుండటం కాదు. అది తనలో రావాలి. ఒకరు చెబితే వచ్చేది కాదు."

2842. "కవిత్వమూ, పాండిత్యమూ వ్యసనమే."

2843. 'ఆశయం లేకపోతే జీవితం నిరర్థకం కాదా?'

"స్థిరమైంది ఏదో అదే ఆశయం.

అడుగడుగునా మారే అభిప్రాయాలను ఆశయం అనం."

2844. "పులినోట్లో తలకాయ పెట్టాం. లోపలుంచినా కొరుకుతుంది. బైటికి తీసినా కొరుకుతుంది."

2845. "నేరవేరితే మనం దానికి బాధ్యులం అనుకుంటాం. అదే నెరవేరకపోతే మనం కాదు అనిపిస్తుంది."

2846. "చెప్పేది చేయలేము. జరిగేదాన్ని మాన్పించలేము."

2847. "భాగ్యవంతుల దగ్గర తలవంచటం కంటే బీదవాళ్ళ దగ్గర తలవంచటం నయం."

2848. "వంకాయ పుచ్చుకాయ అయితే పుచ్చు తీసేసి మంచి భాగం వండు కుంటాం. ప్రతి వ్యక్తిలో తీసుకోవలసింది మంచే కాని చెడు కాదు."

2849. "అవతల వాడిని మనం మంచితనంతోనే మార్చాలి."

2850. 'ఎదుట పట్టుకొని అడగటమేనా? బాధ కలగదూ?'

"ఎదురుగా వున్నవారి లోపం చెప్పుకోవాలి. దగ్గరలేని వారి మంచి చెప్పు కోవాలి."

2851. "ఆవిడ పుడుతూనే వచ్చిన జుట్టు ఆయన పోగానే తియ్యాలని ఏం లేదు- ఆ మనిషికి విరక్తి పుడితే తప్ప. నువ్వు తీయించటం ఎందుకూ?"

2852. 'మనిషిలో పెఱుగుతున్న స్వార్థానికి అంతం ఎప్పుడు?'

"మనిషితో పుట్టినస్వార్థం -మనిషిపోతేనే అంతం."

2853. "చెడుతనమే పూర్తిగా ఎవర్లోనూ ఉండదు. ఒక్కొక్క రీతిగా వుంటుంది మంచితనం."

2854. "ఏదైనా ఎవరు చేసుకున్నా వాళ్ళ కోసమే."

2855. 'పేదవారుగా ధనవంతులుగా వుండటానికి కారణం పాపపుణ్యాలా?'

"సంఘం హెచ్చుతగ్గులతో ఉంటుంది. తాతలనాటిది పోగొట్టుకునే వారున్నారు. ఏ పిల్లల్నో అభివృద్ధి పరచేవారు ఉన్నారు. ఎన్నో మంచిపనులు చేసేవారికీ కష్టాలు తప్పటం లేదే! నేను పాపపుణ్యాలు కారణమనుకోను-"

2856. "ఎవరి అనుభవంలో ఉంది వారికి నిజం."

2857. "బాధ అంటే ఇష్టం లేనివి జరగటమే."

2858. "అనుకూలంగా లేనిదే బాధ."

2859. "ఇష్టంలేని పనులే పాపమేమో!"

2860. "తేలేది సారాంశం కాని చెప్పేది కాదు."

2861. 'ఏది వాస్తవం?'

"వాస్తవం అంటే కనపడేది."

2862. "భావానికి రూపం ఉంది."

2863. "ఏ భావమైనా స్థిరంగా నిలవటమే తెలుసుకోవటం."

2864. "మనకిష్టం లేనిదేగా దుర్మార్గం అంటే?"

2865. "దానం అన్నది మనసును బట్టి వచ్చేది. ఆస్తిని బట్టి వచ్చేది కాదు."

2866. "మనిషి మృగంలా ఉంటే బావుండదు గాని మృగాలు మృగాలుగా వుండవచ్చు. బావుంటాయి."

2867. "బీదరికమంటే కావలిసినది లేకపోవటం."

2868. 'నడిచిందే బాటగానీ మనస్సులో అనుకున్నది బాట కాదు."

2869. "అనుమానమూ స్ఫురణే. ఒకసారి తెలుసుకుని మరిచిపోయిందీ స్ఫురణే. అంతకుముందు లేనిది ఆ తర్వాత తెలుసుకున్నా స్ఫురణే."

2870. 'అన్నిటిలోకి సుందరమైనది ఏది?'

"ప్రకృతే."

2871. "ఆకలే రుచి : ఆకలయితే జిహ్వ మారుతుంది."

2872. "బంధన ఎక్కడ ఏర్పడితే అది బంధుత్వం."

2873. 'సంస్కారం కలగటమనేది లేదా?'

"అభిప్రాయం కలగటం సంస్కారమే గదా!"

2874. 'కోరికలకు అర్థం లేదమ్మా!'

"కోరికలకు అర్థమున్నది గానీ అంతు లేదు."

2875. "ప్రమాణం అంటే మనస్ఫూర్తిగా అని."

2876. "హృదయం అంటే గుండె అని గాదు. గుర్తించేది అని."

2877. "పెళ్ళి అంటే అటువైపు అర్పణ, ఇటువైపు స్వీకరణ."

2878. "నటన అంటే ఒకటి చేస్తూ మరొకటి చూపించటం."

2879. "వాడుకోవడానికి అవకాశం లేనిది ద్రవ్యం కాదు."

2880. "కోపం తన పని సాగుతున్నప్పుడు రాదు. కోపంలేని వారు లేరు. బయటకు రావటంలో తేడా ఉంటుంది. స్థానాన్ని బట్టి వస్తుంది. పరిస్థితులే పిచ్చి ఎక్కిస్తాయి. జీవితానికి ఆటూ పోటూ ఉన్నాయి సముద్రంలా. అయితే ఒకడు కుంగుతాడు - ఒకడు కృతార్థుడౌతాడు."

2881. "అనుభవం మారదు. కాని అభిప్రాయం మారుతుంది. ఒప్పుకోవటం, ఒప్పుకోకపోవటం - రెండూ అభిప్రాయాలే."

2882. "నాటకమైతే ఆడగలుగుతాముగానీ, అనుభవానికి వచ్చినప్పుడు కష్టమే."

2883. మరపుకు కారణమేమిటి?'

"లక్ష్యం లేకపోవటం."

2884. 'పరవశమంటే?'

"నీ వశం తప్పిందని."

2885. 'దయ్యాలు, పూనకాలు, ప్రయోగాలు - వీటిమీద నీకు నమ్మకముందా?'

"నాకు నమ్మకం లేదు."

2886. "సన్యాసి గృహస్థుగా వుండే కంటే గృహస్థు సన్యాసిగా ఉండచ్చు."

2887. "బ్రాహ్మణుడు తప్పు చెయ్యకూడదు - అన్నవాడు బ్రాహ్మణుడే కాదు."

2888. 'అకాల మరణాలు ఎట్లా వస్తాయి?'

"మన దృష్టిలో అకాలమరణం. వాడంతవరకే యిచ్చాడనిపిస్తుంది. వ్యాధి చంపుతున్నదా? అంటే చంపటం లేదు. - అన్పిస్తున్నది."

2889. 'సంసారం సాగరమని చెబుతారు -'

"సాగరం చంపేదనికాదు. నిరంతరం అలలు, ఆటుపోటూ ఉన్నట్టుగా ఒడుదడుకులుంటాయని. తప్పించుకొంటూ పడుతూ ఉంటాము -"

2890. 'సత్పురుషుల సేవవల్ల మా బలహీనతలు తగ్గుతాయా?'

"తగ్గుతాయి."

2891. "మనిషి మంచివాడు, దేవుడు గొప్పవాడు అనిపిస్తుంది. అన్ని అవకతవకలుండి తనిష్టం వచ్చినట్లు ఆడించేవాడు కనక గొప్పవాడు. వాడిష్టం వచ్చినట్టు ఆడుతూ తనదేదో ఉందనుకుంటాడు కనుక మనిషి మంచివాడు."

2892. "సంఘటనలలో బలం వుంటే భాషలో పటుత్వం ఉంటుంది."

2893. 'కోపాన్ని జయించటమెలా?'

"ప్రకృతి సిద్ధంగా ఏర్పడిన దానిని జయించటమెలా? ప్రకృతికి విరుద్ధంగా ఉండాలనా? కోపంమీద కోపం వస్తుంది గానీ కోపం రానివాడి మీద కోపం రావటం లేదుగా?"

2894. "భార్యను ప్రేమించటం మోహం. బిడ్డను ప్రేమించడం మమకారం. గురువును ప్రేమించడం శ్రద్ధ. భగవంతుని ప్రేమించడం భక్తి."

2895. "పెళ్ళితో బాధ్యత తీరిందా? ప్రేమే ఋణం. ప్రేమ వున్నంత వరకూ ఋణం."

2896. "ప్రేమ క్రింద రద్దే అనసూయ. అసూయని కూడా ప్రేమించేది కాదా ప్రేమ?"

2897. "కారణంతో లేని ప్రేమ తన శరీరం మీద కూడా లేదు."

2898. "ప్రేమ ఎక్కడ వుంటుందో కోపం అక్కడే వుంటుంది. ఇద్దరు పిల్లలు బురద పూసుకొస్తారు. వారిలో తన పిల్లనే కొడుతుంది."

2899. "సూక్తి అంటే హృదయానికి నాటుకునేదేగా?"

"ఎవరికి ఏది అవసరమో అది ఇవ్వడమే సమత్వం."

# ఆధ్యాత్మికాలు

2900. 'దేశసేవేగానీ దేవుని సేవ ఎఱుగం.'

"దేశసేవ, దేవుని సేవ రెండూ వేరు గాదు."

2901. "బ్రహ్మైక్య సాధనా?

"ఈ జగత్తుకు మించినదేదీ లేదు."

2902. "నా భార్యా, నా పిల్లలూ అనేది గుర్తున్నంత కాలమూ సంసారం ఉన్నట్లే."

2903. "అందరమూ యిక్కడ ఊరికే తింటున్నాం అంటున్నావు.

ఆ వూళ్ళో తింటే నీ సొంతమనా?"

2904. "అనంతాలు అంటారా! ఇన్ని అనంతాలు ఎక్కడివి? అనంతాలు అన్నపుడు అర్థం పోతుంది. అనంతమే."

2905. "అందరినీ మోసే తల్లి భూదేవి. ఉన్నా పోయినా, మోసేది ఆమే."

2906. "ఇదికాదు, వేరే ఉంది - అంటారు. అది కనపడదు. ఇది కాదంటారు. ఇది కాకుండా నేను చూడలేదు."

2907. "అన్ని మతాలూ సమ్మత మెవరికో, ఆ మతం అందరికీ సమ్మతం."

2908. "సర్వాన్ని భక్షించేవాడికి వాడికి వాడే రక్షణ."

2909. "సంకల్పం ఇది మంచిదికాదు అనేముందీ?"

2910. దురలవాట్లని గురించి మాట్లాడుతూ "తోచక చేసే పనే"

2911. "ఏం అడిగామో అమ్మ అది ఇవ్వదు. ఏది అవసరమో అది ఇస్తుంది."

2912. "గరుడ పురాణం వింటుంటే - కూర్చుంటే తప్పు, నుంచుంటే తప్పు, అన్నీ తప్పులే. తప్పులేనిదేమిటో కనిపించదు."

2913. "ప్రహ్లాదుడూ ధృవుడూ చరిత్ర వింటాం గానీ మన పిల్లవాడు ధృవుడైతే భరించలేం."

2914. "ఎక్కడికక్కడే తృప్తి. చెట్ల క్రింద వాళ్ళని చూసి తృప్తి చెందాలి. మనం

వంటినిండా బట్టలైనా కట్టుకుంటున్నాం."

2915. "అవినాభావ సంబంధం అంటే మన భావమేదో అదే కన్పిస్తుంది. లేనిది ఉన్నట్లు కూడా కన్పించవచ్చు."

2916. "రక్షణ అనేది ఎప్పుడూ వుంది. అనుకున్నవి అనుకున్నట్లు అయితే రక్షణ ఉందనుకుంటాడు. లేకపోతే లేదనా?'

2917. 'శక్తికి మించిన భారం అవుతున్నదమ్మా.'

"ఆ బరువు మొయ్యలేనిదైతే ఎందుకు వేస్తాడు నీ మీద?

2918. "చైతన్యమంటే కదలిక. కదలికకు హేతువయినది స్పందనం. (వైబ్రేషన్) స్పందన అంటే కంటికి కనపడకుండా ఉండే కదలిక. పూవు విచ్చుతున్నప్పుడు గుర్తించలేము."

2919. "నీవూ, కనపడేదీ రెండు ఉన్నాయి - రూపం ఆధారం చేసుకొని చైతన్యం అంటావు. రూపంలేని దాన్ని రూపంతో తెలుసుకొంటావు. పువ్వుకు వాసన ఉంది. వాసనకు రూపం లేదు. పువ్వును ఆధారం చేసుకున్న వాసనకు చైతన్యం ఉంది."

2920. "త్రిమూర్తులకే త్రికాలాలు అంటారు. ఈ త్రికాలాలు ఆ ముగ్గురికి రూపాలు."

2921. 'ఆలోచనలేని స్థితి వుందా?'

"లిప్తకాలం ఆలోచనకూ, ఆలోచనకూ మధ్య సమయం."

2922. "అనేకం అనుకోవచ్చు. చివరకు అనుభవంలోకి వచ్చేది,తనకు ఉన్నదే."

2923. 'ఇవన్నీ అనాదిలోనే ఉన్నాయంటారా?'

"అనాది అనేకం అయింది కాబట్టి యివన్నీ అనాదివే."

2924. "వస్తువును గురించి భాషమారింది గాని వస్తువు మారలేదు."

2925. "లడ్డు అవటంకంటే తినటం రుచి."

2926. "సత్ లేకుండాచిత్ లేదు. చిత్ లేకుండా సత్ ఎక్కడుంటుంది? అన్నీ ఒకటే."

2927. 'ఆనందం చిదానందం అంటారేమిటమ్మా?'

"చెప్పినదాన్నిబట్టి అనుకోవటమే కానీ సదానందమే చిదానందం."

2928. సమాధి అంటే ఒళ్ళు మరిచిపోవటం కాదు. వచ్చే ఒడుదుడుకులు సమానంగా భరించటమే."

2929. 'మరణించిన వ్యక్తికి - చేసే కర్మ తదితర దానాల వల్ల - శాంతి కలుగుతుందా?'

"పితృదేవతలను మరవకుండా వుండటానికి. చేయటం వల్ల వారికి చెందేదేమీ లేదు. చేసినవాడి తృప్తికోసమే. కనిపెంచినందుకు ప్రతిఫలంగా అహర్నిశం ఆ 12 రోజులయినా గుర్తు వుంచుకోవటానికి. శాంతి కలగడానికి విడిగా ఏముంటుంది? అందులో కలసిపోవటమే."

అనిత్యం అంటున్నారు. రూపం మార్పేగాని లేకపోవటం లేదు.

2953. "మారనిది లేదు. మారుతూ వుండేదే. మారకుండా ఎక్కడ వున్నదీ? రూపాలు ధరించినప్పుడు మార్పు కనపడుతుంది. రూపం లేని శక్తిని గుర్తించలేం."

2954. 'విశ్వరూప సందర్శనమంటే ఏమిటి?'

"ఈ కనపడే దానిని చూడడమే."

2955. 'ధ్యానం చేస్తుంటే పాదాలు కన్పడతాయి.'

"ఏది కనపడ్డా మంచిదే. ఏది కన్పిస్తే ఏముందీ? సృష్టేగదా కన్పిస్తుంది?"

2956. "ఏదైతే నీవు కాదంటున్నావో, దానితోనే నీవు మాట్లాడుతున్నావు."

2957. 'అంతా ఒకటే అయితే - ఇంక ఆధారమేముంది?'

"మీకు నేను నాకు మీరు - అంతా ఆధారం."

2958. 'పరలోకాలు ఉన్నాయా?'

"కనపడుతున్నది తప్ప - ఇది కాదు; ఇంకొకటి ఉన్నది - అని ఆలోచన లేదు."

2959. "సృష్టి నిర్ణయాన్ని మార్చటానికి వీలు ఉంటుందా?'

"మార్చటమంటూ జరిగినా అదీ నిర్ణయంలోదే."

2960. 'సృష్టిలోని కార్యకారణాల గూర్చి పశు, పక్షి, క్రిమి, కీటకాలకు తగిన జ్ఞానం, ఆలోచన ఉంటాయా?'

"ఉంటాయి - ఒక గొడ్డు గీత వినపడుతుంటే అక్కడనుండి వెళ్లలేదు. ఇక్కడ ఉండే ఆంబోతు తొక్కకుండా పిల్లలను దాటి వెళ్లేది."

2961. రామకృష్ణ : సంకల్పం నిలవకపోవటం లోపమా? పాపమా?

అమ్మ : ఆ రెండూ కాదు. అది సృష్టికే ఉన్నది.

2962. 'కోరికలు కోరేవారిని గూర్చి నీవేమనుకొంటావూ?'

"సహజమేననుకొంటాను."

2963. 'ప్రపంచంలోకెల్ల విశిష్టమైనదేది?'

"ప్రపంచమే"

2964. "భిన్నత్వమంటే హెచ్చూ తగ్గే."

2965. 'భిన్నంగా తోచటమెందుకు?'

"భిన్నంగా కనిపిస్తున్నది గనుక."

2966. "పంచభూతాలలో కూడా హెచ్చూ తగ్గూ ఉన్నాయి. నేను నీవు కాకపోతే యిదంతా వుండదు."

2967. 'ప్రళయమంటే ఏమిటి?'

"ప్రళయమంటే అంతా జలార్ణవ మౌతుందంటారు. కాదు. ఒక మూల పోతున్నా - ఒక మూల ఉంది. సృష్టి ఎప్పుడూ ఉన్నది."

2968. "ప్రళయం అంటే అసలు ఏమీలేకుండా పోవటం కాదు. ఒక్కొక్కప్పుడు ఒక్కొక్కచోట మార్పు. అందరూ లేకుండా పోరు."

2969. "అంతా ఒక్కసారిగా ఎప్పుడూ పోదు. మారుతుంది."

2970. 'శరీరం గొప్పదా? ఆత్మ గొప్పదా?'

"ఆత్మ అన్నీ కలిసిందే ననిపిస్తుంది."

2971. 'ఆ శక్తో దేవుడో ఇంతమందిని చావకుండా చేయొచ్చుగా?'

"ఆ శక్తి పుట్టకుండానూ చెయ్యొచ్చు."

2972. "కష్టాలూ సుఖాలూ వాడివే."

2973. "పరిణామమేగాని ప్రళయం వేరుగాలేదు."

# వేదాంతం

2974. "వేదాంతం బొమ్మా, సామాన్యం బొరుసూ. రెండూ నిజమే."

'బొమ్మా బొరుసూ, రెండూ నిజం కావటం ఎట్లా?'

అమ్మ సగానికి మడతపెట్టి వున్న కాగితం తీసి,

"ఈ కాగితానికి ఇటూ అటువైపూ ఉన్నాయి ఇప్పుడు. కాని (అని మడత విప్పేసి) ఇట్లా తీసి చూస్తే అంతా ఒకటే. మడిచినప్పుడు రెండుగా కనపడుతుంది. తీస్తే ఒకటే. అలాగే ఏవైపునుంచి చూసేవారు అదే నిజమనుకుంటారు.'ఇది కానిది ఏదో ఉన్న' దని ఒకరనుకొంటే, 'అంతా ఇదే' అని ఇంకొకరు అనుకుంటున్నారు కాని నాకు రెండూ ఒకటే. వాళ్లు రెండు అంటే, నేను ఇది తీసి ఒకటే అంటున్నాను."

2975. "చెట్టూ విత్తనం ఒకటే. అదే చెట్టు,కొమ్మ,ఆకు, కాయ, పువ్వు, పండు - ఇన్నీ అయినట్టు ఒకేశక్తి, రూపాలు వేరని నాకనిపిస్తుంది."

2976. "ఇది కాదిది కాదంటారే, ఏదీ ఔననీ?'

"అంతా అయిందే నువ్వు చూస్తున్నావు."

2977. "మొదట 'నేతి' 'నేతి' తర్వాత అంతా అవును."

2978. "రజ్జు సర్పభ్రాంతి రెండూ తెలిసిన వాడికే.'

2979. "ఒకటే తప్ప రెండు లేదనేదీ, ఒకేమాట మార్పులేనిదీ యిక్కడే. రెండు అన్ని చోట్లా వున్నది."

2980. "ఆధ్యాత్మికానికీ లౌకికానికీ తేడా లేదు."

2981. "మీరు నేననే శరీరం కాదంటున్నారు. కాని నేను అన్నీ (శరీరం,మనస్సు, జీవాత్మ) నేనే అంటాను."

2982. "అక్కడ ఏది ఉందనుకొంటున్నాడో, వీడూ అదే."

2983. "ఇదంతా అదే. పరిపూర్ణమే."

2984. "బ్రహ్మను చూడలేదు. ఇదికాక వేరే వుందని నేననుకోవటం లేదు."

2985. 'చెప్పేవాడిలో వాడే. వినేవాడిలో వాడే. తేడా యెందుకు?'

"మినపప్పంత ఉప్పు పోస్తే రుచిరాదు. అందుకే వ్యత్యాసం."

2986. 'నేను నేనైన నేనూ అంటే?'

"మొదట ఏది ఉందో చివరవరకూ అదేనని."

2987. "నేనంటూ లేకుండా అంతా నీవే - అన్నా, మంచిదే,లేదూ -, అంతా నేనే -అన్నా , రెండూ ఒకటే.

2988. "ఆత్మే స్వభావం, ఆత్మే స్వరూపం"

2989. "వ్రేళ్ళ రూపమూ వ్రేళ్ళ మధ్యది అమ్మే."

2990. "కనపడుతున్న రూపమేదో - కనపడనిదీ,అదీ అమ్మే."

2991. 'ప్రపంచమంతా దైవానికి బిడ్డలే కదా, కొందరు సుఖాలతో కొందరు కష్టాలతో ఎందుకు నలుగుతున్నట్టూ?'

"వాళ్ళూ అవీ (కష్ట సుఖాలు) అన్నీ బిడ్డలే."

2992. "ఒకరని ఏముందీ?

అందరూ అవతారాలే. తలో పనికి వచ్చాం."

2993. "ప్రకృతిలోనే వికృతి ఉంది. ప్రకృతీ వికృతీ వేరు కాదు."

2994. "రెండూ వాడే అనుకొన్నప్పుడు దుఃఖం ఉండదు."

2995. 'కష్టంలో దైవమున్నాడన్పిస్తుంది.'

"దైవం ఎప్పుడూ ఉన్నాడు - కష్టంలో సుఖంలో."

2996. "ప్రపంచమూ - పరమార్థమూ వేరు కాదు."

2997. "వేదాంతం వినేవాడికీ చెప్పేవాడికీ తెలియదు. అనుభవ రీత్యా తెలియ వలసిందే."

# అద్వైతం

2998. "లడ్డు పట్టుకుని తింటూ - ద్వైతం పనికి రాదంటాడు."

2999. 'బ్రహ్మ వేరే ఉన్నాడో లేదో తెలియదు. వాడే మీరనే బ్రహ్మ అనుకుంటున్నాను.'

"బ్రహ్మ తాను అయితే బ్రహ్మ వేరుగా లేడు."

3000. (ఉప్పుబొమ్మ ఉదాహరణ గురించి) "తాను వేరుగా వుంటేనే, ఉప్పు సముద్రంలో కలిసిపోవడం చూచేది. అద్వైతాన్ని ద్వైతంగా వుంటేనే చెప్ప గలడు. ఒక వస్తువును గుర్తించాలంటే, వేరుగా వుండి గుర్తించవలసిందే."

3001. "ఆత్మ కాక యే రూపాలూ లేవని చెబుతూ, సూదిమోపను సందు లేదంటూ, ఏ రూపంలో చూస్తున్నావూ?"

3002. "నేను కానిది లేదు. నేను అన్నీ అంటాను!"

3003. "ఈ మొత్తం పువ్వు అద్వైతం నాన్నా. ఇప్పుడు తొడిమ తీసేస్తే అది ద్వైతం అవుతుంది."

3004. "చెప్పేటప్పుడు రూపం ఉన్నది కాబట్టి ద్వైతంగా కనబడుతున్నది."

3005. "దారం పోగు ఒకటే. దాన్ని సూదిలో వేసి లాగితే రెండు పోగులవుతుంది. ఈ రెండింటికి మూలం, ఆధారం ఒకటే దారం. సూది ఒకటే గదా? దానికి చిల్లి ఉంది. ఒక అడ్డం ఉంటేనేగాని రెండు కాదు."

3006. "రెండుగా లేనిదాన్ని రెండుగా చేసి మాట్లాడుకుంటున్నాము."

3007. "ఒకటి రెండుగా అన్పించటమే భ్రమ."

3008. 'అద్వైతం అంటే ఏమిటి?'

"రెండూ ఒకటి కావటమే అద్వైతం."

3009. "ఒకటిగా వుంటే అద్వైతం. ఇది అదే - అనే విషయం మాటలతో గాక అనుభవాని కొచ్చినప్పుడు అద్వైతం."

3010. "నీ చుట్టూ ఉన్నదాన్ని నీలాగా చూచుకోవటం అద్వైతం."

3011. 'సర్వం దైవమంటున్నారు. అంతా వాడైనప్పుడు ఈ బాధ మాకెందుకు?'
"నేను నేనుగా ఉంటూ నీవై నావు గనుక అనుభవించే వాడు వేరుగా కనబడుతున్నాడు."

3012. "అంతా ఆత్మ అనుకున్నప్పుడు జిల్లెళ్ళమూడి ఎంతో - సరిహద్దులు దాటేక అంతే!"

3013. "సర్వత్రా ఆ చైతన్యమే చూస్తునప్పుడు ప్రశ్నే లేదు."

3014. "నేను మీ కంటే భిన్నంగా లేను."

3015. "నాది యూనివర్సల్ లవ్, నావైపు తిరిగిన వాళ్ళని ప్రేమిస్తున్నానంటాడు. మొదటి మాట పోయిందిప్పుడు."

3016. "మిమ్ములను విడిచి నేనూ, నన్ను విడిచి మీరూ లేరు."

# ముక్తి

3017. 'అయితే ఎప్పుడు చంపుతావు?'

"నీ విట్లా అనుకోనప్పుడు, నాకవసరమనిపించి నప్పుడు, నీ వంటూ లేకుండా నేనై పోతాను."

3018. "ఉన్నది ఒకటే త్రోవ. ఎటు అడుగేసినా వాడి దగ్గరకే. వేరే చోటు లేదు."

'ఎప్పుడు ఒకటే ఔతుంది?'

3019. "నేనూ, నీవూ, ఏకం కావటం అంటే శరీరం కలుసుకోదు. భావం కావటమే."

3020. "నీవంటూ లేకపోయిన తరువాత అంతా నేనే."

3021. 'ఎవ్వరూ లేనిచోటు, హాయిగా ఉండే చోటు చెప్పమ్మా - '

'లోపలా? బయటా?' అని ఇంకొకరు.

"లోపల నాకు తెలియదు, బయటే."

3022. 'ఈ తీర్థంతో కామక్రోధాలు నశింపచెయ్యాలమ్మా-'

"పెరుగుతై. అవన్నీ నేనే అనిపించవచ్చు గానీ పోవు-"

3023. "ఆత్మను పొందినవాడికి దానిని పొందినట్లు తెలియదు."

3024. "అన్నీ తెలిసినా, ఏమీ తెల్సుకోవల్సింది లేకపోయినా - ఒకటే."

3025. 'ముక్తి అంటే?'

"ఏది చేస్తున్నా, ఏది చేస్తున్నా అన్ని వేళల్లో తృప్తి గలిగితే అదే ముక్తి."

3026. సరస్వతి అడిగింది

'పోనీ అమ్మా - ఇన్ని బాధలు పడినా చివరకు నీలో కలుస్తాంగా?'

"అది ఎప్పుడూ ఉంది. దానికి అడ్డు లేదు.

నువ్వు కలవటం కాదు. నేను కలుపుకోవటమే."

3027. 'శాంతి ఎప్పుడు?'

"ఈ ద్వంద్వాలు సహజమనిపించినప్పుడు."

# కటాక్షం

3028. "దుష్ట శిక్షణ అంటే మనుషులను చంపటం కాదు. మనస్సును మార్చటమే అని నేను అన్నాను. అంటే ఆనాటి ఆ విధానం తప్పు అని కాదు. ఆనాటి వ్యవస్థ అది."

3029. 'మీ దయ ఉంచండి తల్లీ మా మీద.'

"అది ఎప్పుడూ ఉన్నది నాన్నా. ఈ కష్టాలూ, సుఖాలూ అన్నీ ఆ దయ ఇచ్చినవే."

3030. "బాధ కలగటానికైనా, రక్షింపబడటానికైనా కారణం కటాక్షమే."

3031. "నా దగ్గర ఉండగలగడం మీ యోగ్యతల వలన కాదు."

3032. "అన్నీ శుభాలే, అన్నీ అశుభాలే. ఒకడికి శుభమైనది ఇంకొకడికి అశుభం కావచ్చు. పెండ్లి మాత్రం శుభమని ఏముంది? పెండ్లి కాగానే వాడు పోతే ఆ పెండ్లిని శుభమని ఎట్లా అంటాము? చావు శుభమని అనలేము. నరకాసురుడి చావు శుభమంటే కాదంటావా?"

3033. "మనం దాని నుండి వేరు అనుకోకపోతే భగవంతుడి దయ అనలేము. అన్నీ వాడే అయితే ప్రత్యేకించి దయ ఏముంది? కాని చెప్పక తప్పటం లేదు. అంతా అయినదాన్ని 'అది, ఇది' చేసాము. భగవంతుడు అని కాక భగవంతుని శక్తి అని చెప్పుకుంటాము. అసలుకు 'ఆ, ఈ'లు లేవు. ఆ ప్రపంచం, ఈ ప్రపంచం అని మనం రెండుగా ఉన్నాము కనుక - చెప్పకోక తప్పదు. అదీ ఇదీ, కూడా అంతే" అని.

3034. "పరిణామమూ కటాక్షమే."

3035. "భగవంతుని కటాక్షమెప్పుడూ వుంది. కాని నువ్వు దానిని అనుకున్నది అనుకున్నట్టు జరిగినప్పుడు గుర్తిస్తావు."

3036. "దారి తప్పటం కూడా అనుగ్రహమే."

3037. 'మీ సంకల్పమే మా సంకల్పం కదా. మేము ఎన్ని అనుకున్నా చివరకు

మీరు అనుకున్నట్టే జరుగుతుంది. మమల్ని ఆశీర్వదించండి-' అన్న వెంటనే అమ్మ నవ్వుతూ అన్నారు . . . .

"అది మాత్రం వేరే ఎక్కడ నుండి వస్తుంది? ఏ ప్రక్క దారినుండి పరిగెత్తుకు వస్తుంది? ఉన్నదే అది."

# ఆత్మ

3038. 'నాకే ఆలోచనా లేదు. శూన్యంగా ఉంది.'

"శూన్యంగా ఉన్నదని దేన్ని ఆధారంగా చేసుకుని అన్నారో? శూన్యం శూన్యాన్ని ఎట్లా గుర్తించిందో?"

3039. "నేను - ప్రాపంచికం వేరూ, పరమార్థికం వేరూ అనుకోవటం లేదు."

3040. 'పరమాత్మ స్థితి ఏమిటి?'

"తాను కాకుండా లేదనే స్థితి."

'పరమాత్మ అంటే?'

"తాను కాకుండా లేనివాడు. అంతా తానైనవాడు."

3041. "అంతటా శక్తిమంతంగా ఉండి అర్థం కానిది ఆత్మ."

3042. "గుర్తించే గుర్తు తానేగా?"

3043. "ఉన్న దొకటేగా, శరీరాలు వేరు గానీ."

3044. "ఆత్మ అనాత్మ అని రెండు అంటారు. అసలు రెండు లేవు. 'అనాత్మ' అనుకుని ఆత్మని - ఒకటి అనగా పది అనుకోమన్నట్లు - ఇంకోటిగా అనుకోమంటారు. ఆత్మకు రూపం లేదు. ఇంకోటేదో చూడమంటారు. చూడగలిగిన్నాడు శరీరమే ఆత్మనిపిస్తుంది."

3045. "ఎక్కడికక్కడ ఉంది. అక్కడే కలుస్తుంది."

3046. "ఆత్మ అంటే అంతటా ఆవరించి ఉండి శక్తి మయంగా ఉన్నది."

'అది తెలుసుకోవటం ఎట్లా?'

"తెలియటం అంటూ వస్తే - శక్తి రూపంగానే తెలుస్తుంది."

3047. "ఆత్మంటూ తెలిస్తే - అనాత్మ అంటూ లేదసలు."

3048. 'నేను అంటే ఏమిటి?'

"ఏది చూస్తూ, ఏది గుర్తుపడుతున్నదో, ఏది నేను అని అడిగించిందో,

ఏది చేసుస్తున్నదో అది నేను."

3049. "అహంకారం కనపడక పోవచ్చు గానీ, అహం ఉంటుంది.'

3050. 'నీలో ఉన్న నేనుకూ, నాలో ఉన్న నేనుకూ తేడా ఏమిటి?'

"గుర్తింపే తేడా."

3051. "మనం ఆత్మ అనేదే Supramental power దిగడానికి ఏదో ఎక్కడానికి అదే."

3052. 'పరమాత్మ అంటే?'

"తాను కాకుండా ఇతరం లేనివాడు."

3053. 'దేహాత్మ భావం పోవడమెట్లా?'

"దేహం కూడా ఆత్మయేనని నా వుద్దేశం. దేహంతోనే గదా ఒక రూపం వచ్చింది."

3054. "శరీరం కాకుండా జీవుడు వేరే లేడు."

3055. 'అమ్మా! ఆత్మ, జీవాత్మ, పరమాత్మ అంటే?'

"నేను మూడుగా అనుకోవటల్లేదు. శరీరం కూడా ఆత్మేననిపిస్తుంది. మారేదీ, మారనదీ కూడా ఆత్మేనని. ఆత్మ అంటే అంతటా ఉంది. సూది మోప సందు లేదంటున్నారు కదా? ఆత్మ కానిదేం వుంది?"

3056. "ఆత్మ కానిదేమిటీ? ఉపాధి లేనిది (ఆత్మ) అంటున్నారు. ఉపాధీ అంటున్నా నేను."

3057. "మీరు సమచిత్తం అన్నారు. రమణ మహర్షి సహజ సమాధి అన్నారు. నేను సహజ సహనం అంటా. సమత్వానికేగా ఇన్ని పేర్లు?"

3058. "సూది మోపను సందు లేదంటూ - సాక్షాత్కారం అయిందంటే ఏమిటీ?"

3059. "పూసలన్నీ ఒక దారంలో గుచ్చినట్లుగా ఈ జీవులన్నీ ఆత్మ మీదనే ఆధార పడి వుంటయ్. పూసలన్నీ వేరు వేరుగా ఎట్లా ఉంటాయో ఈ జీవులన్నీ అంతే."

3060. "ఒక ఆత్మకు మనం జీవులం. కాబట్టి ఈ జీవులందరికీ ఒకడు ఆధారం."

# ఆనందం

3061. 'పూజలు, పురస్కారాలు ఎందుకనీ?'

"హాయీ, ఆనందమూ, సుఖమూ ఉందనుకుని తృప్తి కోసం."

3062. "హాయి అనేది స్థలంలో లేదుగా? మనస్సులోనే ఉంది."

3063. "ఇంకొకటి ఉంటేనే గుర్తించగలవు.

ఆనందం ఇంకొక దానిని ఆధారం చేసుకొని వుంది."

3064. "లక్ష్యం పెట్టుకున్నవాడికి ఆనందం ఉంటుంది. తాగేవాడూ, జూదం ఆడేవాడూ అనుక్షణం తృప్తి పడలేడు."

3065. "ఈ నేను వేరు, ఆ నేను వేరు - అనుకున్నప్పుడు ఆనందం లేదు - ఈ నేనే ఆ నేను అనుకొన్నప్పుడు ఆనందం వుంది."

3066. "అన్నీ తెలిసినవాడికీ, దేన్ని గురించీ ఆలోచన లేనివాడికీ - ఏ బాధా లేదు."

# స్థితులు

3067. "పూర్తి పశ్చాత్తాపం కలిగితే అదే అనుభవించటం. అప్పుడు ఆ మనస్సు పడే ఆవేదన ఎంతో 'ఇంత'ని చెప్పలేము. అదే ప్రాయశ్చిత్తం."

3068. "స్థితి అంటే? అన్నీ స్థితులే. ఎక్కడికక్కడే స్థితి ఉన్నది."

3069. "అటువంటి వాడు ఎక్కడ దొరుకుతాడురా? వంట పని తగ్గితే నీళ్ళకు పోతాడు. నీళ్ళ పని తగ్గితే పొలానికి పోతాడు. ఎప్పుడో ఏదో చచ్చిన తరువాత చూద్దాము, పొందుదామని అనుకునే కంటే - రేపేదో ఉన్నదో లేదో. ఎప్పుడో మాట ఎందుకు? ఇప్పుడు పరిమిత రూపంలో కనబడుతున్నది, చూద్దామని అనుకుంటాడు."

3070. "అన్నీ కావాలనేది త్యాగమే. ఏమీ వద్దనేదీ త్యాగమే."

3071. "ప్రతి స్త్రీలోనూ అమ్మను చూచేవాడికి అందనిదంటూ ఏమీ లేదు."

3072. "పుట్టాడని సంతోషం, చచ్చాడని దుఃఖమూ లేక పోవడం అమృతత్వం."

3073. "వాడు (పోతుకూచి రవి) అక్కడ (ప్రెస్‌లో) ఉంటున్నాడు అంటే ఆ మిషన్‌లూ, అవీ దేవతార్చన అనుకోబట్టే ఉండగలుగుతున్నాడు. చేతిలో నుండి ఏదీ క్రిందపడినా కళ్ళకద్దుకుంటాడు."

3074. "ధ్యానంలో నుండీ బయటకు వస్తున్నాడని అంటున్నారు. ఎక్కడకు వెళ్ళుతున్నాడు, ఏమి అనుభవిస్తున్నాడు? అంతటి ఆనందాన్ని అనుభవించిన వాడు తిరిగి ఎందుకు వస్తున్నాడు?"

3075. "పతనమవటం లేదు - మీరనుకునే అవస్థలూ ఇవన్నీ సోడా గుండు లాంటివి. గాస్ కొడితే పైకి పోవడం, ఓపెనర్‌తో కొడితే క్రిందకు దిగటం-"

3076. "తురీయావస్థలో నుండి దిగివచ్చాడు అంటారే - అటువంటి ఆనందం నుండి ఎందుకు దిగి వస్తాడు? ఏ శక్తి క్రిందకు దించుతుంది. నిజంగా తురీయావస్థలో ఉన్నవాడు చెప్పలేడు."

3077. "సంకల్ప రహితమంటే కష్టసుఖాలకు అతీతమయిన స్థితి కాదు. సర్వ

వస్తువులూ వాడే అనుకోవటమే."

3078. "అన్నిటి యందూ ఒకటే చూడగలగడం ఏకాగ్రత."

3079. "నేను నీవయినప్పుడు స్థితి పరిస్థితి అవుతుంది."

3080. "స్థితి అంటూ కలిగేకా అందులో కొంత పొందటం, కొంత పొందకపోవటం ఉండదు."

3081. "నేను ఎక్కడికి వెళ్లినా అమ్మ నా వెంట ఉన్నది. నేను తప్పు చేస్తే అమ్మకు తెలుస్తుంది. అమ్మే చేయిస్తుంది - ఇవి రెండు స్థితులు."

3082. "ఏ స్థితి అయినా వచ్చేదే."

3083. 'ఎక్కడ నుండి వస్తుందంటారు?'

"మనం ఎక్కడ నుండి వచ్చామో అక్కడ నుండే."

3084. "నాకు 'ఎక్స్‌పీరియన్సులు' లేవు నాన్నా, ఇక్కడ నుండి వెళతాడు. అందద నుకున్న బస్సు లేటయ్యి అందుతుంది. అది ఎక్స్‌పీరియన్సే నంటాడు. అది నిలవదు. ఎందుకంటే రేపు అందకపోవచ్చు. అప్పుడు అనుకోడుగా?"

3085. "ఏది జరిగినా, ఎవరు ఏది చేసినా మనం కాదు చేసేది. మనని నడిపించే శక్తి మరొకటి ఉన్నది అనుకోవటమే ఎక్స్‌పీరియన్సు."

3086. "అవధులు లేనిది సమాధి."

3087. "నా దృష్టిలో నిర్ణయం. మీ దృష్టిలో మిరకిల్."

3088. "సర్వ వ్యాపకంగా ఉన్న శక్తిని గుర్తించటానికి అవకాశం లేదు గనుక - ఈ రూపం కావలసి వచ్చింది."

3089. 'నీ సన్నిధిలో ఉన్నా ఈ రోగాలు పట్టుకున్నాయమ్మా. అక్కడ ఉంటే ఎటూ తప్పవు.'

"ఇదేమిటీ? నా సన్నిధి జిల్లెళ్ళమూడి వరకే పరిమితం చేశావా? నా సన్నిధి రోగాల పుట్ట."

3090. "నేను కని పెంచిన పిల్లలలో లోపం వెదకడమంటే లోపం నాదే."

3091. "తల్లి న్యాయం - నీవు చేసినా, చెయ్యకపోయినా నీకు కావలసినవి తల్లి చెయ్యటమే. తల్లికి బరువు లేదు, బిడ్డకు బదులు లేదు."

3092. "తల్లికి బిడ్డ గుర్తు ఉన్నట్లుగా మరొకరికి ఉండదు."

3093. "తల్లి ప్రేమ లోపాలను పరికించదు. దూషించినా తిరస్కరించినా మమతనే కురుపిస్తుంది."

3094. 'బిడ్డకు తగిన అర్హత ఉండొద్దా?'

"ఎటువంటి వాడైనా బిడ్డడే. బిడ్డ కావటమే అర్హత."

3095. 'అమ్మ మమ్మల్ని గారాం జేస్తున్నారు.'

"అమ్మ చేయకపోతే ఇంకెవరు చేస్తారూ?"

3096. "చెట్టు ఎండలో ఉండి, చేరిన అందరికి నీడ ఇస్తుంది. అటువంటిది మాతృత్వం."

3097. "అందర్నీ ఒకటిగా ఆదరించటం అంటే తల్లి స్వభావమే."

3098. "జనని అంటే - మూల స్థానమనేగా!"

3099. "పిల్లవాడిని తల్లి వంగే ఎత్తుకుంటుంది. నేను ఎప్పుడూ సిద్ధమే."

3100. "అర్పణ బిడ్డ కంటే తల్లే అవుతుంది."

3101. "తల్లీ బిడ్డా అన్నప్పుడు సరెండరు లేదు. తల్లే సరెండరు అవుతుంది."

3102. 'మేము మందిచ్చిన తరువాత ఆరోగ్యంగా ఉంటారా?'

"ఆరోగ్యంగా ఉండను. కులాసాగా ఉంటాను.'

3103. "ప్రతిష్ఠ? సాయంకాలం - "

'సాయంకాలం ప్రతిష్ఠ చేస్తారా?'

"మనస్సుకి ఎప్పుడు హాయిగా ఉంటే అప్పుడూ. ఆగమ శాస్త్ర ప్రకారం కాదుగా? ఎట్లా తోస్తే అట్లా."

3104. "నాకీ వేదాంతం బుఱ్ఱకెక్కటల్లేదు.

ఎంతసేపటికీ ఈ లోక వ్యాపకం తప్ప ఏం లేదు."

3105. 'ఊరికే ఉన్నప్పుడు ఆలోచిస్తుంటావా?'

"ఎప్పుడూ అనేక ఆలోచనలతో ఉంటా. సమాధానాలు చెబుతూ ఆలోచిస్తుంటా - కాదు ఆలోచనలు వస్తయ్."

3106. "కాలం ఎప్పుడూ ఉన్నది. రాత్రీ పగలే కాదు. ఎప్పుడూ ప్రెజంటే నాకు."

3107. 'దేవుని సేవ చేస్తే?'

"నేను దేవుణ్ణి చూడలేదు."

3108. "వచ్చే వాళ్ళెంతో ఉన్నవాళ్ళు అంతే నాకు."

3109. 'మాకూ మీకూ తేడా ఏమిటి?'

"రెండూ కనబడటమే."

3110. "ఆ శక్తి ఉన్నప్పుడు అందరిళ్ళలో, అన్నీ ఊళ్ళల్లో ఒకే టైంలో కనిపించినప్పుడే నాకు తృప్తి. ఇప్పుడు చాలా మంది నేను (వాళ్ళ) ఒంటి మీదకు వస్తున్నానంటున్నారు. నాకు తెలియకుండా నేను వెళ్ళటం జరగదు గదా? వాళ్ళ ఆవేశమే కావచ్చు."

3111. 'లేని వాటిని గురించి ఎందుకమ్మా అడుగుతావు? ఉన్నవి చాలవూ?'

"పది వేల గొఱ్ఱెలున్నా ఒకటి పోతే కావలివాడు దాని కోసమే వెతుక్కుంటాడు."

3112. 'అగ్ని పరీక్ష చూచావా? బాపట్ల వచ్చింది.'

'మనకు రాలా.'

"నాకొచ్చే ఉంది."

3113. "నాకు మామూలుగా ఎట్లా ఉందో ఈ పూజలూ ఇవీ జరుగుతున్నా అట్లాగే ఉంది." (ముద్రలెలాగూ వచ్చాయి?)

3114. "మీరు చేద్దామంటే సరే అంటున్నాను. చెయ్యండీ అని చెప్పలేదు."

3115. "మనకు ఎప్పుడూ బాధ్యతలు ఉంటాయి. ఎప్పుడూ లేవు. ఎంతగా ఉన్నవో అంతగా లేవు."

3116. 'అరిషడ్ వర్గాలను తొలగించుకోవాలా?'

"మీరు వానిని జూచి భయపడుతున్నారు. నేను సంపూర్ణంగా స్వీకరిస్తున్నాను. అన్నీ గుణాలూ మీ కంటే నాకెక్కువే."

3117. "నేను పడలేనంత బాధ నాకు ఎప్పుడూ రాలా."

3118. "ప్రతివ్యక్తి నన్ను గూర్చి ఎట్లా అనుకుంటారూ అన్న ఆలోచన రాదు - నాకు తోచినట్టు చేసుకోవటమే. నన్ను పొగడవచ్చు. దూషించవచ్చు - 'పొయ్యేది ఏమిటిలే' అనుకోవచ్చు - రావచ్చు. ఏమైనా అన్నీ సమానమే. అంతా ఒకటే."

3119. "తెలిసి, అనాలని అనుకొని, అనే మాట లేదు. ఇట్లా అందామని అనుకోను."

'నీ ఉద్దేశం చెప్పమ్మా?'

"రేపటిని గూర్చి ఆలోచన ఉండదు."

3120. 'మీకు కీర్తి కాంక్ష లేదా?'

"అవసరం కోసం చేస్తాను. అది అవతలివాడి దృష్టిలో కీర్తిగా మారవచ్చునేమో-

మొండిమొలతో వచ్చిన ఒకడికి పైట చించి గోచీగా పెట్టాను. చూచినవాడి దృష్టికి కీర్తిగా కనిపించవచ్చునేమో! కీర్తి దృష్టితో ఆ పని చేయటమంటూ ఉండదు."

3121. "మీరంతా అహం చచ్చిపోవాలనుకుంటే, నేను అంతా నేనే అనుకుంటా."

3122. 'దారిద్ర్యం నేనే అని చెప్పేరు వాక్యల్లో!'

"మృత్యువును కూడా నేనే."

3123. "నేను మాత్రం ఒక అనంతమైన శక్తి మనకి అర్థం కాకుండా వుండి నడిపిస్తోందనుకుంటా."

3124. "నాకేమో ఎన్ని గుడ్డలు చూసినా వాటికి మూలం ప్రత్తి అనిపిస్తుంది."

3125. 'మీరు మాలో దైవాన్ని చూస్తారా?'

"మీ 'లో' కాదు, మీరుగా."

3126. "జరిగినదీ చెప్పటం లేదు, జరిగేదీ చెప్పటం లేదు. చెప్పలేను. చెప్పను."

3127. 'ప్రసాదాలు లేవా అమ్మా?' అని ప్రభావతి.

"ఇవ్వాళ ఎవరికీ లేవు ప్రసాదాలు. ఉన్నయ్యేమో కనుక్కో అన్నపూర్ణని."

ప్రభావతి లోపలికి వెళ్ళి వచ్చి లేవని చెప్పింది.

'పక్కగదిలో అలమర్లో ఒక యాపిల్ పండూ, బత్తాయీ ఉన్నాయి. రవికి (అమ్మగారి అబ్బాయి) ఇవ్వవచ్చేమో' అన్నది ఇందిర.

"మిగతా వాళ్ళకి లేకుండా, ఒక్కళ్ళకే ఇస్తే ఎలా? పోనీ యాపిలు తీసుకురా. ముక్కలుకోసి అందరికీ ఇద్దాం."

# జ్ఞానం

3128. 'భగవద్గీత ద్వైతమా అద్వైతమా అని పోట్లాడుకుంటున్నారమ్మా.'

"ఏదీ అర్థం కానప్పుడు మిగిలింది పోట్లాటే."

3129. 'జ్ఞానం అంటే ఏమిటి?'

"తెలుసుకున్నది. కనిపించేదంతా దైవం అనుకోవటమే జ్ఞానం."

'అది రావటానికి ఏం చెయ్యాలి?'

"చేస్తే వచ్చేది కాదు. ఇస్తే వచ్చేదే. ఈ ఆలోచన ఎవరు ఇచ్చారో వాళ్ళే ఇస్తారు."

3130. "శరీరం లేని ప్రాణం కనపడదు.

చైతన్యం లేని వస్తువు ఉండదు."

3131. 'జ్ఞానులకూ, అవతారాలకూ తేడా ఏమిటి?'

"పుట్టుకతో జ్ఞానం ఉన్నవాడు అవతారం. వచ్చి సాధన చేసినవాడు జ్ఞాని."

3132. 'కర్తవ్యం తోచడం లేదు.'

"కర్తవ్యం ఎప్పుడో, ఎక్కడో ఉందని కాదు. అనుక్షణం అదే జరుగుతున్నది."

3133. "ఇది అని ఎప్పుడు అనిపిస్తుందంటే అది అనుభవించి ఉంటే ఇదే అవుతుంది.

మాటలలో కాక - క్రియలలో అనుభవించి తెలుసుకోవాలి."

134. 'సమత్వం చూసే చిత్తానికీ, వ్యవహారంలో ఉన్న చిత్తానికీ పేర్లు పెట్టవచ్చుగా? - జ్ఞానం, అజ్ఞానం అని అనవచ్చుగా?'

"అజ్ఞానం లోంచే జ్ఞానం వచ్చేది. బొగ్గులలోంచే నిప్పులాగా."

135. "సన్యాసాశ్రమంలో ఉన్నవాళ్ళకు కూడా చావు అంటే భయం వుంటుంది."

136. 'లౌకికానుభవాన్ని వదలమన్నారు కదా?

వదిలనవాడు జ్ఞాని అన్నారు.'

"వదిలిపెట్టచ్చు. వదిలి పెట్టాలి అంటున్నారు. అంటూనే నీకు వదిలి పెట్టాలన్న ఆలోచన వుండకూడదంటారు. కోరిక ఉండకూడదట."

3137. "ఏకమేవ అద్వితీయం అంటే ఉన్నది అదే; రెండోది లేదు - అద్వితీయాన్ని బ్రహ్మగా చూడటం లేదు. ద్వితీయం చేసి ఒక భాగాన్ని బ్రహ్మగా అంటున్నారు."

'జ్ఞానేంద్రియాలకు అంటకుండా ఉన్నాడని చెబుతారే.'

"అన్నీ అయి వుండి అంటకుండా ఉన్నాడని - ఇన్ని రూపాలూ నీవే - ప్రత్యేకించి నీ రూపం అర్థం గాదని - "

3138. 'మా గురువుగారు దైవాంశసంభూతులమ్మా!'

"అంశ గలవారే కాని దైవం కారు కదా? ప్రతీవారూ దైవాంశులే. ప్రకృతే దైవాంశ. రెండుగా గుర్తించినప్పుడు దైవాంశ. ఒకటి అయినప్పుడు ప్రకృతి కూడా దైవమే."

3139. "ఏదో ఒకటి తెలుసుకున్నది తెలివి. అన్నీ తెలుసుకున్నది జ్ఞానం."

3140. "ఉన్నది ఉన్నట్టుగా అర్థం చేసుకోవటమేగా జ్ఞానం."

3141. "ప్రేరణను గుర్తించలేకుండా ఉన్నప్పుడు బాధ. అన్ని వేళల్లో అదే గుర్తుకు వచ్చినప్పుడు ప్రేరణే తాను ఔతాడు."

3142. "చూడటమనే ధ్యాస కలగటమే వెలుగు."

3143. "అన్నీ ఒకటిగా గుర్తించేవాడు జ్ఞాని.

అన్నీ తానైనవాడు దైవం."

3144. "సర్వాన్ని శక్తిమయంగా చూడగలగటమే జ్ఞానం."

3145. "నీవైన నేను తెలుసుకోవటమే జ్ఞానం. అంతా నేనుగా కనిపించటం దైవం. నీవు లేని నేను."

3146. 'అమ్మా - నేను నీకేమి చేయగలనూ?'

"నీవు చేసేదంతా నాకే."

3147. "సర్వం తెలుసుకొన్న తెలివికి అవధుల్లేవు."

3148. "కర్త కర్మ క్రియలలో కర్తే కర్మ క్రియలకు ఆధారం గదా? కర్త లేనిది అవి లేవు."

'కర్మ ఎవడికి లేదు?'

"సుకర్మ దుష్కర్మ తానే అయినవాడికి."

3149. "పదార్థంలోంచి చూస్తున్నవి అది (సైన్సు). మనసులోంచి చూస్తున్నది నీవు."

3150. "అన్నీ తెలుసుకునే తెలివే అన్నీ అయివున్నది."

3151. 'ప్రతీ వస్తువులో దైవత్వాన్ని గుర్తించటమే విశేషమంటావు?'

"ఆ దైవమే అనేక రూపాలు అయినప్పుడు అన్నింటిలో దైవత్వం ఉండటం విశేషమేముందీ?"

3152. "నడవనివ్వని శక్తులన్నీ నడిపించే శక్తి మీదే ఆధారపడివున్నయ్."

3153. "ప్రాణం ఎప్పుడూ ఉన్నది.

అంతా సజీవం అన్నాక ప్రాణం లేనిది ఏమిటి!"

3154. "ఆధారం ఎప్పుడూ అజ్ఞాతంగానే ఉంటుంది."

3155. "జీవం ఎక్కడ లేదు? ఒక వస్తువులో మరో వస్తువు కలిసినప్పుడు ఇంకో గుణం పుడుతుంది. గుణం ఉన్నదంటే జీవం ఉన్నదనే. అది అంతటా ఉన్నది."

3156. "పంచభూతాలు ఏ శక్తి ద్వారా నడిస్తున్నాయో ఆ శక్తినే దేవుడు అంటున్నాం."

3157. "జ్ఞానం (వాడు) ఇస్తే వచ్చేదేగాని చేస్తే వచ్చేది కాదు."

3158. "అందర్నీ తానుగా చూచినా, తనలో అందర్నీ చూచినా ఒకటే."

3159. "చిన్న కాయ భక్తి. పెరిగినప్పుడు యోగం. పండినప్పుడు జ్ఞానం."

3160. "క్షరం కాదని తెలుసుకోవటమే జ్ఞానం."

3161. "జ్ఞానం అనేది ఉంటే అది పోవటం అనేదేమీ లేదు. జ్ఞానమంటే సర్వం తెలుసుకున్న స్థితి - "

3162. 'జ్ఞానాన్ని మించిది ఉన్నదా?'

"జ్ఞానం ఎట్లా వుంటుందో తెలిస్తే - దాన్ని మించిన దాన్ని గురించి ఆలోచిద్దాం."

3163. "ఇన్ని స్టేజీలు లేవు నాన్నా - ఉన్నది ఒకటే."

3164. "అన్నింటిలో చూడగలిగినవాడికి అన్నీ అదే అనిపిస్తుంది."

3165. "ఎఱుకతో ఎఱుకను చూస్తున్నామన్నప్పుడు చూచేదీ ఏమీ లేదు. అంతా గుర్తుగా; నీకు నీవే గుర్తుగా ఉన్నావు - చెప్పేవి చూచేవి వినేవి ఏమీ లేవు."

3166. 'భగవంతునిలో లీనం కావడమంటే ఏమిటి?'

"శరీరం వదలిన తర్వాత జరిగేది అదే!"

3167. "ఒంటరితనమంటూ ఉంటే భయానికి తావు లేదు కదా? రెండోది ఉన్నప్పుడే భయం. తాను తానుగా ఉన్నప్పుడు భయం లేదు. తాను రెండయినప్పుడు భయం. ఆ రెండూ తానేనని గుర్తించినప్పుడు అభయం."

3168. "ఆత్మను గురించి రాశారా? అంటే ఆత్మను కలంగా, కాగితంగా, సిరాగా, పాళీగా అక్షరాలుగా పంచారన్న మాట."

'పంచబడిందంటారా?'

"అప్పుడు ఆత్మను ఆత్మకు ఆత్మతో బోధ చేశారు."

3169. '(ఆత్మ) కానిదే లేదనా అమ్మా మీరు చెప్పేది?'

"అంతేగా?"

3170. 'ఏమీ మాట్లాడవేం అమ్మా? ఎన్ని అడుగుతున్నా చెప్పవు?'

"నేను చెప్పేదేముంది? అన్నీ నీవే చెపుతున్నావు. అందరిలో ఉన్నది

నేననేదేగా. ఆ నేనే బ్రహ్మ. నే చెప్పేది - నేను బ్రహ్మ అని కాదు. ప్రతీవారూ సామాన్యంగా 'నేనే' అంటారే, అది అహం. ఆ అహం లేకపోతే అహం బ్రహ్మాస్మి కాలేదు. అహం చేతనే అహంకారాన్ని పోగొట్టుకుంటాడు.

'నేను భగవంతుణ్ణి అయివుండి నేను భగవంతుణ్ణి తెలుసుకోక పోవట మేమిటి' అన్నదే అహం చేత అహాన్ని తెలుసుకోవటం.

సర్వత్రా 'తనను' చూడటం, సర్వమూ తనలో చూడటం."

3171. "నువ్వూ నేనూ అనేది పోనంతవరకూ అంతా ద్వైతమే."

3172. "ఆత్మ తెలిస్తే అనాత్మ అంటూ లేదు."

3173. "ఏ భావమైనా స్థిరంగా నిలవటమే తెలుసుకోవటం."

3174. "ఆర్తిలో జ్ఞానం లేదా? జ్ఞానంలో భక్తి లేదా?"

3175. "సాక్షాత్కారం అంటే కనబడేదే!"

3176. "అన్ని వేళ్ళల్లో మనస్సు ఒక్కటిగా ఉంటే జ్ఞానం వచ్చినట్లే."

3177. "తెలివి వేరు, జ్ఞానం వేరు, ప్రజ్ఞ వేరు.

ఒకదాన్ని అధారం చేసుకోకుండా స్వతసిద్ధంగా తట్టేది ప్రజ్ఞ.

ఎదురుగా ఉన్నదాన్ని తెలుసుకున్నది తెలివి.

సర్వం తెలుసుకున్నవి జ్ఞానం."

3178. "జ్ఞానికి పపరు వేరే లేదు - వాడే పవరు."

3179. "సర్వం బ్రహ్మ మయంగా దర్శించినవాడు బ్రాహ్మణుడు."

3180. 'ఇంట్యూషన్, ఇంటిలిజెన్స్‌కి అందేది కాదు, అనుభవైక వేద్యమే కాని, అర్గ్యుమెంటుకి అందేది కాదు కదమ్మా?'

"ఇంటిలిజెన్స్ ఓ దశకి వెళ్ళేటప్పటికి జ్ఞానం అవుతుందేమో! అడగటం ఇంటిలిజెన్స్‌తోనే అడుగుతున్నారు. రెండు పోయేంత వరకూ పని చెయ్యాలిసిందే.

గుర్తించేవాడూ, గుర్తింపబడేదీ వేరు గాదు."

'ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి నీవేనన్నారుగా?'

"అన్ని శక్తులు అదే."

3181. 'నిశ్శబ్దం అంటే ఏమిటమ్మా?'

"అన్ని శబ్దాలు నీ శబ్దంగా తోచటమే నిశ్శబ్దం."

3182. "హాయే దైవం. సర్వకాల సర్వావస్థల యందూ హాయిగా ఉండగలగటమే దైవం."

3183. "లడ్డు కావటం అంటుంది అద్వైతం.

లడ్డు తినటం అంటుంది ద్వైతం."

3184. "గీతలో ఒక్కొక్క శ్లోకం ఒక్కొక్క జ్ఞాన కణిక అన్నారు. మీరు జ్ఞానకణికల్ని చేసినవారిలో లెక్కా? చూసినవారిలో లెక్కా? నూరుకు తాగినవారిలో లెక్కా?"

'చూచినవారెవరో, చేసినవారెవరో, నూరుకు తాగినవారెవరో నాకు తెలీదు మా తల్లీ.'

"కణికలో పదార్థాల గుణాన్ని గుర్తించినవాడు, పదార్థాలు కూడా సృష్టించిన వాడు - సృష్టికర్త. తనకు తెలియని ప్రేరణ చేత తనకు తెలియ కుండానే ఆ పదార్థాల మీదకు వెళ్ళి ఆ పాళ్ళు కలిపి కణికలు చేసినవాడు పుట్టు జ్ఞాని. ఎవరో చెబితే విని తెలుసుకుని నేర్చుకుని చేసేవాడు సాధకుడు. కణిక ఏమి పెట్టి చేశారో, అందులో ఏ గుణమున్నదో, ఏ శక్తి ఉన్నదో అది తనను ఏమి చేస్తుందో తెలియకుండా కణిక చాదుకు తాగాలి - అని తాగేవాడు అనన్య భక్తుడు. ఆ కణిక యెందుకో యేమిటో అది విషం కాని అమృతం కాని తెలిసి దానిని గురించి ఆలోచించకుండా ఎవరి చేతిలో పెట్టినా ఏది చేతికి వచ్చినా నోట్లో వేసుకుండే వాడు త్యాగి."

3185. "నేను చెప్పేది సెన్స్‌తో కూడిన సైన్సు. ఆ సైన్సూ, సైన్సూ వేరనుకునేది సెన్సు లేని సైన్సు."

# సుగతి

3186. 'అందాకా నేను బ్రతుకుతానా అమ్మా?'

"పోనీ, మరీ మంచిది నాలోకే వస్తావు."

3187. మరణోన్ముఖమైన హనుమాయమ్మ అడిగింది అమ్మను -

'నాగతి ఏమిటో తేల్చు రాజేశ్వరమ్మ తల్లీ! నన్ను నీకాడికి తీసుకో.'

"తప్పకుండా, నా దగ్గరకే నువ్వు వచ్చేది."

3188. అవసాన దశలో ఉన్న వెంకాయమ్మగారిని అమ్మ అడిగారు "నీకు ఇంకా ఆ నమ్మకాలున్నాయా? పోయాయా? - ఏవేవో లోకాలున్నాయని ఎక్కడికో వెళ్తావని ...."

వెంకాయమ్మగారు : (బాధగానూ నిష్ఠూరంగానూ) లేదమ్మా ఏ నమ్మకాలూ లేవు. ఉన్నది ఒకే నమ్మకం. నన్ను నీ పాదాల్లో ఉంచుకో. నేను అక్కడికే వస్తానన్న విశ్వాసం నాకున్నది. ఇంకా నన్ను ఎప్పుడు తీసుకుంటావు నీ దగ్గరకి?

3189. "ఈనాడు అందరికి సుగతి అంటున్నాను అంటే మీదేం లేదు కనుక. ఎప్పుడూ మీదేం లేదు. మీరు బురద పూసుకున్నా దాన్ని కడిగి శుభ్రపరచ వలసిన బాధ్యత నాది. దానికి మాతృత్వం కావలసివచ్చింది."

3190. "మృత్యుంజయుడంటే చనిపోకుండా ఎల్లకాలమూ ఉంటాడని కాదు. చావుని గురించి ఆలోచన లేనివాడూ, భయం లేనివాడూ మృత్యుం జయుడు."

3191. "విదేహి విదేహి అంటారు. అంటే దేహం లేకపోవడం కాదు. దేహంతో ఉండి దేహం కూడా తానయినవాడు విదేహి."

3192. 'ఆకలి లేనివాడు అదృష్టవంతుడు.'

"ఒక ఆకలే కాదు - ఇది ఉన్నది, అది లేదు. అని లేనివాడు అదృష్ట వంతుడు."

3193 'దేహముక్తి అంటే?'

"ఆత్మార్పణ."

3194. "పరిపూర్ణత్వం నీవూ నేనూ లేవనేది."

3195. "తెలిసినవాడికి, తెలియనివాడికి, నమస్కారం చేసినవాడికి, చెయ్యనివాడికి, నమ్మినవాడికి, నమ్మనివాడికి, విన్నవాడికి, విననివాడికి, వచ్చిన వాడికి రానివాడికి - అందరికీ ఒకే గతి."

3196. 'నాస్తికుడికీ సుగతి ఉన్నదా అమ్మా?'

"నాస్తికుడైనా ఆస్తికుడైనా ఎవరైనా సరే నేను ఇవ్వదల్చుకున్నా నన్నప్పుడు 'వాడి సుగతి' అన్నదెక్కడుందీ? వాడికున్నందువల్ల నేను ఇవ్వటమా? - నేను ఇస్తే వాడికున్నదా?"

3197. 'పాదాలు పట్టనివాడికీ సుగతేనా అమ్మా?'

"వాడు పట్టడం కాదు, పట్టించుకోడమే అయినప్పుడు ఆ ప్రశ్నకు తావేముందీ?"

3198. "సుగతి ఎవరికి లేకుండా ఉంది, నీకేం తెలుసు?"

3199. "ఏది వచ్చినా బాధలేకుండా అనుభవించడమే సుగతి."



ఓం
అం అ



తమ బ్రతుకు తాము బ్రతకలేని అనేకవిధాల బలహీనులు ఉన్నారు. తమ కాళ్ళమీద నిలబడలేని వారికే గదా కఱ్ఱ ఆసరా : వారికి తోడుపడండి, అయితే అది వారిపై జాలితో చేసే సహాయమని అనుకోక, వారిని భగవత్ స్వరూపులుగా భావించి, వారికి సేవ చేయండి. కనిపించని దేవునిపై మనసు నిలవడంలేదనీ, ఏకాగ్రత కుదరడంలేదని బాధపడక, కనిపంచే ఈ దేవుళ్ళను ప్రేమతో ఆరాధించండి. ఆసేవలో కలిగే తృప్తే ముక్తి.

సుఖానికి మార్గం ఒకటే - ఏది చేసినా దైవం చేశాడనుకోటమే

సుఖం ఎక్కడ వుందీ అంటే తృప్తి లో ఉంది.